# కవిత్వంతో ములాఖాత్

పరిచయాలూ స్నేహాలూ సాన్నిహిత్యాలూ

ఎన్. వేణుగోపాల్

జనవరి 2016

*Kavitwamtho Mulaqat*

*Essays on Introduction to Poetry*

by *N. Venugopal*

*January 2016*


ముఖచిత్రం : 'ఊపిరి' పెయింటింగ్ – మమత వేగుంట

కవర్ డిజైన్ : అంకుష్ గ్రాఫిక్స్ చే రన్

పేజి లేఔట్ : సి. రాజశేఖర్

వెల : రు. *120*

ప్రతులకు

వీక్షణం

మైత్రీ రెసిడెన్సీ, *3-6-394,* స్ట్రీట్ నం. *3,*

హిమాయత్‌నగర్, హైదరాబాద్ – *500 029,* ఫోన్ : *040 – 66843495*

ప్రముఖ పుస్తక కేంద్రాలు

ముద్రణ

చరిత ఇంప్రెషన్స్, ఆజామాబాద్, హైదరాబాద్

## ములాఖాత్ సమయాలు

# జ్ఞాపకం ఎంత కవితాత్మక మధురవిషాదం!

కవిసంగమం ఫేస్‌బుక్ గ్రూపు పేజి మీద ఒక వారం వారం శీర్షిక రాయమని యాకూబ్ అడిగినప్పుడు అది ఇంత కన్నీటిసరుల దొంతర అవుతుందనీ, ఆ గడిచిన దినాల బాష్ప బిందువులు తమ తలపోత బరువుల పట్టకంలోంచి సప్తవర్ణ శోభను ప్రసరిస్తాయనీ నేనే అనుకోలేదు. ఎన్నో నెలలు తలాయించి యాకూబ్ మాట తీసేయలేక బెరుకుబెరుకుగానే నాకూ కవిత్వానికీ ఎట్లా పరిచయమయిందో, ఎట్లా స్నేహం కుదిరిందో, కొందరు కవులతో, కొన్ని కవిత్వాలతో సాన్నిహిత్యం ఏర్పడిందో చెప్పాలని ప్రయత్నం ప్రారంభించాను. కవితాభిమాని అయిన ఒక వ్యక్తి దృష్టి నుంచి తయారైన కవిత్వ చరిత్ర శకలంగా ఇది ఉండగలుగుతుందనీ, ప్రతి కవితాభిమానీ ఇలాగే ప్రయత్నిస్తే, ఆ ప్రయత్నాలనీ కలిపితే ఒక ఆత్మీయ కవితా చరిత్ర తయారవుతుందని నా ఆశ. దారిపొడుగునా నన్ను ఆకర్షించిన, సమ్మోహపరిచిన, సంలీనం చేసుకున్న కవిత్వం గురించి ఆ ఆశతోనే ఈ శీర్షికలో రాస్తూ వచ్చాను. సఫలమయ్యానో లేదో తేల్చవలసింది పాఠకులే. చెప్పవలసినవి ఎన్నో చెప్పలేకపోయాననీ, చెప్పినవి కూడ సమగ్రంగా చెప్పలేకపోయాననీ, రాయగలిగినవీ ఇంకా ఎన్నో మిగిలిపోయాయనీ అసంతృప్తి మాత్రం ఉంది.

ఇటీవలికాలంలో తెలుగు కవిత్వ, సాహిత్యాభిమానులు ఎక్కువమందే సామాజిక మాధ్యమాలను, ముఖ్యంగా ఫేస్‌బుక్‌ను చూస్తున్నారు గనుక ఈ శీర్షిక ద్వారా ఎక్కువ మందినే చేరగలిగాను గాని అచ్చు మాధ్యమం మీద వచ్చి ఉంటే చేరగల పాఠకులలో కొందరినైనా చేరలేకపోయాను. ఈ రచనను అలా సైబర్ స్పేస్ మీద గాలిలో వదిలివెయ్యడం ఇష్టం లేక, స్థిరమైన ఈ అచ్చు రూపానికి తెస్తున్నాను.

ఫేస్‌బుక్ వంటి సామాజిక మాధ్యమం మీద వెలువడడంతో ఈ శీర్షికకు అనుకోని మేలు జరిగింది. నేను ఆ పేజి మీద పోస్ట్ చేసిన కొద్ది నిమిషాలలోపే పాఠకుల స్పందన కనబడుతుండేది. ప్రతి వారం కొన్ని డజన్ల మంది చూశామని ముద్ర వేశారు (లైక్ అని!) ఆ ముద్ర వేయకుండా కూడ చదివిన వాళ్లుంటారు. కనీసం పది మంది నుంచి ఒక్కొక్కసారి నలభై మంది దాకా తమ వ్యాఖ్యలు రాశారు. 'బాగుంది' లాంటి మామూలు వ్యాఖ్యలు మాత్రమే కాక, వివరమైన ప్రశంసలు, స్పందనలు, విమర్శలు కూడ రాశారు. తమ పేజిల మీద కూడ షేర్ చేసుకున్నారు. ఒక రచనకు ఇంత సద్యోస్పందన రచయితకు ఉపయోగకరంగా, ప్రోత్సాహకరంగా ఉంటుంది.

మొత్తం 40 వ్యాసాలలో ప్రతి వ్యాసం మీదా స్పందించిన కొందరితో సహా, మొత్తం మీద దాదాపు తొంభై మంది కవితాభిమానులు ఈ వ్యాసపరంపర మీద తమ వ్యాఖ్యలు రాశారు. అలా

వ్యాఖ్యలు రాసిన మిత్రులు – అన్వీక్ష నీలం, అపర్ణ కొత్తపల్లి, అఫ్సర్, అయూబ్ మొహమ్మద్, అల్లం నారాయణ, అశోక్ రాజ్, ఆదిశేషయ్య, ఎం. నారాయణ శర్మ, ఎం.వి. రమణ, ఎన్.వి.ఎం. వర్మ కలిదిండి, కపిల రాంకుమార్, కట్టా శ్రీనివాస్, కాళిదాసు పురుషోత్తం, కుమార్ ఎస్.డి., కృష్ణమణి, కృష్ణమూర్తి పులివర్తి, ఎ. కృష్ణారావు, కొండపల్లి జగదీశ్వర రావు, క్రాంతి టేకుల, గొట్టిముక్కుల యోచన, చుంచు శ్రీశైలం, ఎస్. జతిన్ కుమార్, జి.వి. సారథి, జుగాష్ విలి, జ్ఞాన ప్రసూన మామందూరు, దేవరకొండ సుబ్రహ్మణ్యం, నక్కా వెంకట్ రావు, నళినీమోహన కుమార్ కాల్వ, నాగరాజు జింకా, నారాయణస్వామి వెంకటయోగి, నేరెళ్ల శ్రీనాథ్, నౌడూరి మూర్తి, పట్వర్ధన్ ఎం. వి., పద్మాకర్ దగ్గుమాటి, పలమనేరు బాలాజీ, పి. లక్ష్మణరావు, పావన్ కొండపల్లి, పుట్టపర్తి నాగపద్మిని, పుష్యమి సాగర్, ప్రసేన్ బి., బాల యుగంధర్ చిత్తలూరు, బాలసుధాకర్ మౌళి, బుర్రా తిరుపతి, బొల్లోజు బాబా, భాస్కర్ కూరపాటి, మద్దాలి శ్రీనివాస్, మమత కొడిదెల, మారసాని విజయ్ బాబు, ముహమ్మద్ ఘౌస్, మోహన్ దివాకర్, రంజిత్ బ్రామన్ పల్లి, రఘునాథ్, రవీందర్ విలాసాగరం, రాఘవ, రాజశేఖర్ గుడిబండి, రాజారాం తూముచర్ల, రాజేంద్ర ప్రసాద్ యలవర్తి, రాపోలు సత్యనారాయణ, రామచంద్రరాజు కలిదిండి, రామా చంద్రమౌళి, రామారావు కన్నెగంటి, రామ్మోహన్ రావు తుమ్మూరి, రేణుక అయోల, రోహిణి వుయ్యాల, లాస్యప్రియ, లింగారెడ్డి కాసుల, లీల కె, వాణి వెంకట్, వివేకానంద తలకోల, విశ్వనాథ రెడ్డి, వెంకటేశ్వర్లు క్యామ, వాహెద్ అబ్దుల్, శారద శివపురపు, శిలాలోలిత, శైలజ బండారి, శ్రీనివాస్ గద్దపాటి, శ్రీరామోజు హరగోపాల్, సంపత్ రెడ్డి వంగాల, సత్య గోపి, సత్య శ్రీనివాస్, సరళ కొడాలి, సి వి సురేష్, సుభద్ర శీలా, హెచ్చార్కె – అందరికీ నా కృతజ్ఞతలు. లైక్ అని చూశాం అని చెప్పినవారికీ, షేర్ చేసిన వారికీ, ఇది పుస్తకంగా తేవాలి అని సూచించినవారికీ అందరికీ నా కృతజ్ఞతలు.

దాదాపు ముప్పై ఏళ్లుగా స్నేహితురాలు, భావుకురాలు, గొప్ప చిత్రకారిణిగా ఎదుగుతున్న మమత వేసిన చిత్రం ఈ ఆత్మీయ పుస్తకానికి ముఖచిత్రంగా ఉండాలనుకున్నాను. అడిగినవెంటనే, 'కవిత్వమంటే ఊపిరి గదా, ఊపిరికి ప్రతీకాత్మక చిత్రం వేస్తాను' అని భావస్ఫోరకమైన చిత్రం వేసిపంపిన మమతకు కృతజ్ఞతలు. ఆ చిత్రంతో ఆకర్షణీయమైన కవర్ డిజైన్ చేసిన అంకుష్ గ్రాఫిక్స్ చిన్నా చేరన్‌కు, పేజి లేఔట్ చేసిన రాజశేఖర్‌కు, అచ్చు బాధ్యత తీసుకున్న బాల్ రెడ్డికి కృతజ్ఞతలు. ఈ రచనకు కారకుడు, నిరంతర ప్రోత్సాహకుడు, ఎవరి ఆనందమైనా తన ఆనందంగా సంతోషపడే కవి మిత్రుడు, సోదరుడు యాకూబ్‌కు కృతజ్ఞతలు చాల చిన్నమాట.

నా కుటుంబ సభ్యులలో రజని, అరుణ, రాంగోపాల్, సహజ, కూర్మనాథ్ ఫేస్‌బుక్ మీదనే ఎప్పటికప్పుడు చదివి అభినందనలు తెలిపారు. హేమలత, వరవరరావు గారితో సహా మిగిలినవారు ప్రింటవుట్లు చదివి అభినందనలు, సూచనలు తెలిపారు. నా వ్యక్తిత్వం తయారయినదే ఆ వాతావరణంలో గనుక వారికి కృతజ్ఞతలు చెప్పడం నాకు నేను చెప్పుకున్నట్టే. నేను ఏమి ఆలోచించినా, మాట్లాడినా, రాసినా, ఏ పని చేసినా వనజ, విభాత వాటిలో అవిభాజ్యంగా ఉంటారు గనుక ఈ ములాఖాత్‌ల రచన వాళ్లిద్దరిదీ కూడ.

– *ఎన్. వేణుగోపాల్*

హైదరాబాద్

జనవరి 1, 2016

# శబ్దం మీద మైత్రే తొలి ప్రేమ

యువకవులను ఉద్దేశించి మహమూద్ దర్వీష్ రాసిన కవిత ఒకటి అనువాదం చేసి దాదాపు ఏడాదిన్నర కింద అత్యుత్సాహంతో 'కవిసంగమం' మీద పోస్ట్ చేసి, క్షణాల్లో అది తొలగించారనే చిరు చేదు అనుభవంతో, కినుకతో దూరంగా ఉన్న నన్ను మళ్లీ ఒకసారి 'కవిసంగమం'లోకి దూకమని యాకూబ్ బలవంతపెట్టాడు. ఈ సంగమంలోని అనేక పాయల కవితానదులతో సంభాషించడానికి ఆహ్వానించాడు. మూడు దశాబ్దాలకు పైబడిన మైత్రి వల్ల, తన అస్తిత్వవేదనలోనూ, తన విశాల ఐక్యతా ఆకాంక్షలలోనూ నా హృదయం కూడ ఉండడం వల్ల కాదనలేకపోయాను.

నిశ్శబ్దంగా ప్రవహించేవీ, ఉద్ధృతంగా మహాసంరంభంతో ప్రవహించేవీ, నిర్లిప్తంగా ప్రవహించేవీ, ఉత్సాహంగా ప్రవహించేవీ, అలంకారమయమైనవీ నిరలంకారమైనవీ, ఇంకా నడక నేర్చుకోవలసినవీ, ప్రతి పాదాన్నీ తూచి ప్రవహించేవీ, ఎన్నో రకాల సెలయేళ్లు, నదులు, మహానదులు, అసంఖ్యాక నదీ ప్రేమికులు ఇష్టంగా చేరుకున్న, చేరుతున్న ఈ సంగమం పట్ల నాకు ఎంతో పాంవురం, ఎంతో గౌరవం. అందువల్ల కూడ యాకూబ్ ఆదేశాన్ని కాదనలేకపోయాను.

కాని ఏమి పంచుకోవాలి? నాలుగు దశాబ్దాలకుపైగా కవిత్వాన్ని చదువుతూ, మననం చేసుకుంటూ, లోలోపలా బైటా చదువుకుంటూ, అబ్బురపడుతూ, చదివి వినిపిస్తూ, అనువదిస్తూ, విశ్లేషిస్తూ, కొండొకచో కాసింత కవిత్వం రాస్తూ వచ్చిన నేపథ్యం నుంచి కవిత్వంతో నా అనుభవాలు పంచుకొమ్మన్నాడు యాకూబ్. 'కవిసంగమం'లో చేరవస్తున్న కవితాధారలకు చెప్పవలసిన విషయాలు నాదగ్గర ఉన్నాయని తన నమ్మకం అన్నాడు. అలా మాట్లాడుతూ ఉండగా ఈ 'కవిత్వంతో ములాఖాత్' శీర్షికైతే నిర్ణయమయింది గాని దీనికి ఒక ప్రణాళిక లేదు.

అత్యంత ప్రాచీన కవుల నుంచి అత్యాధునిక కవుల దాకా నన్ను ప్రభావితం చేసిన కవుల గురించి కాలక్రమంలో రాయనా, లేక, నా జీవితంలోనూ సాహిత్యానుభవంలోనూ

వాళ్లు నాలో ఎట్లా ప్రవేశించారో, నన్నెట్లా నడిపించారో ఆ క్రమంలో రాయనా ఇంకా తేల్చుకోలేక పోతున్నాను. పాఠ్యాంశాలు గానూ, ఆసక్తి కొద్దీ, ఉద్యమావసరాల కోసమూ వెయ్యి కన్న ఎక్కువ మంది కవులను చదివాను. వేరువేరు భాషలకు చెందిన వందకు పైగా కవులను ఇంగ్లిష్ నుంచి తెలుగు చేశాను. దాదాపు పది సంవత్సరాలు వేరు వేరు పత్రికలలో కవిత్వం ఎంపిక చేసే, కవిత్వాన్ని పైకి చదివి ప్రచురణార్హత – అనర్హతలు నిర్ణయించే పనిలో ఉన్నాను. ఒక్క కవితతో, ఒక్క పదబంధంతో, ఒక్క అభివ్యక్తితో నన్ను జీవితాంతం ప్రభావితం చేసిన వాళ్లున్నారు. వందలాది కవితలు రాసీ ప్రభావితం చేయని వాళ్లూ ఉన్నారు. ఒకానొక మానసిక స్థితిలో అత్యద్భుతం అనిపించిన కవితే మరొక మానసిక స్థితిలో ఎందుకూ కొరగానిదనిపించిన సందర్భమూ ఉంది. ఒక వయసులో, ఒక ఉద్వేగంలో అభిమాన కవులైనవాళ్లే ఇతరేతర విషయాల తెలివిడి వల్ల తమ స్థాయిని పోగొట్టుకున్నవాళ్లూ ఉన్నారు. పూర్తిగా ఇటునుంచి అటు అయిన సందర్భాలూ ఉన్నాయి.

"మన కాలపు కవికి ఏకాంతమూ సమూహమూ రెండూ ప్రాథమిక విధులుగానే ఉన్నాయి" అని నాకు అత్యంత ఆప్తుడైన చిలీ మహాకవి పాబ్లో నెరూడా అన్న మాటను అక్షరాలా నమ్ముతాను. "సామాజిక కవిత్వా"నికీ, "ఆత్మాశ్రయ కవిత్వా"నికీ విభజన రేఖ సున్నితమైనదో, ఊహాత్మకమైనదో అనుకుంటాను. సామూహికతలో భాగం కాని ఏకాంతం లేదనీ, ఏకాంతం లోకి చొచ్చుకురాని సామూహికత లేదనీ కూడ నా విశ్వాసం. కనుక ఆ రెండు ముద్రలు పడిన కవిత్వమూ నాకు నచ్చుతుంది.

కవిత్వంతో నా అనుభవాలకు ఇదీ నా పూర్వరంగం. ఎవరెవరి ములాఖత్‌తో కవిత్వంతో నా అనుభవాలు ఎట్లా వికసించాయో పంచుకోవడం మీద కేంద్రీకరించి, ఆ క్రమంలో ఒక పాఠకుడిగా, కవిగా, విమర్శకుడిగా కవిత్వంలో నేను కోరుకున్నదేమిటి, నాకు అందినదేమిటి, నేను లోలోపలి నుంచి కదిలిపోయినది దేనికి, ఏడేడు సముద్రాల అవతల, ఎన్నెన్నో తరాల వెనుక ఎప్పటికీ నేర్చుకోలేని భాషలో ఒక కవి పలికిన సొంత పలుకు ఇంత సార్వజనీనమై సార్వకాలికమై నాకెట్లా అందింది, ఇటువంటిది నేనెందుకు రాయలేకపోయాను, నా అనుభవమే మరొకరి గొంతులో ఇంత సాంద్రంగా ఎలా పలికింది, ఈ అభివ్యక్తి నా భాషా పాఠకులకు అందితే ఎంత బాగుంటుంది వంటి ఎన్నెన్నో భావాలను కలిగించిన సందర్భాలను పంచుకుంటాను.

పన్నెండు సంవత్సరాల కింద వెలువడిన నా కవితా సంపుటం 'పాంవురం' కు నేను రాసుకున్న ముందుమాట లోంచి కొన్ని వాక్యాల ఉటంకింపుతో ఈ శీర్షిక ప్రారంభిస్తే నా ములాఖాత్‌లకు ఒక సముచిత మెహఫిల్ సిద్ధమవుతుందేమో.

"కవిత్వం నా కన్నతల్లి. కవిత్వం నా తొలి పాంవురం. కవిత్వం అంటే భావప్రకటనో, ఆగ్రహ వ్యక్తీకరణో, పద విన్యాసమో, పశ్చాత్తాపమో, ఉద్వేగ ఉధృతో, ప్రశాంత

పునరావలోకనమో, ఒత్తిడి నుంచి ఉపశమనమో, ఆనందోత్సాహమో, వెళ్లగక్కడమో.... ఎన్ని నిర్వచనాలున్నాయో, అవి ఎప్పుడెప్పుడు ఎంతెంత నిజమో నాకు తెలియదు. నాకు తెలిసిందల్లా నా పాంవురాన్నో, పాంవురం కొరతనో మననం చేసుకున్నప్పుడల్లా అది ఇట్లా వెలువడిందని మాత్రమే... లోకానికీ నాకూ పాంవురం ఉన్నప్పుడూ లేనప్పుడూ కూడ కవిత్వానికీ నాకూ పాంవురం కుదిరింది...."

పాంవురం, నెనరు, వాత్సల్యం, ప్రేమ, స్నేహం – అదీ కవిత్వానికీ నాకూ సంబంధం. కవిత్వానికీ నాకూ పాంవురం. నా పాంవురాలకూ, పాంవురం లేమికీ, పాంవురం కొరతకూ కవిత్వమే ఆలంబన.

మనిషికి మొట్టమొదటి పాంవురం తల్లి మీద అయితే బహుశా ఆ తర్వాతి పాంవురం శబ్దం మీద కావచ్చు. తనను ఆడించేవాళ్లు శబ్దం చేస్తారు. తన చుట్టూ ఉన్నవాళ్లు వాళ్లలో వాళ్లు శబ్దాలు చేసుకుంటారు. తనతో శబ్దాలు చేయడానికి ప్రయత్నిస్తారు. తాను శబ్దం చేస్తే తనవైపు చూస్తారు. కవిత్వమూ శబ్దమయప్రపంచమే గనుక కవిత్వం బాల్య సహజమైన, మానవసహజమైన, సహజాతమైన ప్రవృత్తి కావచ్చు. కవిత్వంతో నా తొలి ములాఖాత్ శబ్దమే.

మా బాపు గొంతెత్తి మంత్రాలు చదివేవాడు. నాకు ఊహ తెలిసేటప్పటికే 'నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్ర పాదాక్షి శిరోరు బాహవే' అని ఆయన చదువుతుండిన విష్ణు సహస్ర నామాల శ్లోకంలోని సహస్ర పాదాక్షి శిరోరు బాహవే అనే మాటల లయ మీద ఆసక్తి కలిగింది. ఆ తర్వాత బహుశా ఐదారేళ్ల వయసులో మేం బమ్మెర పోతన వంశీకులమని చెపుతూ, వంశవృక్షం చూపుతూ పోతన పద్యాల మీద ఆసక్తి కలిగించి, ఆ పద్యాలు చదువుతుంటే, ముఖ్యంగా మమ్మల్ని నిద్ర పుచ్చడానికి 'నారాయణ కవచం' చదువుతుంటే ఆ లయకు, ప్రతి పద్యం చివరా 'గాచు గావుతన్' లాంటి పునరుక్తికీ ఒక వింతలోకంలోకి ప్రవేశిస్తున్నట్టుండేది. అర్థం తెలియకుండానే కేవలం శబ్దం వల్ల కవిత్వంతో కలిసిన మైత్రి అది. ఇప్పటికీ లయబద్ధమైన కవిత్వం మీద ప్రేమ ఉండడం అందుకే కావచ్చు. వచన కవిత్వంలో కూడ యూఫనీ అవసరమని, చదవడంలో కూడ లయబద్ధమైన తూగు పాటించాలని అనుకోవడం అందుకే కావచ్చు.

కవిత్వంలో శబ్దశక్తికి ఒక గీటురాయి ఉంది. పద సంయోజనం సరిగ్గా కుదిరిందా లేదా పైకి గొంతెత్తి చదువుకుంటే తెలుస్తుంది. అది మాత్రాఛందస్సు కూడ కానక్కరలేదు. పూర్తిగా వచన కవిత – వర్స్ లిబర్ – స్వచ్ఛంద కవిత కావచ్చు. కాని విభిన్న పర్యాయపదాల నుంచి, వేరు వేరు తూకాల సమానార్థక పదాల నుంచి కవి ఏ పదం ఎందుకు ఎంచుకుంటున్నారు, ఆ పదానికీ ముందు వెనుకల పదాలకూ సంయోజనం సరిగా కుదిరిందా లేదా అనేది గొంతెత్తి చదివినప్పుడు, చదువుకున్నప్పుడు తెలుస్తుంది. శ్లోకంలోని, గణబద్ధ పద్యాలలోని శబ్దంతో ప్రారంభమైన నా ములాఖాత్ ఆ తర్వాత 'సృజన' సాహితీ మిత్రులలో

కవిత్వం పైకి చదివి వినిపించే బాధ్యతవల్ల మరింత గాఢమైంది. ప్రతినెలా కనీసం వంద కవితలు చదవవలసి ఉండేది. చాల కవితలు లోపల ఒక్కసారి కూడ గున్గునాయించుకోకుండానే మొదటిసారే పైకి చదవవలసి వచ్చేది. అది ఎంత గొప్ప భావమైనా శబ్ద సంయోజనం సరిగ్గా లేకపోతే ఆ భావం పలుకుతున్నట్టు అనిపించేది కాదు.

నెరూడా ఇంగ్లిష్ అనువాదాలలో మునిగి తేలి ఇంత అద్భుతమైన శబ్దశక్తి ఉన్న కవిత్వం దాని మూలభాషలో కూడ అట్లాగే ఉండిందా అని ముప్పై ఏళ్ల కింద స్పానిష్ తెలిసిన మిత్రురాలి నోట ఆ స్పానిష్ కవిత్వం విని ఉప్పొంగిపోయిన అనుభవం కవిత్వంతో నా ములాఖాత్‌లలో ఒక ఉజ్వల జ్ఞాపకం.

# ఆనాటి భావాల సాన్నిహిత్యం

దాన్ని కవిత్వం అంటారనీ, అది ఒక వ్యక్తీకరణ సాధనమనీ, అది మనిషికి చిరకాల నేస్తమనీ, బహుశా మనుషుల మధ్య సంబంధం అవసరమైన నాటి నుంచీ వేల ఏళ్లుగా అది ఉందనీ తెలియకుండానే కేవలం శబ్దమే కవిత్వం వైపు నన్నెలా ఆకర్షించిందో, ధ్వని, లయ, తూగు, పద సంయోజనం ఎలా కవిత్వాకర్షణ శక్తులో చెప్పడానికి గత వారం ప్రయత్నించాను. అది ఏకైకమనీ, ప్రధానమనీ అనలేదనే అనుకుంటున్నాను. కవిత్వంతో నా ములాఖాత్‌లలో నాకు తెలిసి అది మొదటిది. ఇతరుల కవిత్వ ములాఖాత్‌లు భిన్నంగా కూడ ఉండవచ్చు. ఇది కవిత్వంతో నా అనుబంధాన్ని చెప్పుకునే ఒకింత వ్యక్తిగత శీర్షిక మాత్రమే.

'కవి సంగమం' లోని కవి మిత్రులు, కవితాభిమానులు కవిత్వంతో తమ ములాఖాత్‌లను కూడ మననం చేసుకోవడానికి ఈ శీర్షిక ఒక ప్రేరణ కావాలని నా కోరిక. కవిత్వం అనబడేది మొట్టమొదట ఎప్పుడు విన్నారు, చదివిన మొదటి కవిత ఏమిటి, ఆకర్షించిన మొదటి కవిత ఏమిటి, రాయక తప్పదని ఒత్తిడి పెట్టిన మొదటి కవితానుభవం ఏమిటి అని ప్రతి కవీ, కవితాభిమానీ ఎప్పుడో ఒకప్పుడు తనలోకి తాను చూసుకోవడానికి ప్రేరేపించగలిగితే, తద్వారా కవితానుభవాల సాంద్రతనూ గాఢతనూ గుర్తించగలిగితే ఈ శీర్షిక సఫలమైనట్టే.

ఈ కవిత్వ ములాఖాత్‌లను నేను గడిచివచ్చిన కాలక్రమంలోనే, ఏయే కవులను, కవితలను ఎప్పుడెప్పుడు ఎలా కలుసుకున్నానో, ఆ ములాఖాత్‌లు ఎందువల్ల చిరస్మరణీయమయ్యాయో చెప్పాలని ఒక స్థూల ప్రణాళిక ఇప్పటికి సిద్ధం చేసుకున్నాను.

ఈసారి వినికిడి కవిత్వం నుంచి చదివే కవిత్వానికి నా ప్రవేశం చెప్పదలిచాను. నా ఏడో ఏట జరిగిందది. ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే ఆశ్చర్యం కూడ కలుగుతుంది.

కాని ఆశ్చర్యం కలిగినా, అసంతృప్తి కలిగినా మనం నడిచి వచ్చిన అడుగుల్ని మనం చెరిపెయ్యలేం. ఆ బాట మీద ఆ ముద్రలు ఉన్నాయి. ఎక్కువలో ఎక్కువ వాటిని తలచుకోగలం, విమర్శించగలం, అలా ఎందుకు జరిగింది అని విశ్లేషించగలం. అవసరమైతే బాధపడగలం. కొన్ని అడుగులు మన ప్రమేయం లేకుండానే పడతాయి గనుక అర్థం చేసుకోవడానికి ప్రయత్నించగలం. ఆ అడుగు మంచిది కాదనుకుంటే మళ్లీ అటువంటి అడుగు పడకుండా జాగ్రత్త పడగలం. కాని వాటిని తుడిచెయ్యలేం.

మా ఇంట్లో కవిత్వం ఉన్నదని ఇదివరకే చెప్పాను. మా బాపు ఖాస్గీ బడిలో నాలుగో తరగతి మాత్రమే చదివి, స్వయంకృషితో నాలుగు భాషల్లో చదవగల సామర్థ్యమూ ఆసక్తీ పెంచుకున్నవాడు. ఐనా చదువరిగా మాత్రమే మిగిలాడు గాని రాతలో ప్రవేశించలేదు. మా అమ్మ వైపు మాత్రం ఆమె ఐదుగురు అన్నదమ్ములూ చదువరులు, సామాజిక కార్యకర్తలు, రచయితలు. వారిలో చివరి మామయ్య వరవరరావు మా అక్కయ్యనే పెళ్లి చేసుకోవడం వల్ల సాన్నిహిత్యం మరింత పెరిగింది. ఆయన నేను పుట్టక ముందునుంచే కవిత్వం రాస్తున్నారు. అలా ఇంటి వాతావరణంలోనే కవిత్వం పట్ల ఆసక్తి కలగడానికి తగిన స్థితి ఏర్పడి ఉందన్నమాట.

ఆయన ఇంకా మహబూబ్ నగర్ జిల్లా జడ్చర్ల కాలేజిలో పని చేస్తున్నప్పుడు, అంటే 1968 నవంబర్ కన్న ముందు, ఒకసారి అక్కడికి వెళ్లినప్పుడు అక్కడి అనేక పుస్తకాలలో దేశభక్తి గేయాల సంపుటం ఒకటి నాచేతికి అందింది. ఆ కవి పేరు చెప్పనవసరం లేదు. ఆ తర్వాత పెద్దగా రాసినట్టుగానూ లేరు. ఇప్పుడైతే ఆ కవితలు, గేయాలు పూర్తిగా గుర్తు లేవు గాని అవి భారతమాత గురించీ, తెలుగుజాతి గురించీ 'దేశభక్తి' ప్రబోధ గీతాలని గుర్తు. ఆ ఏడేళ్ల వయసులో అప్పటి వాతావరణంలో ఆ గీతాలు చాల ఆకర్షించాయి. ఆ పుస్తకం నాకు కావాలని అడిగి సొంతానికి తెచ్చుకోవాలనిపించేంత ఆకర్షించాయి. ఈ గేయాలలో ఇంతకుముందే చెప్పినట్టు తూగు, లయ ఉండడం ఒక కారణం అయితే, 'దేశభక్తి' మరొక కారణం కావచ్చు.

నిజానికి ఇరవై నాలుగు పేజీలు కూడ లేని ఆ పుస్తకంలో వ్యక్తమైనది శుష్కమైన దేశభక్తి. చాల తక్కువస్థాయి ప్రచార గీతాల చవకబారు శైలి. అంత్యప్రాసలే కవిత్వమనుకునే శైశవదశ కవిత్వం. ఇప్పటికీ గుర్తున్న కొన్ని పాదాలు, చరణాలు తలచుకుంటుంటే అవి ఎట్లా నచ్చాయా అని ఆశ్చర్యం కలుగుతుంది. కాని ఒక రచన నచ్చడానికి అనేక సామాజిక, వ్యక్తిగత, కాలిక కారణాలుంటాయి. ఒక వయసులో, ఒక వాతావరణంలో కొన్ని రకాల భావాలు మనసును అయస్కాంతంలా ఆకర్షిస్తాయి. మనసు విశాలమైన కొద్దీ, గట్టిపడిన కొద్దీ, అనుభవాలు పెరిగిన కొద్దీ, అధ్యయనం పెరిగిన కొద్దీ ఆ భావాల అయస్కాంతం లాగలేనంత బరువెక్కుతుంది మనసు. అప్పుడు కొత్త అయస్కాంతాలేవో మనసును ఆకర్షిస్తాయి.

అలా ఎన్నో అయస్కాంతాలను దాటుతూ అధిగమిస్తూ రావాలి మనిషి. ప్రతి కవితాభిమానీ, ఆ మాటకొస్తే ఏ వ్యక్తి అయినా తన భావ పరిణామాల చరిత్రను ఒకసారి సింహావలోకనం చేసుకుంటే అది ఎంత చిన్న జీవితానుభవమైనా సరే అద్భుతమైన ఈ ప్రయాణ సంరంభం వినబడుతుంది, కనబడుతుంది.

ఆ పుస్తకం అడిగి నా సొంతానికి తెచ్చుకున్నాను గాని దాదాపు ఒకటి రెండు సంవత్సరాలకే ఆ పుస్తకం మీద, అందులోని కవిత్వం మీద మమకారం పోయింది. ఇంట్లోని జాతీయోద్యమ సంప్రదాయం కావచ్చు, నెహ్రూ సోషలిజం మీద భ్రమలు కావచ్చు, సాహిత్య వాతావరణం కావచ్చు – అవన్నీ తెలిసి కూడ కాదు, తెలిసీ తెలియని వయసులో ఆ తేలికపాటి కవితారచననే నేను అద్భుతమని అనుకోవడానికి కారణమయ్యాయి. కాని ఎదుగుతున్న వయసు, ఇంట్లోనూ బైటా మారుతున్న సామాజిక రాజకీయ పరిస్థితులు, చేతికి అందుతున్న కొత్త కవిత్వం ఆ తొలి ములాఖాత్ నుంచి నన్ను దూరం చేశాయి. వచన రచనలతోనూ, సిద్ధాంత గ్రంథాల తోనూ, ఆకర్షించి, ఉపగ్రహంలా తిప్పుకున్న సమ్మోహక వ్యక్తులతోనూ కూడ ఇటువంటి అనుభవం వ్యక్తిగతంగా నాకూ ఎదురైంది. అటువంటిది ఉంటుందని మిత్రులెందరో కూడ చెప్పారు. తమ పుస్తక పఠనాభిలాష మామూలుగా చవకబారుగా చెప్పుకునే డిటెక్టివ్, సెక్స్ నవలలతో ప్రారంభమైందని, ఆ పుస్తకాలే తమలో చదివే ఆసక్తిని పెంచాయని, ఆ తర్వాత వాటిని వదిలేసి సీరియస్ సాహిత్యంలోకి వచ్చామని చెప్పుకున్న మిత్రులెందరో ఉన్నారు.

చదివే కవిత్వంతో ఇటువంటి తొలి ములాఖాత్ ప్రతి ఒక్కరికీ ఏదో ఒక కవితతో ఉండవచ్చు. కొన్నాళ్లకే ఆ కవిత్వం మళ్లీ చదువుకుంటే ఏమీ ఆకర్షించలేకపోవచ్చు. అసలు అందులో కవిత్వమే లేదనిపించవచ్చు. అందులోని భావాలు అంగీకారయోగ్యమైనవి కావని అనిపించవచ్చు. కాని అటువంటి ములాఖాత్ ప్రతి ఒక్కరికీ ఉంటుంది. బహుశా కవిత్వం చదివే తొలిరోజుల మనఃస్థితిలో ఉండే భావాలకూ, ఒకానొక కవి కవిత్వంలో ఉండే భావాలకూ కుదిరే మైత్రే ఈ తొలి ములాఖాత్‌ను చిరస్మరణీయం చేస్తుందనుకుంటాను. మనిషిలో, చదువరిలో, సామాజికవ్యక్తిలో మార్పు సహజం గనుక ఆ తొలినాటి భావాలు మారుతాయి. అప్పుడు ఆ తొలినాటి భావాల మైత్రితో సన్నిహితమైన కవిత్వం పట్ల అభిప్రాయమూ మారుతుంది. అదే గొప్ప కవిత్వమని అనుకోవడానికి కొత్త ఆధారాలూ దొరకవచ్చు. లేదా అది అసలు కవిత్వమే కాదనుకునే దృక్పథమూ రావచ్చు. కాని ఇది దాటక తప్పని దశ.

## ఒక అనవసర వివాదానికి వివరణ

ఇప్పటికీ పూర్తిగా పుస్తకాలకు ఎక్కలేదు గాని మా వరంగల్‌లో కాళోజీ గురించి, హాస్య చతురతతో ఆయన అందించిన వివేకం గురించి వందలాది జానపద గాథలుండేవి. వాటిలో ఒకటి:

ఎవరో ఒక అభిమాని వచ్చి కాళోజీతో "మీ ఫలానా కవిత ఎంత బాగుందో, అసలు ఆ మాట - నేను పడిపోయానంటే నమ్మండి. కాని ఫలానా కవితలో మీరు ఆ మాట వాడడం నాకు నచ్చలేదు..." అని అలా నిరాటంకంగా అభినందనల - విమర్శల వెల్లువ కురిపిస్తూ పోతున్నాడట. కాసేపు విని విసుగొచ్చి కాళోజీ, "వారీ, నేను కవిత్వం రాసిన. పెండ పెట్టిన. పిడకలు జేస్కుంటవా చేస్కో, ఎరువు తోలుకుంటవా తోలుకో. కాని ఇది ఎఱ్ఱగున్నది, ఇది పచ్చగున్నది... ఇది పనికిరాదు, ఇది పనికొస్తది. ఏందిరా ఇదంత" అన్నాడట. తన కవిత్వం పట్ల, రచన పట్ల అంత నిర్మమకారంగా ఉండడం ఆదర్శమని నేననుకుంటాను. ఉండడానికి ప్రయత్నిస్తాను.

కాని ఒక రచన మీద అనవసరమైన కోడిగుడ్డుకు వెంటుకలు పీకడం వంటి వ్యాఖ్యలు వచ్చినప్పుడు, నిరాధారమైన నిందలకు - మా తెలంగాణ భాషలో చెప్పాలంటే బట్ట కాల్చి మీద వేయడానికి - ప్రయత్నం జరిగినప్పుడు, తగులబడి పోకుండా ఉండడానికి ఆ మసిగుడ్డను తీసివేయక తప్పదు.

గతవారం 'కవిత్వంతో ములాఖాత్' లో నేను రాసిన కొన్ని వాక్యాల మీద గౌరవనీయ మిత్రులొకరు మరేదో చర్చలో అసందర్భంగా ప్రస్తావన తెచ్చి అన్యాయపు వ్యాఖ్య చేశారు. దానికి వివరణ ఇవ్వడం నా బాధ్యత.

కవిసంగమం పేరునూ, నా శీర్షికనూ పేరుపెట్టి చెప్పి, నాగురించి మాత్రం "ఒక పెద్ద మనిషి (విప్లవ రచయితల సంఘం అనే ఒక సంస్థ సభ్యుడు అనుకుంటా)" అని ఆయన వ్యంగ్యంగా ప్రస్తావించారు. నిజానికి ఆయన వ్యంగ్యంగానో, అపరిచితుడినన్నట్టుగానో వర్ణించిన "పెద్ద మనిషి" అన్నమాటకు నేను తగను. ఆయనకు నేను అపరిచితుడినీ కాదు, నాకాయన ఒక పుస్తక ప్రచురణలో సహకరించారు కూడ. అలాగే ఆయన ప్రస్తావించిన "అనే ఒక సంస్థ" లో ప్రస్తుతం నేను సభ్యుడిని కాదు. ఆ వ్యంగ్యమూ అవసరం లేదు.

సరే, అది చిన్న విషయం. కాని, నేను కవిత్వంలోని శ్రవ్య లక్షణం ఆకర్షిస్తుందనీ, నన్నదే ఆకర్షించిదనీ, ఇప్పటికి కూడ లయబద్ధమైన కవిత్వం నాకు నచ్చుతుందనీ అన్నదానికి ఆయన నేను వేదమంత్రాలను అప్రీషియేట్ చేయమన్నాననే అర్థం చెప్పారు. నా మాటలకు ఆ అర్థం ఉన్నదేమో మళ్లీ వెతకవలసిందిగా మిత్రులను కోరుతున్నాను. హైందవ, బ్రాహ్మణ్య సంస్కృతి ఆయన అన్నట్టుగా "విసర్జించవలసిన సంస్కృతి" అని మాత్రమే కాదు దుర్మార్గమైన, విషపూరితమైన పాలకవర్గ సంస్కృతి అని, దాన్ని కూలదోయవలసి ఉన్నదని గత ముప్పై సంవత్సరాలుగా రాస్తున్నాను, మాట్లాడుతున్నాను. గత వారం శీర్షికలో కవిత్వంతో నా అనుభవాల గురించి చెప్పే క్రమంలో లయ నన్ను ఎలా ఆకర్షించిందో మాటర్ ఆఫ్ ఫాక్ట్‌గా చెప్పాను. అర్థం తెలియకుండానే ఆకర్షించే శబ్దం అని కూడ అన్నాను. నా జీవితానుభవంలో నాకు తెలిసిన, నన్ను కవిత్వం వైపు ఆకర్షించిన తొలి అంశమేమిటో చెప్పాను గాని, అది

గొప్పదనో, ఆదర్శమనో చెప్పలేదు, చెప్పను. అది దుర్మార్గమైనదనే దానిలో, వేల ఏళ్లుగా ఈ సమాజ పీడనకు సహకరించిందనే దానిలో సందేహమే లేదు. కాని అది నా జీవితానుభవం, ఇప్పుడేం చేయను? ఒక శ్రామిక మహిళ కొడుకుగా పుట్టి ఉంటే మా అమ్మ కలుపు పాటల్లో, నాట్ల పాటల్లో, కోత పాటల్లో, దంపుడు పాటల్లో లయ నన్ను ఆకర్షించి ఉండేది. ఒక శ్రామిక పురుషుడి కొడుకుగా పుట్టి ఉంటే హైలెస్సా పాటలో, ఒహోం ఒహోం లో, అటువంటి సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలలో లయ నన్ను ఆకర్షించి ఉండేది. నేను చెప్పదలచిన విషయమల్లా, మనిషికి కవిత్వంపై ఆసక్తి కలగడానికి తొలి ఆకర్షణ శబ్దంలో ఉంటుందని. అది కూడ నేనేమీ సాధారణీకరించడం లేదు, నా అనుభవం, నా ములాఖాత్ అది.

# కవిత్వాసక్తి వాతావరణ ఫలితమే

గత రెండు వారాలూ శబ్దమూ, తొలినాళ్ల భావాలూ ఎలా కవిత్వాసక్తి కలిగిస్తాయో, కవిత్వంతో ములాఖాత్ జరపడానికి దోహదపడతాయో చెప్పడానికి ప్రయత్నించాను. ఇప్పుడిక అటువంటి అనుద్దేశపూర్వక, ఆగంతుక కలయికలు కావు, అచానక్ ములాఖాత్‌లు కావు, వాతావరణమే కవిత్వంతో ములాఖాత్ కు మనను ఎలా సిద్ధం చేస్తుందో, కనీసం నన్నెలా సిద్ధం చేసిందో చెప్పాలి.

వాతావరణమంటే నైసర్గిక ప్రకృతి వాతావరణం కాదు, దాని పాత్రా ఉంటుందేమో, కాని నేను చెప్పదలచింది సామాజిక రాజకీయ సాంస్కృతిక వాతావరణం. కవితావరణం. మరొక మాటల్లో చెప్పాలంటే దాన్ని యుగ స్వభావం అంటారు. గాలిలో భావాలు తేలియాడుతుంటాయి. అవి మనను స్పృశిస్తాయి, కళ్లకు కనబడతాయి, చెవులకు వినబడతాయి. మన చుట్టూ పరిసరాలలో అవి సర్వవ్యాప్తంగా ఉంటాయి. నా ఏడో ఏట తెలిసీ తెలియని వయసులో ఒక శుష్క దేశభక్తి భావన కవిత్వం వైపు నా ఆసక్తిని పురికొల్పితే, ఆ తర్వాత రెండు మూడు సంవత్సరాలు తెలుగు సాహిత్యంలో, సమాజంలో సమూలమైన మార్పులు జరిగిన వాతావరణం కవిత్వంతో నా ములాఖాత్ ను తీర్చిదిద్దింది. ఆ మార్పులన్నీ కవిత్వంలో ప్రతిఫలిస్తున్నాయి. ఆ మార్పులూ ఆ కవిత్వమూ మా ఇంట్లోకి కూడ ప్రవహించి ఆ ప్రవాహపు ఉరవడి నన్నూ తాకింది.

అది 1969. అప్పటికి రెండు సంవత్సరాలుగా రగులుతున్న నక్సల్బరీ వసంత మేఘగర్జన ఒక నిర్మాణంగా మారిన సంవత్సరం. ఆ సంవత్సరమే మా 'సృజన' ముఖచిత్రం మీద 'ట్రిగర్ మీద వేళ్లతో రా' అని లోచన్ సారు కవిత శీర్షిక అచ్చయింది. లోపలికి వెళితే

“పదును పెట్టిన కత్తి అంచులమీద రక్తాక్షరాలు

....

ఈసారి నీ సమాధానం

అరిగిన మాటల్లో కాదు

విరిగిన వెకిలి నవ్వులో కాదు

ట్రిగర్ మీద పరుగెత్తే వేళ్లలోంచి

మండే కనుల్లోంచి

మరిగే గుండెలోంచి

తుపానుల శ్వాసలోంచి

పరాభూతమైన ప్రతి అణువులోంచి

బులెట్ శబ్దంలోంచి రావాలి...” అని ఉత్తేజకరమైన కవిత్వం.

మరి కొన్నాళ్లకే పదిమంది కవులు (వరవరరావు, లోచన్, అశోక్, సంజీవరావు, సుధాకర్, యాదగిరిరావు, కిషన్, సుదర్శన్, ఎక్స్ రే, ఐ) ప్రకటించిన ‘తిరుగబడు’ సంకలనం వెలువడింది. అది ఒకరకంగా ఇంట్లో తయారయిన కవిత్వమే. ఆ పది మంది కవులలో ఐదుగురు బంధువులు. మిగిలిన ఐదుగురినీ అంతకుముందు నుంచే ఎరుగుదును. అలా ఒక కవితా సంచలనం వికసిస్తున్నప్పుడు, ఒక అగ్నిపర్వతం పేలబోతున్నప్పుడు సన్నిహితంగా చూడడం, అప్పటికి వాటి లోతు తెలియకపోయినా మనసు మీద గాఢమైన, నిగూఢమైన ప్రభావం వేసే ఉంటుంది. ఆ ‘తిరుగబడు’ పుస్తకం పట్టుకుని దాంట్లో కవిత్వం చదువుతూ అటువంటి కవితా సంచలనం తామూ ఒకటి తయారు చేయాలని మా అన్నయ్య రాంగోపాల్ (పదిహేనేళ్ల వయసులో తాను అప్పటికే కవిత్వం రాస్తున్నాడు), యాదగిరి తమ్ముడు రాజరాజనరేందర్, సంజీవరావు కొడుకు రవీందర్ హనుమకొండ పాత మునిసిపాలిటీ పక్క సందులో నిలబడి జరిపిన చర్చలు నాకు ఇప్పటికీ వినబడుతూనే ఉన్నాయి.

ఇవన్నీ అడపాదడపా హనుమకొండ వెళ్లినప్పుడు చెవిన పడుతున్న మాటలు. కంటికి కనబడుతున్న సందోహం. మరొక పక్క హనుమకొండలో ఎక్కువైపోయినవో, వరవరరావు మా ఊరు రాజారం వచ్చేటప్పుడు తెచ్చుకొని వదిలేసి పోయినవో రాజారం ఇంట్లో కూడ ఆధునిక వచన కవిత్వ పుస్తకాలు చేతికందడం మొదలయింది. అలా వెనుకా ముందులుగా చేతికందిన పుస్తకాలు పరాభవ సంవత్సరం (1966) లో రుతువుకొకటి చొప్పున వెలువడిన కాళోజీ కవితా సంపుటాలు. ఆ చిన్నచిన్న పుస్తకాలలో కవిత్వం చదువుతుంటే అదంతా తెలిసిన విషయంలాగుండేది. తన కవిత్వం గురించి “ఓస్ ఇదే కవిత్వమైతే నేనూ రాయగలను” అని ఒక విద్యార్థి వ్యాఖ్యానించాడని, తాను కోరుకున్నది అదేనని శ్రీశ్రీ రాశాడు గాని, నిజానికి ఆ వ్యాఖ్య శ్రీశ్రీ కవిత్వానికన్న ఎక్కువగా కాళోజీ కవిత్వానికి వర్తిస్తుంది. ఆ కవితలన్నీ గొంతెత్తి చదువుకుంటూ ఉండేవాడిని. ఆ కవితలలో నన్ను ఎక్కువగా ఆకర్షించినవాటిలో

"నేను బ్రతికే వుంటాను
నా పరాయితనం పోగొట్టే ఆర్ద్రత
చెలిమి చెలిమెలో
చిందునన్నాళ్లు" అనే భావాలు,
"అసామ్య సంఘంలో
ఆర్జనయే దౌర్జన్యం" వంటి తాత్విక కవితా పంక్తులతో పాటు,
"ఆకళ్ల కళలు ఆకళ్లు
ఆ కళ్లు కళల ఆకళ్లు
ఆకళ్ల కలలు ఆకళ్లు
కలల ఆకళ్లు ఆకళ్లు" అంటూ ల, ళ లను పునరుక్తం చేస్తూ గొప్ప తాత్వికతతో సాగిన లోతైన సుదీర్ఘ కవిత. కాళోజీ పుస్తకాలతో పాటే నా చేతికందినవి పొట్లపల్లి రామారావు గారి 'ఆత్మవేదన', 'చుక్కలు' కవితా సంపుటాలు. బహుశా ఆ ఇద్దరినీ నేను వ్యక్తిగతంగా చూసి ఉండడంవల్ల కావచ్చు, అందులోనూ రామారావు గారిది మా పొరుగూరు కావడం వల్ల కావచ్చు, వాళ్ల కవిత్వం చాల సన్నిహితమనిపించేది.

ఆ తర్వాత సంవత్సరం విరసం ఏర్పడింది. సహజంగానే ఆ వార్తలు ఇంట్లో నిత్య చర్చనీయాంశాలయ్యాయి. విరసం ప్రభావం మొదట ప్రధానంగా కవిత్వరంగంలోనే వ్యాపించింది గనుక ఆ కవిత్వమూ ఇంట్లో తరచూ వినబడుతుండేది. అప్పుడే లెనిన్ శతజయంతి పెద్ద ఎత్తున జరిగింది గనుక లెనిన్ గురించి పెద్దగా తెలియకుండానే అభిమానం కలిగింది. మా ఇంట్లో బంగ్లా మీద ఒక హాలు, ఒక గది ఉండేవి. బట్టలు కొంటే వచ్చే అట్టపెట్టె మీద సూర్యోదయం లాంటి డిజైన్ ఉంటే ఆ సూర్యుడి మీద 'లెనిన్ లైబ్రరీ' అని రాసి ఆ గది తలుపు మీద తగిలించుకున్నాను. నాకు నచ్చిన కవితా పంక్తులు, చరణాలు పెన్సిల్‌తో లోపల గోడల నిండా రాసి పెట్టుకున్నాను.

సరిగ్గా అప్పుడే ఒకసారి హనుమకొండకు వెళ్లినప్పుడు వరవరరావు గారు ఒక కవిత ఇచ్చి అది మరొక ప్రతి రాసి పెట్టమన్నారు. ఆ కవిత మరుసటి సంచిక 'సృజన'లో అచ్చయింది. అది 'తూర్పు పవనం వీచెనోయ్' అనే కవిత. కవి పేరు గంగు. ఆ తర్వాత రెండు సంవత్సరాలకు గాని ఆ కవి ఎవరో, ఎందువల్ల మరొకరి దస్తూరీలో ఆ కవిత ప్రెస్‌కు వెళ్లవలసి వచ్చిందో తెలియలేదు. ఆ కవితే మళ్లీ 1972లో 'గెరిల్లా' కవితా సంకలనంలో కూడ వచ్చింది. దాంట్లో పార్వతి, శివుడు, శివసాగర్, నటరాజమూర్తి, గంగాధర్ వగైరా అన్నీ శివసంబంధమైన పేర్లతో ఉన్న కవులు రాసిన కవితలు, గీతాలు ఉన్నాయి. "ఇవన్నీ ఒక్కరే రాసారన్నంత విప్లవ సత్యమూర్తిత్వం ఏకసూత్రతను సాధిస్తున్నది" అని దాని ముందుమాటలో వరవరరావు గారు ఆ కలం పేర్లు అప్పటికి అజ్ఞాతవాసంలో ఉన్న గెరిల్లా కవి కె.జి. సత్యమూర్తివని చెప్పకనే చెప్పారు.

అయితే ఇంకా 'గెరిల్లా' సంపుటం వచ్చి నా కాళ్ల కింద నేలను ఊడ్చేసి, నన్ను కవితాకాశంలోకి ఎగరేసి, పుస్తకం మొత్తం నోటికి అప్పగించే ఆసక్తిని కలిగించక ముందే, మరికొన్ని కవిత్వ ములాఖాత్‌లున్నాయి. అంతకుముందే రెంజిం పేరుతో శివసాగర్ రాసిన 'చెల్లీ చెంద్రమ్మా' పాట మా ఎన్‌కె నోట వందలాది సార్లు విని, పాడడానికి, అనుకరించడానికి ప్రయత్నిస్తూ ఉన్నాను. 'సృజన' 'సాహితీమిత్రుల'లో ఒకరైన ఎన్‌కె గొప్ప కవి. గాయకుడు. ఎమర్జెన్సీ దాకా ఆయన పాట మోగని సభ లేదు. ఆయనకు ఉండిన సమ్మోహక శక్తే నా కవిత్వ ములాఖాత్‌లకు ఒక మూలం కూడ కావచ్చు. ఆయన అన్న నెల్లుట్ల జగన్మోహన రావు 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమ సారథులలో ఒకరైన ఎన్జీవో సంఘ నాయకుడు. ఆ ఉద్యమ సందర్భంగా వెలువడిన 'జనని' పాటల పుస్తకం నుంచి కూడ ఎన్‌కె పాడుతుండేవాడు.

మరొక ప్రధానమైన జ్ఞాపకం 1971లో వెలువడిన 'కొక్కొరొకో' బతుకు పాటలు అనే కవితాసంపుటం, 'బంగ్లాదేశ్' కవితా సంపుటం. 'కొక్కొరొకో' సంకలనకర్త మేం వద్దేపల్లి సుధాకర్ అని పిలుచుకునే ఎం. సుధాకర్. తెల్లని పైజామా లాల్చీతో, ఎప్పుడూ బుగ్గన పాన్ తో ఉండే సుధాకర్ కవిత్వం చదువుతుంటే వినడం ఒక ఆకర్షణ. నిజానికి ఆయనది కవిత్వం అనడం కంటే కవితాత్మక జనరంజక ఉపన్యాస ధోరణి అనడం సరైంది. బహుశా ఉర్దూ కవితా సంప్రదాయం కూడ తెలిసినవాడేమో, సరిగ్గా ఆ సంప్రదాయంలో లాగే ఆయన ఒక కవితా పంక్తి చదివితే శ్రోతలే తరువాత పంక్తి అందించేలా ఉండేది. "ఈ దేశం మీద ఉమ్మి వేయడానికి కాదు" అని ఒక్క క్షణం ఆగేవాడు, "ఉచ్చ పోయడానికి కూడ మనస్కరించడం లేదు" అని ముక్తాయించేవాడు. సభ చప్పట్ల హోరెత్తేది. ఆయన సంపాదకత్వం వహించిన 'కొక్కొరొకో' అప్పుడొక క్రేజ్. నాకు శ్రీశ్రీ ములాఖాత్ మహాప్రస్థానం కన్న ముందే 'కొక్కొరొకో' లో 'తుది పయనం: తొలి విజయం' ద్వారా జరిగింది. అప్పుడే బంగ్లాదేశ్ యుద్ధం సందర్భంగా ఎన్‌కె సంపాదకుడుగా వెలువడిన 'బంగ్లాదేశ్' కవితా సంపుటం వచ్చింది. అంటే ఒకేసారి ప్రాంతీయ, దేశీయ, అంతర్దేశీయ విషయాలమీద విస్తారమైన కవిత్వ స్పందన నా చేతికి అందిందన్నమాట.

అలా ఒకవైపు వచన కవిత్వమూ, మరొకవైపు పాట, గేయం వంటి లయబద్ధ కవిత్వమూ ఒకేసారి నాకు ములాఖాత్ అయ్యాయి. ఇంట్లోనే దాదాపుగా రోజూ పాడుతూ, కవిత్వం చదువుతూ ఉండే ఎన్‌కె తో పాటు, అప్పుడు ఏ సభ, సమావేశం జరిగినా అద్భుతంగా పాటలు పాడుతుండే జనసేన ఉండేవాడు. ఆయన పాటల పుస్తకం 'జనసేన పాటలు' కూడ అప్పుడే వెలువడింది. ఆయన వేదిక మీది నుంచి గొంతెత్తి "ఎవరు వాళ్లూ, ఎవరి వాళ్లూ, లే మనోళ్లే, రా మనోళ్లే" అని పాడుతుంటే రక్తం ఉప్పొంగిపోయేది.

ఆనాటి కవిత్వ ములాఖాత్‌లకు ఉండిన మరొక రెండు మెహఫిల్‌ల గురించి చెప్పకపోతే ఇది సంపూర్ణం కాదు. ఒకటి బాలసముద్రం జిల్లా గ్రంథాలయ సంస్థ వరండాలో

జరుగుతుండిన మిత్రమండలి సమావేశాలు. పెద్ద కాళోజీ, చిన్న కాళోజీలు పెద్దదిక్కుగా ముప్పై నలభై మంది కవులు తమ కవిత్వం వినిపిస్తుండేవారు. కవిత్వం మీద చర్చలు జరుగుతుండేవి. మరొకటి, పబ్లిక్ గార్డెన్ లోని టౌన్ హాలు, బిటిఎస్ హాలు సమావేశాలలోగాని, అంతకన్న ముఖ్యంగా జీవన్ లాల్ గ్రౌండ్స్‌లో రెండు మూడు వేల మంది పాల్గొనే బహిరంగ సభల్లో గాని సాగే కవితా పఠనాలు. ఫాక్టరీల గేట్ల ముందు కార్మికులకు వినిపించినప్పుడే తన కవిత్వం పదునెక్కిందని పాబ్లో నెరూడా రాసిన మాటలు ఆ తర్వాత పది పదిహేనేళ్లకు చదివానేమో గాని, అంతకు ముందే ఆ అనుభవం ఆ జనబాహుళ్యం మధ్య కవిత్వ పఠనాల్లో కళ్లారా చూశాను, చెవులారా విన్నాను.

అప్పుడే అనంతపురం చైతన్యసాహితి ప్రచురణగా 'రక్తగానం' అనే కవితాసంపుటం వచ్చింది. ముఖచిత్రంతో సహా మొత్తంగా ఆ పుస్తకం మీద మనసు పారేసుకుని ఎప్పటికైనా కవిత్వం రాస్తే (రాస్తాననే గట్టిగా నమ్ముతూ) 'రక్తగాయకుడు' అనే కలం పేరు పెట్టుకోవాలని నిర్ణయించుకున్నాను. కవిత్వంతో ములాఖాత్‌లు వినడం, చదవడం నుంచి రాయడం వైపు ప్రవహిస్తున్నాయన్నమాట.

# ఎన్‌కె కవిత్వంతో సదా బహార్ ములాఖాత్

ఈ వారం ఈ శీర్షిక కొద్దిగా పక్కకు జరగవలసి వస్తున్నది. గతవారం శీర్షిక ముగించి పంపించగానే దాని చివరలో చెప్పినట్టుగా కవితారచనలోకి ఎలా వెళ్లానో చెప్పడం కుదరదనిపించింది. జ్ఞాపకం మీద రాస్తూ ఉండడం వల్ల కొన్ని ముఖ్యమైన జ్ఞాపకాలు కూడ చరిత్ర జల్లెడ లోంచి జారిపోతున్నాయనీ, మళ్లీ కాస్త వెనక్కి రావాలనీ అనిపించింది. ఎట్లాగూ ఈ శీర్షికకు ఒక నిర్దిష్టమైన ప్రణాళిక లేదు గనుక అలా కాలంలో వెనక్కీ ముందుకీ అడుగులు వేసినా ఫరవా లేదనుకున్నాను. గతవారం ఎన్‌కె ప్రస్తావన వచ్చినప్పుడు ఆయన గురించీ, ఆయన కవిత్వం గురించీ, ఆయనవల్ల జరిగిన నా కవిత్వ ములాఖాత్‌ల గురించీ చాల చెప్పవలసినవి ఉన్నాయని అనిపించింది.

ఆ శీర్షిక అచ్చయిన మూడు రోజులకే ఆయన తుదిశ్వాస విడవడం నాకు తీరని దుఃఖం. దాదాపు మూడు సంవత్సరాలుగా అనారోగ్యంతో ఉన్నా ఆయనది అకాల మరణమే. ఇరవై సంవత్సరాలుగా కవిత్వానికి దూరంగా ఉన్నా, కవితాధార గురించీ, కవిత్వ వస్తుశిల్పాల గురించీ తెలుసుకోవలసిన సూక్ష్మాంశాలెన్నో నిండిన కవిత్వం రాసిన అరుదైన కవి ఆయన. అందువల్ల ఈ వారం శీర్షిక ఆయన కవిత్వంలోని కొన్ని అంశాలను పంచుకోవడానికీ, అవి నా కవిత్వ ములాఖాత్‌లను ఎలా ప్రభావితం చేశాయో వివరించడానికీ ప్రయత్నిస్తాను.

శివసాగర్ రాసిన పాటలన్నిటికీ ట్యూన్లు కట్టినదీ, వందల చోట్ల పాడి ప్రచారం చేసినదీ ఎన్‌కె అనీ, 'లాల్ బనో, గులామీ చోడో, బోలో వందే మాతరం' అనే అజరామరమైన కవిత రాసినది ఆయనేననీ ఈ నాలుగైదు రోజులుగా జ్ఞాపకాలు, సంస్మరణ వ్యాసాలు రాసినవాళ్లందరూ రాశారు. గాయకుడిగా ఆయన ప్రతిభ గురించి ఇక్కడ అవసరం లేదు గాని, స్వయంగా ఆయన రాసిన పాటల్లో, కవితల్లో గుర్తించదగిన కవిత్వ లక్షణాల గురించి మాత్రం చెప్పుకోవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి. ఇప్పటికే చెయ్యి తిరిగిన కవులకైనా, కొత్తగా రాస్తున్న కవులకైనా, కవితాభిమానులకైనా ఆసక్తికరమైన అంశాలవి.

మొట్టమొదటిది ఎన్‌కె వాడిన కవిత్వ భాష. పొయిటిక్ డిక్షన్ – కవిత్వ పదజాలం – అనే భావన కవులందరికీ తెలిసినప్పటికీ దానిపట్ల ఎన్‌కె కు ఉండిన స్పష్టత, శ్రద్ధ చాలమంది ముందరి కవుల్లోనూ తర్వాతి కవుల్లోనూ కనిపించదు. ఎన్‌కె కు కూడ అది కఠోర సాధన ద్వారానే వచ్చిందని నాకు అనిపిస్తుంది. మొదట పద్య రచన చేసేవాడు. ప్రాచీన కావ్యాలు చదివాడు. తర్వాత కృష్ణశాస్త్రి కవిత్వంలోనూ చలం సాహిత్యంలోనూ తలమునకలయ్యాడు. అక్కడి నుంచి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం మీదుగా విప్లవ సాహిత్యంలోకి ప్రవేశించాడు. ఈ మధ్యలో తెలుగు ఎంఎ చదివి, సాంప్రదాయిక, ఆధునిక సాహిత్యాలలో శిక్షణ పొందాడు. రావిశాస్త్రి కథల మీద పిఎచ్‌డి చేయడానికి నిశితంగా అధ్యయనం చేశాడు. 'సృజన' సాహితీమిత్రులలో భాగంగా కనీసం ఇరవై సంవత్సరాలు రచనల ఎంపికలో, అంటే వందలాది మంది విభిన్నమైన కవుల, సాహిత్యకారుల భాషలను, శైలులను పరిశీలించాడు. అంటే కనీసం నాలుగైదు రకాల కవితా పదజాలం తన అందుబాటులోకి వచ్చింది. ఇదంతా ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని తన కవితా పదజాలం మీద ప్రభావం వేసి ఉంటుంది. అంతకు ముందరి తెలంగాణ కవిత్వాన్నీ, అంతకు ముందూ ఆ తర్వాతా కూడ విరివిగా రాసిన ప్రేమ కవిత్వాన్నీ పక్కన పెడితే, విప్లవ కవిత్వంలో అచ్చయిన మొదటి కవిత 'సృజన' మే 1970 సంచిక ముఖపత్ర కవిత 'మేడే'. ఆ తర్వాత ఇరవై, ఇరవై ఐదు సంవత్సరాలు తాను రాసిన కవితలు ఏడాదికి ఒకటైనా ఉన్నాయో లేవో తెలియదు. కాని ప్రతి ఒక్కటీ విశిష్టమైన వస్తువుతో, గొప్ప శిల్పంతో, ప్రత్యేకమైన పదజాలంతో వెలువడ్డాయి. అందువల్లనే తక్కువ కవిత్వమే రాసినా ఆయన అరుదైన కవిగా గుర్తింపు పొందాడు. గాయకుడు కూడ గనుక వచన కవిత్వంలోనూ పదాల తూగు, పద సంయోజనం అద్భుతంగా ఉండేది. మాత్రాఛందస్సును కూడ పాటించకపోయినా తన వచన కవితలు కూడ చదువుతుంటే, పైకి చదువుకుంటే వినడానికి చాల బాగుంటాయి.

ఎన్‌కె కవిత్వంలో మరొక ముఖ్యమైన అంశం ఆర్ద్రత, అనుభూతి సాంద్రత. ఏ ఒక్క కవితను తీసుకుని చూసినా ప్రతి పదంలోనూ, పంక్తిలోనూ హృదయానికి నేరుగా హత్తుకునే గాఢమైన అభివ్యక్తి ఉంటుంది. "ఒకచేత్తో కన్నీరు తుడుచుకునీ, వేరొకచేత్తో ఎర్రజెండ ఎత్తుకునీ"

అని  తానే ఒక పాటలో రాసినట్టు తన కవిత్వానికి ప్రధాన లక్షణం ఈ రెండు ఉద్వేగాల సమ్మేళనమే. ఆ కన్నీటి స్పర్శ వల్ల ప్రతి కవితా పాఠకులకు, శ్రోతలకు ఆత్మీయంగా తయారయ్యాయి, ఆ విప్లవ స్ఫూర్తి వల్ల అవి ఒక సామాజిక ప్రయోజనాన్ని నెరవేర్చాయి. అంటే వయ్యక్తికతనూ సామాజికతనూ రసాయనిక సమ్మేళనంలో ఏకం చేసిన కవిత్వం, అందువల్ల సాంద్రమైన కవిత్వం ఆయనది. (రసాయనశాస్త్ర ప్రయోగశాలలో ఉద్యోగిగా ఉండడం, విభిన్న రసాయనాలను వేరువేరు పాళ్లలో కలిపి ఫలితాలను పరీక్షించడం కూడ ఆయన కవిత్వంపై పరోక్ష ప్రభావం వేసి ఉంటుందా?!)

కవిత్వ పదజాలం పట్ల, కవిత్వం కలిగించవలసిన, కలిగించగలిగిన అనుభూతి ఫలితం పట్ల ఈ నిశితమైన ఎరుక ఉండడం వల్లనేనేమో, ఆయన కవిత రాయడమంటే కొన్ని నెలల, వారాల, రోజుల ప్రయత్నంగా ఉండేది. కవిత, పాట రాస్తున్న క్రమంలో ఎప్పటికప్పుడు తయారయిన పంక్తిని, పాదాన్ని, చరణాన్ని పైకి మననం చేస్తుండేవాడు, గున్గునాయిస్తుండేవాడు. గొంతెత్తి పాడడమో, చదవడమో చేసేవాడు. మాటలతో సులభంగా సంతృప్తి చెందేవాడు కాదు. కొత్త మాటల కోసం వెతుకుతుండేవాడు. తన కవిత్వం గురించే ఇంత తపన, అన్వేషణ, సాధన ఉన్నవాడు, ఇక ఇతరుల కవిత్వాన్ని పరిశీలించి ప్రచురణకు ఎంపిక చేసే బాధ్యతలో ఉన్నప్పుడు ఎట్లా ఉంటాడో ఊహించవచ్చు. 'సృజన' సాహితీమిత్రుల సమావేశాల్లో కవితలు చదివే పని మొదట తనదీ, ఆ తర్వాత నాదీ. ఒక్కోసారి, ఒక పాదం కాగానే 'ఆగు' అని తనలో తానే ఆ పాదాన్ని చదువుకునేవాడు. తన  ప్రశంసనో, విమర్శనో ప్రకటించేవాడు. అక్కడ కవి రాసిన పదం బదులు మరొక పదం ఉంటే ఎలా ఉంటుందో వినిపించేవాడు. నిజంగా అది ఒక కవిత్వ ప్రయోగశాలలా ఉండేది. ఒక్కోసారి మేం తనది పర్ఫెక్షనిజం – ఏదైనా సమగ్రంగా ఉండాలనే వాదం – అని బనాయిస్తుండేవాళ్లం. "ఓ ఎన్.కె., మా ఎన్.కె., నీ ఎనకే మేమంతా" అని వేళాకోళం చేస్తుండేవాళ్లం. బహుశా ఆ పర్ఫెక్షనిజమే ఆయన తక్కువ రాయడానికీ, చాలసార్లు శకలాలు మాత్రమే రాసి, మొత్తం కవిత పూర్తి చేయకపోవడానికీ, రాసినవాటిని కూడ అచ్చుకు ఇవ్వకపోవడానికీ కారణమైందేమో.

తన కవితా సంకలనం 'రిహార్సల్' (1981) లో అచ్చయిన కవితలు, పాటల్లోనూ, 'లాల్ బనో, గులామీ చోడో, బోలో వందేమాతరం' లోనూ, మొత్తంగా ఎన్కె కవిత్వంలో మరొక రెండు అంశాలు కూడ గుర్తించదగినవి. ఒకటి, చాల సందర్భాలలో కవిత నిర్దిష్టమైన అనుభవానికీ, వ్యక్తికీ, ఘటనకూ సంబంధించినది అయి, ఆ నిర్దిష్టత వ్యక్తమవుతూ కూడ, విస్తరించి సాధారణ, సార్వజనీన అనుభవంలోకి పర్యవసించడం. ఉదాహరణకు "సత్యాన్ని చాటే పుస్తకాల్ని నిషేధించగలరు గాని, సాక్ష్యంగా బతికే ప్రపంచాన్ని ఏం చేస్తారు" అని తాను పూర్తి చేయని, కేవలం ఖండికగా రాసిన నాలుగు పాదాలున్నాయి. అవి నిర్దిష్టంగా

1971 మార్చ్ – ఏప్రిల్ లలో 'మార్చ్', 'ఝంఝ' కవితా సంకలనాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిషేధించినప్పుడు ఎన్కె కు కలిగిన ఆగ్రహం నుంచి వచ్చిన కవితా పాదాలు. 'సృజన' 1971 మే సంచికలో ఒక కవిత కింద ఫిల్లర్ గా అచ్చయినవి. కాని, ఆ నిర్దిష్ట సందర్భం తెలియకపోయినా ఎల్లకాలానికీ అన్వయించగలిగిన గొప్ప కవితా వాక్యాలు అవి. అలాగే 'రిహార్సల్' లోని ఇరవై ఒక్క కవితల్లో తొమ్మిది ఎవరో ఒకరిని ఉద్దేశించి, ఒకానొక ప్రత్యేక సందర్భంలో రాసినవే కాని అన్నిటికన్నీ ఆ వ్యక్తినీ ఆ సందర్భాన్నీ దాటి ఇవాళ్టికీ ఉత్తేజకరంగా ఉంటాయి.

రెండు, దానికే కొనసాగింపు, ఒక తక్షణ అవసరం కోసం రాసినప్పటికీ, తన కవితాశక్తి వల్ల శాశ్వతంగా నిలిచిపోగలిగిన, నిలిచిపోయిన, ఆ తర్వాతి కాలానికీ అన్వయించదగిన కవితలు. ఎన్నో ఉదాహరణలు ఇవ్వవచ్చు గాని, అన్నిటికన్నా సుప్రసిద్ధమైన ఉదాహరణ 'లాల్ బనో, గులామీ చోడో, బోలో వందేమాతరం'. సంఘ్ పరివార్ భావజాలం వరంగల్‌లో వేళ్లూనుకోవడానికి ఎంతోకాలం నుంచి ప్రయత్నిస్తుండేది గాని, చుట్టుపట్ల గ్రామాల్లో రైతాంగ పోరాటాలు పెల్లుబికి దొరలు గ్రామాల నుంచి పారిపోయి వచ్చి వరంగల్ పట్టణంలో తలదాచుకోవడం మొదలు పెట్టినప్పుడు, ఆ దొరల పిల్లల చేరికతో సంఘపరివారం కాస్త బలపడింది. అప్పుడే పిజి సెంటర్ కాకతీయ విశ్వవిద్యాలయంగా మారిన తర్వాత ఆ గ్రామీణ విద్యాలయంలో చేరిన దళితుల, వెనుకబడిన కులాల, పేదరైతుల బిడ్డలు, మొదటి తరం విద్యావంతులు రాడికల్ విద్యార్థి సంఘం, ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం కార్యకర్తలుగా మారితే, దొరల బిడ్డలు అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ కార్యకర్తలయ్యారు. సరిగ్గా అప్పుడే ఎన్.కె. కాకతీయ విశ్వవిద్యాలయ విద్యార్థి అయ్యాడు. తొలిరోజుల్లోనే 'వేర్ ది మైండ్ ఈజ్ ఫ్రీ' అనే రవీంద్రనాథ్ టాగూర్ గీతానువాదం గోడల మీద అతికించిన ఒక ప్రగతిశీల బృందంలో ఉన్నాడు. ఆ కవితకూ, దాన్ని పోస్టర్‌గా అతికించడానికీ ఎబివిపి అభ్యంతరం చెప్పినందువల్ల ఘర్షణ జరిగింది. ఇక ఆ తర్వాత రెండు మూడు సంవత్సరాలు విప్లవ విద్యార్థులకూ ఎబివిపి కార్యకర్తలకూ నిత్య ఘర్షణలే.

విప్లవ విద్యార్థులు లాల్ గులామీలు (ఎరుపుకు బానిసలు) అనీ, అది వదులుకుని వందేమాతరం అనాలనీ, వందేమాతరం అనడమే దేశభక్తి అనీ ఎబివిపి 'లాల్ గులామీ చోడ్ కర్, బోలో వందేమాతరం' అని నినాదం తయారుచేసి గోడలనిండా రాసింది. నిజానికి ఒక పాలకవర్గ ముఠాగా సంఘపరివారం కూడ దేశాన్ని తాకట్టుపెట్టేదేనని, దేశం పట్ల నిజమైన ప్రేమ ఉన్నది విప్లవకారులకేనని, వారికి దేశమంటే మట్టి కాదు, మనుషులనీ చెప్పాలని ప్రతి ఒక్క విప్లవ విద్యార్థీ తపన పడుతున్న, ప్రయత్నిస్తున్న సందర్భం అది. ఆ తక్షణ, నిర్దిష్ట సందర్భంలో అసలు మానవ జాతి చరిత్ర, ప్రపంచ చరిత్ర, భారతదేశ చరిత్ర వివరించి, శ్రమ జీవులకు మాత్రమే తమ నేల మీద నిజమైన ప్రేమ ఎలా ఉంటుందో, మార్క్సిస్టులు ఆ ప్రేమను సాకారం చేయడానికి ఎలా ప్రయత్నిస్తారో, ఆ నాటికి భారత

పీడిత ప్రజా ఉద్యమానికి ఆదిలాబాద్ అడవుల్లో సాగుతున్న విప్లవోద్యమం ఎలా సూచికో ఒక విశాలమైన కాన్వాస్ ఎంచుకుని సుదీర్ఘ కవిత రాశాడు ఎన్కె. ఎబివిపి నినాదాన్ని తిరగేసి 'లాల్ బనో, గులామీ చోడో, బోలో వందేమాతరం' అని ఒక ఉత్తేజకర నినాదంగా మలిచాడు. దాదాపు మూడు నెలలు ఆ కవిత మీద సాహితీమిత్రులలో చర్చ జరిగి చివరికి అది ఆగస్ట్ 1982 సంచికలో అచ్చయింది. ఆ తర్వాత రాడికల్ విద్యార్థి సంఘం ప్రచురణగా 1983లో, 1985లో పునర్ముద్రణ పొందింది. వందలాది సభలు, సమావేశాల్లో ఎన్.కె. గళంలోనూ, మరెందరో గళాలలోనూ వేలాది మందికి పరిచయమయింది. అది అంత తక్షణ కవిత అయి ఉండీ ఎంత శాశ్వత కవిత అయిందంటే, ఇవాళ మళ్లీ మన మేధో, మానసిక, భౌతిక ప్రపంచంలో సంఘపరివార్ వికటాట్టహాసాలు, దూకుడు దురాక్రమణలు పెరిగిపోతున్న వేళ ఆ ముప్పై రెండు సంవత్సరాల కిందటి కవిత తాజాగా, కొత్తగా, ఇప్పటి అవసరానికి రాసినట్టుగా కనబడడం ఎన్కె ప్రతిభకు నిదర్శనం.

కవిత్వంతో నా ములాఖాత్ల వివరణలో, మనిషే కవిత్వమైన ఆ కవిత్వమనీషితో నా జీవితంలో అత్యధిక భాగం అతి సన్నిహితంగా గడిపానని చెప్పుకోవడం కన్న ఉజ్వలమైన అనుభవం మరేముంటుంది?

# హనుమకొండ జీవితమూ కవిత్వమూ

సరిగ్గా కవిత్వంతో నా ములాఖాత్ల లాగే ఈ శీర్షిక కూడ కాలక్రమంలో పద్ధతి ప్రకారం సాగడం కష్టమే అయ్యేట్టుంది. నిజానికి నా ఒక్కడి కవిత్వ ములాఖాత్లు మాత్రమే కాదు, ఎవరి కవిత్వ ములాఖాత్లైనా పద్ధతి ప్రకారం సాగవనుకుంటాను. అనేకానేక కారణాలవల్ల అనేకానేక మంది కవులతో, కవిత్వంతో అనుకోని వేళలలో ములాఖాత్లు జరుగుతాయి. పక్కనే ఉన్న కవి జీవితాంతం తెలియకనే పోవచ్చు, స్థలంలోనూ కాలంలోనూ సుదూరపు కవి ఏదో ఒక కారణం వల్ల సన్నిహితం కావచ్చు. కవిత్వ ములాఖాత్ల చరిత్ర క్రమబద్ధంగా చెపుదామని మొదలుపెట్టినా మధ్యలో అది ముందువెనుకలు కావచ్చు. నా ములాఖాత్లు క్రమపద్ధతిలో రాయగలనని అమాయకంగా అనుకున్నాను గాని, అది సాధ్యం కాదని తేలిపోయింది. ఇప్పటికే రాసినవాటిలో మధ్యలో కాలపు జల్లెడ నుంచి రాలిపోయిన జ్ఞాపకాలున్నాయి. వాటిని ఇప్పుడే మునివేళ్లతో ఎత్తిపట్టకపోతే అవి కాలగర్భంలో కలిసిపోతాయి.

ఏడో తరగతి నాటికే మా రాజారం ఇంట్లో బంగ్లా మీద గదిలో ఒక చిన్న గ్రంథాలయం తయారుచేసుకుని, అందులో గోడలనిండా కవిత్వ చరణాలు రాసి పెట్టుకుని, కవిత్వాన్ని ఆస్వాదించడం మొదలుపెట్టానని చెప్పాను. ఎనిమిదో తరగతి కోసం హనుమకొండ రావడం

కవిత్వానికి కొత్త కిటికీలు తెరిచింది. కవిత్వంతో కొత్త ములాఖాత్‌లను ఇచ్చింది. కవిత్వం చదవడంలో, వినడంలో, అర్థం చేసుకోవడంలో, కవిత్వ ప్రభావాన్ని గ్రహించడంలో కొత్త వెలుగులతో కళ్లూ చెవులూ తెరిపించింది. ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే అసలు ఇన్నిన్ని మార్పులకు, కుదుపులకు లోనైనవి మా జీవితాలేనా అని ఆశ్చర్యమూ గగుర్పాటూ కలుగుతాయి.

1973లో చిన్నపెండ్యాలలో ఏడో తరగతి ముగిసి, అక్కడ ఎనిమిదో తరగతి లేకపోవడంతో, అప్పటికే రెండు సంవత్సరాల నడక వల్ల, మళ్లీ హైస్కూలు ఘనపురంలో చేర్చి నడిపించడం ఇష్టం లేక నన్ను హనుమకొండ మర్కజీ హైస్కూలులో చేర్చారు. నేను హనుమకొండలో చదువుకు చేరకముందు 'సృజన' ప్యాకింగ్, పోస్టింగ్ బాధ్యతంతా మా అన్నయ్య రాంగోపాల్ చూసేవాడు. నేను హనుమకొండ వెళ్లినప్పుడు 'సృజన' ప్యాకింగ్‌లో చెయ్యి పెడుతూ ఉండేవాడ్ని. ఇక పూర్తిగా హనుమకొండకు వచ్చాక ఇంట్లో 'సృజన' పనిలో నాకూ భాగం వచ్చింది.

'సృజన' నిర్వహణ విషయాలు ఇక్కడ అప్రస్తుతం గాని, 'సృజన' నుంచి, 'సృజన' వల్ల నాకు ఏర్పడిన కవిత్వ ములాఖాత్‌ల గురించి చెప్పాలి. నేను హనుమకొండకు వచ్చిన తర్వాత వెలువడిన సంచిక జూలై 1973. ముఖచిత్రం మీద అప్పుడే ప్రమాదవశాత్తూ మరణించిన కథకుడు ఎన్ ఎస్ ప్రకాశరావు ఫొటో. లోపల ఆయన మీద స్మృతి గీతాలు. అప్పటికే చెరబండరాజు పేరు, రావిశాస్త్రి పేరు విని ఉన్నాను గాని, ఆ సంచికలో ఎన్నెస్ మీద వాళ్లిద్దరి స్మృతి గీతాలు ఒక చనిపోయిన మనిషిని తలచుకోవడమంటే ఏమిటో, సంస్మరణ కవిత్వం ఎలా ఉంటుందో చూపాయి. అప్పటికి ఎన్‌కె, జనసేన, కానూరి వెంకటేశ్వరరావుల పాటలు విని, వాటిలో కవిత్వం కొంతైనా అనుభవించి ఉన్నాను గాని ఆ సంచికలోనే మొదటిసారిగా వి బి గద్దర్ పాటలు చూశాను. అప్పటికే లయ ఉన్న కవిత్వం, గొంతెత్తి చదువుకునే కవిత్వం రుచి దొరికి ఉన్న నాకు ఆ సంచికలో అచ్చయిన నాలుగు గద్దర్ పాటలు కొత్త కవిత్వాన్ని పరిచయం చేశాయి.

> 'నీవు నిజం దెలుసుకోవరో కూలన్న
> నీవు నడుంగట్టి నడవాలి రైతన్నా',
> 'రిక్షాదొక్కే రహీమన్న
> రాళ్లుగొట్టే రామన్న
> డ్రైవరు మల్లన్న
> హమాలి కొమ్రన్న',
> 'వాన పడతాది జాన
> ఎట్ట బొమ్మందునో',

'కల్లుముంతో మాయమ్మ నిన్ను మరువజాలనే' అనే ఆ పాటలు చదువుతుంటే ఒళ్లు పులకించింది. ఇంత మామూలు మాటలతో, ఇంతగా ఉద్రేకపరిచే కవిత్వం ఉంటుందా అని ఆశ్చర్యం వేసింది. ఆ తర్వాత మూడు నెలలకు ఆ పాటలు గద్దర్ నోటి వెంట విన్నప్పుడు కలిగిన ఉత్తేజం నిజంగా చెప్పడం అసాధ్యం.

గద్దర్ పాటలు అచ్చుకెక్కడం అదే మొదటిసారి. అందుకే అవి అచ్చవుతున్నప్పుడు 'సృజన' సంపాదకీయ వ్యాఖ్య కూడ రాసింది: "ఈ సంచికలోనూ, రాగల వొకటి, రెండు సంచికల్లోనూ ఎక్కువ సంఖ్యలో వేయనున్న వి.బి. గద్దర్ పాటలు త్వరలో పుస్తకరూపంలో కూడ వస్తయి. హైదరాబాదు జిల్లా మాండలికాలు, అక్కడి ప్రజాజీవితం మాత్రమే కాదు – ఈ పాటలన్నీ ఆ చుట్టుపట్ల పల్లెల్లో ప్రజలు పాడుకునే బాణీల్లో వచ్చినవే. కొన్ని పాటల మకుటాలు, చరణాలు కూడ ప్రజలు పాడుకునే పాటలనుంచే తీసుకుని విప్లవభావాలకు అనుగుణంగా మలచినవి. ఈనాడివి హైదరాబాదు చుట్టూ దాదాపు ఇరవై గ్రామాల్లో విరివిగా పాడుకోబడుతున్నయి. అందరికీ అందుబాటులోకి తెచ్చే ఉద్దేశంతో ఇప్పటికే ప్రచారంలో వున్న ఈ పాటలను అచ్చులోకి తెస్తున్నాం."

అవి అప్పటికి ఎంత అర్థమయ్యాయో చెప్పలేను గాని, ఆ తర్వాత నాలుగు నెలలు నిజంగా జీవితం మారిపోయిన రోజులు. ఆ తర్వాత వెలువడిన ఆగస్ట్ 1973 సంచికలో 'వీడేనమ్మో డబ్బున్న బాడుకావు', 'పోదామురో జనసేనలో కలిసి', సెప్టెంబర్ 1973 సంచికలో 'రెక్కబొక్క నొయ్యకుండ సుక్కసెమ్ట వొద్వకుండ బొర్ర బాగా బెంచావురో దొరోడో', 'పిల్లో నేనెల్లి పోతా', 'నిజం తెలుసుకోవరో కూలన్న' ఖవాలి.

ఒకవైపు ఈ పాటల ప్రభంజనంలో ఉండగానే ఆగస్ట్ 1973 సంచిక ముఖచిత్రంగా వచ్చిన కొల్లిపర రామనరసింహా రావు గురించి దేవిప్రియ రాసిన పది పాదాల చిన్న కవిత – నలభై సంవత్సరాల తర్వాత ఇప్పటికీ నా నాలుక మీద పలికే కవిత – 'కాల్చియేసిన్రే కొడుకులు కూల్చియేసిన్రే'.

అప్పుడే విప్లవ రచయితల సంఘం తొలి సాహిత్య పాఠశాల హనుమకొండలో జరిగింది. ఇంకా పదమూడు సంవత్సరాలు నిండని ఒక అమాయక బాలుడి కళ్లూ చెవులూ చాలని అద్భుత దృశ్యాలు, మాటలు, పాటలు, మనుషులు, నినాదాలు, పరిహాసాలు, ఊరేగింపులు. శ్రీశ్రీ, కెవి రమణారెడ్డి, త్రిపురనేని మధుసూదన రావు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, కాశీపతి, ఎంటి ఖాన్, పత్తిపాటి వెంకటేశ్వర్లు, చలసాని ప్రసాద్... అప్పటి దాకా అచ్చు అక్షరాలుగా మాత్రమే తెలిసినవారెందరో మూడు రోజులు కళ్ల ముందర తిరిగారు. గద్దర్ సరేసరి. అదే ఒక కవిత్వ సంరంభం. నాకు గుర్తున్నంతవరకు అక్కడే నేను మొదటిసారి పుస్తకాలు అమ్మాను.

ఆ మహాజన సందోహం నాటికి వెలువడిన 'సృజన' అక్టోబర్ సంచికలో రెంజిం

పేరుతో అచ్చయిన శివసాగర్ 'తోటరాముని తొడకు' పాట. అది ఎన్‌కె పాడుతుంటే, 'వాగు జల జల ఏడ్చెరా, వాగు వల వల ఏడ్చెరా' అని ఎన్‌కె గొంతు వణికితే శ్రోతలు కన్నీరు పెట్టవలసిందే. 'తోట రాముడు కళ్లు తెరిచి నవ్విండంట. అడవీ అడవీ నవ్వెరా, పల్లె మల్లెలు పూచెరా, నా కళ్లా నీరు నిండెరా' అని ఎన్‌కె గొంతులో ఆనంద పారవశ్యం పలికితే ప్రతి ఒక్కరి ముఖాల మీద వెలుగులు చిమ్మవలసిందే.

ఆ సాహిత్య పాఠశాల అందించిన కవిత్వ ములాఖాత్ అది మాత్రమే కాదు. సభల చివరిరోజు వరంగల్ జగదీశ్‌నగర్‌లో బహిరంగ సభ, గద్దర్ పాటలు, బీదలపాట్లు, వీరకుంకుమ నాటకాలు కాగా, దానికి ముందు రోజు హనుమకొండ జీవన్‌లాల్ గ్రౌండ్స్‌లో కవి సమ్మేళనం. అప్పుడు హనుమకొండలో జీవన్‌లాల్ గ్రౌండ్స్ ఒక మంచి బహిరంగ సభాస్థలం. పదివేలమంది పడతారని అనుకునేవాణ్ని. అప్పటి నా వయసుకు జనసంఖ్య అవగాహన లేదు గాని ఇప్పుడు చూస్తే ఆ కవి సమ్మేళనానికి రెండు వేల మంది హాజరయ్యారని 'సృజన' రిపోర్టు రాసింది. ఆ కవి సమ్మేళనానికి శ్రీశ్రీ అధ్యక్షత. నలభై మంది కవులు తమ కవిత్వం చదివి వినిపించారు.

అద్భుతంగా జరిగిన ఆ సభల ఉద్ధృతోత్సాహం ఇంకా చల్లారక ముందే, సభలు ముగిసిన మూడో రోజు ఉదయాన్నే పోలీసులు వచ్చి వరవరరావును అరెస్ట్ చేసి తీసుకు పోయారు. హైదరాబాదులో చెరబండరాజును, ఎంటి ఖాన్‌ను కూడ అరెస్టుచేశారు. కవిత్వానికీ, సాహిత్యానికీ, పత్రిక నడపడానికీ, ఉపన్యాసాలు ఇవ్వడానికీ, సభలు ఏర్పాటు చేయడానికీ పర్యవసానం ఎలా ఉంటుందో అంత వేగంగా తెలిసివచ్చిన సందర్భం అది. ఆంతరంగిక భద్రతాచట్టం కింద జరిగిన ఆ అరెస్టులు చెల్లవని కోర్టు కొట్టివేయడంతో ఐదు వారాల తర్వాత వరవరరావు విడుదలైతే, జైలు దగ్గరికి వంద మందిమి వెళ్లి ఊరేగింపుగా తీసుకువచ్చి, హనుమకొండ చౌరస్తాలో సుభాస్ చంద్రబోస్ విగ్రహం దగ్గర సభలాగ జరిపి, కవితాచరణాలనే నినాదాలుగా మార్చినప్పుడు 'కవిత్వం అనుభవ వస్తువు కావాలి' అని శ్రీశ్రీ అన్నమాట అప్పటికి తెలియదు గాని, అది అప్పటికే నిత్యజీవితానుభవ వస్తువుగా మారిపోయి ఉంది.

'సృజన'కు వచ్చే కవిత్వం చదవడం, హనుమకొండ, వరంగల్‌లలో నిత్యం కవి సమ్మేళనాలు జరుగుతుండడం, ప్రతి వారమూ లేదా రెండు వారాలకొకసారీ మిత్రమండలి సమావేశాలలో చదివే కవిత్వం వింటుండడం అప్పటి కవిత్వ ములాఖాత్‌లలో మరికొన్ని.

అప్పుడే 'సృజన' డిసెంబర్ 1973 సంచికలో శివసాగర్ 'వివాలా శాంటియాగో' కవిత అచ్చయింది. చిలీలో సైనిక కుట్ర జరిపి అధ్యక్షుడు సల్వదోర్ అయెండె ని, వేలాది మంది సోషలిస్టులను ఊచకోత కోసిన సిఐఎ కుట్ర గురించి అంతర్జాతీయ రాజకీయాలనూ, అమెరికన్ సామ్రాజ్యవాదం మీద కసినీ, మూడవ ప్రపంచదేశాల ప్రజల సంఘీభావ స్ఫూర్తినీ కలగలిపి అత్యద్భుతంగా ప్రకటించిన దీర్ఘ కవిత అది. అప్పటికే నాలుక మీద పిలిస్తే పలికే శివసాగర్ ఈ కవితతో మరింత సన్నిహితుడయ్యాడు.

# మొట్టమొదటి బలహీన అక్షరాలు

అప్పటికే ప్రపంచవ్యాప్తంగా సుప్రసిద్ధుడైన మహాకవి పాబ్లో నెరూడా తనను కవిత్వం ఎలా ఆవహించిందో తన అరవయో ఏట ఒక అద్భుతమైన కవిత రాశాడు. మన మహాకవి శ్రీశ్రీ కవితతో "నీకై బ్రదుకే ఒక తపమై వెదుకాడా"ననీ, "నీకై నేనేరిన వేయే ధ్వనులో, ఏయే మూలల వెదికిన ప్రోవుల ప్రోవుల రణన్నినాదాలో" అనీ చెపితే, నెరూడా మాత్రం "కవిత నన్ను వెతుకుతూ వచ్చింది" అన్నాడు.

"ఒకానొక కాలాన.... కవిత నన్ను వెతుకుతూ వచ్చింది
నాకు తెలియదు
నాకేమీ తెలియదు
ఎక్కడినుంచి వచ్చిందో
చలికాలం నుంచా నది లోంచా
ఎక్కడినుంచో తెలియదు, ఎప్పుడొచ్చిందో తెలియదు
అవి గొంతులు కావు, అవి
మాటలు కూడ కావు, నిశ్శబ్దమూ కాదు

కాని ఒక వీథిలోంచి నన్ను పిలిచింది
రాత్రి కొమ్మల మీద కూచున్న నన్ను పిలిచింది
మిత్రులతో బాతాఖానీ ఆపించి నన్ను పిలిచింది
హింసాజ్వాలల మధ్య నన్ను పిలిచింది
ఒంటరి ప్రయాణం నుంచి నన్ను పిలిచింది
అక్కడ, ముఖం లేకుండా నిలబడ్డ నన్ను
కవిత స్పృశించింది

ఏమనాలో నాకు తెలియలేదు, పేర్లు నిండిన
నా నోరు తెరుచుకోలేదు
నా కళ్లు గుడ్డివైపోయాయి
నా ఆత్మలోలోపల ఏదో కదలాడింది

అది జ్వరమో, మరిచిపోయిన రెక్కలు గుర్తుకొచ్చాయో,
నేనిక నా దారి వెతుక్కున్నాను
ఆ మంటకు అక్షరాలు తొడగడం మొదలెట్టాను
మొట్టమొదటి బలహీనపు పాదం రాశాను
బలహీనం, నిస్సారం, ఉత్తి అర్థరాహిత్యం
ఏమీ తెలియనివాడి శుద్ధ వివేకం

హఠాత్తుగా
ఆకాశాలు కట్లు విప్పుకుని
గ్రహాలు విడుదలయ్యాయి
అరణ్యాలు వణికిపోయాయి
బాణాలూ, మంటలూ, పూలూ
దూసుకువెళ్లి
నీడలు జల్లెడలయ్యాయి
భ్రమణరాత్రి, విశ్వం
నేను, అత్యంత సూక్ష్మ జీవిని
ఆ మహా నక్షత్ర శూన్యం తాగి
మమేకమై
నిగూఢత్వపు ప్రతిబింబాన్నై
ఆ మహా అగాథంలో అంతర్భాగాన్నయ్యాను

నక్షత్రాలతో ప్రయాణించాను
నా హృదయం గాలి అలల మీద ఎగిరిపోయింది"

ముప్పై ఐదేళ్లుగా దాన్ని అనువాదం చేయాలని ప్రయత్నించి విఫలమవుతున్నాను. నెరూడాతో ములాఖాత్ మరొకసారి గాని, ఈసారి కవిత్వ రచనతో నా ములాఖాత్ గురించి చెప్పేటప్పుడు ఈ కవిత గుర్తొచ్చింది. నేనూ నా బలహీనమైన, నిస్సారమైన అక్షరాలను, నేను కవిత్వమని భ్రమపడిన అక్షరాలను సరిగ్గా ఇలాగే తోసుకొచ్చిన సందర్భం వల్ల రాశాను. అది ఒక కథ.

విప్లవ సాహిత్యోద్యమ ఉధృతిలో అనంతపురం చైతన్యసాహితి 1972 చివరలో 'రక్తగానం' అనే కవితా సంకలనాన్ని ప్రచురించింది. ఆ పేరు నాకు చాల నచ్చింది. అప్పుడే

ఆ పుస్తకం నిషేధానికి గురయిందని కూడ విన్నాను. అప్పటికే కవిత్వం చదువుతూ, వింటూ, కవిత్వశక్తిని తెలుసుకుంటూ ఉన్నాను గనుక, ఎప్పటికైనా కవిత్వం రాయాలనీ, రాస్తే 'రక్తగాయకుడు' అనే కలం పేరుతో రాయాలనీ నిర్ణయించుకున్నాను. అలా కవిత్వం అనబడేది పలకడానికి కొన్ని నెలల ముందే రాయాలనే సంకల్పమూ, కలం పేరూ కుదిరాయన్నమాట.

ఆ సందర్భం ఆకాశవాణిలో జలగం వెంగళరావు మాటలు విన్నప్పుడు వచ్చింది. విప్లవోద్యమం అప్పటికింకా ప్రజాపంథా చేపట్టలేదు. దళచర్యలు మాత్రమే సాయుధ పోరాటమనుకునే దశలో ఉండేది. దళాల ఆర్థిక అవసరాలు తీర్చుకోవడానికి ధనవంతుల మీద, బ్యాంకుల మీద దాడులు (ఆర్థికచర్యలు) చేస్తుండేది. అలా 1974 ఫిబ్రవరి 18న నల్లగొండ జిల్లా నడిగూడెం గ్రామంలో స్టేట్ బ్యాంక్ మీద ఒక ఆర్థికచర్య జరిగింది. ఆ దాడి తర్వాత దళనాయకులు తాము దొంగలం కామనీ, నక్సలైట్లమనీ, ప్రజా ఉద్యమ నిర్మాణ అవసరాల కోసమే ఈ చర్య చేశామనీ ఉపన్యాసం ఇచ్చారు. అది విని తెలుగు తెలిసిన ప్రజలు వారిని వదిలేశారు గాని, సమీపంలో నాగార్జునసాగర్ కాలువ పనుల్లో ఉన్న తమిళ కూలీలు, గూర్ఖాలు వారిని పట్టుకుని పోలీసులకు అప్పగించారు. ఆ తర్వాత సికింద్రాబాద్ కుట్రకేసులో భాగమైన ఈ ఘటన అప్పుడు చాల సంచలనం అయింది. ఆతర్వాత రెండుమూడు రోజుల్లోనే ఒక రాత్రి నేను రాజారంలో మా ఇంట్లో రేడియోలో ఈ ఘటన మీద ఆకాశవాణి రూపొందించిన కార్యక్రమం విన్నాను. ఆ కార్యక్రమంలో ముఖ్యమంత్రి జలగం వెంగళరావు స్వయంగా పాల్గొని ఈ "దోపిడీ"ని ఖండించాడు.

నాకప్పుడు విప్లవోద్యమం ఏమిటో, ఆర్థిక చర్య ఏమిటో, దాని మంచి చెడులేమిటో పూర్తిగా తెలియని పదమూడేళ్ల వయసు. ఇది మనవాళ్లు చేసిన పని. కనుక మంచి పని. దీన్ని విమర్శిస్తూ, నిందిస్తూ శత్రువు మాట్లాడుతున్నాడు. కనుక ఇది సమర్థించవలసిన పని – తెలిసిందంతే. అది ఆలోచనో, విశ్లేషణో కాదు. కేవలం పాంవురం. అంతే. దోపిడీ అని వెంగళరావు గొంతులో విని 'అది దోపిడీ కాదు' అని నాలో భావం చెలరేగింది. 'అది దోపిడీ కాదు' అని శీర్షికతో, 'రక్తగాయకుడు' అని కలంపేరుతో ఒక పన్నెండు పంక్తుల కవిత అని నేననుకున్నది రాశాను.

ఆ కవిత అచ్చుకు 'సృజన'కే పంపాలి. కాని, 'సృజన'కు పంపాలంటే భయం, బెరుకు. 'సృజన'లో వస్తున్న కవిత్వ ప్రమాణాలు దీనికి ఉన్నాయా అనుమానం. సంకోచం. ఎవరికీ తెలియకుండా, చెప్పకుండా, రహస్యంగా, అనామకంగా 'సృజన'కు పంపి, సాహితీమిత్రులు ఏం చేస్తారో చూడాలి. అప్పటికింకా హనుమకొండ మర్కజీ హైస్కూలులో ఎనిమిదో తరగతిలో ఉన్నాను. మా మర్కజీ ఎదురుగానే లష్కర్ బజార్ పోస్టాఫీసు. అక్కడ ఒక కవర్ కొని, ఆ కవిత అందులో పెట్టి పోస్ట్ చేశాను. ఆ మర్నాడో, రెండురోజులకో అది ఇంటికి, 'సృజన' ఆఫీసుకు చేరుతుందనీ, అది చదివి వరవరరావుగారు ఎలా స్పందిస్తారో, సాహితీమిత్రుల

సమావేశంలో ఎలా స్పందిస్తారో చూడాలనీ ఆదుర్దా, కుతూహలం. మర్నాడు బడి ఎగ్గొట్టి, పోస్టు వచ్చే సమయానికి ఇంట్లో ఉన్నాను గాని ఆ రోజు నా కవర్ రాలేదు. ఎక్కువ రోజులు బడి ఎగ్గొట్టడానికి అవకాశం లేదు. మర్నాడుబడి నుంచి వచ్చాక పోస్ట్ వెతికితే అందులో 'రక్తగాయకుడి' కవిత లేదు. ఇప్పుడు రాస్తుంటే (పాంచురం ముందుమాటలో పన్నెండేళ్ల కింద రాసినప్పుడూ) సరదాగా ఉంది గాని, అప్పుడు నరాలు తెగిపోయే ఉత్కంఠ! అలా రెండు మూడు రోజులు చూసి, అది పోస్టులో పోయినట్టుందనుకున్నాను.

వారం, పది రోజుల తర్వాత 'సృజన' మార్చ్ 1974 సంచిక వచ్చింది. అందులో చూస్తే నా కవిత! 'అది దోపిడీ కాదు' – రక్తగాయకుడు అనే కవిత! అచ్చయిన నా మొదటి కవిత! ఒక పేజీలో పైన 'మాట్లాడే మైనా' అని శివసాగర్ కవిత. కింద నా కవిత. రాసిన అక్షరాలు మొదటిసారి అచ్చులో చూసుకున్న కవి అనుభూతి, సంభ్రమం, ఆశ్చర్యం, ఆనందం. కాని ఆ అక్షరాలు నావే అని చెప్పుకోలేని బెరుకు, సంకోచం. వెంటనే కాజీపేట వెళ్లి, రాఘవులు మామయ్య ఇంట్లో మా కొండన్నకూ హరికీ చెప్పుకున్నాను. అలా ఇంట్లో తెలిసింది. కవితారచనతో తొలి ములాఖాత్ అది.

కాని ఇంతకూ అది కవిత కాదు. చాల పేలవమైన, నిస్సారమైన పంక్తులు కొన్ని. సరే, అప్పటి ఉద్యమ, సాహిత్యోద్యమ అవసరాల కొద్దీ అది కవిత అనిపించి ఉండవచ్చు, ప్రచురణార్హమనీ అనిపించి ఉండవచ్చు. కాని నాకే పాఠకుడిగా, కవిగా, విమర్శకుడిగా దానిలో కవిత అని చెప్పే ప్రమాణాలు లేవని ఇప్పుడు తెలుస్తున్నది. అందుకే 2002 లో నా కవితా సంపుటం వేసినప్పుడు, అచ్చయిన మొదటి కవిత అనే పాంచురాన్ని కూడ వదులుకుని దాన్ని చేర్చలేదు. కాని ఇప్పుడు దాన్ని దానిపక్కనే అచ్చయిన శివసాగర్ 'మాట్లాడే మైనా' తో పోల్చి చెప్పడానికి కొన్ని అంశాలున్నాయి గనుక, కవిత్వ రచనతో నా మొదటి ములాఖాత్ ఎట్లా విఫలమైందో చెప్పడానికి వాడుకుంటున్నాను. ఆ రెండు కవితలూ రెండు నిర్దిష్ట రాజకీయ ఘటనలకు కవితా వ్యక్తీకరణలే. కాని ఆ పోలిక అక్కడితో అంతమవుతుంది. శివసాగర్ ఆ నిర్దిష్టతను విశాలం చేసి, సాధారణీకరించడానికి, తద్వారా కవిత్వీకరించడానికి ప్రయత్నించి సఫలమయ్యారు. ఆయన కవిత చివర సందర్భం రాశారు గాని, కవితలో పదమూడు పంక్తులలోనూ ప్రత్యక్షంగా ఆ ఘటన ప్రస్తావన లేదు. నేను నా పన్నెండు పంక్తులలో మొదటి ఏడు పంక్తులూ ఆ నిర్దిష్ట ఘటనను నేరుగా చెప్పడానికి ప్రయత్నించాను. ఆ మేరకు కవిత్వీకరణ తగ్గి, అది వచనంగా, రిపోర్టుగా, కాస్త వ్యంగ్యం కలిసిన రిపోర్టుగా మారింది. ఆ తర్వాత ఐదు పంక్తులూ నా రాజకీయ విశ్లేషణ, ప్రకటనే తప్ప అది కూడ కవిత్వం కాలేదు.

కవిత్వం రాయడానికి కవిత్వం చదవడమూ, వినడమూ, ఆస్వాదించడమూ అవసరమే గాని, అవి మాత్రమే సరిపోవనీ, మరేవో దినుసులు కావాలనీ ఆ తర్వాత ములాఖాత్‌ల లోగాని నేను తెలుసుకోలేకపోయాను.

# అధ్యయనం, ఆసక్తి, నిరంతర సాధన

మొదటి కవిత అచ్చు కావడం ఎంత ఆనందోద్వేగాన్ని కలిగించిందో, బహుశా తెలియకుండానే అంత బాధ్యతనూ పెంచినట్టుంది. అప్పుడు నాకు తెలియలేదుగాని ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే ఆ తర్వాత దాదాపు ఏడాది దాకా మళ్లీ కవిత అనేది రాయడానికి పూనుకోకపోవడం అసంకల్పితంగానే అయినా సకారణంగానే జరిగిందనుకుంటాను. ఎందుకంటే ఆ నిశ్శబ్దకాలం కవిత్వంతో ములాఖాత్‌లలో కొత్త అనుభవాలు కలిగించింది.

రాయాలంటే మనకంటె ముందు రాసిన వాళ్లను విరివిగా చదవాలి. అన్నిరకాల రచనలనూ రచనా శైలులనూ చదవడం మీద కేంద్రీకరించాలి. ఎవరినైనా చదివి, వాళ్లు నచ్చితే వాళ్లను అనుకరించడం మానుకోవాలి. సమాజాన్ని చదవాలి, మనుషులను చదవాలి. కొత్త భాష నేర్చుకోవాలి. భాష మీద, పదజాలం మీద నిరంతర సాధన చేయాలి. ఇవన్నీ తెలిసి, సంకల్పపూర్వకంగా చేశానని గొప్పలు చెప్పుకోలేను గాని తెలియకుండానే ఆ మధ్యంతర కాలంలో అవి చేసినందువల్ల ఆ తర్వాతి దశాబ్దాలలో జరిగిన కవిత్వ ములాఖాత్‌లకు పునాది పడిందని ఇప్పుడు కచ్చితంగా చెప్పగలను. అందుకే ఈ వారం ఆ నిశ్శబ్ద ములాఖాత్‌ల గురించి.

'సృజన' మార్చ్ 1974 సంచికలో మొదటి కవిత అచ్చయినాక, బహుశా కొంతకాలం కవినని అనవసర భ్రమలకు పోయి ఉంటాను. కాని కాలం ఆ అపోహలను ఎక్కువకాలం సాగనివ్వలేదు. కవిత్వం గురించి ఆలోచించడానికి వ్యవధినివ్వనంత వేగంగా పరిణామాలు జరిగిపోయాయి. మే 18న పోలీసులు ఇంటికి వచ్చి వరవరరావు గారిని అరెస్టు చేసి తీసుకుపోయారు. అది మండుటెండాకాలం. అప్పటికి మా అక్కయ్యకు (హేమలత, వరవరరావు సహచరి) ప్రసవమై మూడు వారాలు నిండలేదు. పాపను (పవనను) ఆ ఎండలనుంచి రక్షించడానికి గదిలో నీళ్లు నింపి పెడుతున్నాం.

అరెస్టు చేయడానికి ఈసారి వచ్చిన పద్ధతి గతంలో కన్న తక్కువ మర్యాదగా ఉండింది. ఈసారి వరంగల్ కోర్టుకో, జైలుకో కాక, హైదరాబాదు తీసుకువెళ్లారనీ, అక్కడ సికిందరాబాదు కుట్రకేసు అని ఒక పెద్ద కుట్రకేసు తయారయిందనీ, అందులో నిందితులలో వరవరరావు ఒకరనీ తెలిసింది. కొండపల్లి సీతారామయ్య, కె జి సత్యమూర్తిలతో సహా నలభై మంది విప్లవకారులతో పాటు విరసం నాయకులు కె వి రమణారెడ్డి, త్రిపురనేని మధుసూదనరావు, చెరబండరాజు, ఎం టి ఖాన్, ఎం రంగనాథం, వరవరరావు అందులో నిందితులు. అంతకుముందు అరెస్టు సందర్భంగా "భావాల కారణంగా ఎవరినీ నిర్బంధించగూడదు. ఆ భావాలు హింసాత్మక నేరాలుగా మారినప్పుడే అవి నిర్బంధానికి, నేరారోపణకు పునాది

కావాలి" అని జస్టిస్ ఆవుల సాంబశివరావు ఇచ్చిన తీర్పును, ప్రభుత్వం చాల తెలివిగా అన్వయించింది. ఎక్కడో ఒకచోట అప్పటికే నేరంగా నమోదై, విచారణలో ఉన్న ప్రతి విప్లవకారుల చర్యకూ ముందు ఈ ఆరుగురూ చేసిన ఉపన్యాసమో, రాసిన కవితో, రచనో కారణంగా చూపింది. అలా రచనను నేరానికి కుట్రలో భాగం చేసింది. "శత్రువు కలమూ కాగితమూ నన్ను బంధించింది/ప్రజలను సాయుధం కమ్మన్నందుకు కాదు/ నేనింకా సాయుధుణ్ని కానందుకు" అని వరవరరావు ఆ నిర్బంధం మీద, నేరారోపణమీద స్పందించారు.

ఒకవైపు ఈ నిర్బంధం, దానికి సంబంధించిన ఆందోళన, ఆవేదన సాగుతుండగానే, అప్పటికి మేం అద్దెకు ఉంటున్న యజమాని, "ఇలా అరెస్టయ్యే ప్రభుత్వ వ్యతిరేకులకు మేం ఇల్లు ఇవ్వలేం. వెంటనే ఖాళీ చెయ్యండి" అని రాత్రికి రాత్రి మమ్మల్ని ఇంట్లో నుంచి పంపించేశాడు. మరొక ఇల్లు వెతుక్కునేవరకూ మూడు నాలుగు వారాలు మిత్రుల ఇంట్లో తలదాచుకోవలసి వచ్చింది.

కవిత్వమంటే విందుభోజనం కాదనీ, అది కంటకావృతమార్గమనీ, కాగితం మీది అక్షరానికి బలి కావడానికి సిద్ధపడాలనీ ఒక ఎరుకను బలంగా, వేదనామయంగా కలిగించిన ములాఖాత్ అది.

వరవరరావు మొదటి అరెస్టు సందర్భంగా 1973 నవంబర్‌లోనే 'సృజన' సంపాదకత్వం హేమలతకు మారింది. అప్పటి నుంచి 'సృజన' 'సాహితీమిత్రులు' పూర్తిస్థాయి సమష్టి కృషిగా మెరుగులు దిద్దుకుంది. లోచన్, ఎన్.కె. వంటి అప్పటికే ప్రసిద్ధులైన కవులు, కె రాంమోహన్ రాజు, మా అన్నయ్య రాంగోపాల్, ఆర్ఇసి విద్యార్థి సోమసుందర్ తదితరులు ప్రతి రచననూ చదివి, చర్చించి, అవసరమైన అనువాదాలు, రచనలు చేసి 'సృజన'ను వెలువరించే బాధ్యత తీసుకున్నారు. అప్పటికింకా హైస్కూలు విద్యార్థిగానే ఆ సమావేశాల్లో కూచోవడం, ఎన్‌కె కవిత్వం చదువుతుంటే ఆయన గొంతు మార్పులను, స్వర విన్యాసాన్ని వినడం కవిత్వంతో మరొక ములాఖాత్. అలా రచనలు చదివి, చర్చించి, నాణ్యత నిర్ణయించి, ఎంపిక చేసే 'సాహితీమిత్రులే' సంచిక రాగానే ప్యాకింగ్, పోస్టింగ్ పనులు కూడ చేసేవారు. రోజువారీ సర్క్యులేషన్ పనులు చేసేవారు. ఆరకంగా 'సృజన' 'సాహితీమిత్రుల' సంప్రదాయం మేధో శ్రమకూ శారీరక శ్రమకూ మధ్య అంతరాన్ని చెరపడానికి ప్రయత్నించింది. కవిత్వంతో మాత్రమే కాదు, జీవితంతో ములాఖాత్‌ల లోనే ఈ శ్రమ అంతరాన్ని తుడిచే పాఠం నా జీవితానికంతా దిక్సూచి అనుకుంటాను.

అందరికందరూ విద్యార్థులుగానో, ఉద్యోగులుగానో ఇతర వ్యాపకాలలో ఉన్నవారే గనుక సాధారణంగా ప్యాకింగ్ పనులకు ఒక రాత్రి పూర్తిగా కేటాయించేవారు. నైట్ అవుట్ చేసి పని చేస్తూ మధ్యరాత్రి హనుమకొండ చౌరస్తాలోని కోహినూర్ హోటల్‌లో చాయ్ తాగి వస్తూ, ఈ క్రమమంతటిలోనూ కవిత్వం గున్గునాయించుకుంటూ ఉండడం కవిత్వంతోనూ రాత్రితోనూ చాయ్‌తోనూ నడకతోనూ అనన్యసాధ్యమైన స్వర్గతుల్యమైన ములాఖాత్‌లు.

అది కూడ త్వరలోనే గడిచిపోయింది. ఎమర్జెన్సీ వచ్చింది. హైదరాబాదులోనే ఉండాలనే కండిషన్డ్ బెయిల్ మీద ఒక్కనెల ముందు విడుదలైన వరవరరావు మాత్రమే కాదు, 'సృజన' రచయితలు, పాఠకులు, అభిమానులు డజన్లకొద్దీ జైలు పాలయ్యారు. పత్రికలమీద ప్రిసెన్సార్ షిప్ అమలై, అచ్చుకు సిద్ధంగా ఉన్న జూలై 1975 సంచికలో పావు వంతు కూడ అచ్చుకు యోగ్యమైనది కాదని జిల్లా అధికారులు ప్రకటించారు.

'సృజన' ఆగిపోయింది. ఇతర పత్రికలు చాల ఆగిపోయాయి. ఇంట్లో ఉన్న పాత కవిత్వ పుస్తకాలు చదవడంతో పాటు, కవిత్వానికి మిగిలిన ఏకైక కిటికీ ప్రజాతంత్ర వారపత్రికలో ప్రతివారం అచ్చయ్యే ఒకేఒక్క కవిత. అది కూడ సెన్సార్ ఆంక్షలను దాటుకుని వచ్చే నిస్సారమైన కవిత. అప్పటికింకా పదో తరగతిలో, ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరంలో ఉన్నాను గాని నాకన్న చిన్న పిల్లలకు ట్యూషన్లు చెప్పి నెలకు ఇరవయో, ముప్పయో రూపాయలు సంపాదిస్తూ ఉండేవాడిని. ఎమర్జెన్సీలో వస్తున్న చదవదగిన పత్రికలు ప్రజాశక్తి, ప్రజాతంత్ర వారపత్రికలు క్రమం తప్పకుండా కొనుక్కుని ప్రతి అక్షరమూ చదవడం భాషతో, సామాజిక రాజకీయ విషయాలతో ములాఖాత్. మరీముఖ్యంగా, ప్రజాశక్తి సెన్సార్‌షిప్ ఆంక్షల వల్ల కావచ్చు, తక్షణ రాజకీయ విషయాలకన్న ఎక్కువగా సైద్ధాంతిక రచనలు, అనువాదాలు వేస్తుండేది.

అంతకన్న కవిత్వాస్వాదనకు మార్గం తెరిచినది శ్రీశ్రీ పదబంధ ప్రహేళిక. అప్పుడు జ్యోతి మాసపత్రికలో ప్రతినెలా శ్రీశ్రీ పదబంధ ప్రహేళిక వస్తుండేది. అది నింపడం ఒక సుదీర్ఘమైన, ఉత్తేజకరమైన, ఘర్షణాత్మకమైన అనుభవం. ఒక్కొక్క క్లూ విప్పడానికి ఒక్కోసారి వారం, పదిరోజులు పడుతుండేది. ఆ వారం పదిరోజులూ నిరంతర ధ్యాస దానిమీదనే ఉండేది.

ఈ కాలపు కవిత్వ ములాఖాత్‌లలో మరొక ముఖ్యమైన ఘటన, కనీసం కొత్త కవుల కోసమైనా చెప్పాలి: ఎమర్జెన్సీ విధించిన నెలరోజులకే మెదక్ జిల్లా గిరాయిపల్లి అడవుల్లో సూరపనేని జనార్దన్, లంకా మురళీమోహన్ రెడ్డి, కొలిశెట్టి ఆనందరావు, వనపర్తి సుధాకర్ అనే నలుగురు విప్లవ విద్యార్థులను పోలీసులు కాల్చి చంపి ఎన్‌కౌంటర్ అని ప్రకటించారు. ఆ నలుగురిలో జనార్దన్‌తో నాకు కొంత సాన్నిహిత్యం ఉండేది. రీజినల్ ఇంజనీరింగ్ కాలేజి విద్యార్థిగా, వరంగల్ విప్లవ విద్యార్థి, కార్మిక ఉద్యమాల నిర్మాతగా ఆయన చాల తరచుగా వరవరరావు దగ్గరికి వస్తుండేవాడు. ఆయన ప్రయాణసాధనం సైకిల్. దానిమీద నన్ను కూచోబెట్టుకుని చౌరస్తాకో, పోస్టర్లు అతికించడానికో తీసుకుపోతుండేవాడు. నాకు సన్నిహితంగా తెలిసిన వ్యక్తి పోలీసుల చేతిలో హత్యకు గురి కావడం అదే మొదటిది. ఆ వార్త కూడ కాస్త ఆలస్యంగా బయటపడింది. ఆ వార్త తెలిసి వరవరరావు ఒక కవిత రాసి జైలు ములాఖాత్‌కు వెళ్లినవాళ్లతో బైటికి పంపించారు (స్మగుల్ చేశారు!) అది అప్పుడు అచ్చయ్యే అవకాశమేమీ లేదుగాని, ఊరికే మేం అది చదువుకుంటూ ఉన్నాం.

జనార్ధన్ నాకు కూడ దగ్గరివాడేగదా, నేనూ ఆయన మీద ఒక కవిత రాయాలనుకున్నాను. ఓ పదిహేను పంక్తులో ఇరవై పంక్తులో రాశాను. కాని అది మొత్తంగా వరవరరావు కవిత ప్రభావంలోనే వచ్చినట్టుంది. అంతేకాదు, జనహృదయం జనార్ధన్ అని ఆయన చేసిన ప్రయోగం కూడ నేను ఒకటికి రెండుసార్లు ఉపయోగించుకున్నానని గుర్తు. నా కవిత మా అన్నయ్య రాంగోపాల్‌కు చూపాను. ఆయన తక్కువ రాశాడు గాని చాల రాయగల శక్తి ఉన్నవాడు. మంచి చదువరి. విశ్లేషకుడు. నా కవిత చదివి ఏమీ అనకుండా తిరిగి ఇచ్చేశాడు.

మర్నాడో, ఆ మర్నాడో నాకిప్పటికీ కళ్లకు కట్టినట్టు కనబడుతున్న దృశ్యం. మా కుమార్‌పల్లి ఇంట్లో ఇంటి వెనుక మంచినీటి పంపు (నల్లా అనేవాళ్లం) గొయ్యి ఉండేది. నేను ఆ గొయ్యిలో మూడు మెట్లు లోపలికి దిగి బిందె నిండేదాకా వేచి ఉండి, నిండినాక ఎత్తుకొని పైకి ఎక్కితే అక్కడ మా అన్నయ్య అందుకొని స్నానాల గదిలో డ్రమ్ములో పోసి వచ్చేవాడు. నేను ఆ గొయ్యిలో కింది మెట్టు మీద నిలబడి ఉన్నాను. మా అన్నయ్య పైన నేల మీద ఉన్నాడు. "ఇంకొకరి మాటలు కాపీ కొడితే కవిత్వం కాదు" అన్నాడు. ఆ కవిత అనుకుని రాసినది చించేశాను గాని, ఎంత అభిమానించినా కవిత్వాన్ని, అభివ్యక్తిని అనుకరించ గూడదనే పాఠం నేర్పిన ములాఖాత్ అది.

# ఎమర్జెన్సీ అనంతర ప్రజా వెల్లువలో కవిత్వం

కవిత్వం ఎట్లా వస్తుంది, మామూలు మాటలనే జ్వలింపజేసే విద్యుదావేశం ఎక్కడినుంచి వస్తుంది, అది కవి ప్రతిభలో ఉంటుందా, కవితావస్తువులో ఉంటుందా, పాఠకుల స్పందనలో ఉంటుందా, సామాజిక సందర్భంలో ఉంటుందా అనే ప్రశ్నలు బహుశా వేలసార్లో లక్షలసార్లో వెలువడి ఏదో ఒక జవాబు పొంది ఉంటాయి. అయినా పాఠకులూ కవులూ విమర్శకులూ ఆ ప్రశ్నను మళ్లీ మళ్లీ వేసుకుని మళ్లీ మళ్లీ జవాబులు చెపుతూనే ఉన్నారు. 'ఊరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే' అంటూ అల్లసాని పెద్దన కవిత్వం రాయడానికి 'నిరుపహతి స్థలం, రమణీప్రియ దూతిక తెచ్చి ఇచ్చు కప్పుర విడెము, ఆత్మకింపయిన భోజనం, ఊయల మంచం, ఒప్పుతప్పు అరయు రసజ్ఞులు, ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తములు' లేకపోతే కవిత్వం రాయడమే సాధ్యం కాదన్నాడు. మరీ పెద్దన లాంటి భోగ, ఉన్నత వర్గ ప్రాతిపదికలు కాకపోయినా బహుశా ప్రతి కవికీ చిన్నవో పెద్దవో కోరికలు, ప్రాతిపదికలు ఉంటాయనుకుంటాను.

కాని అవేవీ లేకుండా, వాటి ప్రమేయమే లేకుండా కేవలం జనజీవన సంచలనాల లోంచి, ప్రజా ఉద్యమాల లోంచి, వెల్లువెత్తిన ప్రజాస్వామిక చైతన్య వాతావరణం లోంచి

కవిత్వం పుట్టుకు రావడం నేను కళ్లారా చూశాను. అది కూడ నా కంటె ముందు ఎందరో చూసినదీ, గుర్తించినదీ, చెప్పినదీ అయినప్పటికీ నా కవిత్వ ములాఖాత్‌లలో ప్రధానమైన వాటిలో ఒకటి ప్రజాఉద్యమాలే కవిత్వ ఆధారభూమిక అవుతాయనేది. కవిత్వం ఉద్యమ క్షేత్రాలలో పుట్టడం, ఉద్యమాల పాదులో పెరగడం, ఉద్యమాల నుంచే తన పోషక పదార్థా లన్నిటినీ గ్రహించి విస్తరించడం, అంతవరకూ కవిత్వం గురించి తెలియని, కవిత్వం చదవని, రాయని వాళ్లెందరో ప్రజా ఉద్యమాల వెల్లువలోనే కవిత్వాభిమానులూ కవులూ కావడం నాకు అటు ప్రజా ఉద్యమాల శక్తినీ, ఇటు కవిత్వ శక్తినీ తెలియజెప్పింది. 'సృజనాత్మకతకు మూలమూ ఏకైక వనరూ సమూహమే, ప్రజలే' అని మాక్సిం గోర్కీ రాసిన అద్భుతమైన వ్యాసాన్ని చదవడమూ, తెలుగులోకి అనువదించడమూ ఆ తర్వాత పదిహేనేళ్లకు చేశాను గాని, ఆ పాఠం అనుభవైకవేద్యమైనది మాత్రం ఎమర్జెన్సీ అనంతర ప్రజావెల్లువలోనే.

ప్రధాని ఇందిరాగాంధీ 1975 జూన్ 25 అర్ధరాత్రి విధించిన ఎమర్జెన్సీలో రాజ్యాంగబద్ధంగానే వాక్సభాస్వాతంత్ర్యాలను తొలగించారు. అంతకు దశాబ్దాల ముందునుంచీ ప్రజల మీద, జాతి ఉద్యమాల మీద, ప్రజా ఉద్యమాల మీద అమలవుతున్న నిర్బంధం ఇప్పుడు మధ్యతరగతికీ, పార్లమెంటరీ రాజకీయాల లోపలి ప్రత్యర్థులకూ కూడ విస్తరించింది. ఆ పరిస్థితిలో సహజంగానే భావప్రకటనా స్వేచ్ఛ ఆలంబనగా వికసించే కవిత్వమూ బైటికి కనబడకుండా పోయింది. మొత్తంగా దేశవ్యాప్తంగా లక్షమంది నిర్బంధానికి గురికావడంతో రాయగలవాళ్లలో అత్యధికులు జైలుపాలయ్యారు. చెరసాలకు చిక్కని వాళ్ల కవిత్వాన్ని కూడ అచ్చువేసే పత్రికలు లేకుండా పోయాయి. పత్రికల మీద ఎటువంటి ఆంక్షలు మొదలయ్యాయంటే, ఎమర్జెన్సీ విధించిన కొన్ని రోజులకు మరెక్కడా వ్యతిరేక వార్తలు అచ్చువేసే అవకాశం లేక టైమ్స్ ఆఫ్ ఇండియా ఆబిచువరీ (సంతాప ప్రకటనల) పేజీలో ఒక అజ్ఞాతవ్యక్తి D'Ocracy D.E.M, beloved husband of T Ruth, loving father of L.I.Bertie, brother of Faith, Hope and Justice, expired on June 26 అని ఒక ప్రకటన వేయించారు. ఆ ప్రకటన ఇచ్చిన వ్యక్తి ఎవరని పోలీసులు వెతకడం ప్రారంభించారు. ఆ ప్రకటనలోని ధ్వని, వ్యంగ్యం, కవితాత్మకత, సత్యం దానికదే ఎంత గొప్ప కవిత్వమో చెపుతాయి. అది అట్లా సంతాప ప్రకటనగా అచ్చు కావడం కవిత్వానికి, భావప్రకటనకు ఎంత కానికాలం వచ్చిందో చూపుతుంది.

అప్పటికి రెండు మూడు సంవత్సరాలుగా ప్రతిరోజూ చదువుకుంటున్న, ప్రతినెలా 'సృజన'లో అచ్చువేస్తున్న, ఇతర పత్రికల్లో చదువుతున్న కొత్త కవిత్వం ఆ ఎమర్జెన్సీ చీకట్లో కంటికి కనబడకుండా పోయింది. పాత కవిత్వం చదువుకోవడానికి కాస్త అవకాశం దొరికింది గాని నిత్య చలనశీలమైన సమాజాన్ని అనువదించే, ప్రతిబింబించే, ప్రతిఫలించే, ప్రతిధ్వనించే కవిత్వానికి మాత్రం అవకాశం లేకుండా పోయింది.

ఆ ఎమర్జెన్సీ చిమ్మచీకటినుంచి లోకమంతా, ప్రత్యేకించి కవిలోకం, ఎమర్జెన్సీ అనంతర ప్రజా ఉద్యమాల వెలుగువెల్లువలోకి వికసిస్తుండగా చూసే అవకాశం రావడం ఒక అద్భుతమైన అనుభవం. 1977 మార్చ్ 20న ఎన్నికల ఫలితాలు రావడం మొదలయింది. అప్పుడు ఎన్నికల ఫలితాలంటే రెండు మూడు రోజుల వ్యవహారం. అప్పటికి టెలివిజన్ లేదు. తక్షణ వార్తల ఆసక్తికి ఆల్ ఇండియా రేడియోనే ఏకైక సాధనం. ఆకాశవాణిలో గంటకోసారి ప్రసారమయ్యే ఎన్నికల ఫలితాల కోసం ట్రాన్సిస్టర్ల చుట్టూ మూగి ఆ రెండు రోజులూ ఎంత ఉద్వేగాన్ని అనుభవించామో, ఒక్కొక్క వార్త వింటుంటే ఏయే అనుభూతులకు లోనయ్యామో, ఇందిరాగాంధీ ఓడిపోయిందంటే, ఆమె వందిమాగధులు ఒక్కొక్కరూ పడిపోతున్నారంటే ఎట్లా కేరింతలు కొట్టామో ఆ సన్నివేశం తలచుకుంటే ఇప్పటికీ మనసు పులకించిపోతుంది. చిట్టచివరికి ఇందిరాగాంధీ ఓటమిని అంగీకరించింది. ఎమర్జెన్సీ ఎత్తివేస్తున్నానని ప్రకటించింది. అప్పటినుంచి బహుశా ఆ తర్వాతి మూడు సంవత్సరాలు భారత ప్రజాస్వామిక చరిత్రలోను, తెలుగుసీమలో ప్రజా ఉద్యమాల చరిత్రలోను అద్భుతమైన కాలం. ఆ కాలం గొప్ప కవిత్వపు పంటను వాగ్దానం చేసింది, సృష్టించింది, అక్షరాలకెత్తింది.

ఎమర్జెన్సీ ఎత్తివేసి, కేంద్రంలో జనతా ప్రభుత్వం వచ్చినప్పటికీ రాష్ట్రంలో ఎన్నికలకు సమయం ఉండింది గనుక జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా కాంగ్రెస్ ప్రభుత్వమే కొనసాగింది. అందువల్ల ఎమర్జెన్సీ తొలగిపోయినా నిర్బంధం పూర్తిగా తొలగిపోలేదు. కవిత్వానికి సంబంధించినంతవరకు ఒక విచిత్రమైన నిర్బంధం గురించి ఇక్కడ చెప్పాలి. 'సృజన' మే 1974 సంచికలో అప్పుడు జరుగుతుండిన రైల్వే సమ్మెను బలపరుస్తూ 'రైళ్లను జైళ్లు నడిపించగలవా' అనే సంపాదకీయం రాసినందుకు, అదే శీర్షికతో ఒక కవితను ప్రచురించినందుకు ఆ సంచికను నిషేధించి, సంపాదకురాలు పి హేమలత మీద కేసు పెట్టారు. ఆ కేసు ఎమర్జెన్సీ అంతా విచారణ జరిగి, ఎమర్జెన్సీ ఎత్తివేశాక, 1977 జూలై 16న తీర్పు వెలువడింది. మూడు రోజుల ముందే హేమలతను అరెస్టు చేశారు. తీర్పులో వరంగల్ సెషన్స్ జడ్జి రెండు సంవత్సరాల కఠిన కారాగార శిక్ష విధించాడు. ముగ్గురు పిల్లల తల్లి గనుక దయ చూపాలని అనిపించినా, విచారణ సమయంలో ఆమెలో తప్పు చేశాననే పశ్చాత్తాపం కనబడనందువల్ల, న్యాయప్రయోజనాల రీత్యా ఈ శిక్ష విధిస్తున్నానని జడ్జి తీర్పులో రాశాడు. విచిత్రమేమంటే, ఏ సమ్మెను బలపరిచిన కవితను ప్రచురించినందుకు ఈ శిక్ష విధించడం జరిగిందో, ఆ సమ్మెకు నాయకుడైన జార్జి ఫెర్నాండెజ్ ఈ శిక్ష విధించిన సమయంలో కేంద్ర ప్రభుత్వంలో మంత్రి అయ్యాడు. ఆ విచిత్రాన్ని అలా ఉంచి, ఒక ప్రజా ఉద్యమాన్ని సమర్థిస్తూ కవిత్వం రాయడం, దాన్ని ప్రచురించడం ఈ దేశంలో 'న్యాయ ప్రయోజనాల రీత్యా' శిక్షార్హమైన నేరాలవుతాయని బహిర్గతం చేసిన పరిణామం అది.

వరవరరావు, ఇతర సాహితీమిత్రులు, 'సృజన' రచయితలు ఏప్రిల్‌లో విడుదలై వచ్చినా,

కేంద్రంలో జనతా ప్రభుత్వం ఏర్పడి ప్రజాస్వామిక వాతావరణం ఏర్పడిందనే అభిప్రాయం కలుగుతున్నా, 'సృజన' పునరుద్ధరించడానికి మరొక నాలుగు నెలలు పట్టింది. అప్పటికి రెండు సంవత్సరాల కింద జిల్లా కలెక్టర్‌కు అందజేసి, పావు వంతు మాత్రమే ప్రచురణకు అర్హమనే వ్యాఖ్యతో, కొట్టివేతలతో తిరిగివచ్చిన వ్యాసాలు, కవితలతో, ఇతర రచనలు కూడ కలిపి 1977 ఆగస్టు సంచిక తెచ్చాం. సరిగ్గా అప్పుడే 'అరుణతార' కూడ త్రైమాసికగా ప్రారంభమయింది. అప్పటిదాకా విప్లవ రచయితల సంఘానికి వార్షిక బులెటిన్లు తప్ప క్రమబద్ధమైన పత్రిక లేదు. అప్పుడే జనసాహితీ సమాఖ్య పత్రికగా, రంగనాయకమ్మ సంపాదకురాలిగా 'ప్రజాసాహితి' ప్రారంభమైంది. గజ్జెల మల్లారెడ్డి సంపాదకుడిగా 'వీచిక' ప్రారంభమయింది. 'ప్రజాతంత్ర' వారపత్రిక కొత్త రంగులు అద్దుకుంది. మరి నాలుగైదు కొత్త పత్రికలు గొప్ప వాగ్దానంతో, ఆసక్తిదాయకమైన పద్ధతిలో వెలువడడం మొదలయింది.

అంటే రెండు సంవత్సరాలు మూసుకుపోయిన గొంతులు తెరుచుకోవడం మొదలయింది. భావప్రకటనాస్వేచ్ఛ మారాకు వేయడం మొదలయింది. కవిత్వానికి అంతకన్న కావలసిన కాలం ఏముంటుంది? అప్పుడిక కవితా సంకలనాలు వెలువడడం, పత్రికలలో విరివిగా కవితలు రావడం, కవి సమ్మేళనాలలో డజన్ల కొద్దీ కవులు తమ కవిత్వం చదవడానికి ముందుకురావడం ప్రారంభమయింది. బహుశా ఎమర్జెన్సీ అనంతర మొదటి కవితా సంకలనంగా కెవిఆర్ సంపాదకుడిగా, విరసం ప్రచురణగా 'కిరణాలు' అనే గేయాల, పాటల సంకలనం వచ్చింది. అది ఎక్కువగా ఎమర్జెన్సీలో హత్యకు గురైన పోరాటకారుల స్మృతిగీతాల సంకలనమే గాని, ఆ పోరాటకారులను తలచుకోవడానికి కూడ వీలు లేని స్థితి గడిచిపోయి, వారి సంస్మరణ సభలు, వారి హత్యలపై విచారణ జరగాలని కోరుతూ సభలు జరుగుతున్నప్పుడు ఆ గీతాల కవిత్వం ప్రతి ఒక్కరి నాలుకల మీద ఆడింది. ఎమర్జెన్సీకి కొద్ది ముందు భూస్వామ్య శక్తుల చేతుల్లో హత్యకు గురైన పరిటాల శ్రీరాములుపై పెద్దారెడ్డి రాసిన 'పరిటాలా రాములూ నీకు లాల్ సలాములు', ఎమర్జెన్సీలో ప్రభుత్వ బలగాల చేతిలో హత్యకు గురైన నాగరాజు మీద ఎన్.కె. రాసిన పాట 'ఒకచేత్తో కన్నీరు తుడుచుకునీ', జంపాల చంద్రశేఖర ప్రసాద్ మీద వై కాశీపతి రాసిన పాట 'ఉయ్యాలో జంపాలా' వంటి అద్భుతమైన కవిత్వం అది.

సరిగ్గా అప్పుడే ఎమర్జెన్సీలో, ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా ఏడు భాషల్లో వెలువడిన కవిత్వాన్ని ఇంగ్లిషులోకి అనువదించి 'డిసెంటింగ్ వాయిసెస్' పేరుతో ఢిల్లీ పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ (పియుసిఎల్) అచ్చువేసింది. ఇంగ్లిషులో ప్రజా ఉద్యమాల కవిత్వం చదవడం అదే మొదలు.

అప్పుడే పెద్దపల్లి నుంచి మల్లోజుల కోటేశ్వరరావు ప్రచురించిన 'చైతన్య', 'జైత్రయాత్ర' అనే పాటల పుస్తకాల గురించి, 'సృజన' ప్రచురణలుగా తెచ్చిన 'కరీంనగర్ ఆదిలాబాద్ పోరాట పాటలు' రెండు సంపుటాల గురించి, కరీంనగర్ ఆదిలాబాద్ పోరాటాలు సృష్టించిన

కవుల గురించీ, కవిత్వం గురించీ చెప్పుకోవలసింది ఎంతో ఉంది. అది ప్రజా ఉద్యమం కవిత్వ సృజనకు, కవితాస్వాదనకు ప్రయోగశాలగా ఎట్లా పనిచేస్తుందో తెలుసుకోవడానికి ఒక గొప్ప ఉదాహరణ....

◆ ◆ ◆

'కవిత్వంతో ములాఖాత్' లో గతవారం 'ఎమర్జెన్సీ అనంతర ప్రజావెల్లువలో కవిత్వం' అని మొదలుపెట్టినప్పుడు అది ఎంత విశాలమైనదో, సుదీర్ఘమైనదో నాకు తెలియలేదు. మొదటి విడత పూర్తయ్యే సమయానికి ఉపోద్ఘాతం కూడ పూర్తి కాలేదు. 1977 నుంచి 1980 దాకా, ఇంకా చెప్పాలంటే 1982 దాకా ఆ ప్రభావం కొనసాగింది గనుక ఈ అధ్యాయమే కొన్ని వారాలు సాగవచ్చుననిపిస్తున్నది. ఎమర్జెన్సీ అనంతర కవిత్వ వెల్లువలో వెలువడిన పాటల గురించి గతవారం ప్రస్తావించాను. అది ఇంకా చెప్పవలసే ఉంది గాని ఈసారి వచనకవిత్వ వెల్లువ గురించి చెప్పాలి.

ఎమర్జెన్సీ తర్వాత కేంద్రంలో మొదటిసారి ఒక కాంగ్రెసేతర ప్రభుత్వం అధికారంలోకి రావడం మాత్రమే కాదు, మొదటిసారిగా ప్రభుత్వ నిర్బంధాన్ని చవిచూసిన లక్షకు పైగా మధ్యతరగతి బుద్ధిజీవులు ప్రజాస్వామ్యం గురించి, పౌరహక్కుల గురించి ఆలోచించడం ప్రారంభించారు. "నువ్వు చెప్పేదానితో నాకు ఏకీభావం లేకపోవచ్చు. కాని అది చెప్పడానికి నీకున్న హక్కును కాపాడడానికి నా ప్రాణమైనా ఇస్తాను" అని ఫ్రెంచి విప్లవంలో వోల్టేర్ చెప్పిన ప్రజాస్వామిక సంప్రదాయపు మూలధాతువు చాలమందికి తెలిసివచ్చినది అప్పుడే. ఆదివాసుల మీద, పోరాటకారుల మీద, జాతి ఉద్యమకారుల మీద అప్పటికి మూడు దశాబ్దాలుగా అదే రకమైన అణచివేత సాగుతున్నప్పటికీ, మధ్యతరగతికి మాత్రం అది అనుభవానికి వచ్చినది అప్పుడే. అప్పటికే సాగుతున్న అణచివేతలకు వ్యతిరేకంగా పౌరహక్కుల ఉద్యమాలు, సంస్థలు ప్రారంభమై నడుస్తున్నప్పటికీ, మధ్యతరగతి ప్రజాస్వామికవాదులు సిటిజెన్స్ ఫర్ డెమోక్రసీ (సిఎఫ్‌డి), పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ వంటి పౌరహక్కుల సంస్థలు ఏర్పాటు చేయడం ప్రారంభమైనదప్పుడే. ఆ ప్రజాస్వామిక వెల్లువ సహజంగానే కొత్త కవితాభివ్యక్తికీ దారితీసింది. పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ ఎమర్జెన్సీలో జైలుపాలయిన కవుల కవిత్వం ఇంగ్లిషులోకి అనువదించి 'డిసెంటింగ్ వాయిసెస్' అనే చిన్న పుస్తకం అచ్చువేసిందని ఇదివరకే చెప్పాను.

ఎమర్జెన్సీలో జైలులో పుట్టి, ఎక్కడా అచ్చుకెక్కలేకపోయిన కవిత్వం ఎమర్జెన్సీ అనంతర పత్రికల విస్తరణలో పాఠకులకు అందడం మాత్రమే కాదు, ప్రజాస్వామ్యం వెల్లివిరుస్తున్నదన్న వాస్తవమో, భ్రమో చాల కొత్త కవిత్వం రావడానికి కారణమైంది. ఆ సందర్భంలో తెలుగు వచన కవితా లోకంలో వెలువడిన చెప్పుకోదగిన సంకలనం 'జలపాతం'. న్యూఢిల్లీ జవహర్లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో తెలుగు విద్యార్థులు ఏర్పాటు చేసుకున్న ప్రగతిసాహితి ప్రచురణగా,

కాళోజీ సంపాదకుడిగా 1978 మేలో వెలువడిన ఈ సంకలనం నా కవిత్వ ములాఖాత్‌లలో ఒక మైలురాయి. ఇక్కడ 'జలపాతం' గురించి చెప్పబోయే ముందు దాని వెనుక ఉన్న టంకశాల అశోక్ గురించి చెప్పాలి.

'జలపాతం' సంకలనానికి కాళోజీ గౌరవ సంపాదకుడిగా ఉన్నారు గాని కవిత్వం సేకరించడం, ఎడిట్ చేయడం, అచ్చుపని చూడడం వగైరా పనులన్నీ చేసినది ప్రగతిసాహితి బృందం, ప్రధానంగా టంకశాల అశోక్. అప్పటికి పది సంవత్సరాలుగా కవిత్వం రాస్తున్న, 'తిరుగబడు' కవులలో ఒకరైన అశోక్ తన 'ఖెడ్డా' కవితకు శ్రీశ్రీ ప్రశంసలు కూడ పొందారు. ఖెడ్డా ఏనుగులను బంధించడానికి, వాటిని ఒక చక్రబంధంలోకి నెట్టడానికి ఉపయోగించే పారిభాషిక పదం. మూలపదం హిందీది కావచ్చు గాని ఏనుగులు ఉన్న ప్రాంతపు భాషలన్నిటికీ విస్తరించింది. తెలుగు ప్రాంతపు అడవులలో ఏనుగులు లేవు గనుక ఆ మాట తెలుగుకు తెలియదు. కవిత్వంలో శీర్షికలోగాని, అంతర్గతంగా గాని ఇటువంటి పరభాషా పదాలను ఉపయోగించి ఆసక్తిని రేకెత్తించడం ఒక ప్రత్యేక కృషి. అట్లని నిఘంటువులలో నిద్రపోయే పదాలను ఆవాహన చేయడం కాదు. అరోరా బొరియాలిస్ అని తిలక్, వివా లా శాంటియాగో అని శివసాగర్ అటువంటి ప్రయోగాలు చేశారు. ఎవరికైనా కవిత్వంతో ములాఖాత్‌లలో ఈ వినూత్న పదాల, పదబంధాల పరిచయం ఒక విశిష్టమైన ములాఖాత్.

అశోక్ కృషితో 52 మంది కవుల 54 కవితలతో వెలువడిన 'జలపాతం'కు చాల ప్రత్యేకతలున్నాయి. పైన జెండాలు వేళ్లాడుతుండగా, కింద సాయుధ సైనికుల రక్షణ మధ్య ఇద్దరు రాజకీయ నాయకులు రాట్నాలు వడుకుతున్నట్టు చిత్రించిన అబూ అబ్రహామ్ కార్టూన్ 'జలపాతం' ముఖచిత్రం. కచ్చితంగా ఆ కార్టూన్ ఈ సంకలనం కోసం వేసినది కాకపోవచ్చు. కాని రాజ్యసభలో నామినేటెడ్ సభ్యుడిగా ఉండి, ఎమర్జెన్సీని ధిక్కరించిన వ్యంగ్య చిత్రకారుడిగా అబూ అబ్రహాం ప్రతిష్ఠ చాల పెరిగింది. ఎమర్జెన్సీలో చిత్రించి, ప్రెస్ సెన్సార్‌షిప్ వల్ల అచ్చుకాని తన కార్టూన్లను, వ్యాసాలను ఎమర్జెన్సీ అనంతరం 1977లో ఆయన 'గేమ్స్ ఆఫ్ ఎమర్జెన్సీ' పేర ప్రచురించాడు. అటువంటి ఒక ధిక్కార, వ్యంగ్య చిత్రాన్ని కవితాసంకలనానికి ముఖచిత్రం చేయడం బహుశా అదే మొదటిసారి కావచ్చు.

మూడు పేజీల ముందుమాటలో కాళోజీ ఎమర్జెన్సీ పేరెత్తకుండానే 'కలము – బడితె – రూపాయి కలిసికట్టు వ్యవహారం గొలుసుకట్టు వ్యాపారం గట్టిబలం పుంజుకొన్న జట్టు చేతిలో దేశం' అంటూ, ఈ నిరంకుశత్వాన్ని వ్యతిరేకించవలసిన మేధావుల్లో కొందరు ఎలా మేతావులైపోయారో ఈసడించారు. ప్రగతిసాహితి రాసిన వివరణలో "కడలితరగలను కింగ్ కాన్యూట్లు, క్వీన్ కాన్యూట్లు శాసించబూనడం, చరిత్ర వారిని అపహసించి అప్రతిహతంగా పురోగమించడం ఎప్పుడూ జరిగేదే. సాహిత్య రంగంలో కూడా మనకు ఇదే కనిపిస్తుంది. ఎన్ని 'చీకటిరోజులు' దాపురించినా తిరిగి ఉత్తేజంతో తమ భావాలను పునరుద్ఘాటిస్తున్న

సుపరిచితులూ, తొలిసారిగా నినదిస్తున్న అపరిచితులూ ఈ సంకలనం ద్వారా అదే సత్యాన్ని తిరిగి రుజువు చేస్తున్నారు" అని ఇందిరాగాంధీనీ, ఎమర్జెన్సీనీ అన్యాపదేశంగా ప్రస్తావించారు. ఈ కవులలో ఎమర్జెన్సీలో జైలుపాలయిన కవులున్నారు, జైల్లోనే రాసిన కవితలూ ఉన్నాయి. అలాగే ఆనాటి ప్రధాన ధోరణి అయిన నిరంకుశత్వంపై ధిక్కారం, ప్రజాస్వామ్య ఆకాంక్ష ఉన్నాయి.

ఇది వచనకవితా సంకలనం అయినప్పటికీ చేరిన ఒకే ఒక్క పాట ఎమర్జెన్సీలో బూటకపు ఎదురుకాల్పులలో మరణించిన విద్యార్థి నాయకుల గురించి వి.బి. గద్దర్ రాసిన 'హోలీ హోలీల రంగ హోలి'. శివసాగర్, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజు, నగ్నముని, వరవరరావు, స్మైల్, కె. శివారెడ్డి, దేవిప్రియ, ఎన్. గోపి, ఎన్‌కె, టంకశాల అశోక్ వంటి అప్పటికే సుపరిచితులైన కవులతో పాటు, అప్పుడప్పుడే కవితాలోకంలో ప్రవేశిస్తున్న, ప్రస్తుతం లబ్ధప్రతిష్ఠులైన నందిని సిధారెడ్డి, రామా చంద్రమౌళి, వేణు సంకోజు, సి. ఎచ్ మధు, బైస దేవదాసు, వి.పి. చందన్ రావు, వి.ఆర్. విద్యార్థి వంటివారు, గొప్ప వాగ్దానంతో ముందుకు వచ్చి అకాలంగా మరణించిన గుడిహాళం రఘునాథం, సలంద్ర, కె. రామమోహన్ రాజు వంటివారు ఈ సంకలనంలో ఉన్నారు. తర్వాతి కాలంలో కథకుడిగా, నవలాకారుడిగా సుప్రసిద్ధుడైన అల్లం రాజయ్య కూడ ఈ సంకలనంలో ఒక కవిత రాశారు.

ఒక్క మాటలో చెప్పాలంటే 'జలపాతం' మన సమాజం చూసిన చీకటిరోజులనుంచి మేల్కొన్న కవి వినిపించిన హోరు.

"కష్టజీవి చెమటచుక్క చెప్పని సత్యం
కష్టజీవి ఆకలిడొక్క చెప్పని సత్యం
కష్టజీవి కన్నీటిచుక్క చెప్పని సత్యం
కష్టజీవి పోరాడేరెక్క చెప్పని సత్యం
కవి కలం నుంచి చిందే సిరాచుక్క ఏమని చెప్తుంది?
'ఎవరూ చేయని నేరం
రచయితలే ఏం చేసార'ని కాదు
ఎవరూ చేయని త్యాగం
రచయితలు ఏం చేసారని అడుగు.
మట్టి చేతులు నిను మేధావిగా మలిస్తే
ఆ చేతులు కట్టిన రక్తగాయాలతో
నువ్వెవరిపై గేయాలు కట్టావని అడుగు"

అని వరవరరావు ఎమర్జెన్సీలో హైదరాబాదు జైలులో రాసిన కవిత 'జలపాతం' స్ఫూర్తికి ప్రతీక.

ఎమర్జెన్సీ కవిత్వానికి మరొక బలమైన ప్రతీక బొజ్జా తారకం రాసిన 'నీతో చెప్పనే లేదు'. ఎమర్జెన్సీలో జైల్లో రాసిన ఈ కవిత జైల్లో కవులు, రచయితలు నడుపుకున్న లిఖిత పత్రికలో వచ్చింది. ఆ తర్వాత తిరిగి ప్రారంభమైన 'సృజన' తొలి సంచిక (ఆగస్ట్ 1977) లో అచ్చయింది.

"నీతో చెప్పనేలేదు
నేను వెళ్తున్నప్పుడు
నన్ను పోలీసులు పట్టుకున్నప్పుడు
నీతో చెప్పలేదు
నన్ను చూస్తూ నిలబడిపోయావు
నీ కళ్లనిండా నీళ్లు
నీ కన్నీళ్లు తుడవడానికి
నా చేతులకు సంకెళ్లు...
నిశ్శబ్దానికి గంటలు కొడుతూ
పోలీసు బూట్ల చప్పుళ్లు
సముద్రం హోరులా మనసులో
పొంగే మాటల కెరటాలు
నిశ్శబ్దాన్ని చీల్చలేని
హృదయనాదాలు
నీతో చెప్పనేలేదు...
అప్పుడు
ఏమాటలైనా ఎన్నైనా
ఉట్టి శబ్దాలేనని
అర్థం ఏమీ ఉండదని
చెప్పలేకపోయాను నీకు.
.... .....
ఒకరోజు
నువ్వూ నేను సాయంకాలం
అందాలను మలచుకొంటున్నప్పుడు
ఆనందాలను తొలుచుకుంటున్నప్పుడు
హఠాత్తుగా
వాళ్లొచ్చారు
నీకు చెప్పనేలేదు....

నీ కన్నీళ్లు
నాకొక్కడికే కాదని
కోటికోట్ల బాధాతప్త హృదయాలకు
నివాళులని
ఆనంద జలదాలని
ఆశాకిరణాలని
అరుణార్ణవ కెరటాలని
నీకు చెప్పనే లేదు..."

ఆ వరుసలో వెలువడినవే కె వి రమణారెడ్డి జైలు కవితల సంకలనం 'జైలు కోకిల', వరవరరావు జైలు కవితలు 'స్వేచ్ఛ', చెరబండరాజు జైలులో రాసిన పాటలు 'జన్మహక్కు', కావ్యం 'గౌరమ్మకలలు', బి నరసింగ రావు కవితలు 'జననం' వంటి ఎన్నో కవితా సంకలనాలు. అప్పుడే ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్ ప్రారంభమై పది పదిహేను మంది శక్తిమంతమైన వచనకవులను సృష్టించింది. అప్పుడే కరీంనగర్ – ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలు పాటలు రాసిన కవులెందరినో వెలికితేవడంతో పాటు వచనకవిత్వం కూడ బలంగా రాసిన అల్లం నారాయణ, సాహు (వెంకన్న) వంటి కవులను సృష్టించాయి. హెచ్చార్కె, విమల, దామెర రాములు మొదలైన ఎందరో కవులు కవితా రచనలో ప్రవేశించినదీ, వారి కవిత్వమూ, వారూ నాకు వ్యక్తిగతంగా పరిచయమైనదీ ఈ ఎమర్జెన్సీ అనంతర ప్రజా ఉద్యమ, కవిత్వ వెల్లువలోనే. నా కవిత్వ ములాఖాత్‌లలోకెల్లా అద్భుతమైన కాలం బహుశా ఈ ఎమర్జెన్సీ అనంతర వాతావరణమే.

◆ ◆ ◆

నా కవిత్వంతో ములాఖాత్‌లో వచన కవితకూ పాటకూ భేదం చూపడం లేదని పాఠకులు ఈ సరికే గుర్తించి ఉంటారు. సాంప్రదాయికంగా ఆ రెండు ప్రక్రియల మధ్య కొందరు సాహిత్య విమర్శకులు భేదం చూస్తున్నారు. కొందరు ఘర్షణ కూడ చూస్తున్నారని నాకు తెలుసు. అటు కొందరు వచన కవులు పాటల మీద అసూయ పడడమూ, ఇటు కొందరు పాటలకవులు వచన కవిత్వాన్ని చిన్నచూపు చూడడమూ కూడ నాకు తెలుసు. తమకు రావలసినంత ప్రాధాన్యత రావడం లేదని, అవతలివాళ్లు అది కొట్టుకు పోతున్నారని రెండు వైపులా కొందరు ఆరోపణలు చేయడం కూడ నాకు తెలుసు. అయినా నేను వచన కవితకూ పాటకూ (ఆమాటకొస్తే పద్యానికీ) తేడా చూడను. రెండిటికీ పునాది కవిత్వమే అనుకుంటాను. ఆ ఉమ్మడి ప్రాతిపదిక మీద నిర్మాణమైన ఒకే ప్రక్రియలోని ఈ రెండు శాఖల మధ్య ఉంటే గింటే ఛాయాభేదం ఉందనుకుంటాను. ఒకటి పూర్తిగా మధ్యతరగతి విద్యావంతుల కవితా రూపం, మరొకటి విద్యావంతులు రాసినప్పటికీ ప్రధానంగా నిరక్షరాస్యుల

కవితా రూపం. ఒకటి వచనానికి దగ్గరిదైన భావ ప్రధానమైన వ్యావహారిక భాష, మరొకటి లయాత్మకతతో కూడిన శబ్ద ప్రధానమైన భాష. వచన కవిత్వానికి కూడ శబ్దశక్తి, తూగు, లయ బలం ఇచ్చినప్పటికీ, అవి పాటకు ఆధారమైనంతగా వచన కవితకు కావు. ఒకటి ఇటీవల వందా నూట ఇరవై సంవత్సరాల కింద పుట్టుకొచ్చినది కాగా మరొకటి బహుశా మనిషికి భాష తెలిసినప్పటినుంచీ, అంటే మాట తెలిసినప్పటినుంచీ ఉన్నది. ఈ భిన్నత్వం ఎలా ఉన్నా, రెండు ప్రక్రియలకూ సాధారణమైన భూమిక కవితాభివ్యక్తి.

నా కవిత్వ ములాఖాత్‌లలో ఎమర్జెన్సీ అనంతర ప్రజావెల్లువలో పాట, పాటలోని కవిత్వం నిర్వహించిన పాత్ర గొప్పవి. అప్పటికి ఆరేడు సంవత్సరాలుగా కానూరి వెంకటేశ్వరరావు, చెరబండరాజు, జనసేన, ఎన్‌కె, గద్దర్, సంధ్య, వంగపండు ప్రసాదరావు వంటి అద్భుతమైన కవిగాయకులు రాసిన, పాడిన పాటలు వింటున్నప్పటికీ, ఎమర్జెన్సీ అనంతర వాతావరణంలో జరిగిన పాటల విస్ఫోటనం నా జీవితంలో వ్యక్తిగతంగా మాత్రమే కాదు, మొత్తంగా తెలుగు సామాజిక జీవితంలోనే ఒక సంచలనం. ఎమర్జెన్సీ తొలగిపోయిన వెంటనే విప్లవ రచయితల సంఘం వెలువరించిన 'కిరణాలు', 'పోరాట పాటలు', కరీంనగర్ జిల్లా పెద్దపల్లి నుంచి మల్లోజుల కోటేశ్వరరావు బృందం వెలువరించిన 'చైతన్య', 'జైత్రయాత్ర' పాటల పుస్తకాల గురించి ఇదివరకే ప్రస్తావించాను. అప్పుడే మొదట 'సృజన'లో అచ్చయి, ఆ తర్వాత రెండు సంపుటాలుగా వెలువడిన 'కరీంనగర్ – ఆదిలాబాద్ పోరాట పాటలు', మొదటి ముద్రణ వెలువడిన 'జననాట్యమండలి పాటలు' లోని కవిత్వం నా జీవితం మీద, కవిత్వ భావన మీద వేసిన అపారమైన ప్రభావాన్ని కొండ అద్దమందు అన్నట్టు క్లుప్తంగానైనా చూపవలసి ఉంది.

ఎమర్జెన్సీ తర్వాత కరీంనగర్ జిల్లాలో అప్పుడు తాలూకాలుగా ఉండిన జగిత్యాల, సిరిసిల్ల గ్రామాలలో పెల్లుబికిన రైతాంగ పోరాటాలలో మొదట పాటలు వినబడడం మొదలయింది. అప్పటికి తెలిసిన పాటలకన్న ఇవి ఒకరకంగా భిన్నమైనవి. అంతకు ముందు హైదరాబాదు శివారు ప్రాంతాల ప్రజల బాణీలను అద్భుతంగా ప్రజారాజకీయాలతో సమన్వయించిన గద్దర్ పాటలలో మినహా, ఇతర పాటలన్నిటిలోనూ బాణీలు మాత్రాఛందస్సు నుంచో, సాంప్రదాయిక గతుల నుంచో వచ్చినవి. కాగా, జగిత్యాల, సిరిసిల్ల పాటలు అట్టడుగు ప్రజల జీవితాలనుంచి, నుడికారం నుంచి, ఆ ప్రజల నిత్యజీవితంలో తరతరాలుగా పాడుకుంటున్న బాణీల నుంచి వికసించినవి. ఆ మూడు నాలుగు సంవత్సరాలలో కొన్ని వందల పాటలు అలా వెలికి వచ్చి, గొప్ప నైసర్గిక సౌందర్యంతో, సహజ పరిమళంతో తెలుగునేల నాలుగు చెరగులా విరబూశాయి. తెలుగు కవిత్వ లోకానికి అప్పటికి తెలిసి ఉండని ఎన్నో కొత్త ప్రయోగాలను, వాసనలను, జీవిత శకలాలను, అనుభూతులను, మాటలను అవి పరిచయం చేశాయి. ఆ పోరాటం మీద అమలయిన ప్రభుత్వ నిర్బంధంపై నిజనిర్ధారణ జరపడానికి వచ్చిన బృందంతో ఒక కార్యకర్త అన్నమాట ఈ మూడున్నర దశాబ్దాలలో

సుప్రసిద్ధమయింది. కరీంనగర్ జిల్లాలో జరిగిన పరిణామాలన్నిటినీ ఆయన ఒక్కమాటలో 'దొరల కాళ్లకింది ధూళి ఎగిరి వచ్చి దొరల కంట్లో పడ్డది' అన్నాడు. గొప్ప కవితాత్మకమైన ఈ వ్యాఖ్యే ఆ పోరాటానికీ, ఆ పోరాటంలోంచి ఉద్భవించిన సాహిత్యానికీ, కవిత్వానికీ, మట్టి మనుషులు మహా మానవులుగా ఎదిగిన పరిణామ క్రమానికీ అద్దం పడుతుంది.

సరిగ్గా ఆ విస్ఫోటనం జరుగుతున్న సమయాన ఆ మహా సంరంభంలో శతాంశాన్నయినా నమోదుచేయగలిగిన 'సృజన' పత్రికలో, 'సాహితీ మిత్రుల'లో, బుద్ధిజీవుల బృందంలో ఉండడం నాకు దొరికిన అరుదైన అద్భుతమైన అవకాశం. జగిత్యాల – సిరిసిల్ల ప్రజా పోరాటాల ప్రజ్వలనాన్ని 'సృజన' ఎప్పటికప్పుడు నమోదు చేసింది, ప్రచారం చేసింది, ఆ పోరాటంలోంచి పెల్లుబికిన కళాసృజనను ఎత్తిపట్టింది. ఆ సృజనకర్తలందరితో నిత్యసంబంధాలు నెరపింది. ఎమర్జెన్సీ తర్వాత 'సృజన' ఆగస్ట్ 1977 సంచికతో మొదలైతే, సెప్టెంబర్ సంచికలోనే అల్లం రాజయ్య రాసిన పెద్ద కథ 'ఎదురు తిరిగితే' మొదలయింది. 'కరీంనగర్ జిల్లా, మంథెన తాలూకా, గాజులపల్లి గ్రామంలోని ప్రజల భాష ఈ కథలో వాడబడింది' అనే నోట్‌తో అచ్చయిన ఆ కథ కరీంనగర్ రైతాంగ పోరాటాల తొలి ప్రతిఫలనాలలో ఒకటి. అప్పటినుంచి ఒక ఏడాది తిరిగేసరికి, సుప్రసిద్ధమైన జగిత్యాల జైత్రయాత్ర జరిగింది. ప్రభుత్వం జగిత్యాల, సిరిసిల్ల తాలూకాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించింది.

ఆ నిర్బంధకాండ మొదలైన మరుసటి సంచిక 'సృజన'లో పది పాటలు ప్రచురించాం. ఆ సంచికతో పాటే ఆ పది పాటలనూ 'పుడమితల్లి పురిటి నొప్పుల చప్పుడు' పేరుతో చిన్న పుస్తకంగా తెచ్చాం. రెండు నెలల తర్వాత 'ఆదిలాబాద్ – కరీంనగర్ రైతాంగ పోరాట పాటలు – 2' పేరుతో, మరొక పన్నెండు పాటల సంకలనం తెచ్చాం. వాటిలో శివసాగర్, చెరబండరాజు, హెచ్చార్కె, అట్లూరి రంగారావు వంటి అప్పటికే కవులుగా పేరువచ్చిన వారి పాటలు మాత్రమే కాక అల్లం వీరయ్య, అల్లం నారాయణ, ఎన్ శేఖర్ వంటి అప్పుడే రచన ప్రారంభించినవారి పాటలు, అల్లం రాజయ్య సేకరించిన నిరక్షరాస్యుల నోటిపాటలు కూడ ఉన్నాయి. ఈ రెండు సంపుటాలు మాత్రమే కాదు, అప్పుడే ప్రారంభమైన 'అరుణతార' లోనూ, ఇతర పత్రికలలోనూ, ఎక్కడా అచ్చు కాకుండానూ వందలాది పాటలు కరీంనగర్ ఆదిలాబాద్ రైతాంగ పోరాటం నుంచి పుట్టుకువచ్చాయి.

ఈ పాటల్లో ఉన్న జీవితాన్నీ, ఉద్వేగాన్నీ, కవిత్వాభివ్యక్తినీ, అనుభూతి సాంద్రతనూ, శిల్ప నిర్మాణ రహస్యాలనూ విశ్లేషించే చాల అవసరమైన పెద్దపని చేయడానికి ఇక్కడ సమయమూ స్థలమూ సరిపోవు గాని ఒక్క పాటను మాత్రం వివరిస్తే నా కవిత్వ ములాఖాత్‌లలో అది ఎందుకు ప్రత్యేకంగా నిలిచిపోయిందో తెలుస్తుంది.

ఆ పాట 'సృజన' డిసెంబర్ 1978 సంచికలో పొరపాటున అల్లం నారాయణ పేరుతో అచ్చయింది. కాని నిజానికి అది అల్లం వీరయ్య రచన. అది బహుశా తెలుగులో అతి ఎక్కువసార్లు వేదిక మీద పాడిన పాట కావచ్చు. గత నాలుగు దశాబ్దాలలో కొన్ని వేల

వేదికల మీద, కొన్ని వందల మంది గాయకుల నోట వెలువడిన పాట అది. మార్పులు చేర్పులతో కాసెట్లలో, సిడిలలో, డివిడిలలో, సినిమాలో అందరూ, అన్ని ఉద్యమాలూ ఉపయోగించుకున్న పాట అది. అది 'ఎర్రజెండెర్రజెండెన్నియలో'.

కరీంనగర్ జిల్లా మంథని సమీపంలోని గాజులపల్లి గ్రామంలో కాముడిపున్నమ సమయంలో పాడుకునే

"పుల్లలు పుల్లలెన్నియలో లవంగ పుల్లలెన్నియలో
లవంగపుల్లలెన్నియలో నమిలితె వాసనలెన్నియలో
సుక్కబొట్టు సుక్కబొట్టెన్నియలో
సూరుడు లచ్చన్నెన్నియలో
మరి ధీరుడు లచ్చన్నెన్నియలో..." అని సాగే పాట బాణీని తీసుకుని అల్లం వీరయ్య రాసిన పాట అది.

ఆ పాట మొదటిసారి విన్న అనుభవాన్ని వరవరరావు 'ఆదిలాబాద్ – కరీంనగర్ పోరాట పాటలు – 2' ముందుమాటలో రాశారు:

"భద్రాచలంలో గద్దర్ సాంస్కృతిక కార్యక్రమం ప్రారంభమవుతున్నదంటే వెళ్లి జనంలో కూర్చున్నాను. ఆరోజు నవంబర్ 11. మీద గొంగడి వేసుకొని, రుమాలు చుట్టుకొని గద్దర్ ఎత్తుకున్నాడు.

'ఎర్రజెండెర్రజెండెన్నియలో
ఎర్రెర్రనిదీ జెండెన్నియలో...' ఆ బాణీకి పులకించి పోయాను.
'అన్నలు అన్నాలెన్నియలో
మరి వెన్నెల కోనాలెన్నియలో' – అప్రయత్నంగా తల పైకెత్తి చూసాను. పుచ్చ పువ్వులా వెన్నెల కాస్తున్నది. ఆ పాటలో మొహర్రం పండుగరోజు పీరీలను బావిలో వేసి వస్తూ, అర్ధరాత్రి పాడుకునే ధూలా పాటలోని విషాదం ఉంది. వీరుల సంస్మరణతో ఉత్తేజాన్ని పొందే ఊపూ ఉంది. బతుకమ్మను సాగనంపి శరద్వెన్నెలలో తెలంగాణ పల్లె స్త్రీలు పాడుకునే ఎన్నియ్యలూ ఉన్నాయి. ఆ పాట గద్దర్ మనసులో కొత్తగూడెం మించి అడవి మీదుగా, గోదావరి మీదుగా ఆ రాత్రి ప్రయాణం చేస్తుంటే పరచుకుంటున్న వెన్నెల అనుకున్నాను. కాదు, ఇదే సింగరేణి కాలరీ మొదలయ్యే, ఇదే గోదావరి పొరలివచ్చే, ఇదే అడవి ఆవులించే, ఇదే ఏజెన్సీ ఎగువన ఆదిలాబాదు జిల్లాలో – అప్పటికింకా అజ్ఞాత కవిని, ఆదిలాబాదు కరీంనగర్ జిల్లా రైతాంగ పోరాటం పలికించిన గీతం అది. కడుపులో రక్తపు పేగులా గుండెలకే ఎర్రజెండెర్రజెండెన్నియలో పాట వెన్నెల కూన లాగో, వెలుగు రవ్వలాగో అతుక్కునిపోయింది."

వరవరరావు వ్యాఖ్య ఆ పాట వెలువడిన రెండు నెలలలోపు చేసినది. కాని ఇవాళ

ముప్పై ఆరు సంవత్సరాలు గడిచినాక ఆ పాట ఎంతటి మహత్తర శక్తిగా మారిందో చూస్తే ఆ పాటలోని సాంద్రత, బలం అర్థమవుతాయి.

ఆ పాటలో ప్రచార దృష్టి ఉన్నమాట నిజమే. కాని అంతకన్న మిన్నగా అద్భుతమైన కవిత్వం ఉన్నది. జీవం తొణికిసలాడుతున్నది. 'అన్నలు అన్నాలెన్నియలో' అని ప్రారంభించి వారిని వెన్నెల కోనలతోనూ, వెలుగు రవ్వలతోనూ పోల్చడం మాత్రమే కాదు. తర్వాతి చరణంలో 'తూరుపు దిక్కూనెన్నియలో సూరుడు పొడిసిండెన్నియలో' అని ఒక నైసర్గిక సత్యాన్ని చెప్పినట్టే చెప్పి, 'ప్రజలా కొరకూ ఎన్నియలో మన అన్నలు నిలిచారెన్నియలో' అనడంలో వాచ్యంగా చెప్పకుండానే, ధ్వని పూర్వకంగానే అన్నలను సూర్యునితో పోల్చడం ఉన్నది. కొనసాగింపుగా 'పడమటి దిక్కూనెన్నియలో సూరుడు గుంకిండెన్నియలో' అని చెప్తూ 'ప్రజలా మధ్యానెన్నియలో మన అన్నలు ఒరిగారెన్నియలో' అనడం శక్తిమంతమైన కవితా నిర్మాణానికి, ఒక ఉద్వేగాన్ని పొరలుపొరలుగా విస్తరించడానికి చిహ్నం. అలా అమరవీరుల గురించి ప్రారంభ చరణాలలో చెప్పిన తర్వాత, 'సీకటి కొండల్లెన్నియలో మరి సివరీ మూలలెన్నియలో నక్సల్‌బరి నుండెన్నియలో మరి నాలుగు దిక్కూలెన్నియలో మరి పోరు మార్గం లెన్నియలో ఒరిగిన అన్నలకెన్నియలో' అనే చరణంలో పోరాటం గురించి, ఆ పోరాటం పుట్టినచోటి గురించి, అది విస్తరించిన తీరు గురించి తీగసాగినట్టు చెప్పడం కవితానిర్మాణంలో మరొక శక్తిమంతమైన పద్ధతి. నక్సల్‌బరి అనే వాచ్య ప్రస్తావన మినహాయిస్తే మిగిలినదంతా ప్రతీకాత్మకం కావడంలో కూడ కవితాత్మకత ఇనుమడిస్తున్నది. ఇక చివరి చరణం 'ఆగదు ఆగాదెన్నియలో పోరాటామాగాదెన్నియలో' అనే విశ్వాసాన్నీ, 'పోరుమార్గం లెన్నియలో మరి నువ్వూనేనూ ఎన్నియలో కలిసే పోదామెన్నియలో' అనే ఆహ్వానాన్నీ కలగలిపింది. ఈ పాట ఇంతగా విస్తరించడానికి వెనుక కేవలం బాణీ, సంగీతం మాత్రమే కాక ఇంత ప్రభావశీలమైన కవితా శక్తి కూడ ప్రధాన కారణమనుకుంటాను.

క్రాంతి ప్రచురణలు అప్పుడే 1979 మార్చ్‌లో మొదటిసారి 'జననాట్యమండలి పాటలు' సంకలనం ప్రచురించింది. అప్పటికే ఉద్యమక్రమంలో ప్రజలు పాడుకుంటున్న పాటలలో కొన్నిటిని సేకరించిన ఈ సంకలనం బహుశా తెలుగు పుస్తక ప్రచురణా చరిత్రలో ఒక రికార్డ్ ను నెలకొల్పింది. ఆ తర్వాత ఆరు సంవత్సరాలలోనే ఆ పుస్తకం కనీసం ఆరు పునర్ముద్రణలు పొంది, ప్రతి పునర్ముద్రణ ఒక కొత్త కూర్పుగా, కొత్త పాటలను సంతరించుకుంటూ, లక్షకు పైగా ప్రతులు అమ్మకం అయింది. ఇక 1985-89 మధ్య కాలంలో అమలయిన 'ఆట-పాట-మాట బంద్' అనే నిర్బంధ కాలంలో ప్రచురణ ఆగిపోయినా, 1990 ప్రజా ఉద్యమాల వెల్లువ నుంచి 1992లో నిషేధం వల్ల క్రాంతి ప్రచురణలు మూతపడేదాకా మరొక రెండు మూడు ముద్రణలు పొందింది. తర్వాత కూడ వేరువేరు పేర్లతో ఆ పాటలు అచ్చవుతూనే ఉన్నాయి. వేదికల మీద ఆ పాటలు మార్మోగుతూనే

ఉన్నాయి. ప్రజలను ఉత్తేజపరచే, సమ్మోహ పరచే, కంట తడి పెట్టించే, పిడికిలి బిగింపజేసే, ఆచరణకు ఉద్యుక్తుల్ని చేసే శక్తి కవిత్వానికి ఎంతగా ఉంటుందో చూపడానికి జననాట్యమండలి పాటలను మించిన ఉదాహరణ లేదు.

ఈ సందర్భంలోనే పాటతోనూ, పాటలలోని కవిత్వంతోనూ నా వ్యక్తిగత ములాఖాత్ గురించి రెండు సందర్భాలు చెప్పాలి: విప్లవ రచయితల సంఘం ఎమర్జెన్సీ తర్వాత మొదటి సాహిత్య పాఠశాల వరంగల్‌లో 1979 జనవరిలో జరిగింది. అందులో భాగంగా ఇస్లామియా జూనియర్ కాలేజి ఆవరణలో ఒకరోజు మధ్యాహ్నం 'ప్రజల పాటలు – అనుభవాలు' అనే సెషన్. గద్దర్, అరుణోదయ రామారావు, వంగపండు ప్రసాద్ ముగ్గురూ తాము పాటలెట్లా రాశారో, ప్రజల పాటలను తీసుకుని విప్లవ భావజాలంతో మిళితం చేసి మళ్లీ ప్రజల దగ్గరికి ఎలా తీసుకుపోయారో అద్భుతంగా వివరించిన సెషన్ అది. ఆ మూడు ఉపన్యాసాలనూ కాసెట్లలో రికార్డ్ చేసి, ఆ కాసెట్లను ఎత్తిరాసి, పుస్తకంగా తయారు చేసే బాధ్యత నాకు అప్పగించారు. ఆ పుస్తకం తయారీలో భాగస్వామ్యం వల్ల నాకు ప్రజా జీవితానికీ, కవితా నిర్మాణానికీ, కవి శక్తిసామర్థ్యాలకూ, కవి సున్నితత్వానికీ ఉండే అవినాభావ సంబంధం అడుగడుగునా తెలిసింది.

అలాగే రెండో సందర్భం, 'జననాట్యమండలి పాటలు' 1979 నుంచి 1983 దాకా ఐదారు ముద్రణలు లెటర్ ప్రెస్‌లో అచ్చయిన తర్వాత, ఒకేసారి ఎక్కువ కాపీలు కావాలని 1984లో మొదటిసారి మద్రాసు ఆఫ్‌సెట్‌లో అచ్చువేయాలని క్రాంతి ప్రచురణలు నిర్ణయించింది. ఆ అచ్చుపని చూసే బాధ్యత నాకు అప్పగించడంతో పాటు, ఈ కొత్త ముద్రణకు ముందుమాట రాయమని కూడ నన్ను అడిగారు. అప్పుడు ఆ పాటలన్నీ చదువుతూ, పాట విన్న సందర్భాలను గుర్తు తెచ్చుకుంటూ, గున్గునాయించుకుంటూ, వాటిలోని కవిత్వానికీ, ప్రేరణ శక్తికీ అబ్బురపడుతూ ముందుమాట రాశాను.

పాటతో ఈ ములాఖాత్ వల్లనే, ఈ గాఢమైన మైత్రి వల్లనే నేను పాటను ఇతర కవిత్వ ప్రక్రియల నుంచి వేరుచేసి చూడలేను. పాటలోని కవిత్వాన్ని సంపూర్ణంగా అనుభవిస్తాను.

## తీరికా, మిత్రులూ, సొంత చదువూ

ఎమర్జెన్సీ అనంతర ప్రజాస్వామిక వెల్లువలో భాగమైన కవితా తరంగాల గురించీ, వాటితో నా ములాఖాత్‌ల గురించీ చెప్పవలసిన విషయాలు మరెన్నో ఉన్నాయి గాని, వాటిని భవిష్యత్తుకు వాయిదా వేసి ఇక ఇతర ములాఖాత్‌ల లోకి ప్రవేశిస్తాను.

ఎమర్జెన్సీ ముగిసేనాటికి ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం చివరలో ఉన్నాను. ఆ తర్వాతి సంవత్సరం మార్చ్‌లో ఇంటర్మీడియట్ పరీక్ష తప్పి, సెప్టెంబర్ సప్లిమెంటరీలో పాసయ్యాను గనుక 1978-79ల్లో మొత్తంగా ఏడాదిన్నరా, ప్రత్యేకంగా సెప్టెంబర్ 78 నుంచి మళ్లీ కాలేజీలు తెరిచి బిఎ లో చేరిన జూన్ 1979 దాకా ఎనిమిది తొమ్మిది నెలలూ పూర్తి రికామీగా ఉన్నాను.

తీరిక కాలం ఎప్పుడైనా అద్భుతమైనది. నిత్యం పనుల్లో మునిగి ఉండి ఆ పనుల వల్ల, ఆ పనుల కోసం చదువు అవసరమయ్యే సందర్భం కూడ ఉంటుంది గాని, ఏమీ పని లేకుండా విశ్రాంతిగా ఉన్నప్పుడు ఇష్టప్రకారం చదువుకోవచ్చు. ఒక పని కోసం కాదు, చదువు కోసమే చదువుకోవచ్చు. అప్పుడిక చదువు మీద, ప్రత్యేకమైన ప్రక్రియల మీద, ప్రత్యేకమైన సృజనకారుల మీద అభిమానం ఉన్న మిత్ర బృందం కూడ ఉంటే ఇంక ఆ ఆనందానికి, అవగాహనల విస్తరణకు అవధి ఉండదు.

ఆ విశ్రాంతికాలం నాకు అటువంటి గొప్ప అవకాశాన్నిచ్చింది. వేరు వేరు ప్రక్రియల మీద ఆసక్తి ఉన్న మిత్రులు, కవిత్వం మీద ప్రత్యేక ఆసక్తి ఉన్న మిత్రులు, ఒక సాహిత్య మాసపత్రిక నిర్వహణలో భాగంగా అన్ని ప్రక్రియలతో నిరంతర సంబంధం, సాహిత్య, రాజకీయ సమావేశాలలో పుస్తకాలు అమ్మేవాడిగా వందలాది మందితో సంభాషణలు, డజన్ల కొద్దీ ఉపన్యాసకుల, కవుల శైలీ భేదాలను దగ్గరినుంచి చూడడం. అది ఒక అద్భుత కాలం. ఒక కర్రముక్క వేణువుగా మారడానికి ఇంకేం కావాలి? నేనలా మారలేకపోయానన్నది వేరే సంగతి గాని, వాతావరణం సంగతి చెపుతున్నాను.

అప్పుడు రోజువారీ పని అంటే, రెగ్యులర్‌గా 'సృజన' పని తప్ప మరేమీ లేదు. అంటే రోజూ సర్క్యులేషన్ పని చూడడం, అవసరమైనప్పుడల్లా వరంగల్‌కు ప్రెస్‌కు వెళ్లి ప్రూఫులు చూసి రావడం, నెలకు రెండు రోజులు నైట్ ఔట్ చేసి 'సృజన' ప్యాకింగ్ చేసి మర్నాడు పోస్ట్ చేయడం. అంతే. ఇక మిగిలిన కాలమంతా బలాదూరుగా అటు వరంగల్ నుంచి ఇటు కాజీపేట దాకా వీథులు తిరగడమే. ఆ రోజుల్లో ఇటు కాజీపేట ఇంకా మెట్టుగుట్ట దాకా వ్యాపించలేదు. చర్చి తర్వాత స్తంభాల బావి ప్రాంతాన్ని కాంచీట్ అని పిలిచేవారు. ఒకప్పటి రహదారి చీటీల నాకా. అటు చివర వరంగల్ ఆజంజాహి మిల్స్ లేబర్ కాలనీ. ఇటు కాంచీట్ నుంచి అటు లేబర్ కాలనీ దాకా నా అడుగు పడని నేల లేదు. అందుకే వరంగల్ గురించి రాసిన నాలుగైదు కవితల్లో ఒకదానిలో

"ఇక్కడి నేల మీద ప్రతి రేణువునూ
మన పాదాలు ముద్దాడి మేల్కొలిపాయి
ఇక్కడి గాలిలో ప్రతి తెమ్మరనూ
మన ఊపిరి రాజేసింది" అని రాశాను. వరంగల్‌లో, ప్రత్యేకించి హనుమకొండ

చౌరస్తాలో అప్పుడు ఉండిన అన్ని ఇరానీ హోటళ్లలోనూ ఇరవైనాలుగు గంటల్లో గడపని క్షణం ఒక్కటి కూడ లేదనే రికార్డు సృష్టించడం ప్రధాన వ్యాపకాల్లో ఒకటి. ఆ ఇరానీ హోటళ్లలో కూచుని రాజకీయాల గురించీ, సాహిత్యం గురించీ, కవిత్వం గురించీ మాట్లాడుకోవడం, కవిత్వం చదువుకోవడం నిత్యకృత్యం. వరంగల్‌లో ఉన్నది తొమ్మిది సంవత్సరాలే అయినా నా అణువణువునా నిండిన గాలీ నీరూ నేలా ఆకాశమూ ప్రాణమూ వరంగల్. నాకు వరంగల్ జనజీవితమే కవిత్వం గనుక నా కవిత్వ ములాఖాత్‌లలో అదే ప్రధానమైనది.

ఆ కాలంలో వరంగల్‌ను ప్రేమించినంత సమానంగానూ, దానికన్న ఎక్కువగానూ ప్రేమించిన మరొక వ్యాపకం చదువు. కవిత్వం, కథ, నవల, సాహిత్యవిమర్శ, రాజకీయార్థిక సిద్ధాంతాలు, సైన్సు, చదరంగం... ఏది చేతికి దొరికితే అది. అసలు ఆలోచిస్తే, ఏ మానవ వ్యక్తీకరణ అయినా సరే, మానవీయమైతే, హృదయస్పర్శి అయితే, వాస్తవికమైనదైతే, జనజీవిత భూమికలో చిగురించినదైతే కవిత్వమేననిపిస్తుంది. అంటే చూడగలిగితే ప్రతి ప్రక్రియలోనూ కవిత్వం చిప్పిల్లుతుందన్నమాట.

అలా పుస్తకాల కోసం ఆతురతతో, కుతూహలంగా, ఎక్కడపడితే అక్కడ వెతుకుతుండిన రోజుల్లో అనుకోని చోట అనుకోని సమయంలో దొరికింది ఒక కవిత్వ పుస్తకం. ఎన్‌కె ద్వారా మా కుటుంబంలోకి 1972–73ల్లో వచ్చి, 1976లో మా అరుణక్క సహచరుడిగా మారి, 'సృజన' సాహితీమిత్రులలో ఒకరుగా మారిన ఒద్దిరాజు గోపాల్ రావు (గోపీ – 1986లో ఊపిరితిత్తులకు శస్త్రచికిత్స జరిగి, ఆ తర్వాత వచ్చిన సమస్యలతో మరణించాడు. 'గోపీస్మృతి' అని ఆయన స్మృతిలో 1987లో ఒక చిన్న కవితా నివాళి పుస్తకం తెచ్చాం) అప్పుడు వరంగల్ ఎల్‌ఐసి ఆఫీసులో అసిస్టెంట్‌గా పనిచేస్తుండేవాడు. అప్పుడు ఎల్‌ఐసి ఆఫీసు వరంగల్ లక్ష్మీటాకీసు ఎదుట ఒక రెండంతస్తుల భవనంలో ఉండేది. ఒకరోజు ప్రెస్‌లో 'సృజన' ప్రూఫులు చూసి నడుస్తూ నడుస్తూ లక్ష్మీటాకీసు దాకా వచ్చి ఆ ఆఫీసుకు వెళ్లాను. ఆయన కూచున్న గదిలో లైబ్రరీ అని రాసి పెట్టిన ఒక చెక్కబీరువా ఉంది. 'మీ దగ్గర ఏం పుస్తకాలుంటాయి' అంటూ తాళం తీయించి చూడడం మొదలుపెట్టాను. అప్పటికి చాల ప్రగతిశీలంగా ఉండిన ఎల్‌ఐసి యూనియన్ నాయకులు వరంగల్ ఆఫీసులోనే ఉండేవారు. అందువల్ల అక్కడ మంచి అభిరుచి గల సాహిత్యమే ఉంది. అలా చూస్తూ చూస్తూ ఉండగా వందా నూట యాభై పేజీలకు మించని ఒక బౌండు పుస్తకం. అట్టమీద 'కృష్ణ పక్షము – ఊర్వశి – ప్రవాసము' – దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి. నాకు గుర్తున్నంతవరకు అది కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్ ప్రచురణ.

కృష్ణశాస్త్రి పేరు అప్పటికి విని ఉన్నదే గాని సానుకూలంగా విన్నది కాదు. 'మహాప్రస్థానం'కు చలం రాసిన 'యోగ్యతాపత్రం'లో బహుశా మొదటిసారి విన్నాను. అక్కడ చలం "కృష్ణశాస్త్రి తన బాధని అందరిలోనూ పలికిస్తే, శ్రీశ్రీ అందరిబాధనూ తనలో పలికిస్తాడు.

కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ" అన్నాడు. కృష్ణశాస్త్రి మీద చలానికీ, శ్రీశ్రీకీ కూడ ఉన్న ప్రగాఢమైన అభిమానంతో పోలిస్తే అది అన్యాయమైన మాట. చలం అలా ఉద్దేశించాడో లేదో తెలియదు గాని నాబోటి మిడిమిడి జ్ఞానపు కవిత్వ పాఠకులకు మాత్రం ఆ మాటతో కృష్ణశాస్త్రి శ్రీశ్రీకి భిన్నమైన, వ్యతిరేకమైన కవి అనిపించింది. అందువల్ల కృష్ణశాస్త్రిని చదవనక్కరలేదనే ఒక మానసిక స్థితి మొదలయింది. తర్వాత కృష్ణశాస్త్రి గురించి విన్నది ఇంకా అన్యాయమైన మాట. శ్రీశ్రీయే స్వయంగా రాసిన

"ఏరి తల్లీ నిరుడు మురిసిన
ఇనప రచయితలు?
కృష్ణశాస్త్రపుటుష్ట్రపక్షీ
దారి తప్పిన నారిబాబూ
ప్రైజు ఫైటరు పాపరాజూ
పలకరెంచేత?"

ఆ కవిత రాసిన సమయ సందర్భాలు వేరు. ఒక విశాల రాజకీయ నేపథ్యంలో అర్థం చేసుకోవలసిన కవిత అది. కాని తెలిసీ తెలియని నా బోటి పాఠకులకు కృష్ణశాస్త్రి ఉష్ట్రపక్షి అనే అభిప్రాయమే మిగిలిపోతుంది.

అవి రెండూ చదివి ఉండడం వల్ల కృష్ణశాస్త్రి మీద ఒకరకమైన వ్యతిరేకత, చిన్నచూపు ఉన్నవేళ ఆ పుస్తకం కంటపడింది. ఇటువంటి అజ్ఞానంతో కూడిన వ్యతిరేకతలు, చిన్నచూపులు మనకు చాల ఉంటాయి. దేన్నయినా అదేమిటో తెలియకుండానే మరెవరో చెప్పారు గనుక ప్రేమిస్తుంటాం. అలాగే తెలియకుండానే మరెవరో చెప్పారు గనుక మరొకదాన్ని ద్వేషిస్తుంటాం. ఈ అపసవ్య ధోరణులు మన ఆలోచనా ప్రపంచంలో రాజ్యం చేస్తున్నాయి. "ఇతరులు చెప్పారనో, ఎక్కడో రాసి ఉందనో, గురువు చెప్పాడనో, సంప్రదాయం చెప్పిందనో దేన్నీ నమ్మకు. నీ అంతట నువ్వు పరీక్షించు. విశ్లేషించు. ఉపయోగకరమైనదనిపిస్తే, నిర్దుష్టమైన దనిపిస్తే, సంక్షేమానికీ, ఆనందానికీ దారి తీస్తుందంటే మాత్రమే నమ్ము" అని సిద్ధార్థ గౌతముడు రెండున్నరవేల ఏళ్ల కింద చెప్పిన పరమ ప్రమాణాన్ని ఈ దేశపు మేధో ప్రపంచం ఎప్పుడో పోగొట్టుకుంది.

అట్లాగే తెలుగు సాహిత్య, ముఖ్యంగా కవిత్వ లోకంలో అనుభూతి కవులు, సామాజిక కవులు అనే అనవసరమైన, అర్థరహితమైన విభజన కూడ రాజ్యం చేస్తున్నది. అనుభూతి లేకుండా కవిత్వమే లేదు. సమాజంలో భాగం కాకుండా, సమాజంతో స్పందనలు, ప్రేరణలు పొందకుండా, కవి కాదు గదా, మనిషే ఉండడం సాధ్యంకాదు. ఆ రెండు అంశాలలో దేనికి ప్రాధాన్యత ఇస్తారనే విషయంలో ఆయా కవులకు ప్రత్యేకతలు ఉండవచ్చు. కాని సమాజానికి ప్రాధాన్యత ఇచ్చే కవులైనా అనుభూతిని పలికి పలికించవలసిందే. అనుభూతికి ప్రాధాన్యత ఇచ్చే కవులైనా సమాజంలో బతుకుతూ, సమాజం నుంచి వస్తువును తీసుకుంటూ, సమాజానికి

తిరిగి ఇవ్వవలసిందే. కనుక ఒక కవితలో దేనికి ప్రాధాన్యత వచ్చింది, అది సముచితమేనా అని విశ్లేషించడం వేరు. మొత్తంగా కవులను ఆ ప్రాతిపదికపై విభజించడం వేరు.

అప్పటికి నాకిదంతా తెలియదు గాని, 'ఈయన ప్రపంచపు బాధను పట్టించుకున్న మనిషి కాదు, ఉష్ట్రపక్షి' అనుకుంటూనే, అయినా ఈయనను కూడ చదివి చూద్దాం అనుకుని పుస్తకం తెచ్చుకున్నాను. ముప్పై ఆరేళ్లు గడిచిపోయాయి. కృష్ణశాస్త్రి కవిత్వం నన్ను ఒక్కరోజు కూడ వదలలేదు. విషాదం, నిరాశ, మృత్యుస్పర్శ లేవని కాదు, కాని అవి ఒక సామాజిక వేదన ప్రతిఫలనాలు కావచ్చునని నాకనిపిస్తుంది. అంతకన్నముఖ్యంగా స్వేచ్ఛాభావన, ప్రేమ, కరుణ, లోకాతీత మానవసంబంధం వంటి భావనలు నాలోని పద్దెనిమిదేళ్ల యువకుడిని ఆకర్షించి ఉంటాయి.

"విభు వీడి శుష్కించు విరహిణి సెలయేటి
కడుపులో నడగిన కడలి మ్రోత
రేనికై వెదకెడు రిక్కచూపుల లోన
చెరవడ్డ నిండు చందురుని పాట" లోని ఆ లాలిత్యం, ఆ తడి మూడున్నర దశాబ్దాల తర్వాత కూడ నా మునివేళ్ళకూ, కనుకొలకులకూ అందుతూనే ఉంటుంది. ప్రతిరోజూ ఏదో ఒక సందర్భంలో ఎవరో ఒక మిత్రుడి గురించి కృష్ణశాస్త్రితో గొంతు కలిపి

"నావలెనె యాతడున్మత్త భావశాలి,
ఆగికోలేడు రేగు నూహల నొకింత!
ఇంత చిరుగీతి యెద వేగిరించునేని
పాడుకొనును తాండవనృత్య మాడుకొనును
మస్తకమ్మొరగా వంచి మన్ను మిన్ను
వేయికేలాడగా వ్రాసి వేసికొనును
ఏనెరుంగుదు నావలెనె యతండు
పాటపదములకై నిత్య పథికుడయ్యె" అనుకుంటాను. ఇప్పటికి సరిగ్గా తొంభై సంవత్సరాల కింద తొలిసారి అచ్చయిన ఆ పుస్తకం ఇవాళ్టికీ కవిత్వ రచనకూ, నిర్మాణానికీ, శీర్షిక 'సృజన'కూ, ఆర్ద్రతకూ, సాంద్రతకూ పాఠ్యపుస్తకం అనుకుంటాను.

"హృదయ వనజాత సుమ
మృదు మనోహర దళము
లదయతను ద్రుంచినారె
పెంధూళి చిదిమి వెదజల్లినారె!
హృదయ శోణిత ధార
నెదుగు జీవిత వల్లి

మొదలంట దూల్చినారె

భయదాగ్ని కీలలను వ్రేల్చినారె!" అని బీభత్సాన్ని చిత్రించిన కవితకు, ఆ బీభత్సాన్ని చూసిన సున్నిత, ఆర్ద్ర మనస్కుల స్పందన 'అబ్బ' అని శీర్షిక పెట్టడం ఒక అద్భుతం.

"కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ" అని ఒక అనుద్దేశపూర్వక అన్యాయ ప్రకటన చేసిన యోగ్యతాపత్రంలోనే చలం "స్వయంగా చదవండి. చదివింతరువాత శ్రీశ్రీని చూడాలనిపిస్తే స్వయంగా చూడండి. ఎవరి అభిప్రాయమూ అడగకండి. ముఖ్యం, కవి అనేవాణ్ణి – చెప్పినా వినకండి" అని చెప్పిన మాటలు ప్రతి కవికీ వర్తిస్తాయని నాకు కృష్ణశాస్త్రి కవిత్వ ములాఖాత్ నేర్పింది. ఏ కవి గురించీ, రచయిత గురించీ అయినా మరొకరి భావాలను, వారు ఎంత గొప్పవారైనా సరే, అరువు తెచ్చుకోవద్దు. సొంతంగా చదువుకోవాలి. సొంతంగా అభిప్రాయం ఏర్పరచుకోవాలి. మళ్లీ మళ్లీ చదువుతుంటే, మన వ్యక్తిత్వం పెరుగుతుంటే ఆ అభిప్రాయం బలపడనూ వచ్చు, చెరిగిపోనూ వచ్చు. ఏదైనా సరే అది మనదై ఉండాలి.

# కవిత్వ రచనలో తొలి అడుగు

నా కవిత్వ ములాఖాత్‌లలో ఇప్పటిదాకా చెప్పినవి ఒకరకంగా నేపథ్యాన్ని సమకూర్చిన సందర్భాలు మాత్రమే. ఆ ఉపోద్ఘాతమంతా ముగిసి, నిజంగా కవిత్వాస్వాదనలోకీ, విశ్లేషణలోకీ, రచనలోకీ, అనువాదంలోకీ దిగిన సమయాలలో, కవిత్వ ములాఖాత్‌లలో చెప్పుకోదగిన సమయాలలో ఒకటి 1979–82 వరంగల్ ఆర్ట్స్ కాలేజిలో బి.ఎ. చదివిన కాలం. ఆ కాలంలోనే నేను రాసిన కవిత్వం అచ్చుకావడం మొదలైంది. 'సృజన'లో, ఇంట్లో మాత్రమే కాక బైట తెలుగు కవిత్వమూ, దానితో పాటు దేశదేశాల కవిత్వమూ చదవడం సాగింది. 'సృజన' సాహితీ మిత్రులలో బాధ్యతలు పెరిగి పదిమంది వినేలా, అర్థం చేసుకునేలా భావస్ఫోరకంగా కవిత్వం చదవడం, ప్రతి పదం దగ్గరా, పాదం దగ్గరా ఆగి పరిశీలించడం, మొత్తంగా విశ్లేషించడం, ప్రచురణకు ఎంపిక చేయడం మొదలయ్యాయి. కవిత్వం అనువాదం చేయడం మొదలైంది. బిఎలో ఇంగ్లిష్ సాహిత్యం ప్రధానాంశంగా ఉండడం మాత్రమే కాదు, గొప్ప కవిత్వ విమర్శకులు, మా ఇంగ్లిష్ అధ్యాపకులు ఎ. జగన్మోహనా చారి దగ్గర మూడు సంవత్సరాలు కవిత్వాస్వాదనా పాఠాలు నేర్చుకునే అవకాశం దక్కింది. ఆయన ఇంగ్లిష్ అధ్యాపకులు మాత్రమే కాక మంచి తెలుగు సాహిత్య విమర్శకులు, 'సృజన' సాహితీమిత్రులులో ఒకరు. 'కవిత్వం – గతితార్కికత' పేరుతో, క్రిస్టఫర్ కాడ్వెల్, జార్జి థామ్సన్, రేమండ్ విలియమ్స్‌లతో పోల్చదగిన గొప్ప సాహిత్య విమర్శ వ్యాసాల పుస్తకం రాశారు.

అచ్చయిన మొదటి కవిత గురించీ, రాసి, అనుకరణ కావడం వల్ల వదిలేసిన రెండో

కవిత గురించీ ఇదివరకు ప్రస్తావించాను. ఆ తర్వాత మూడు సంవత్సరాలకు గాని మళ్లీ సొంతంగా కవిత్వం రాయాలనిపించలేదు. అనిపించలేదనడం కూడ నిజం కాదేమో. అనిపించిన సందర్భాలెన్నో వచ్చినా, వ్యక్తీకరించడానికి బద్ధకించడమో, శ్రద్ధ పెట్టకపోవడమో, సాధన చేయకపోవడమో జరిగి ఉంటుంది. ప్రతి మనిషికీ జీవితంలో అసంఖ్యాక సందర్భాలలో, అనంతమైన రూపాలలో కవితా ప్రేరణలు కలుగుతూ ఉంటాయని ఆ తర్వాత కాలంలో నాకు అర్థమయింది. ఏదో ఒక ఊహ, ఏదో ఒక మాట, ఎవరో ఒక మనిషి, ఏదో ఒక వాసన, ఏదో ఒక రుచి, ఏదో ఒక స్పర్శ, ఏదో ఒక అనుభూతి అయినా సరే మానవమేధను కవిత్వాభివ్యక్తికి పురికొల్పుతుందని నాకనిపిస్తుంది. ఒక పదబంధం, ఒక పదచిత్రం, ఒక పాదం, ఒక దృశ్యం మనసుకు తడుతుంది. దాన్ని వెంటనే రాసి పెట్టుకోవాలి. పదేపదే మననం చేసుకోవాలి. దాన్ని ఒక మొరటు శిలలా భావించి చెక్కుతూ చెక్కుతూ శిల్పంలా తయారు చేయాలి. అంత ఓపికా తీరికా శ్రద్ధా లేకపోవడమే చాల మంది కవులు కాకపోవడానికీ, ఎప్పుడో ఒకసారి కవిత్వం రాసినా అభివ్యక్తి మెరుగు పడకపోవడానికీ కారణమని అనుకుంటాను. అలా వెంటనే స్పందనను కాగితం మీద పెట్టి రోజుల తరబడీ నెలల తరబడీ, కొన్నిసార్లు సంవత్సరాల తర్వాత కూడ పూర్తి చేసిన కవితలున్నాయి. కాని చాలసార్లు మంచి పదబంధాలు, అనుభూతులు, ఊహలు, దృశ్యాలు తట్టినా వాటి మీద శ్రద్ధ పెట్టకపోవడం వల్ల మరుగునపడి కవితలు కాకుండా పోయినవీ ఉన్నాయి. ఇతరుల విషయం ఏమో గాని మూడేళ్ల దాకా కవిత్వం రాయకపోవడానికి, ఆ తర్వాత కూడ తక్కువగా రాస్తూ ఉండడానికి నాకైతే కారణం ఈ శ్రద్ధ లేకపోవడమే.

కాని ఎంత శ్రద్ధలేని మనిషినైనా లోలోపలి నుంచి కదిలించి ఇక రాయకతప్పదని అనిపించే సందర్భం ఒకటి వస్తుంది. నాకూ అటువంటి సందర్భం 1979 అక్టోబర్‌లో వచ్చింది. నా జీవితంలో నాకు దగ్గరిగా తెలిసి, ఆత్మీయంగా గడిపి, దాదాపు రెండు సంవత్సరాల పాటు ఎన్నెన్నో విషయాలు పంచుకున్న జన్ను చిన్నాలు గూండాల చేతుల్లో 1979 అక్టోబర్ 19న హత్యకు గురి కావడం నన్ను బాగా కలిచివేసింది. జన్ను చిన్నాలు వరంగల్ శివారు గ్రామం పైడిపల్లిలో నిరుపేద మాదిగ కుటుంబంలో పుట్టాడు. కాకతీయ మెడికల్ కాలేజిలో మెస్‌బాయ్‌గా పనిచేస్తూ అక్కడి విప్లవవిద్యార్థుల ప్రభావంలో విప్లవ రాజకీయాలలోకి వచ్చాడు. వరంగల్ ఐటిఐలో ఏదో కోర్సులో చేరాడు గాని ఎమర్జెన్సీ అయిపోయే నాటికి అది కూడ వదిలేసి పూర్తికాలం కార్యకర్తగా, వరంగల్ జిల్లా రైతాంగ, యువజన ఉద్యమాల నాయకుడిగా ఎదిగాడు. జగిత్యాల – సిరిసిల్ల రైతాంగ పోరాటాల స్ఫూర్తితో వరంగల్ జిల్లాలో వందల గ్రామాల్లో రైతాంగాన్ని సంఘటితం చేసి పోరాటాలు ప్రారంభించాడు. రెండు సంవత్సరాల ప్రజా జీవితంతోనే వరంగల్ సామాజిక చరిత్రలో చెరపరాని స్థానాన్ని సంపాదించుకున్నాడు. ఆ కక్షతో భూస్వాముల, పోలీసుల అండతో

గూండాలు ఆయనను హత్యచేశారు. “వరంగల్ జిల్లాలో దళితవర్గాల, యువజనుల హృదయా లలో ఇంతగా గూడు కట్టుకున్న మరొక నాయకుడు లేడు. కారణం, ఆయన నాయకుడు కాదు. ఆయన పెద్దవాళ్లకు కన్నకొడుకు. అక్కలకూ అన్నలకూ ఎదిగిన తమ్ముడు. చిన్నవాళ్లకు అన్న” అని ‘సృజన’ నవంబర్ 1979 సంచికలో ‘సాహితీమిత్రుల’ తరఫున రాశాం.

చిన్నాలు నాకు వ్యక్తిగతంగా అత్యంత ఆత్మీయుడు. మూడున్నర దశాబ్దాలు గడిచినతర్వాత కూడ ఆయన గురించి తలచుకుంటే నాకు దుఃఖం ఆగదు. ఎమర్జెన్సీ ఎత్తివేసిన కొన్ని వారాల్లోనే మా ఇంటికి వచ్చాడు. ఇక అప్పటినుంచి చనిపోవడానికి మూడు రోజుల ముందు దాకా రెండు సంవత్సరాల పాటు ఆయనతో లెక్కలేనన్ని అనుభవాలున్నాయి. ఆయన సైకిల్ తొక్కుతుంటే వెనుక కూచుని, లేదా ముందు హాండిల్ బార్ మీద కూచుని నేను వరంగల్ తూర్పు గ్రామాల దళితవాడలెన్నిటికో వెళ్లాను. ఆయన జనంతో మాట్లాడడమంటే ఎటువంటి సమ్మోహక శక్తి ప్రవహించడమో చూశాను. ఒక అమాయకుడైన, పెద్దగా విద్యావంతుడు కాని పల్లెటూరి మాదిగ పిల్లవాడు ఇంకా ఇరవై–ఇరవై రెండేళ్లు కూడ నిండకుండానే ఎంత బలవత్తరమైన నాయకుడు కాగలడో చూశాను. సెప్టెంబర్ 29, 30, అక్టోబర్ 1 ల్లో తిరుపతిలో జరిగిన విరసం సాహిత్య పాఠశాలకు కలిసే వెళ్లాం. అక్కడ బాలాజీ హోటల్లో పక్కపక్కన కూచుని భోజనం చేస్తున్నప్పుడు తనను పెళ్లి చేసుకొమ్మంటూ ఒక అమ్మాయి అడుగుతున్నదని, కాని విప్లవ జీవితంలో ఇది సరైనదేనా అని ఆయన అమాయకంగా నాతో పంచుకున్న మాటలు నాకిప్పటికీ చెవుల్లో ఆడుతున్నాయి. ఆ తర్వాత తన గ్రామం పైడిపల్లిలో గిరాయిపల్లి అమరవీరుల స్థూపం నిర్మించి, దాన్ని కొండపల్లి సీతారామయ్య చేత అక్టోబర్ 16న ఆవిష్కరింపజేసి, పెద్ద సభ ఏర్పాటు చేశాడు. చిన్నాలును ఆ సభలో చూడడమే ఆఖరిసారి. తర్వాత మూడో రోజే హత్యకు గురయ్యాడు. అటువంటి ఆప్తమిత్రుడు హత్యకు గురయ్యాడని విని భోరున ఏడుస్తూ వెళ్తే తమకూ ఆయన అంతే ఆత్మీయుడని విలపిస్తున్న వేలాది మంది జనసమూహం. గిరాయిపల్లి మృతవీరుల స్థూపం పక్కనే చిన్నాలు సమాధి. బాగా తెలిసిన మనిషి భౌతికంగా కనబడకుండా పోవడం, జ్ఞాపకాల్లో మాత్రమే మిగలడం నాకు అనుభవానికి వచ్చిన తొలి సందర్భం అది.

అంత గాఢమైన, వేదనాభరితమైన ప్రేరణ గనుక అది కవిత్వమైంది. ‘బద్‌లా’ అనే శీర్షికతో

“వేదన
గొంతులో అడ్డుపడుతూ ఉంటే
నీ గురించేమీ
పలకలేను
కానీ –

నీకోసం రాయాల్సింది
ఎలిజీ కాదు,
నువు నడిచిన
ప్రజలబాట కాపాడుకునే
ప్రతిక్రియ”

అని రాశాను. నా కవిత ‘పథిక్’ పేరుతో అచ్చయింది. రచన ప్రారంభించిన చాలకాలం దాకా నేను నా పేరుతో రాయలేదు. లెక్కలేనన్ని, నాకే ఇప్పుడు గుర్తు లేనన్ని మారుపేర్లతో రాశాను. కవి, రచయిత అనే పేర్లకు ఉండే హోదాను పక్కనపెట్టాలనీ, కవితలో, రచనలో ఉండే విషయమే ప్రధానం కావాలనీ అభిప్రాయం ఉండేది. పేరుతో రాయడం ప్రారంభించాక, ఎక్కువ రాయడం వల్ల, సందర్భపు అవసరాలను బట్టీ వేరువేరు పేర్లతో రాయవలసి వస్తున్నది. కవిత్వ ములాఖాత్‌లలో ఈ కలం పేర్ల ములాఖాత్ కూడ భాగమే.

సుదీర్ఘకాలపు నిర్బంధం నుంచి సరిగ్గా చిన్నాలు అంత్యక్రియల సమయానికి పైడిపల్లికి చేరిన అల్లం నారాయణ ఆ అంత్యక్రియల దృశ్యాన్ని కళ్లకు కట్టే అద్భుతమైన కవిత రాశాడు. ‘అమ్మా సారంగధార ఎండుపోయె నాయనా ఎక్కడాడుతున్నాడో’ అనే జానపద పాట బాణీలో అల్లం వీరయ్య ‘అమ్మా చిన్నన్న యింక మళ్లి రాకపాయెనే ఏడికెళ్లిపోయెనే’ అనే పాట రాశాడు. “నువు ఏదడిగితే అదే పాడుతా” అని ఎన్‌కె ఒక పాట రాశాడు. చిన్నాలు మీద వచ్చిన కవితలు, పాటలు, రచనలు అన్నీ ‘సృజన’లో అచ్చువేయడం మాత్రమేకాక ‘జనం చిన్నాలు’ పేరుతో చిన్న పుస్తకం కూడ తెచ్చాం.

చిన్నాలు మీద నా కవిత సందర్భంగా మరొక విషయం కూడ చెప్పవలసి ఉంది. ఈ కవిత రాసిన కొద్ది రోజులకే మా బాపు ఆరోగ్యం బాగా చెడిపోయి హైదరాబాద్ గాంధీ ఆస్పత్రిలో చేర్చాం. అప్పటికి ఆ ఆస్పత్రిని ‘గాంధీ రోగ నిలయం’ అని పిలుస్తుండిన చెరబండరాజు బ్రెయిన్ ట్యూమర్ కు ఒకసారి శస్త్ర చికిత్స అయి అక్కడే ఉన్నాడు. సహజంగానే నా కవిత ఆయనకు చూపాను. నా మొదటి కవితకు పెట్టుకున్న ‘రక్తగాయకుడు’ పేరు కూడ ఆయనకు తెలుసు. “పథిక్ అయితే అస్సలు బాగులేదు. ఆ రక్తగాయకుడూ బాగులేదు. నీ పేరుతోనే రాయి. లేదా తెలుగుతనం కనబడే మరొక  పేరు పెట్టుకో” అన్నాడు. ఆ తర్వాత చాల సంవత్సరాలకు గాని ఆయన మాట పాటించలేకపోయాను.

చిన్నాలు సంస్మరణ రచనలు వెలువడిన ‘సృజన’ సంచిక 97వది. అప్పటికే ‘సృజన’ నూరో సంచిక తయారీ పనుల్లో ఉన్నాం. ఆధునిక సాహిత్య వేదికగా ‘సృజన’ కవిత, కథ, వ్యాసం, పుస్తక సమీక్ష ప్రక్రియలకు ఏదోహదం చేసిందో ఆ సంచిక అద్దం పట్టాలనుకున్నాం. అంతకు ముందరి 99 సంచికలలోనుంచి ఎంపిక చేసిన రచనలు వేయాలని, ప్రతి భాగానికీ ఒక ముందుమాట రాయాలని అనుకున్నాం. 1966 నవంబర్ నుంచి జనవరి 1980

వరకు వెలువడిన 99 సంచికలలో ఆరువందలకు పైగా కవితలు వచ్చి ఉంటాయి. అవన్నీ చదివి వాటిలోంచి ఇరవై కన్న ఎక్కువ కాకుండా ఎంపిక చేయాలనుకున్నాం. అప్పటికే అవి వడపోసిన కవితలు కాగా, ఆ వడపోత నుంచి మరొక వడపోత జరిపే కష్టతరమైన పని అది. నిజానికి అవన్నీ అలా వరుసగా చదువుతూ రావడం 'సృజన' చరిత్ర, 'సృజన'లో అచ్చయిన కవితల చరిత్ర మాత్రమే కాదు, తెలుగు కవితా చరిత్ర కూడ అవుతుంది. తెలుగులో ఒక ప్రక్రియగా వచనకవిత మీద చర్చ జరిగిన సందర్భం అది. దిగంబర కవులు, తిరుగబడు కవులు, చేతనావర్తం, మార్చ్, విప్లవ రచయితల సంఘం, ఝంఝ, జననాట్యమండలి, పైగంబర కవులు, విరసంలో చీలిక, జనసాహితి, ఎమర్జెన్సీ, ఎమర్జెన్సీ అనంతర ప్రజావెల్లువ వంటి చరిత్రాత్మక సామాజిక, సాహిత్య సందర్భాలెన్నో పడుగూపేకలా అల్లుకున్న సందర్భం అది. ఆ అన్ని సందర్భాలనూ ప్రతిఫలించిన కవిత్వం ఉంది. ఆ కవిత్వంలో అత్యధిక భాగం 'సృజన'లో అచ్చయింది. అందువల్ల ఆ ఎంపికలో భాగం కావడం తెలుగు కవిత్వంలోని ఉజ్వలమైన పదిహేను సంవత్సరాల చరిత్రతో ములాఖాత్.

# సృజనాత్మక కవిత్వ 'సృజన'

నా కవిత్వ ములాఖాత్‌లలో చెప్పుకోదగిన, గొప్ప ప్రభావం వేసిన, ఒక కవిత్వ పాఠ్యప్రణాళికలా సాగిన ములాఖాత్ 'సృజన' నూరో సంచిక తయారీ. తన ప్రయాణంలో ఏదో ఒక మైలురాయిని గుర్తించి, అక్కడ ఆగి వెనక్కి చూడడం దాదాపుగా ప్రతి పత్రికకూ ఆనవాయితీయే. 'సృజన' పద్నాలుగు సంవత్సరాల ప్రయాణం తర్వాత నూరో సంచిక సందర్భంగా అటువంటి సింహావలోకనం చేయాలని అనుకున్నాం. నిజానికి ఎనిమిదిన్నర సంవత్సరాలకే వంద సంచికలు కావాలి గాని 'సృజన' మొదటి నాలుగు సంవత్సరాలు (1966 నవంబర్ –1970 నవంబర్) త్రైమాసికగా రావడం, మధ్యలో ఎమర్జెన్సీలో రెండు సంవత్సరాలు (1975 జూలై– 1977 జూలై) ఆగిపోవడం, మధ్యలో మూడు సార్లు రెండు నెలల సంచికలు కలిపివేయడం వల్ల, 1980 ఫిబ్రవరి సంచికే నూరో సంచిక అయింది. ఆ సంచిక ఎట్లా ఉండాలని సాహితీమిత్రులు చర్చించినప్పుడు అనేక సూచనలు, సలహాలు, ప్రణాళికలు వచ్చినప్పటికీ, చివరికి నిర్వహణ, కవిత, కథ, వ్యాసం, పుస్తక సమీక్ష, అభిప్రాయాలు అనే ఆరు భాగాలుగా ఉండాలని నిర్ణయించాం. దీనిలో చివరి భాగమైన అభిప్రాయాలులో మాత్రమే కొత్త రచనలు ఉండాలని, మిగిలిన అన్ని భాగాలలో అంతకు ముందరి 99 సంచికల నుంచి ఎంపిక చేసిన రచనలు ఉండాలని అనుకున్నాం. దాదాపు అన్నీ ఉండదగినవే అనిపించే రచనలలోంచి కొన్నిటిని మాత్రమే ఎంచుకోవడంలో, ఒక్కో

రచనను ఎందుకు ఎంపిక చేయాలో ప్రమాణాలు చర్చించడంలో, నిర్ధారించడంలో ఎక్కువ సమయమే పట్టింది. చాల సులభంగా అయిపోతుందనుకున్న పని నాలుగు నెలలు పట్టింది.

అలా రూపొందిన 286 పేజీల బృహత్సంచిక గురించీ, దానిలో నిక్షిప్తమైన 'సృజన' చరిత్ర గురించీ, ఆధునిక సాహిత్య వేదికగా 'సృజన' నమోదు చేసిన సాహిత్య చరిత్ర గురించీ, ఆ తర్వాత 1992లో ఆగిపోవడానికి ముందు వచ్చిన మరొక వంద సంచికల గురించీ చెప్పుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. ఎప్పుడో భవిష్యత్తులో రాయవలసిన 'సృజన' చరిత్రకు వాటిని వదిలేసి, ఇక్కడ నూరో సంచిక కవిత్వ ఎంపిక సందర్భం నా కవిత్వ ములాఖాత్‌లలో ఎట్లా ప్రభావశీలమైనదో చెప్పడానికే పరిమితమవుతాను.

కవి, విశ్లేషకుడు, ఉద్యమ సహచరుడు, ఎన్నో రకాలుగా ఆప్తుడు, అప్పటికి ఢిల్లీ విశ్వవిద్యాలయ అర్థశాస్త్ర అధ్యాపకుడు సివి సుబ్బారావు ప్రభావంలో తలమునకలుగా ఉన్నాను గనుక ప్రతి విషయాన్నీ వర్గీకరణల్లో, విభజనల్లో, అంకెల్లో, పట్టికల్లో ఆలోచించడం అలవాటవుతున్నది. ఆ అలవాటుతోనే, ఆయా ప్రక్రియల్లో వచ్చిన రచనల, రచయితల జాబితా తయారుచేసి నూరో సంచికలో వేస్తే బాగుంటుందని అమాయకంగా ప్రతిపాదించాను. మొదట 'సృజన' 99 సంచికల్లో వచ్చిన కవిత్వం జాబితా తయారు చేయడం మొదలుపెట్టాను. ఫూల్‌స్కేప్ రూల్డ్ కాగితాల మీద క్రమ సంఖ్య, కవి, శీర్షిక, అచ్చయిన సంచిక, పేజి నంబర్ అని ఐదు కాలమ్‌లు గీసి, వరుసగా ఒక్కొక్కటీ రాస్తూ పోయాను. అలా రాస్తూ పోతే, ఒక్క కవిత్వం మాత్రమే చూసినా ఏడు వందల కవితలున్నాయని, కలం పేర్లు కూడ కలుపుకుంటే కనీసం మూడు వందల మంది కవులు ఉన్నారని తేలింది. అంటే ఒక్క కవిత్వ జాబితానే 25 పేజీలు ఆక్రమించి ఉండేది. మొత్తం రచనల జాబితా వేయాలంటే 3000 పంక్తులు, కనీసం వంద పేజీలు అయి ఉండేది. అలా ఆ జాబితా ప్రచురించే ఆలోచన పక్కకు పోయింది గాని ఆ క్రమంలో నాకు ఆ ఏడు వందల కవితలనూ మరొకసారి చదివే అవకాశం వచ్చింది.

నిజంగా ఆ వంద సంచికలలో తెలుగు కవిత్వానికి 'సృజన' చేసిన దోహదం అపారం. బహుశా 1966 నుంచి 1980 దాకా కవిత్వం రాసిన వాళ్లలో 'సృజన'లో అచ్చుకాని వాళ్లు వేళ్లమీద లెక్కపెట్టదగినంతమంది మాత్రమే ఉండి ఉంటారు. శ్రీశ్రీ, కాళోజీ, ఆరుద్ర, కుందుర్తి, సోమసుందర్, ఇస్మాయిల్, సి నారాయణరెడ్డి, కె వి రమణారెడ్డి, సి.వి., పేర్వారం జగన్నాథం, అనుముల కృష్ణమూర్తి, సి వి కృష్ణారావు, జ్వాలాముఖి, చెరబండరాజు, నగ్నముని, నిఖిలేశ్వర్, భైరవయ్య, మహాస్వప్న, వేగుంట మోహన్‌ప్రసాద్, కె శివారెడ్డి, దేవీప్రియ, శివసాగర్, వరవరరావు, లోచన్, బొజ్జా తారకం, టంకశాల అశోక్, ఎన్ గోపీ, అమ్మంగి వేణుగోపాల్, నందిని సిధారెడ్డి, గుడిహాళం రఘునాథం, పాపినేని శివశంకర్, ఎన్‌కె, కె. రాంమోహన్ రాజు, గద్దర్, అల్లం వీరయ్య, అల్లం నారాయణ, హెచ్చార్కె, విమల... ఆ జాబితాకు అంతులేదు.

"కవిత్వం పత్రిక అనుకునేంత విరివిగా 'సృజన'లో కవితలు ప్రచురించబడ్డాయి" అని ఆ ఎంపిక చేసిన కవితలకు రాసిన ముందుమాటలో రాశాం. నిజంగానే ఆధునిక కవిత్వం కోసమే ప్రారంభమై నాలుగైదు సంచికలతో ఆగిపోయిన 'నవత' తర్వాత 'సృజన' ఆలోచన ప్రారంభమయింది. వ్యవస్థాపక సాహితీమిత్రులు నలుగురిలో ఇద్దరు అప్పటికే కవులు. 'ఇటువంటి పత్రిక గురించి ఆలోచిస్తున్నాం' అని వాళ్లు దేవరకొండ బాలగంగాధర తిలక్‌తో పంచుకున్నప్పుడు, ఆయన ప్రోత్సహించడం మాత్రమే కాదు, "ఒక బ్రాడ్ బేస్డ్ స్టాండర్డ్ ఆఫ్ లిటరేచర్‌కు మనం ఒక ఇన్సెంటివ్‌నీ, ఒక ఫోరమ్‌నీ కల్పించాలి" అని రాశారు. అందుకే 'సృజన' ఆధునిక సాహిత్య వేదిక అయింది. కొద్ది నెలల్లోనే తిలక్ మరణించడంతో, 'సృజన' తొలి సంచికే తిలక్ సంస్మరణ సంచికగా, కాళోజీ ప్రచురణకర్తగా వెలువడింది. అప్పటి నుంచి తర్వాతి నాలుగు సంవత్సరాలలో వెలువడిన పదహారు సంచికల్లో కూడ కవిత్వం చాల ఎక్కువ వెలువడింది. కొన్ని సంచికలలో 20–25 కవితలు కూడ వచ్చాయంటే కవిత్వానికి 'సృజన' ఇచ్చిన ప్రాధాన్యత అర్థమవుతుంది.

అంతేకాదు, ముఖపత్రం మీద కవిత అచ్చువేసే సంప్రదాయాన్ని కూడ 'సృజన' మూడో సంచిక (మే 1967) నుంచే మొదలుపెట్టింది. నూరో సంచిక కవిత్వ ముందుమాటలో చెప్పుకున్నట్టు, "అప్పటికింకా పదహారు సంవత్సరాల కుర్రవాడు" జి ఎమ్ చంద్రం 'రక్తచలన సంగీత శ్రుతి' అనే కవితతో " 'సృజన' కవిత్వంలో ఓ కుదుపుకు" కారణమయ్యాడు.

"నా నెత్తురు వాడికత్తి
నా బ్రతుకు కన్నీటి వొత్తి" అని ప్రారంభమయ్యే ఆ కవిత,
"నాలోని వెలుగుతో
ఈ నీడ చెరపి
నా నెత్తుటి వాడితో
ఈ వ్రణము చీల్చి
రక్త చలన సంగీత శ్రుతి
రేపు వినిపిస్తాను
నేను భవిష్యత్తు మనిషిని
రేపు కనిపిస్తాను" అని గొప్ప ఆశలో ముగుస్తుంది. ఆ తర్వాతంతా 'సృజన' జీవితంలోనూ, సమాజంలోనూ ఆ ఆశావహ దృష్టిని ఎత్తిపట్టే కవిత్వాన్నే ప్రచురించింది. తెలుగు కవిత్వంలో కొత్త గాలులన్నిటికీ వేదిక కల్పించింది. దిగంబర కవులనూ, వేగుంట మోహన్ ప్రసాద్‌నూ ప్రచురించింది. తిరుగబడు కవుల్లో అత్యధికులు 'సృజన' కవులే. పదో సంచిక (ఫిబ్రవరి 1969) ముఖచిత్రం మీద లోచన్ 'ట్రిగ్గర్ మీద వేళ్లతో' అచ్చువేసి అప్పటికే శ్రీకాకుళంలో రగులుతున్న విప్లవోద్యమానికి ఆహ్వానం పలికింది. ఆ తర్వాత విశాఖపట్నంలో

శ్రీశ్రీ షష్టిపూర్తి, హైదరాబాదులో అభ్యుదయ సాహితీ సదస్సు, బహిష్కరణ, విప్లవ రచయితల సంఘం ఏర్పాటు నుంచి ఎమర్జెన్సీ అనంతరం 'అరుణతార' ప్రారంభమయ్యేదాకా విప్లవ కవిత్వానికి 'సృజన' పర్యాయపదంగా నిలిచింది.

అందుకే నూరో సంచికలో 'రక్తచలన సంగీత శ్రుతి'తో ప్రారంభించి పది కవితలు, రెండు అనువాద కవితలు, ఐదు పాటలు అచ్చువేశాం. ముప్పై సంవత్సరాలు గడిచాక ఇప్పుడు ఆలోచిస్తుంటే ఆ ఎంపిక పూర్తిగా విప్లవ కవిత్వంతో మాత్రమే నిండిందని, 'సృజన' మొదటి 99 సంచికలలో కనిపించిన బహుళత్వాన్ని సూచించేలా లేదేమోనని అనిపిస్తున్నది.

సరే, అది కాలపరిణామంలో వచ్చిన ఆలోచన. కాని 'సృజన' కవిత్వాన్ని అవలోకించినప్పుడు నాకు కనిపించిన, నా కవిత్వ ములాఖాత్‌లలో భాగమైన కొన్ని అంశాలు పంచుకోవాలి:

నాలుగో సంచిక (ఆగస్ట్ 1967) లో ఇస్మాయిల్ 'భగ్నకామం' కవిత అచ్చయింది. పన్నెండు పాదాల ఆ కవిత ఇస్మాయిల్ కవిత్వ పద్ధతికి ఒక ప్రాతినిధ్య కవిత కాగా, ఆ కవిత ఒక కాలమ్‌లో వేసి, దాని పక్కనే మరొక కాలమ్‌లో ఇస్మాయిల్ రాసిన మాటలు వేశారు. ఆ మాటలు ఇవాల్టికీ ప్రతి కవీ, రచయితా తమ రచనల గురించి ఆలోచించుకోవలసినవి: "నేను చాలా స్లో రచయితని. కాయితం మీద దిగే నా ప్రతి మాటకీ దాదాపు కష్ట ప్రసవమే. నేను రాయబోయే విషయం, మాట అంతకు ముందే ఎవరైనా చెప్పేసి వున్నారేమో అనే సందేహం, నేను నాదిగా చెప్తున్న మాట సూటిగా స్పష్టంగా వస్తున్నదా అనే భయం నేనేం రాస్తున్నా కలుగుతుంటాయ్. ఈ సందేహ భయాలు నేను రాసినవాటిని హాంపర్ చేశాయనడం కంటె, కొంతవరకైనా సెన్సిబుల్‌గా తయారుచేశాయనే హంబుల్ ఒపీనియన్ వుంది నాకు. ఈ అభిప్రాయానికి మీలాంటి గుడ్ రీడర్స్ గీటురాళ్లు...." అని ఆయన రాశారు. ఇటువంటి ఆణిముత్యాలు ఎన్ని దొరుకుతాయో 'సృజన' పాత సంచికల్లో. ఆ నాలుగు నెలలూ వాటిని పుక్కిట పట్టడమే నా పని.

ఇక తెలుగు కవిత్వ రచన అభివృద్ధికి 'సృజన' తన వంతుగా చేసిన మరొక దోహదం గురించి కూడ చెప్పుకోవాలి. 'సృజన' ఐదో సంచిక (నవంబర్ 1967) లో "కళాశాల విద్యార్థులకు మాత్రమే" అంటూ వచన కవితా రచన పోటీ నిర్వహించింది. 'సృజన' తన మనుగడకు పునాదులుగా తొలినుంచీ ప్రకటించుకున్న శాస్త్రీయ దృక్పథం, ప్రయోగదృష్టి, సమకాలీన సామాజిక స్పృహలతో పాటు ఈ కవితా పోటీకి కొత్తదనమూ, మౌలికతా, జీవమూ అనే అంశాలు కూడ కొలమానాలుగా పెట్టారు. రాష్ట్రంలోని అన్ని కళాశాలల విద్యార్థుల నుంచి డెబ్బై కవితలు ఈ పోటీకి వచ్చాయి. అప్పటికి ఉస్మానియా ఆర్ట్స్ కాలేజిలో ఎంఎ ప్రథమ చదువుతున్న అమ్మంగి వేణుగోపాల్ 'చీకటిలో బ్రతుకు నీడ' ఉత్తమ కవితగా, అదే కాలేజిలో బి ఎ ప్రథమ చదువుతున్న ఎన్ గోపీ 'కత్తి కార్చిన కన్నీరు' ప్రత్యేక బహుమతి కవితగా, ఆంధ్ర విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ విద్యార్థి 'ప్రకాశకుమార' 'పల్లవిస్తున్న వసంతం',

శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ కళాశాల, తిరుపతి విద్వాన్ విద్యార్థి ఎస్ నారాయణ చౌదరి 'అగ్ని పంజరం', నిజామాబాద్ కళాశాల పియుసి విద్యార్థి అమృతలత 'కూలి' ప్రచురణార్హమైన కవితలుగా నిర్ణయించారు. వీరిలో అమ్మంగి వేణుగోపాల్, ఎన్ గోపీ ఆ తర్వాత ఎంత ప్రముఖ కవులుగా ఎదిగారో అందరికీ తెలిసిందే. ఎస్ నారాయణ చౌదరి సింగమనేని నారాయణగా మారి కవిత్వం వదిలేసినట్టున్నారు గాని కథకుడుగా, విమర్శకుడుగా, వక్తగా ప్రముఖులయ్యారు. అమృతలత ఇప్పటికీ కవిత్వం, కథలు రాస్తున్నారు.

తెలుగు సాహిత్య పత్రికలలో విరివిగా కవిత్వానువాదాలు ప్రారంభించినది కూడ సృజనే. తొమ్మిదో సంచిక (నవంబర్ 1969) భారతీయ సాహిత్య పరామర్శ పేరుతో అనేక భారతీయ భాషల సాహిత్యం గురించి, కవిత్వం గురించి పరిచయ వ్యాసాలతో పాటు 17 భాషలకు చెందిన 21 కవితల అనువాదాలు ప్రచురించింది. ఇతర భాషల కవిత్వాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేసే ఈ ఆనవాయితీ 1992లో పత్రిక ఆగిపోయేవరకూ నిర్విరామంగా కొనసాగింది. 'సృజన'లో ఇతర భాషల కవితల అనువాదాలు కనీసం రెండు వందలైనా వచ్చి ఉంటాయి.

ఇక కవితా సంపుటాల సమీక్షల విషయంలో కూడ 'సృజన' తొలిరోజుల్లో చాల శ్రద్ధ తీసుకున్నది. ఒక్కొక్క కవి మీద, కవితాసంపుటం మీద చాల వివరమైన, సమగ్రమైన సమీక్షలు వచ్చాయి. శ్రీశ్రీ 'ఖడ్గసృష్టి' మీద బైటి పత్రికల్లో వచ్చిన సమీక్షలను సమీక్షిస్తూ కె వి రమణారెడ్డి రాసిన వ్యాసం మీద చర్చోపచర్చలు జరిగి 'ఖడ్గసృష్టి సమీక్షాసమీక్షాసమీక్షా సమీక్ష' అని వేయవలసి వచ్చింది. అలాగే వచన కవిత అనాలా, ముక్త కవిత అనాలా, స్వచ్ఛంద కవిత అనాలా అని ఫ్రీవర్స్ ప్రక్రియ మీద చాల ఆలోచనాత్మకమైన చర్చ జరిగింది.

ఈ సందర్భంలోనే కవిత్వానికి సంబంధించిన కొన్ని హాస్యస్ఫోరకమైన సంగతులు కూడ పంచుకోవాలి. 'కొత్త చిగుళ్లు' కవితా సంపుటాన్ని సమీక్షిస్తూ "చిగుళ్లేనా, కొత్తవా?" అనీ, 'ఘృణి' కవితా సంపుటాన్ని సమీక్షిస్తూ "ఎంత గొట్టు పేరు?" అనీ, 'సైరన్' కవితా సంపుటాన్ని సమీక్షిస్తూ "కూతరాని సైరన్" అనీ శీర్షికలు పెట్టడంలో ఇప్పుడు ఆలోచిస్తే కాస్త కరుకుదనం ఉందనిపిస్తుంది గాని ఆ వేడిలో ఆ శీర్షికలు ఎలా పేలాయో, ఎంత పాఠకాదరణ పొందాయో...

ఇక ఒక కవితా సంపుటం సమీక్ష సందర్భంలో 'సృజన'లో జరిగిన ఒక చమత్కారం చెప్పాలి. అప్పటికే సామాజిక ఉద్యమ నాయకుడిగా పేరుపొందిన ఒక కవి కవితా సంపుటం 'సృజన'కు సమీక్షకు వచ్చింది. దాదాపు నూట ఇరవై పేజీల కవిత్వం పుస్తకంలో నలభై పేజీలపైన ముగ్గురు ఉద్ధండులైన సాహిత్య విమర్శకుల ముందుమాటలున్నాయి. ఆ కవి, కవిత్వం, ముందుమాటల రచయితల ప్రాధాన్యత దృష్ట్యా ఆ పుస్తకాన్ని సమీక్ష కోసం త్రిపురనేని మధుసూదనరావుకు పంపాం. ఆయన తనకు సహజమైన ఫూల్‌స్కేప్ రూల్డ్ కాగితాల మీద

పెద్ద పెద్ద అక్షరాలతో దాదాపు ముప్పై పేజీల సమీక్ష పంపారు. సాహితీమిత్రుల సమావేశంలో చదువుతున్నాం. మొదటి పది పేజీలు ఒక ముందుమాట చర్చ, తర్వాతి పది పేజీలు రెండో ముందుమాట చర్చ, చివరి పది పేజీలు మూడో ముందుమాట చర్చ. చివరి వాక్యం "ఇక ...... కవిత్వం గురించి చెప్పడానికేమీ లేదు."

ఆ చివరి వాక్యం చదివి హతాశులమయ్యాం. ఏ కవిత్వ పుస్తకం మీద సమీక్ష చేస్తున్నారో ఆ కవిత్వం గురించి ఏమీ మాట్లాడకుండా ఇలా ఎలా అనుకుని ఆ మాటే ఆయనకు రాశాం. 'కవిత్వం మీద కూడ సమీక్ష రాసి పంపితే అది కలిపి అచ్చువేస్తాం' అని. తిరుగుటపాలో ఆయన నుంచి ఒక కార్డ్ వచ్చింది. "అయితే ఆ చివరి వాక్యం తీసేయండి" అని!

# న్యూయార్క్ నట్టనడివీధిలో కవిత్వం

కవిత్వంతో నా ములాఖాత్‌లలో 1979-82 కాలం ఎంత కిక్కిరిసిన అనుభవాల, ఉద్వేగాల సందోహ సమయమంటే కనీసం ఒక డజను గుర్తించదగిన సందర్భాల జ్ఞాపకాలు నేనంటే నేనని తోసుకొస్తున్నాయి. నా యవ్వన ప్రారంభ వికాసాలను, వాటితో ముడిబడిన కవిత్వ సమాగమ సంరంభాన్ని మూడు దశాబ్దాలు దాటిన తర్వాత ఇప్పుడు తవ్వి తీస్తుంటే నాకే తెలియకుండా దాగిపోయిన మణులెన్నో బయటపడుతున్నాయి. వాటిలో లీనమై అనుభవిస్తున్నప్పుడు వాటి ప్రాధాన్యత గుర్తించి ఉండను, అవి అతి సాధారణమైన అనుభవాలే అనుకుని ఉంటాను గాని, ఇప్పుడు స్థలంలో కాలంలో ఇంత గడిచివచ్చాక, పురాస్మృతిలో, గతంతో సంభాషిస్తున్న వర్తమానంలో ఆ మహత్తర కాలపు అద్భుతత్వం తెలిసివస్తున్నది.

ఆ సందర్భాల సాంద్రత వల్లా, ఉరవడి వల్లా, అవి ప్రస్తుతం నాలో కలిగిస్తున్న గాఢమైన ఆనంద విషాద సంభ్రమ ఉద్వేగాల వల్లా ఏది రాయబోయినా ఒక కంట కన్నీరు, మరొక కంట వెలుగుల జడి రాలుతున్నాయి. ఏ సందర్భం ఎలా రాయాలో తేల్చుకోలేకపోతున్నాను. ఆ విచికిత్సలో జ్ఞాపకాలూ కాలక్రమమూ అటూ ఇటూ అవుతాయేమో, క్షమించాలి.

ముప్పై ఐదు సంవత్సరాల కింద పునాది పడి ఎదుగుతూ ఎదుగుతూ వచ్చి 2008లో న్యూయార్క్ వీథుల్లో వ్యక్తమైన ఒకానొక కవిత్వ ములాఖాత్ ఈసారి పంచుకుంటున్నాను. తెహెల్కా ఇంగ్లిష్ వారపత్రిక నిర్వహించే 'పర్సనల్ హిస్టరీస్' శీర్షికలో 2009 అక్టోబర్ 10 సంచికలో నా ఈ రచన అచ్చయింది గాని తెలుగు పాఠకుల కోసం, కవిత్వంతో ములాఖాత్ శీర్షికలో ఆ అనుభవపు ఔచిత్యం దృష్ట్యా మళ్లీ రాస్తున్నాను.

1979 జూలైలో పంజాబ్ విద్యార్థి సంఘం కార్యదర్శి ప్రీతిపాల్ సింగ్ రణధవాను

మతోన్మాద గూండాలు హత్య చేశారు. ఆయన వ్యవసాయశాస్త్ర పట్టభద్రుడు. పంజాబ్ లో అప్పటికి బలంగా ఉండిన విప్లవ విద్యార్థి యువజన ఉద్యమ నాయకుడు. రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలు కావాలనీ, రాష్ట్ర ప్రభుత్వాల మీద కేంద్ర ప్రభుత్వ నిరంకుశత్వం తగ్గాలనీ, దేశ పాలనలో నిజమైన సమాఖ్య స్వభావం వెల్లివిరియాలనీ ఆనందపూర్ సాహిబ్ తీర్మానం (1973) నాటినుంచీ సాగుతున్న ప్రజాస్వామిక ఆకాంక్షల వ్యక్తీకరణ ఒకవైపు ఉండగానే, పంజాబ్‌లో ఈ న్యాయమైన ఆకాంక్షలను తమ ప్రయోజనాలకు అనుగుణంగా వాడుకోవడానికి మతోన్మాదశక్తులు, నయాసంపన్న శక్తులు, విదేశీ శక్తులు ప్రయత్నాలు ప్రారంభించాయి. అలా పెచ్చరిల్లిన మతోన్మాద శక్తులు నిజమైన ప్రజా ఉద్యమ గళాలను ఉత్తరించడానికి చేసిన ప్రయత్నాలలో భాగమే రణధవా హత్య. అప్పటికి ఇక్కడ విద్యార్థి ఉద్యమంలోనూ, రచనలోనూ ఉన్నాను గనుక 'సృజన' సెప్టెంబర్ 1979 సంచికలో మన విద్యార్థి నాయకుడు జార్జిరెడ్డి హత్యనూ, రణధవా హత్యనూ పోలుస్తూ, రణధవా కృషిని వివరిస్తూ ఏడెనిమిది పేజీల వ్యాసం రాశాను. అప్పటినుంచీ పంజాబ్ ప్రజా ఉద్యమాలు నాకొక ప్రధాన ఆసక్తికర విషయం అయిపోయాయి. పంజాబ్ గురించి చదవడమూ, రాయడమూ, సంపన్నమైన పంజాబీ కవిత్వాన్ని ఇంగ్లిష్‌లో చదివి అబ్బురపడుతూ, కొన్నిటినైనా తెలుగు చేయడమూ జరుగుతూ వచ్చాయి.

పది సంవత్సరాల తర్వాత అత్యద్భుతమైన పంజాబీ కవి అవతార్ సింగ్ పాష్‌ను మతోన్మాదశక్తులు హత్య చేశాయి. పాష్ కవిత్వం అంతకు ముందూ, ఆ తర్వాతా కూడ తెలుగు చేశాను. అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి సభల్లో, సమావేశాల్లో పంజాబ్ నుంచి వచ్చిన మిత్రుల ద్వారా పరిచయమైన మరొక అద్భుతమైన కవి-గాయకుడు సంత్ రామ్ ఉదాసీ. నలభై ఏడు సంవత్సరాలకే, 1986లో చనిపోయిన సంత్ రామ్ ఉదాసీ స్వరం కాసెట్లలో వింటుంటే, ఆ భాష అర్థం కాకపోయినా నరాల్లో నెత్తురు పోట్లెత్తేది.

పంజాబ్ ప్రజా ఉద్యమాలతో, పంజాబీ కవిత్వంతో ఈ పరిచయం, సాన్నిహిత్యం 1990ల తర్వాత, మరీ ముఖ్యంగా 2000లలో నావరకు నాకు తగ్గిందనే చెప్పాలి. కాని హఠాత్తుగా ఆ కవిత్వం 2008లో న్యూయార్క్ లో నన్ను ఆవహించి, కౌగిలించుకుని, ముంచెత్తి, ముప్పై సంవత్సరాల అంతరాంతర జ్ఞాపకాల తుట్టెను కదిలించింది.

2008 మే 23న కవిమిత్రుడు నారాయణ స్వామితో కలిసి నా సహచరి వనజా, నేనూ న్యూయార్క్ నగరం చూడడానికి బయలుదేరాం. న్యూయార్క్‌లో 'గ్రీన్‌విచ్ విలేజ్ వాకింగ్ టూర్' అని ఒక అసాధారణమైన కవిత్వ-సాహిత్య పాదయాత్ర ఉంటుంది. కవి-గాయకుడు బాబ్ డిలాన్ తన పందొమ్మిదో ఏట తన మొదటి పాట పాడిన స్థలం, 1930ల కవి డైలాన్ థామస్ అతి తరచుగా వస్తుండిన పానశాల, జేమ్స్ ఫెన్నిమోర్ కూపర్, లూయిసా మే ఆల్కాట్, జాక్ లండన్, అప్టన్ సింక్లేర్, థియొడర్ డ్రీజర్, సింక్లేర్ లూయిస్, యూజినీ ఓనీల్, హెర్మన్ మెల్విల్, జాన్ రీడ్ వంటి సుప్రసిద్ధ కథకులు, నవలాకారులు, నాటకకర్తలు,

పాత్రికేయులు నివసించిన ఇళ్లూ, కూచున్న చోట్లూ, రాసిన చోట్లూ, మాట్లాడిన చోట్లూ, రచనలు వినిపించిన చోట్లూ అన్నీ గుర్తు పెట్టి, అక్కడ సమాచారం రాసిపెట్టి, జ్ఞాపికలు కూడ అమ్మే పాదయాత్ర అది. ఆ కవుల గురించీ, సాహిత్యకారుల గురించీ మాట్లాడుకుంటూ, మన మహాకవుల జీవిత స్థలాలకైనా ఇటువంటి అవకాశం ఎప్పుడొస్తుందో అని విచారపడుతూ మేం మూడు నాలుగు గంటలు అక్కడ తిరిగాం. చివరికి ట్వెల్త్ స్ట్రీట్ మీద న్యూ స్కూల్ అనే సామాజిక పరిశోధనా విద్యా సంస్థ కూడ చూసి, అక్కడి నుంచి వెస్ట్ స్ట్రీట్ మీద ఉన్న ప్రగతిశీల ఆలోచనా కేంద్రం బ్రెష్ట్ ఫోరమ్ కు వెళ్లడానికి రోడ్డు మీద కనబడిన టాక్సీని పిలిచాం.

టాక్సీలో కూచుంటూ రిజిస్ట్రేషన్ ప్లేట్ చూశాను. డ్రైవర్ పేరు రామ్మోహన్ పుని. "ఓహ్ మీరు ఇండియనా" అని అడిగాను. "ఔను, పంజాబీని" అన్నాడాయన. మేం బ్రెష్ట్ ఫోరం వెళ్తున్నది న్యూయార్క్‌లోని టాక్సీ డ్రైవర్లను న్యూయార్క్ టాక్సీ వర్కర్స్ అలయన్స్ అనే బలమైన సంఘంలోకి సమీకరించిన, 'కాబ్స్ అండ్ కాపిటలిజం ఇన్ న్యూయార్క్ సిటీ' అనే పుస్తకం రాసిన మార్క్సిస్టు మేధావి బిజూ మాథ్యూను కలవడానికి. ఆయన మొదట హైదరాబాదీ. కొన్ని సంవత్సరాలుగా మిత్రుడు. "బిజూ మాథ్యూ తెలుసా" అని రామ్మోహన్‌ను అడిగాను. "ఓహ్ ఆ లెఫ్టిస్టా? యూనియనిస్టు కదా. పేరు విన్నాను. ఎప్పుడూ కలవలేదు" అన్నాడు.

అలా మాట మీద మాట కలిసింది. సంత్ రామ్ ఉదాసీ పాటలు తెలుసా అని అడిగాను. నా ప్రశ్న ఇంకా పూర్తిగా నా పెదాలు దాటనేలేదు, రామ్మోహన్ ఆ పాటలు పాడడం మొదలెట్టాడు. పాట ముగించి, నాకు ఉదాసీ గురించి ఎలా తెలుసని అడిగాడు. నాకు పంజాబ్ ప్రజా ఉద్యమాలతో, కవిత్వంతో ఉన్న పరిచయం చెప్పాను. "1970ల్లో హత్యకు గురైన ఒక విద్యార్థి నాయకుడి గురించి నేను తెలుగులో ఒక వ్యాసం రాశాను" అని చెప్పాను. "ఎవరా నాయకుడు" అని నిర్ధారించుకోవడానికి అడిగినట్టు అడిగాడు. "ప్రీతిపాల్ సింగ్ రణధవా" అన్నాను.

నా మాట పూర్తయిందో లేదో, రామ్మోహన్ హఠాత్తుగా నడిరోడ్డు మీద కారు ఆపేశాడు. ఆ రోడ్డు మీద ఎక్కువ ట్రాఫిక్ లేదు గనుక మేం బతికిపోయాం. తనవైపు తలుపు తెరుచుకుని కిందికి దిగాడు. నన్ను బైటికి రమ్మన్నాడు. ఏం జరుగుతున్నదో నాకేమీ అర్థం కాలేదు. నేను బైటికి రాగానే నన్ను గట్టిగా కౌగిలించుకున్నాడు. పంజాబీలతో పరిచయం ఉన్న ఎవరికైనా వాళ్ల కౌగిలి ఎంత ఆర్ద్రంగా, గాఢంగా, ప్రేమపూర్వకంగా ఉంటుందో తెలుస్తుంది. ఆయన చెంపల మీద కన్నీటి ధారలు...

ఆ ఆత్మీయ బిగి కౌగిలి అయిపోయాక, నేనింకా ఆ సంభ్రమంలోంచి తేరుకోక ముందే కారు మళ్లీ బయల్దేరింది. "ప్రీతి నాకు చాల ప్రియమైన మిత్రుడు. హోషియార్‌పూర్ జిల్లాలో దసుయా గ్రామం వాళ్లది. పక్క గ్రామమే మాది. ఆయన నక్సలైట్ రాజకీయాలలో,

విద్యార్థి సంఘంలో ఉండేవాడు. నేనప్పుడు ఎస్ఎఫ్ఐలో ఉండేవాణ్ని. కాని పొరుగు గ్రామాల వాళ్లం గనుక మా ఇద్దరికీ మంచి స్నేహం ఉండేది. ఆయనను లూధియానాలో 1979లో అతి కిరాతకంగా చంపేశారు. నేను ఇరవై ఐదేళ్ల కింద పొట్ట చేతపట్టుకుని ఇక్కడికి వచ్చాను గాని నా మనసు ఇంకా ఆ గ్రామాల్లోనే తిరుగుతోంది. నా శరీరంలో ప్రతి కణమూ ప్రతి క్షణమూ పంజాబ్ కోసం పలవరిస్తోంది" అంటూ చిన్న పిల్లవాడిలా ఏడ్చాడు.

నేను పాష్ కవితలు కూడ అనువాదం చేశానని చెప్పాను. ఆ పేరు వినగానే విద్యుత్ ప్రేరణ పొందినట్టుగా పాష్ కవితలు చదవడం మొదలుపెట్టాడు. అన్నిటికన్న ప్రియమైన, సుప్రసిద్ధమైన 'సబ్ సె ఖతర్నాక్ హోతా హై' కవిత అలా చదివేశాడు.

తానూ పంజాబీలో కవిత్వం రాస్తానని చెప్పి ఆ కవితలు చదువుతూ వాటికి హిందీ, ఇంగ్లిష్ అర్థాలు చెప్పాడు. ప్రతి ఒక్క కవితలోనూ తల్లిని పోగొట్టుకున్న పిల్లవాడి వేదన. దూరదేశం వెళిపోయిన ప్రవాసి దుఃఖం. "ఇక్కడ ఉన్నది నా శరీరమే. నా మనసంతా అక్కడే" అనేదే ఆ కవితల అంతరార్థం. అప్పటికి పదిహేను సంవత్సరాలుగా న్యూజెర్సీలో ప్రవాసిగా, అటువంటి పురాస్మృతి కవిత్వమే రాస్తున్న నారాయణస్వామి తన కవిత్వం పంచుకున్నాడు. న్యూయార్క్ వీథుల్లో ఆ టాక్సీ ఒక కవితాగానపు వేదికగా మారింది. 'సబ్ సె ఖతర్నాక్ హోతాహై హమారే సపోన్ం కా మర్నా' (మన కలలు చనిపోవడం అన్నిటికన్న ప్రమాదకరం) అని పాష్‌తో గొంతు కలిపి ఒక పంజాబీ కవీ, ఒక తెలుగు కవీ పాడుతున్నట్టనిపించింది.

బ్రెడ్డ్ ఫోరం వచ్చింది గాని రామ్మోహన్‌కు మమ్మల్ని వదలాలని లేదు. మేం దిగగానే మరెవరో వచ్చి ఇంకెక్కడికో రమ్మంటే వాళ్లను లెక్కచేయలేదు. ఇంకో టాక్సీ చూసుకోండి అన్నట్టు సైగ చేశాడు. వాషింగ్టన్ స్ట్రీట్ అనే ఆ రోడ్డు పక్కన, బెథూన్ స్ట్రీట్‌కూ బ్యాంక్ స్ట్రీట్‌కూ మధ్య కారు ఆపేసి మాతో కవిత్వ సంభాషణ కొనసాగించాడు.

కవిత్వం ఎక్కడెక్కడి వాళ్లను కలుపుతుంది!
కవిత్వం ఎప్పటెప్పటి వాళ్లను కలుపుతుంది!
కవిత్వం ఎప్పుడో మరణించిన మనుషులను కూడ ఎట్లా పునర్జీవింపజేస్తుంది!
కవిత్వం ఎంతెంత పురాస్మృతులను నవనవోన్మేషం చేస్తుంది!

# "నువ్వా? ప్రేమ కవిత్వమా?!"

వరంగల్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజిలో బి ఎ మూడు సంవత్సరాల చదువూ ఒక ఎడతెగని కవిత్వ ములాఖాత్. ఆ నిరంతర అనుభవాల ఉద్వేగాల గనిలోంచి ఏ ములాఖాత్‌లు

తవ్వాలో, ఏవి ముందు చెప్పాలో తబ్బిబ్బు పడుతున్నాను. ముప్పై ఐదు సంవత్సరాల కిందటి జ్ఞాపకాలు గనుక నిర్దిష్ట స్థలాలూ కాలాలూ కాలపు జల్లెడలోంచి ఏవి జారిపోయాయో, ఎంత మారిపోయాయో, ఏవి మిగిలాయో కూడ కచ్చితంగా చెప్పలేను. అవి అటూ ఇటూ కూడ కావచ్చు. కాని కనీసం రెండు మూడు ములాఖాత్‌ల జ్ఞాపకాలైనా చెప్పాలి.

ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి దానికదే ఒక అద్భుతం. బహుశా ఎవరి అల్మా మాటర్ వారికి కన్నతల్లి అంత మధురంగా, అందంగా, ఆత్మీయంగా, అసాధారణంగా కనిపిస్తుందేమో గాని మా అల్మా మాటర్ నిజంగానే అద్భుతమైనది. దాని చరిత్రే ఒక కవిత్వ సందర్భం. నిజాం ప్రభుత్వం 1927లో ఏర్పరచిన కాలేజియేట్ హైస్కూల్, తర్వాత ఇంటర్మీడియట్ కాలేజిగా, ఆ తర్వాత ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజిగా మారింది. వరంగల్ ప్రజా జీవితంలో మాత్రమే కాదు, తెలంగాణలో, ఆంధ్రప్రదేశ్‌లో ప్రముఖులైన ఎందరో ఆ కాలేజి ప్రాంగణంలోనే తమ తొలి యవ్వన దినాలు గడిపారు. పివి నరసింహారావు, కాళోజీ, టి కృష్ణ, చుక్కా రామయ్య, కె జయశంకర్, నేరెళ్ల వేణుమాధవ్, సి రాఘవాచారి, కోవెల సుప్రసన్నాచార్య, పేర్వారం జగన్నాథం, వరవరరావు, అంపశయ్య నవీన్ వంటి ప్రముఖులెందరో చదువుకున్న, దూపాటి వెంకటరమణాచార్యులు, రాయప్రోలు సుబ్బారావు, రావాడ సత్యనారాయణ, బారు వెంకట రామనరసు, చెలమచెర్ల రంగాచార్యులు, ఖండవల్లి బాలేందుశేఖరం, పిజి లాలే, ఇరివెంటి కృష్ణమూర్తి, జి వి సుబ్రహ్మణ్యం, ఇజాక్ సెక్వేరా, కేశవరావు జాదవ్, కె ఎస్ ఉపాధ్యాయ, బిరుదురాజు రామరాజు, జి హరగోపాల్ వంటి మహామహులెందరో పాఠాలు చెప్పిన కాలేజి అని మాకు గర్వంగా ఉండేది.

ఆ కాలేజిలో చేరేటప్పటికే కవిత్వమూ వ్యాసాలూ రాస్తున్నాను, అనువాదాలు ప్రారంభించాను, ఒక సాహిత్య పత్రిక నిర్వహించే బృందంలో ఉన్నాను, రాడికల్ విద్యార్థి సంఘం కార్యకర్తగా ఉన్నాను గనుక బహుశా స్వాతిశయంతో ఉండి ఉంటాను. కాలేజి ఘనచరిత్రకూ నా వ్యక్తిగత స్వాతిశయానికీ కూడ లంకె కుదిరి ఉంటుంది. మామూలు మాటల్లో చెప్పాలంటే కాస్త పొగరుగా, ఉండవలసినదానికన్న ఎక్కువ ఆత్మవిశ్వాసంతో ఉన్నానన్నమాట. ఇప్పుడు వెనక్కి తిరిగి ఆలోచిస్తే అలా ఉండకపోవలసిందేమో అనిపిస్తుంది గాని, ఇ ఎచ్ కార్ అన్నట్టు యు కెనాట్ క్రాస్ ఎగ్జామిన్ ది డెడ్! ఇంతకూ చెప్పవచ్చేదేమంటే, ఆ అతిశయాన్ని తగ్గించి, కాస్త వినయం ఇచ్చి, నన్ను సమూహంలో ఒకడిగా మార్చినవి కవిత్వాసక్తీ, సాహిత్యాసక్తీ, అద్భుతమైన ఆర్ట్స్ కాలేజి గ్రంథాలయమూ, అంతకన్న అద్భుతమైన లెక్చరర్లూ, పరమాద్భుతమైన విద్యార్థి రాజకీయాలూ.

ఆ తర్వాత 'కొమ్రన్న'గా, బహుజన కవిగా, సిద్ధాంతకర్తగా సుప్రసిద్ధుడై, కొద్ది సంవత్సరాల కింద అకాలంగా మరణించిన కేసరాజు కొమరయ్య నాకు సీనియర్. అప్పటికే ఆయన కవి. మా కాలేజి మాగజైన్ 'జ్యోతి' సంపాదకుడుగా, సాహిత్య కార్యదర్శిగా, సాంస్కృతిక

కార్యదర్శిగా పనిచేశాడు. ఆయన సహాధ్యాయి, నిశితమైన విమర్శకుడు, ఆలోచనాపరుడు రాంపెల్లి సత్యనారాయణ, సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలలో ఎప్పుడూ అగ్రభాగాన ఉండే పొట్లపల్లి వరప్రసాద రావులతో రెండు సంవత్సరాలు చాల సన్నిహితంగా గడిపే, కవిత్వమూ సాహిత్యమూ పంచుకునే అవకాశం నాకు ఆర్ట్స్ కాలేజిలోనే దక్కింది. అలాగే, అప్పటికే కవిత్వం రాయడం ప్రారంభించిన ఎ కృష్ణారావు (కృష్ణుడు), పొట్లపల్లి శ్రీనివాసరావు, అనిశెట్టి రజిత, అప్పటికే నేరెళ్ల వేణుమాధవ్ శిష్యుడుగా రాష్ట్రమంతటా ప్రదర్శనలు ఇస్తున్న మిమిక్రీ శ్రీనివాస్, సాంస్కృతిక కార్యకర్తగా, గాయకుడిగా ఉండిన శ్రీనివాసరెడ్డి, అప్పుడు ఎఐఎస్ఎఫ్ నాయకులుగా ఉండి, ఆ తర్వాత పార్లమెంటు సభ్యుడైన బి వినోద్ కుమార్, శాసనసభ్యుడైన పి సారయ్య, మా బంధువులూ, నాతో ఆ మూడు సంవత్సరాలూ సమస్తమూ పంచుకున్న మిత్రులూ కృష్ణ, హరి, సన్నిహిత మిత్రులు యాకయ్య, సమ్మిరెడ్డి, వెంకటరమణ, మీరస్వామి, రమేశ్, 'చాంద్ జైసే ముఖ్డే పె బిందియా సితారా' లాంటి పాటలను అత్యంత మధురంగా పాడే శ్రీధర్, 'మౌనమె నీ భాష ఓ మూగ మనసా' అని నిరంతరం గున్గునాయిస్తుండే నవీన్ వంటి వాళ్లెందరో సహాధ్యాయులుగా, జూనియర్లుగా గొప్ప సాహిత్య, సాంస్కృతిక, రాజకీయ స్నేహభరిత వాతావరణం చుట్టూ ఉండేది. పద్దెనిమిది – ఇరవై ఏళ్ల వయసులోని ఆ నవయవ్వన తేజం ఎంత కవితాత్మకమైనది!

మూడు నాలుగు విద్యార్థి సంఘాలు కాలేజిలో బలంగా ఉండడం మాత్రమే కాక, కనీసం వారానికొకసారి కాలేజి ఎంట్రెన్స్ దగ్గర విద్యార్థుల సమస్యల మీదనో, ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ సమస్యల మీదనో తమ అవగాహన ప్రకటించే పోస్టర్లు వేస్తుండేవి. ఒకరి పోస్టర్ మీద మరొకరి పోస్టర్‌లో చర్చలూ విమర్శలూ వివాదాలూ ఉండేవి. రాడికల్ విద్యార్థి సంఘం వేసే 'రాడికల్ వాయిస్' రాసే పని నాది గనుక సంఘ అవగాహనలను సాధారణ విద్యార్థులకు అర్థమయ్యేలా రాయడంలో, ప్రత్యర్థుల అవగాహనలతో వాదించడంలో, ఆకర్షణీయంగా ఉండడానికి కవితా పంక్తులు ఉటంకించడంలో, కవిత్వ భాష వాడడంలో ఆ మూడు సంవత్సరాలూ అపురూపమైన తర్ఫీదు పొందాను. అప్పటి ఆర్ఎస్‌యు సహచరులలో ఒకరైన పైళ్ల వెంకటరమణ విప్లవోద్యమంలోకి వెళ్లి అమరుడై కవితావస్తువై ఇప్పటికీ ఆర్ద్ర జ్ఞాపకంగా ఉన్నాడు.

ఆ మూడు సంవత్సరాలలో ఇంగ్లిషు కవిత్వం, నాటకం చెప్పిన జగన్మోహనాచారి గురించి మరింత వివరంగా మరొకసారి చెపుతాను గాని, ఇంగ్లిషు వచనం చెప్పిన వినోద, తెలుగు కవిత్వం చెప్పిన పేర్వారం జగన్నాథం, నవల, నాటకం చెప్పిన కాత్యాయనీ విద్మహే ఆ ప్రభావాస్పదమైన వయసులో వేసిన ముద్రలు ప్రగాఢమైనవి. పేర్వారం జగన్నాథం చెప్పిన జాషువా 'పిరదౌసి' కావ్యం ఆధారంగానే, మొత్తంగా జాషువా కవిత్వం చదవడానికి దారి దొరికింది. కాత్యాయని చెప్పిన 'మాభూమి' నాటకం, 'రాబందులు రామచిలుకలు' నవల

సమాజ సాహిత్య సంబంధాల అవగాహనను పెంచాయి. ఇంగ్లిషు వచన రచనలనూ, కొంత కవిత్వాన్నీ చెప్పిన వినోద ఉచ్చారణే కవిత్వం పట్ల ఆకర్షణ కలిగించేది. రెండో సంవత్సరం లోనో, మూడో సంవత్సరంలోనో కాలేజి మాగజైన్ 'జ్యోతి'కి సంపాదకుడినయ్యాను. నలుగురైదుగురు మిత్రుల పేర్ల మీద కవితలూ, వ్యాసాలూ రాయడం, ఆ సంచికను ఒక విలువైన సంచికగా తీర్చిదిద్దడం, ఇతవరి కాత్యాయనీ విద్మహేతో, ఉపసంపాదకులు సారయ్య, శ్రీనివాసరెడ్డిలతో ఎడతెగని చర్చలు నిన్ననో మొన్ననో జరిగినట్టున్నాయి.

మా కాలేజికి 75 సంవత్సరాలు నిండిన సందర్భంగా 2002లో వెలువరించిన ప్లాటినమ్ జూబ్లీ సంబరాల సంచికలో, 'హృదయాంతరంగంలో నెమలీక' అనే వ్యాసంలో, "వ్యక్తిగతంగా, అత్యంత సన్నిహితంగా, ఆర్ట్స్ కాలేజి నా గుండె లోలోపల దాచుకున్న ఒక నెమలీక. ఆ వరండాలలో, ఆ చెట్ల కింద, సుబేదారి నుంచి ఆర్ట్స్ కాలేజి దాక ఆ రోడ్డు పక్కన నా తొలిప్రేమ అంకురించి, విస్తరించింది. ఒక సహాధ్యాయినిని రెండు సంవత్సరాల పాటు మౌనంగా ఇష్టపడడం, రెండో సంవత్సరం చివర వణికిపోయే ఉద్వేగంతో ఆ ఇష్టానికి మాటలు తొడగడం, అవతలి నుంచి అంగీకారాన్ని పొంది, ప్రేమ పారవశ్యంలో పుష్కిన్, ఫైజ్ అహ్మద్ ఫైజ్, కైఫీ ఆజ్మీలు నాకోసమే రాశారనుకోవడం. ఆ తర్వాత ఉస్మానియా ఆర్ట్స్ కాలేజి కారిడార్లలో ఆ ప్రేమ విఫలమయినా, ఈ గుండెను తొలిసారిగా రవరవలాడేలా చేసినదీ, రవరవలాడగా చూసినదీ నా అల్మా మాటర్ ఆర్ట్స్ కాలేజ్" అని రాశాను.

ఆ మూడు సంవత్సరాలలో చాల కవిత్వం రాశాను, అనువాదాలు చేశాను గాని వాటికన్న ముఖ్యంగా కవిత్వం ఎక్కువగా చదివాను. ఈ మూడు పనులూ కలగలిసిన ఒక అనుభవం గురించి ప్రత్యేకంగా చెప్పాలి:

ఆ అనుభవం కాలేజిలో జరిగిన సాహిత్య కార్యక్రమం సందర్భంగానో, ఆలిండియా రేడియో, హైదరాబాదు కేంద్రం నుంచి ప్రసారమైన మా కాలేజి విద్యార్థుల సాహిత్య కార్యక్రమం సందర్భంగానో గుర్తు రావడం లేదు. అప్పుడు మా కాలేజిలో మాథమాటిక్స్ లెక్చరర్‌గా ఉండిన ఎస్ఎస్‌విఎన్ శర్మ సాహిత్య ప్రియుడు. తన పేరును యశస్వి ఎన్ శర్మగా రాసుకుంటూ విద్యార్థులను సాహిత్య కార్యక్రమాల వైపు ఆకర్షిస్తూ, ఆలిండియా రేడియో వంటి చోట్లకు తీసుకువెళ్తూ ఉండేవారు. నేను పాల్గొన్న ఏకైక ఆలిండియా రేడియో సాహిత్య కార్యక్రమం అది.

హనుమకొండ చౌరస్తా లోకల్ బస్‌స్టాండ్‌లో రాజన్న అని ఒకాయన న్యూస్ స్టాల్ నడుపుతుండేవాడు. ప్రతినెలా 'సృజన' ఇవ్వడానికి వెళ్తుండడం వల్ల స్నేహితుడయ్యాడు. అక్కడ కూచుని, అక్కడ అమ్మే ప్రతి పత్రికా చదవడం అలవాటయింది. అలా అప్పుడు వస్తుండిన 'యూత్ టైమ్స్' పక్షపత్రిక చదువుతుండేవాడిని. అనీస్ జంగ్ సంపాదకురాలిగా చాల ఆసక్తిదాయకంగా వస్తుండిన ఆ పత్రిక 1980 ఫిబ్రవరి మొదటి సంచిక ప్రితీష్ నందీ అతిథి సంపాదకుడిగా 'పొయెట్రీ ఆఫ్ లవ్' ప్రత్యేక సంచికగా వచ్చింది. ఒక అందమైన

యువతి పక్కకు తిరిగిఉన్న ముఖం ముఖచిత్రంగా వచ్చిన ఆ సంచిక చూడగానే ఆకర్షించడంతో పాటు, లోపల అరవై పేజీలలో నలభై యాభై ప్రేమ కవితలూ, ప్రేమ కవిత్వం రాసిన కవుల పరిచయాలూ ఇంటర్వ్యూలతో అద్భుతమైన కలెక్టర్స్ ఇష్యూ. ఆ వయసులోనే కాదు, ఏ వయసులోనైనా కవులకు ఆత్మీయమయ్యే సంచిక అది. ఆ సంచిక నాకు కంఠోపాఠమయింది. ముప్పై ఐదేళ్ల తర్వాత నా పాత కాగితాలలో ముఖచిత్రం చిరిగిపోయినప్పటికీ, ఆ సంచికా, దానిలో నాకు నచ్చిన కవితల మీద నేను పెట్టుకున్న గుర్తులూ కనబడి, 'గడిచిన దినాల తలపోత బరువు చేత' కదిలిపోతున్నాను. ఆ సంచికలో ఒక రంగుల పేజీలో ఉన్న సాహిర్ లూధియాన్వీ ఉర్దూ కవిత ఇంగ్లిష్ అనువాదం నుంచి తెలుగు చేశాను. అప్పటికింకా మొదటి సంవత్సరంలోనే ఉన్నాను గనుకా, అప్పటికి కొమరయ్యే సాహిత్య కార్యదర్శిగా ఉన్నాడు గనుకా ఆయన చేతికి ఆ అనువాదం ఇచ్చాను. ఇద్దరమూ కాలేజి నుంచి రోడ్డు దాటి ఎదురుగా ఉన్న ఆడిటోరియం వైపు నడుస్తున్నాం. రెండు లైన్లు చదవడం కూడ అయిపోకుండానే, "నువ్వా? ప్రేమ కవిత్వం రాశావా? రాడికల్స్ కూడ ప్రేమ కవిత్వం రాస్తారా?" అని హోరుహోరున నవ్వాడు.

ఎంతోమంది కవులు, ఎన్నోసార్లు తమ కవిత్వం ద్వారా, స్పష్టమైన వ్యాఖ్యల ద్వారా అది తప్పని నిరూపించినా, విప్లవ, ప్రగతిశీల భావాలకూ ప్రేమ భావాలకూ చుక్కెదురు అనే అపోహ ఇప్పటికీ చాలమందిలో రాజ్యం చేస్తున్నది. నిజానికి విప్లవమే, సరిగ్గా ప్రేమ లాగనే ఒక కవితాత్మక భావన. సమాజమంతటికీ ప్రగతి ఫలాలు సమానంగా అందాలనే ఆలోచన, అసమానతకూ దోపిడీకీ పీడనకూ మూలమైన వ్యవస్థ మారాలనే ఆలోచన గొప్ప ప్రేమ భావనలు. అది మనిషి మీద, మానవ గౌరవం మీద అత్యున్నత ప్రేమ ప్రకటన. దానికదే కవిత్వం. అంటే విప్లవం, ప్రేమ, కవిత్వం ఒకే వస్తువుకు మూడు కోణాలు. మూడు స్థాయిలు. ఈ మూడిటి వరుసనూ ప్రాధాన్యతా క్రమాన్నీ ఎవరికి ఇష్టం వచ్చినట్టు వారు మార్చుకోవచ్చు. కాని ఆ మూడూ అవిభాజ్యం. ఎన్నో అనుకూల ములాఖాత్‌లతోనూ, ప్రతికూల ములాఖాత్‌లతోనూ నేను నేర్చుకున్న జీవిత పాఠం అది.

# ఇంగ్లిష్ కవిత్వ రుచి నేర్పిన పాఠాలు

వరంగల్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజిలో బిఏ మూడు సంవత్సరాల చదువూ ఒక ఎడతెగని కవిత్వ ములాఖాత్ అని ఎన్నోసార్లు ఎంతగా చెప్పినప్పటికీ ఆ మొత్తం అపూర్వమైన అనుభవంలో కొద్ది భాగమైనా మీకు అందించగలనని అనుకోను. బహుముఖాలుగా విస్తరించిన ఆ కవిత్వానుభవంలో ఈసారి మా ఇంగ్లిష్ అధ్యాపకులు ఎ జగన్మోహనాచారి గురించీ, ఆయన బోధించిన ఇంగ్లిష్ కవిత్వం గురించీ చెప్పాలి.

మామూలుగా అప్పుడైనా ఇప్పుడైనా బిఏ మాడర్న్ లిటరేచర్ (ఇంగ్లిష్) అంటే మొదటి రెండు సంవత్సరాలూ ఒక్కొక్కటీ, మూడో సంవత్సరం రెండూ మొత్తం నాలుగు పేపర్లుంటాయి. కవిత్వమూ వచనమూ నాటకమూ సాహిత్య చరిత్రా సాహిత్య విమర్శా ఆనవాయితీగా ఉండేవే. మూడు సంవత్సరాల్లో ఏ సంవత్సరం ఏది ఉందో కచ్చితంగా గుర్తు లేదు గాని కవిత్వంలో షేక్స్పియర్ సానెట్లూ, జాన్ డన్, జాన్ డ్రైడెన్, ఆండ్రూ మార్వెల్, జాన్ మిల్టన్, అలెగ్జాండర్ పోప్, జాన్‌కీట్స్, పి బి షెల్లీ, విలియం వర్డ్స్‌వర్త్, శామ్యూల్ టేలర్ కాలరిడ్జ్, రాబర్ట్ బ్రౌనింగ్, డబ్ల్యుబి యేట్స్‌ల కవితలూ మరికొన్ని కవితలూ ఉన్నాయనీ, షేక్స్పియర్ 'మాక్‌బెత్' నాటకం ఉందనీ గుర్తున్నాయి. షేక్స్పియర్ సానెట్లకైతే విడి పుస్తకం కొనుక్కొమ్మన్నారు గాని, చదువుకోవలసిన కవితలు డజనో ఒకటి రెండు అటో ఇటో ఉన్నప్పటికీ వాటి కోసం ఒక మూడువందల పేజీల భారీ పుస్తకం సూచించారు. అది మాక్మిలన్ ప్రచురించిన, డేవిడ్ గ్రీన్ సంపాదకత్వం వహించిన 'ది వింగ్డ్‌వర్డ్' అనే పుస్తకం. అది ఒక అద్భుతమైన ఇంగ్లిష్ కవిత్వ సంకలనం. 'పాల్గ్రేవ్స్ గోల్డెన్ ట్రెజరీ' అనే సంకలనం సుప్రసిద్ధమే గాని, పరిమాణం లోనూ ఆధునికతలోనూ 'ది వింగ్డ్‌వర్డ్' సులభమైనది. అందులో ప్రధానమైన ఇంగ్లిష్ కవులందరూ ఉన్నారు. కవిత్వంలో వివిధ స్వరాలనూ, శైలులనూ, భిన్న దృక్పథాలనూ చూడదలచిన వాళ్లెవరైనా, ప్రత్యేకించి కవులు తప్పనిసరిగా చదవవలసిన పుస్తకం 'ది వింగ్డ్‌వర్డ్'.

ఆ పుస్తకం ఎంత గొప్పదో ఆ పుస్తకంలోని కవితలను మాకు చెప్పిన ఎ జగన్మోహనా చారి అంత గొప్ప అధ్యాపకులు, విశ్లేషకులు. నేను ఆయన విద్యార్థిని కాకముందునుంచే కవిగా, విమర్శకుడిగా, 'సృజన' రచయితగా, 'సృజన'ను నిర్వహించే సాహితీ మిత్రులలో ఒకరుగా ఆయన నాకు పరిచయమే. ఆయన 'సృజన'లో 1969లోనే సి ఎ జగన్మోహన్ పేరుతో 'ఫ్రీ-ఫ్రాంక్ వర్స్ – ఆధునికత', 'ఆధునికత – తెలుగు వచన కవిత' వంటి లోతైన విమర్శ వ్యాసాలు రాశారు. రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కవిత్వం గురించి, ప్రత్యేకంగా 'పొయెట్రీ ఆఫ్ ది థర్టీస్'గా ప్రసిద్ధమైన కవిత్వం గురించి పిఎచ్ డి చేశారు. జెసి పేరుతో 1980లలో అద్భుతమైన కవిత్వ విమర్శ వ్యాసాలు రాశారు. ఆయన వ్యాసాలన్నిటినీ 1991లో 'కవిత్వం – గతితార్కికత' పేరుతో 'సృజన' ప్రచురణగా పుస్తకరూపంలో తెచ్చాం. ఏకకాలంలో ఒకవైపు 'సృజన' సాహితీమిత్రులలో ఆయన వ్యాసాలు చదువుతూ, చర్చలో పాల్గొంటూ, ఆయన వివరణలూ విశ్లేషణలూ వింటూ, మరొకవైపు కాలేజిలో విద్యార్థిగా ఆయన చెప్పే పాఠాలు వింటూ ఉండడం అరుదైన, అసాధారణమైన అనుభవం.

'సృజన' సాహితీమిత్రుల సంప్రదాయం శారీరకశ్రమకూ మేధోశ్రమకూ మధ్య అంతరాన్ని చెరిపేసి గొప్ప ముందడుగు వేసిందని ఇదివరకే రాశాను. ఇద్దరు మనుషుల మధ్య ఏకకాలంలో ఉపాధ్యాయ-విద్యార్థి సంబంధమూ, సహ అధ్యయనపరుల సంబంధమూ ఉండడానికి వీలున్నదని కూడ 'సృజన' చూపింది. అలా అప్పటికే మేధావిగా, సాహిత్య విమర్శకుడిగా, గౌరవనీయ మిత్రుడిగా తెలిసిన జెసికి 1979 నుంచి 1982 దాకా విద్యార్థిగా

ఉన్నాను. ఇంగ్లిష్ సాహిత్యం గురించీ, కవిత్వం గురించీ, ఇంగ్లిష్ సాహిత్య చరిత్ర గురించీ ఆయన ద్వారా ఎన్నో విషయాలు తెలుసుకున్నాను.

నా కవితా సంపుటం పాంవురం (2002) ముందుమాటలో "కవిత్వం నా కన్నతల్లి. కవిత్వం నా తొలి పాంవురం. కవిత్వం అంటే భావప్రకటనో, ఆగ్రహ వ్యక్తీకరణో, పదవిన్యాసమో, పశ్చాత్తాపమో, ఉద్వేగ ఉధృతో, ప్రశాంత పునరావలోకనమో, ఒత్తిడి నుంచి ఉపశమనమో, ఆనందోత్సాహమో, వెళ్లగక్కడమో... ఎన్ని నిర్వచనాలున్నాయో, అవి ఎప్పుడెప్పుడు ఎంతెంత నిజమో నాకు తెలియదు..." అని రాసినప్పుడు జాబితాకట్టిన కవిత్వ నిర్వచనాలన్నీ ఎవరో ఒక ఇంగ్లిష్ కవి, సాహిత్య విమర్శకులు ఇచ్చినవే. నాకు జెసి ద్వారా తెలిసినవే. నేనక్కడ 'ఉద్వేగ ఉధృతి' అన్నప్పుడూ, 'ప్రశాంత పునరావలోకనం' అన్నప్పుడూ 'స్పాంటేనియస్ ఓవర్ ఫ్లో ఆఫ్ పవర్‌ఫుల్ ఎమోషన్స్' అనీ, 'ఎమోషన్ రికలెక్టెడ్ ఇన్ ట్రాంక్విలిటీ' అనీ అన్న వర్డ్స్‌వర్త్ నా మనసులో ఉన్నాడు.

అలా మొత్తంగా కవిత్వం గురించీ, కవిత్వ నిర్వచనాల గురించీ, కవిత్వ చరిత్ర గురించీ మాత్రమే కాదు, ఆయన పాఠంగా చెప్పిన, లోతులు వివరించిన కొన్ని కవితల గురించి ఆయన చెప్పిన మాటలు ముప్పై ఐదేళ్ల తర్వాత ఇప్పటికీ నాకు వినబడుతూనే ఉన్నాయి. ఆయన ఉచ్చారణ విశిష్టంగా ఉండేది. ఒక లోహధ్వని సదృశమైన గంభీర స్వరంలో కవిత్వం చదివేవారు. కవిత్వ పాదాలు ఎంతగా పైకి చదివితే అంతగా వాటి సారం బోధపడుతుందనీ, ఆ పదాల స్ఫూర్తి అందేట్టుగా మాడ్యులేట్ చేస్తూ చదివితేనే కవి అంతరార్థమూ, ఉద్దేశించిన భిన్న ఛాయలూ గోచరిస్తాయనీ జెసి కవితాపఠనం ద్వారానే నాకు తెలిసింది. ఒకరకంగా ఇంగ్లిష్ కవిత్వంలో రుచి కల్పించినవారు ఆయనే. అలాగే కవిత్వం వంటి ఒకానొక సామాజిక చైతన్య రూపాన్ని అది వెలువడిన, లేదా అది చదువుకుంటున్న సామాజిక నేపథ్యం నుంచి, రాజకీయార్థిక వాతావరణం నుంచి ఎలా అర్థం చేసుకోవాలో నేర్పింది కూడ ఆయనే. పదహారో శతాబ్ది కవిత్వం నుంచి ఇరవయో శతాబ్ది కవిత్వం దాకా వాటి సందర్భాన్ని వివరిస్తూనే, మేం అవి చదువుతున్నప్పటి సమకాలీన ప్రాసంగికతను కూడ చెపుతుండేవారాయన.

జెసి కవిత్వ పాఠాలలో మూడు నాలుగైనా తలచుకుంటేనే కవిత్వంతో నా ములాఖాత్ లోని ఆ సందర్భపు గాఢత అర్థమవుతుంది.

మా సిలబస్‌లో అలెగ్జాండర్ పోప్ కవిత 'ఎపిసిల్ టు డా. ఆర్బత్‌నాట్' ఉండేది. 'షట్ షట్ ది డోర్, గుడ్ జాన్! ఫాటిగ్డ్ ఐ సెడ్, టై అప్ ది నాకర్ సే ఐ ఆమ్ సిక్, ఐ ఆమ్ డెడ్' అని జెసి చదువుతుంటే ఆ పద్దెనిమిదో శతాబ్దపు కవి మా ముందు నిలబడి తన విమర్శకుల పట్ల తన విసుగునూ, పరిహాసాన్నీ, వ్యంగ్యాన్నీ వినిపిస్తున్నట్టే ఉండేది. ఆత్మకథాత్మక కవితగా ప్రసిద్ధమైన ఆ కవితలో పోప్ తన విమర్శకుల గురించీ, తనకు అభిమానులమని చెప్పుకునేవారి గురించీ కూడ విస్తారమైన వ్యంగ్యాన్ని వెదజల్లాడు. తనను చూడవచ్చేవాళ్లకు

తలుపులు మూయమనీ, తాను జబ్బు పడ్డాననీ, చనిపోయాననీ చెప్పమన్నాడు. వాళ్లు ప్రతి కంట్లో అగ్నికీలతో, ప్రతి చేతిలో కాగితాలతో తన మీద దాడి చేస్తారనీ, అరిచీ, చదివీ నేలనేలంతా పిచ్చెక్కిస్తారనీ అన్నాడు. (ఫైర్ ఇన్ ఈచ్ ఐ, అండ్ పేపర్స్ ఇన్ ఈచ్ హాండ్, దే రేవ్ రిసైట్ అండ్ మాడెన్ రౌండ్ ది లాండ్). తనది దారుణమైన విచికిత్స అనీ, ఎటు చూసినా ఓటమేననీ, శత్రువులైతే విమర్శలు రాసీ, మిత్రులైతే తమ రచనలు చదివి వినిపించీ చంపుతారనీ (ఎ డైర్ డైలెమా! ఐదర్ వే ఐ ఆమ్ స్పెడ్, ఇఫ్ ఫోస్, దే రైట్, ఇఫ్ ఫ్రెండ్స్, దే రీడ్ మి డెడ్) అనీ బహుశా ప్రతి కవీ ఎప్పుడో ఒకసారి తన స్థితి గురించి తను చెప్పుకోవలసిన ఆ కవితాత్మక ఉత్తరాన్ని జెసి చెప్పిన తీరు ఇప్పటికీ కళ్లకు కట్టినట్టుగా ఉంది.

అలాగే జాన్ మిల్టన్ 'పారడైజ్ లాస్ట్', 'పారడైజ్ రిగెయిన్డ్' కన్న ముందు చదివిందీ విన్నదీ జెసి పాఠాల్లో మిల్టన్ రాసిన 'లిసిడాస్' అనే సంస్మరణ గీతం. పదిహేడో శతాబ్ది మధ్యలో ఓడ మునిగి చనిపోయిన మిత్రుడి గురించి మిల్టన్ రాసిన ఆ సంస్మరణ గీతం కరుణరసభరితమైనది, చిరస్మరణీయమైనది. మరణించిన మిత్రుల గురించి ఏమి తలచుకోవాలో, ఎట్లా తలచుకోవాలో సంస్మరణ గీతంలో ఆర్ద్రత, పురాస్మృతి, భవిష్యదాశ ఎలా కలగలిసి ఉంటాయో ఎవరైనా ఆ గీతం నుంచే నేర్చుకోవాలనిపిస్తుంది. 'లిసిడాస్ మరణించాడు, తన యవ్వనం కన్న ముందే మరణించాడు', 'లిసిడాస్ కోసం పాడని వాళ్లెవరు?' అంటూ ఆ కవిత వెలువడిన మూడున్నర శతాబ్దాల తర్వాత కూడ పాఠకుల కంట తడి పెట్టిస్తుంది. మా కుటుంబ సభ్యుడు, సాహితీమిత్రులలో ఒకరు, మా గోపీ 1985లో అకాలంగా మరణించినప్పుడు 'గోపీ స్మృతి' అని మేం వేసిన చిన్న పుస్తకంలో నేను 'గోపీ గురించి పాడని వాళ్లెవరు?' అని రాసినప్పుడూ ఇప్పటికీ కూడ లిసిడాస్ నా మనసు మీదినుంచి చెరిగిపోలేదు. జెసి కంఠస్వరం లోంచి లిసిడాస్ గీతపు విషాదం, ఆర్ద్ర స్మృతి ఇంకా వినిపిస్తూనే ఉన్నాయి.

షేక్స్పియర్ 'మాక్‌బెత్' నాటకం కూడ జెసి చెప్పేవారు. దానిలో సంభాషణలన్నీ కవితామయమైనవే. సరిగ్గా అది ఆయన పాఠం చెపుతున్న, మేం చదువుతున్న సమయానికి ఆదిలాబాద్ ఆదివాసుల పోరాటం పదునెక్కుతున్నది. ఇంద్రవెల్లిలో గిరిజన రైతుకూలి సంఘం సభకు వస్తున్న వారిమీద కాల్పులు జరిపి పోలీసులు అరవై మందిని బలిగొన్నారు. ఆదివాసులను సంఘటితం చేస్తున్న విప్లవోద్యమ కార్యకర్తలను 'పోరకల సార్లు' అంటారని పత్రికలు రాస్తున్నాయి. అప్పుడే 'మాక్‌బెత్ విల్ నెవర్ బి డిఫీటెడ్ అంటిల్ బిర్నామ్ వుడ్ మార్చెస్ టు ఫైట్ యు ఎట్ డన్సినేన్ హిల్' అని చెపుతూ పోరకలు కదిలొచ్చి మాక్‌బెత్‌ను ఓడించగలవు అని వర్తమానానికి అన్వయించడం, ఎంత కడిగినా లేడీ మాక్‌బెత్ చేతుల మీద నెత్తుటి మరకలు పోవనీ, వాటీజ్ డన్ కెనాట్ బి అన్ డన్ అనీ నాటక పాఠం చెపుతూ కాల్పుల నెత్తుటి మరక మాయదని చెప్పడం ఆ కాలంలో కవిత్వాన్నీ సమాజాన్నీ కలిపి అధ్యయనం చేయగలిగిన గొప్ప అనుభవం.

ఇక అన్నిటికన్న మరపురాని అనుభవం యేట్స్ కవిత 'సెకండ్ కమింగ్'ను జెసి చెప్పిన తీరు. మార్మిక వాదిగా, మూఢనమ్మకాల విశ్వాసిగా యేట్స్ గురించి ఉన్న అభిప్రాయాలతో ఆ కవితకు మార్మిక అర్థాలు చెప్పిన వారున్నారు. క్రైస్తవ భావజాలంలోని రెండవ రాకడ భావనను ఆ కవిత చెపుతున్నదని వాదించినవారున్నారు. కాని జెసి ఆ కవిత రాసిన 1921ని తీసుకుని అది సరిగ్గా మొదటి ప్రపంచ యుద్ధపు అనంతర స్థితి అనీ, బోల్షివిక్ విప్లవ విజయానంతర స్థితి అనీ దాని సామాజిక నేపథ్యంలో పెట్టేవారు. యేట్స్ మార్మికవాది అయినా ఐరిష్ జాతీయవాద ప్రభావంలో ఉన్నవాడనీ, ఐరిష్ జాతి స్వాతంత్ర్య కాంక్ష ఆవరణ నుంచి ఆ కవితను చూడాలనీ అనేవారు. ఆయన చెప్పిన కొత్త కోణం నుంచి ఆ కవితను చూశాను గనుక ఈ మూడు దశాబ్దాలుగా ఎన్నిసార్లు చదివినా నాకది మార్మిక కవిత అనిపించదు, సామాజిక కవిత అనిపిస్తుంది. తొలి వాక్యాలు మీరే చదవండి:

*Turning and turning in the widening gyre*
*The falcon cannot hear the falconer;*
*Things fall apart; the centre cannot hold;*
*Mere anarchy is loosed upon the world,*
*The blood-dimmed tide is loosed, and everywhere*
*The ceremony of innocence is drowned;*
*The best lack all conviction, while the worst*
*Are full of passionate intensity.*

అన్నీ చెల్లాచెదురయ్యాయి, కలిపి ఉంచే కేంద్రం లేదు, ఉట్టి అరాచకం ప్రపంచాన్ని కమ్ముకుంది, ఉత్తములకు నిబద్ధతనేదే లేదు, దుర్మార్గుల నిలువెల్లా ఉన్మత్త తీవ్రత అన్న మాటలు 1920ల నాటివా, 2020ల నాటివా?

# కల్లోల దశాబ్దానికి దర్పణం 'ఈ తరం యుద్ధకవిత'

1980ల తొలినాళ్ల కవిత్వ ములాఖాత్‌లలో మరొక మైలురాయి 1982లో ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్ ప్రచురించిన '71–'80 – ఈతరం యుద్ధకవిత'. ఆ దశాబ్ది కవితల ప్రాతినిధ్య సంకలనంగా తయారైన ఆ ప్రభావశీల కవితా సంకలనానికీ, ప్రచురణకూ, అందులోని కవితలకూ చాల ప్రత్యేకతలున్నాయి.

ప్రస్తుతం విశ్వవిద్యాలయ విద్యార్థుల సాహిత్య సృజన పరిమాణంలో పెరిగిందేమో

గాని రెండు మూడు దశాబ్దాల కింద ఉన్న భిన్నాభిప్రాయాల మధ్య సంఘర్షణ, చర్చా సంప్రదాయం, రచనల్లో లోతు, సమష్టి కృషి ఇప్పుడు లేవనే చెప్పాలి. అప్పుడు ఒకవైపు విద్యార్థి రాజకీయాలతో, విద్యార్థి సంఘాలతో క్యాంపస్ లన్నీ చలనశీలంగా, సంచలనాత్మకంగా, క్రియాశీలంగా ఉండగా, మరొకవైపు ఆ ఘర్షణలో వెలువడుతున్న ఉద్వేగాలతో గొప్ప సాహిత్య సృజన కూడ జరుగుతుండేది. ఆ సాహిత్య సృజనను నిర్మాణాత్మకంగా మలచడానికి, దిశానిర్దేశం చేయడానికి, వేదిక కల్పించడానికి అన్ని విశ్వవిద్యాలయాలలోనూ చిన్నవో పెద్దవో ప్రయత్నాలు జరుగుతుండేవి. అటువంటి ప్రయత్నాలలో ఒకటే ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్. ఎమర్జెన్సీ అనంతర ప్రజాస్వామిక వెల్లువలో ఒక భాగంగానే అది పుట్టి పెరిగింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రబలంగా ఉండిన ప్రోగ్రెసివ్ డెమొక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ (పిడిఎస్‌యు), రాడికల్ స్టూడెంట్స్ యూనియన్ (ఆర్ఎస్‌యు) ల సభ్యులు, ఆ సంస్థలలో సభ్యులు కాకపోయినా స్థూలంగా ప్రగతిశీల, ప్రజాస్వామిక, విప్లవ భావాలతో ప్రేరణ పొందినవాళ్లు ఈ సాహిత్య సంస్థను నిర్వహించేవారు. రైటర్స్ సర్కిల్ అనే విశాలమైన పేరు పెట్టుకున్నప్పటికీ అందులో ఎక్కువమంది కవులే ఉండేవారు. వారిమీద విరసం ప్రభావం, శివారెడ్డి, నగ్నముని, జ్వాలాముఖి, చెరబండరాజుల ప్రభావాలు ప్రస్ఫుటంగా ఉండేవి. ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్ ప్రధానంగా పనిచేసిన కాలం 1978 నుంచి 1984 దాకా అనుకోవచ్చు.

ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్ చేసిన పనులన్నిటిలోకీ అతి ముఖ్యమైనది అది 1982లో ప్రచురించిన 'ఈతరం యుద్ధకవిత'. అది ఒక దశాబ్ది కవితల సంకలనం. తెలుగు వచన కవితా వికాసంలో 1970ల దశకం కీలకమైనదని కొత్తగా చెప్పనక్కరలేదు. ఆ దశాబ్ది తొలిరోజుల్లో శ్రీశ్రీ షష్టిపూర్తి, అభ్యుదయ సాహితీ సదస్సు, విప్లవ రచయితల సంఘం ఏర్పాటు వంటి సాహిత్య ఘటనలతో పాటు శ్రీకాకుళ విప్లవోద్యమ వెనుకంజ, ఎమర్జెన్సీ, భూమయ్య–కిష్టాగౌడ్ ఉరిశిక్ష, ప్రజా ఉద్యమాల పునర్విజృంభణ, ఉద్యమాలపై తీవ్ర నిర్బంధం, దివిసీమ ఉప్పెన, పోలీసుల సమ్మె, భాగల్పూర్ ఖైదీల కళ్లు పొడిచిన దురంతం వంటి సామాజిక, రాజకీయ ఘటనలు జరగడం, తెలుగు వచన కవిత ఆ పరిణామాలన్నిటినీ ప్రతిఫలించడం సాహిత్య చరిత్ర విద్యార్థులందరికీ తెలుసు. ఆ కల్లోల దశాబ్దానికి ఎత్తిపట్టిన కవితా దర్పణం 'ఈ తరం యుద్ధకవిత'.

అందుకే, "71–80 తెలుగు కవిత్వంలో గొప్ప మలుపు. ఈ దశాబ్దంలో కలం పట్టిన ప్రతికవీ ఒక కొత్త చైతన్యంతో కవితారచన చేశాడు. సమకాలీన ఉద్యమాలనుంచీ, పోరాటాలనుంచీ ప్రేరణ పొందాడు. తనూ సమరంలో భాగమయ్యాడు. అందుకే ఈతరం కవిత యుద్ధ కవిత.

ప్రజల పక్షాన ఈ సమరం. క్రూర వ్యవస్థపై, మనిషిని అమానుషంగా తయారు

చేస్తున్న ప్రతి విషయంపై ఈ యుద్ధం. సాంస్కృతిక సైనికుడిగా కవి యుద్ధం ప్రకటించాడు. కవిత్వం పదును దేరింది. ఈ యుద్ధంలో ఆయుధమైంది. తెలుగుదేశంలో రాజకీయంగా ఈ దశాబ్దానికి ఎంత ప్రాముఖ్యత ఉందో, అంతే ప్రాముఖ్యత తెలుగు కవిత్వానికుంది. కొత్త ఆలోచనల్తో వికసించిన ఈ దశాబ్దానికి అన్ని రంగాల్లోనూ చారిత్రక ప్రాముఖ్యత ఉంది. చారిత్రక ప్రాధాన్యత దృష్ట్యా ఈ విశిష్ట దందహ్యమాన దశాబ్దంలో వచ్చిన అద్భుతమైన కవిత్వాన్ని కొంతవరకైనా పాఠకులకు అందించాలనే ప్రయత్నమే ఈ సంకలనం.

చాలామంది గత దశాబ్ది కవిత నినాదమయంగా వచ్చిందనీ, కళావిలువలు కవిత్వంలో లోపించాయనీ స్వీపింగ్ కామెంట్స్ చేస్తుంటారు. వాళ్లందరికీ ఈ సంకలనమొక మంచి సమాధానం. ఈ దశాబ్దంలో వచ్చిన ఏ సగటు కవితైనా గతంలో వచ్చిన ప్రసిద్ధ వచన కవితల కన్నా గుణంలో ఆధిక్యతను నిరూపించుకుంది. వస్తువులో మరింత స్పష్టతను చేకూర్చుకుంది. వ్యక్తీకరణలో మరింత 'వాడి'ని సాధించింది.... ఈ సంకలనం దీనికి రుజువు" అని ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్ ముందుమాట 'ఉద్దేశం' లో చెప్పుకుంది.

"విప్లవ భావాలు వచన కవిత్వాన్ని ఎంత శక్తిమంతమైన రూపాలుగా మలచగలవో ఈ సంపుటి రుజువు చేస్తుంది" అని ఆ సంకలనానికి రాసిన ముందుమాటలో చేరా అన్నారు.

ఆ పది సంవత్సరాలలో 'సృజన', 'భారతి', 'ఆంధ్రజ్యోతి' వంటి పత్రికలలో వెలువడిన కవిత్వాన్నంతా సేకరించి, అందులోంచి ప్రాతినిధ్య స్వభావం గల కవితలను, వస్తు శిల్పాల ప్రమాణాలతో ఎంపిక చేసి ప్రచురణకు సిద్ధం చేసిన సంపాదకవర్గం లక్నారెడ్డి, కె నరసింహాచారి, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, గుడిహాళం రఘునాథం, గుంటూరు ఏసుపాదం. ఆ సంకలనంలో ఇరవైతొమ్మిది మంది కవుల ముప్పై ఒక్క కవితలు చోటు చేసుకున్నాయి. ముప్పై ఐదు సంవత్సరాల తర్వాత ఇప్పుడు చూస్తుంటే దానిలోకి రావలసి ఉండిన కవితలు కొన్ని రాలేదనీ, కొన్ని లేకపోయినా ఫరవాలేకపోయేదనీ, విపరీతమైన అచ్చుతప్పులున్నాయనీ అనిపిస్తున్నది గాని అది వెలువడిన రోజుల్లో మాత్రం గొప్ప ప్రభావాన్ని కలిగించింది. పది సంవత్సరాల కవిత్వంలో కొన్ని సంవత్సరాల నుంచి, మరీ ముఖ్యంగా చివరి సంవత్సరాల నుంచి ఎక్కువ కవితలు ఉండడం ఎమర్జెన్సీ అనంతర కవిత్వవెల్లువకు చిహ్నం కావచ్చు. అలాగే ఉండవలసినంత, ఆ దశాబ్ది కవిత్వంలో ఉన్నంత వస్తువిస్తృతి కూడ సంకలనంలోకి రాలేదని ఇప్పుడు వెనక్కి తిరిగి చూస్తే అనిపిస్తుంది. ఒకటి రెండు కవితలు మినహా అన్నిటికన్నీ విప్లవ వస్తువుకు సంబంధించినవే అయి ఉండడం ఆ దశాబ్ది కవితకు నిజమైన ప్రాతినిధ్య స్వభావం కాదు.

అయితే ఈ లోపాలు కాలం గడిచినమీద కనబడుతున్నవే గాని ఆ సంకలనాన్ని దాని స్థలకాలావధుల లోపల చూస్తే అది తన కాలానికి ఎంత సమర్థమైన దర్పణమో అర్థమవుతుంది. ఆ పుస్తకం వెలువడినప్పుడు కవితాభిమానుల చేతుల్లో అది ఎటువంటి

ఆయుధంగా ఉండిందో గుర్తు చేసుకుంటే అర్థమవుతుంది. ఆ ముప్పై ఒక్క కవితలలో ఒక్కొక్కటీ అప్పుడు పాఠకులుగా నన్నూ, నేను భాగమైన కవితా పాఠకుల బృందాన్నీ ఎంతగా కదిలించాయో, ఎన్నెన్ని పంక్తులు మమ్మల్ని ఉత్తేజపరిచి నోటిమాటలు, పాటలుగా మారాయో, ఎన్నెన్ని కవితల్ని ఎన్నెన్నిసార్లు, ఎంతమంది ముందు గొంతెత్తి చదివి వినిపించామో వివరించాలని ఉంది గాని, అందుకిక్కడ స్థలం సరిపోదు.

అందులోని కవితలన్నీ చెప్పుకోదగినవే, ప్రతికవితలోనూ ఉటంకించగల పాదాలున్నాయి గాని, మీకిక్కడ ఉదాహరణ ప్రాయమైనవి మాత్రం చెపుతాను. శివసాగర్ కవితలు రెండు 'కుట్ర', 'వివాలా శాంటియాగో', టంకశాల అశోక్ 'అలీన భుజంగాలు', కె శివారెడ్డి 'నా అక్షరం', చలసాని ప్రసాద్ 'ఖైదు కవిత', హెచ్చార్కె 'పదునుదేరిన పాట', కె రాంమోహన్ రాజు 'రోడ్డుమీద సూర్యుడు', నగ్నముని 'కొయ్యగుర్రం', వరవరరావు 'ఆహ్వానం' 'అవును అతడూ మనిషే', అజ్ఞాత సూరీడు 'రెడ్ శాల్యూట్స్ డియర్ చైర్మన్', నందిని సిధారెడ్డి 'రోడ్డు క్రాస్ చేస్తా', గుడిహాళం రఘునాథం 'అంకితం', సుంకిరెడ్డి నారాయణరెడ్డి 'నగరం సాలెగూడు', మొలీనా 'కొన్నివాక్యాలు', అజంతా 'అగ్నిస్పర్శ', ఎ ఎన్ (అల్లం నారాయణ) 'జగిత్యాల పల్లె', గోదారి (అల్లం రాజయ్య) 'ఇది ఎలిజీ కాదు', ఎన్‌కె 'భద్రత', నిజం (జి శ్రీరామమూర్తి) 'కళ్లు' లాంటి కవితలు ఆ సంకలనంలో ఉన్నాయి.

"విప్లవం ప్రతిచోటా కుశాగ్రంగా ఉంది
విప్లవం ప్రతిచోటా జీవధ్వనులు విన్పిస్తూంది
విప్లవం తాను లేకపోవడమే నిర్జీవమని చెపుతూంది
విప్లవం ప్రతిచోటా నాదంలా, హ్లాదంలా, అందంగా, ఆశగా ఉత్తేజమై నిండి ఉంది"
(కిషన్ – విప్లవం పిలుస్తూంది రా),

"ఏ ఒక్కరి ఆనందం కోసమో వేళ్లు తెగే వీణానాదం కాదు
మన పేగుల మీద ప్రపంచ ప్రజల
విప్లవాకాంక్షలు మీటుదాం",
"కంఠంలో నినాదంగా స్వీకరించిన పోరాటమే
ఊహలకు ఇంతగా కాంతినిస్తుంటే
మనం ప్రజల రాజ్యాధికారం కత్తిని నిర్మించే
కొలిమిలో రవ్వలమైతే ఎంత వెలుగు!" (యాత్రిక్ (వరవరరావు) – ఆహ్వానం),
"చెరిగిపోని వాళ్ల శిలాశాసనం మీద
నక్షత్రాలు సాక్షి సంతకం చేశాయి" (శ్రీశ్రీ – భూమ్యాకాశాలు),
"నా నీడలో నా భావాల వేడిని అనుమానించి
తుదకంటా నాశనం చెయ్యాలని
నన్ను వెన్నంటే నడుస్తుంటారు పోలీసులు...

నేను పసిపాపల్ని ముద్దాడితే

వారి చెక్కిళ్లమీది తడిని

కత్తులతో చెరపుతారు" (చెరబండరాజు – పునర్జన్మ) వంటి ఉటంకించదగిన పాదాలు ప్రతి కవితలోనూ ఎన్నెన్నో. ఆ పుస్తకం వెలువడినాక రెండు మూడు సంవత్సరాలు మా సంభాషణల్లో ఆ పాదాలు అలవోకగా దొర్లుతుండేవి.

నిజానికి ఆ కవితలన్నీ వస్తువును అద్భుతంగా కవితామయం చేసినవి, సాంద్రమైనవి, ప్రతి ఒక్కదాని గురించీ అవి రేకెత్తించిన సమకాలీన స్పందనల గురించీ మాత్రమే కాదు, మూడున్నర దశాబ్దాల తర్వాత కలిగించగలుగుతున్న స్పందనల గురించి కూడ రాయవలసింది ఎంతో ఉంది.

ఇక్కడే ఇంకో రెండు విషయాలు పంచుకోవాలి. అ సంకలనంలో మోలీనా అనే కవి రాసిన 'కొన్నివాక్యాలు' కవిత ఉంది. అప్పటికి అజ్ఞాతవాసం చేస్తున్న, ఆ తర్వాత ఒక బూటకపు ఎన్‌కౌంటర్‌లో మరణించిన మైలా నర్సయ్య అనే విప్లవోద్యమ నాయకుడి కలం పేరని అంటారు. ఆయన ఇది కాక కవిత్వం రాశాడో లేదో తెలియదు గాని,

"యుద్ధరంగంలో నిలబడి

కవిత్వం రాయడం గొప్ప ఆనందాన్నిస్తుంది

ఇక్కడ కవిత్వం తన కృత్రిమ మృదుత్వాన్ని కోల్పోతుంది...

పువ్వులూ, వెన్నెల రాత్రులూ సైతం

ఇక్కడ రక్తంలో మునిగి ఉన్నాయి

దీనికి నాగరికుల కవితాజ్ఞాన సర్వస్వాల్లో చోటులేదు" అనే ఈ కవితను 'సృజన' ముఖపత్ర కవితగా అచ్చువేశాం. అలాగే ఈ సంకలనంలో ఉన్న గుడిహాళం రఘునాథం 'అంకితం' కవిత ఎంత ప్రభావశీలమైనదంటే, అది మొదట 'భారతి'లో అచ్చయింది. అది చూసి వెంటనే మరుసటి సంచిక 'సృజన'లో పునర్ముద్రించాం. అలా అప్పుడు ఎక్కడ మంచి కవిత్వం వచ్చినా దాన్ని అచ్చులోనో, మౌఖికంగానో పునరుక్తం చేయడం ఒక ఇష్టమైన దినచర్యగా ఉండేది.

ఈ సంకలనంలోని ఎన్‌కె 'భద్రత', ఎఎన్ 'జగిత్యాల పల్లె' కవితలు రెండూ 'సృజన' డిసెంబర్ 1980 సంచికలో అచ్చయినవే. ఈ సంకలనంలో చేరలేదు గాని ఆ సంచికలోనే అచ్చయిన పాపినేని శివశంకర్ కవిత 'అడవి' కూడ అలా నెలలపాటు మా నాలుకల మీద ఆడినదే.

"అలిసిపోయిన అడవి నిద్ర పోతోంది

ఆదమరిచిన అడవి నిద్ర పోతోంది" అని మొదలై,

"ఆకులాడని అడవి నిద్ర లేచింది

ఆకలెత్తిన అడవి నిద్రలేచింది" అని ముగుస్తుంది ఆ కవిత.

# సుదూర కవిత్వపు సరికొత్త ములాఖాత్

ఈసారి నా కవిత్వ ములాఖాత్‌ల పురాస్మృతుల పరంపర నుంచి కాస్త పక్కకు జరిగి సరికొత్త కవిత్వ ములాఖాత్‌ల మాలిక గురించి చెప్పాలనిపిస్తున్నది. జ్ఞాపకాల తలపోత ఎప్పుడైనా జరగవచ్చు, అటూ ఇటూ కూడ కావచ్చు కాని ఈ సరికొత్త అనుభవాల ఉద్వేగాలను చల్లారకముందే పంచుకోకుండా ఉండలేకపోతున్నాను.

ఈ అనుభవాలు కోల్‌కతా లోని జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయానివి. బెంగాల్ అంటే నాకు చాల ప్రేమ. గత తరాల బుద్ధిజీవులలో చాలమంది లాగే నేనూ బెంగాలీ సమాజ, సాహిత్యాలతో ఎక్కువ పరిచయంతో కళ్లు తెరిచాను. అందులోనూ శరత్, టాగూర్ వంటి పాత తరం బెంగాలీ సమాజ, సాహిత్యాలతో మాత్రమే కాక, చారు మజుందార్, సరోజ్ దత్తా, సమర్ సేన్ వంటి నక్సల్బరీ తరంతో ప్రభావితమయ్యాను గనుక బెంగాల్ ఎప్పుడూ నా మనసు మీద ఉంటుంది. నిజానికి ఒక ఉద్వేగభరితమైన ప్రజ్వలనంగా నక్సల్బరీ దానికదే కవిత్వం గనుక అదే కవిత్వంతో పెద్ద ములాఖాత్. 'నూతన మానవ సృష్టి జరుగుతున్నది', '1970ల దశకాన్ని విముక్తి దశకం చేద్దాం', 'వెయ్యి శ్రీకాకుళాలను నిర్మించండి' లాంటి ఎన్నో కవితాత్మక, ఆవేశభరిత, భావుక, ఊహాశాలి భావాలను సృష్టించిన కవితావరణం అది. ఆ బెంగాల్ అపజయానికి గురై, ధ్వంసమై, నిరాశామయమై, హింసాత్మకమై చాల రోజులు గడిచిపోయింది. జంగల్ మహల్‌లో మారాకు వేసిన చిగురు కూడ విస్తరించకుండానే మాడి మసైపోయింది. అయినా నా మనసులో బెంగాల్ ఒక ఉజ్వల కవితాచరణమే. ఆ బెంగాల్‌కు, కోల్‌కతాకు వెళ్లడానికి ఇరవై ఆరేళ్ల తర్వాత అనుకోకుండా అవకాశం వచ్చిన సందర్భంలో కూడ కవిత్వం నిండడం కవితాన్యాయం అనుకుంటాను.

రెండున్నర సంవత్సరాల కింద నా ఇంగ్లిష్ వ్యాస సంపుటం 'అండర్‌స్టాండింగ్ మావోయిస్ట్స్' ప్రచురించిన సేతు ప్రకాశని అనే ప్రచురణ సంస్థ కోల్‌కతాలో జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయంలో 'క్రియేటివిటీ థ్రైవ్స్ అండర్ ప్రెజర్' (ఒత్తిడిలో వికసించే సృజనాత్మకత) అనే అంశం మీద రెండు రోజుల సదస్సు నిర్వహిస్తూ, నన్ను కూడ ఒక పత్రం సమర్పించమని ఆహ్వానించింది. ఆ సదస్సు చర్చనీయాంశమే కవితాత్మకమైనది. సృజనాత్మకతకు ప్రధాన వ్యక్తీకరణ రూపమూ, గణనీయమైన వాహికా కవిత్వమే గనుక ఆ సదస్సులో కవిత్వ ప్రస్తావన రాకుండా ఉండడం అసాధ్యం. ప్రస్తావన మాత్రమే కాదు, ఒక రకంగా చెప్పాలంటే ఆ రెండు రోజులూ అనేక రూపాల్లో అక్కడ కవిత్వం, కవిత్వ సదృశమైన భావోద్వేగం ప్రవహించాయి. ఆ రెండు రోజుల్లో ఎన్నెన్నో కవిత్వ ములాఖాత్‌లు కిక్కిరిసి పోయాయి.

ఈ కొత్త కవిత్వ ములాఖాత్‌లలో మొట్టమొదట చెప్పవలసినవి వార్సా (పోలండ్)లోని

జూయిష్ హిస్టారికల్ ఇన్‌స్టిట్యూట్ నుంచి వచ్చిన డా. అగ్నీస్కా హస్కా పంచుకున్న రెండు కవితా సందర్భాలు. మొదటిది వార్సా ఘెట్టోలో నిర్బంధ శిబిరంలో పెల్లుబికిన సృజనాత్మకత గురించినది. రెండవది, అద్భుతమైన కవిత్వం రాసి ఇరవై ఏడు సంవత్సరాల వయసుకే నాజీల చేతుల్లో హత్యకు గురైన జుజానా గింజాన్కా అనే కవి గురించినది.

నాజీలు పోలండ్‌ను ఆక్రమించాక వార్సా నగరంలో మూడోవంతుగా ఉన్న నాలుగు లక్షల యూదులను ఒకే ప్రాంతానికి పరిమితం చేసి వార్సా ఘెట్టో తయారు చేశారు. నగర విస్తీర్ణంలో మూడుశాతం కన్న తక్కువ భూభాగంలో, మూడున్నర చ.కి.మీ. ప్రాంతం చుట్టూ పది మీటర్ల ఎత్తు గోడ నిర్మించి వారందరినీ బందీలుగా కుక్కారు. వాళ్లకు బైటి ప్రపంచంతో సంబంధం లేకుండా చేశారు. అక్కడి దుర్భరమైన పరిస్థితుల్లో అనారోగ్యం బారిన పడి చనిపోయినవారూ, అక్కడి నుంచి మరొక నిర్బంధ శిబిరానికి తరలింపు పేరుతో నాజీ అధికారుల చేతుల్లో హత్యకు గురైనవారూ, 1943 జనవరిలో ఒక తిరుగుబాటు ప్రయత్నం సందర్భంగా హత్యాకాండలో బలి అయిపోయినవారూ కలిపి మొత్తం మూడు లక్షల మంది ఆ ఘెట్టోలో చనిపోయి ఉంటారని అంచనా. ఇంత భయానకమైన నిర్బంధం మధ్య, దుర్భర పరిస్థితుల మధ్య కూడ ప్రతి ఒక్కరూ రచన చేశారు. తాము ఏ క్షణాన హత్యకు గురైనా సరే, తాము అనుభవిస్తున్న అంతులేని వేదన గురించి భవిష్యత్ తరాలకు తెలియడానికి రాసిపెట్టాలనుకున్నారు.

“నా జీవితమంతా పుస్తకాలనూ రచననూ అసహ్యించుకున్నాను, కాని ఇప్పుడు నేను రాయక తప్పదు” అని ఒక దంతవైద్యుడు తన రచన ప్రారంభించారు. కవిత్వం, కథ, జ్ఞాపకాలు, దినచర్య, సంభాషణలు, చిత్రలేఖనం, ఫొటోలు, సంగీతం వంటి అనేక రూపాల్లో ఆ సృజనాత్మకత వ్యక్తమయింది. తరచుగా సోదాలు జరుగుతుండేవి గనుక ఆ వ్యక్తీకరణలను వేరువేరు స్థలాల్లో దాచిపెట్టారు. అలా వార్సా ఘెట్టోలో వెలువడిన సృజనాత్మకత మొత్తం ఎప్పటికీ దొరకకపోవచ్చుననీ, ఇంకా పరిశోధనలు జరుపుతున్నామనీ హస్కా అన్నారు. అప్పుడు వార్సా ఘెట్టోలో భాగంగా ఉండి, ఇప్పుడు ఒక విదేశీ రాయబార కార్యాలయం ఉన్న భవనం కింద నేల మాళిగల్లో అటువంటి సామగ్రి ఉందని కచ్చితమైన ఆధారాలు ఉన్నప్పటికీ, ఆ దేశం అక్కడ తవ్వకాలకు అనుమతించడం లేదని ఆమె అన్నారు. “ఘెట్టోలో, నిర్బంధ శిబిరంలో ప్రతి ఒక్కరూ రాస్తారు, ప్రతి ఒక్కరూ రాశారు” అని ఆమె చెప్పిన మాట సృజనాత్మకత వికాసానికి హృదయ విదారకమైన నిదర్శనం.

అలాగే, ఆమె జుజానా గింజాన్కా అనే పోలిష్ కవి గురించి, ప్రత్యేకించి ఆమె రాసిన ఒక చరిత్రాత్మక కవిత గురించి చెప్పారు. కవిత్వం గురించి ఆలోచించే, తపించే మన వంటి వాళ్లందరం తప్పనిసరిగా తెలుసుకోవలసిన చరిత్ర అది. సారా గిన్జ్‌బర్గ్ అనే కలం పేరుతో రాసిన జుజానా 1917లో పుట్టి, పద్నాలుగో ఏటి నుంచే కవిగా పేరు తెచ్చుకున్న పోలిష్ యువతి. ఆమె జీవితకాలంలో పందొమ్మిదో ఏట ఒకే ఒక్క కవితా సంపుటం

వెలువరించి పోలిష్ భాషా సాహిత్య ప్రపంచంలో సంచలనం సృష్టించింది. పోలండ్ తూర్పు ప్రాంతానికి చెందిన జుజానా తల్లిదండ్రులు విడాకులు తీసుకుని ఎవరి దారిన వారు వెళ్లిపోవడంతో అమ్మమ్మ దగ్గర పెరిగింది. పద్దెనిమిదో ఏట విశ్వవిద్యాలయంలో చేరడానికి రాజధాని వార్సాకు చేరి తన కవిత్వంతో, రేడియో నాటకాలతో, స్వేచ్ఛా జీవన శైలితో అక్కడి సాహిత్య బృందాలలో ప్రముఖురాలయింది. ఆనాటి పోలిష్ సాహిత్య ప్రముఖులెందరో ఆమె కవిత్వాన్నీ, శారీరక సౌందర్యాన్నీ కూడ మెచ్చుకుంటూ రాశారు. నాజీ జర్మనీ 1939 సెప్టెంబర్ 1న పోలండ్ రాజధాని వార్సాతో సహా పశ్చిమ ప్రాంతం మీద దాడిచేసి, ఆక్రమించుకుని, రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభించే నాటికి ఆమె అమ్మమ్మతో స్వస్థలం తూర్పు ప్రాంత నగరం రోన్ లో ఉండింది. జర్మన్ దాడిని అడ్డుకోవడానికి సోవియట్ యూనియన్ ఎర్రసైన్యం సెప్టెంబర్ 17న ఆ ప్రాంతంలో ప్రవేశించింది. ప్రచ్ఛన్న యుద్ధం రోజుల్లోనూ, ఆ తర్వాతా వెలువడిన సాహిత్యంలో దీన్ని సోవియట్ దురాక్రమణగా చిత్రిస్తున్నప్పటికీ, ఆస్తిపరవర్గంగా తన కుటుంబం కూడ ఇబ్బందులు అనుభవించినప్పటికీ, జుజానా 1939–42 కాలంలో ల్వోవ్ నగరంలో ఒక పత్రికకు సంపాదకురాలిగా పనిచేస్తూ సోవియట్ అనుకూల కవిత్వం రాసింది. మయకోవస్కీ కవిత్వాన్ని పోలిష్‌లోకి అనువదించింది.

జర్మనీ 1941 జూన్ లో ఆ ప్రాంతాన్ని కూడ ఆక్రమించడంతో యూదులందరితో పాటు జుజానాకు కూడ కష్టాలు మొదలయ్యాయి. 1942 వేసవిలో రెండు మూడు విఫల ప్రయత్నాల తర్వాత నాజీ పోలీసులు జుజానాను అరెస్టు చేశారు. ఆమె ఆ నిర్బంధం నుంచి తప్పించుకుని, నకిలీ పత్రాలతో క్రాకో పట్టణానికి చేరి అక్కడ ఒక ఇంటి నుంచి మరొక ఇంటికి మారుతూ రహస్య జీవితం గడిపింది. కాని 1944 మొదట్లో అనుకోకుండా సహచరుల అరెస్టుతో, ఆ పరంపర జుజానా దాకా సాగి ఆమె కూడ అరెస్టయింది. నాజీ పోలీసులు డిసెంబర్ 1944 – జనవరి 1945 మధ్య ఎప్పుడో ఆమెను కాల్చి చంపారు. ఈ కాలమంతా కూడ ఆమె కవిత్వం రాస్తూనే ఉంది. అలా తన 1942 అరెస్టు మీద ఆమె రాసిన ఒక కవిత యుద్ధానంతరం ఆమె అరెస్టు–హత్యల మీద కేసులో ప్రధాన సాక్ష్యంగా ఉపయోగపడింది. ప్రపంచ చరిత్రలోనే ఒక క్రిమినల్ కేసులో సాక్ష్యంగా ఒక కవిత ఉండడం అదే మొదటిసారి అంటారు. శీర్షిక లేని ఆ కవిత దాని మొదటి వాక్యం – హొరేస్ లాటిన్ కవిత్వం నుంచి ఉటంకించిన – నాన్ ఆమ్నిస్ మొరియర్ (నేను మొత్తంగా చనిపోను) అనే పేరుతో సుప్రసిద్ధమయింది. ఒక పంక్తిలో చోమిన్ అన్న మాట ఆధారంగా, జుజానాకు ఆశ్రయం ఇచ్చిన ఇంటి యజమానురాలు జోఫియా చోమిన్ విద్రోహానికి పాల్పడిందనీ, తనను పోలీసులకు అప్పగించిందనీ తేల్చిన న్యాయస్థానం చోమిన్‌కు నాలుగు సంవత్సరాల శిక్ష విధించింది. జుజానా కవిత్వం పోలిష్ భాషలో ఇప్పటికి నాలుగు సంపుటాలు వచ్చాయి. ఆమె జీవిత చరిత్ర, కవిత్వ విశ్లేషణ ఇప్పటికి కనీసం నాలుగు పుస్తకాలు వచ్చాయి.

జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయ ఫిల్మ్ స్టడీస్ శాఖ ప్రొఫెసర్ సంజయ్ ముఖోపాధ్యాయ 'నిర్బంధ పాలనలలో సృజనాత్మకత: సినిమాల ఉదాహరణలు' అనే ప్రసంగంలో ఆసక్తికరమైన ఇతర విషయాలన్నీ అలా ఉంచి, పాబ్లో పికాసో సుప్రసిద్ధ చిత్రం గెర్నికా మీద ఒక డాక్యుమెంటరీని చూపారు. ఆ పదమూడు నిమిషాల డాక్యుమెంటరీ నేపథ్యంలో గెర్నికా మీద ఫ్రెంచి కవి పాల్ ఎలువా రాసిన అద్భుతమైన కవితాపఠనం చూసి, విని తీరవలసిందే తప్ప వివరించడం అసాధ్యం. అత్యద్భుతమైన కవి పాల్ ఎలువా (ఎలార్డ్ అనే పొరపాటు ఉచ్చారణతో) శ్రీశ్రీ అనువాదం చేసిన 'స్వాతంత్ర్యం' కవిత ద్వారా మనకు తెలిసినవాడే.

అదే సెషన్ లో ప్రజా సంస్కృతి సృజనశీలత గురించీ, ప్రత్యేకించి సంగీతం గురించీ జీతన్ మరండీ మాట్లాడాడు. మావోయిస్టు సాంస్కృతిక కార్యకర్తగా, జార్ఖండ్ అబేన్ నాయకుడిగా సుప్రసిద్ధుడైన జీతన్ ఒక తప్పుడు కేసులో కింది కోర్టులో ఉరిశిక్షకు గురై ఐదు సంవత్సరాలు ఉరికంబం నీడలో జైలులో బతికాడు. చివరికి, పై కోర్టు కేసు కొట్టేసి నిర్దోషిగా విడుదల చేశాక తన ఆటా పాటా మాటా కొనసాగిస్తున్నాడు. తాను తన పాటలు ఎలా రాశాడో, ఎలా పాడాడో ఆయన నోటి వెంట వినడం దానికదే ఒక గొప్ప అనుభవం.

అలాగే మహారాష్ట్ర ప్రభుత్వం చేతిలో ఇవాళ్టికీ నిర్బంధాన్నీ, తప్పుడు కేసులనూ అనుభవిస్తున్న, నాయకులలో కొందరు కవులూ, గాయకులూ ఇప్పటికీ జైళ్లలోనే ఉన్న కబీర్ కళా మంచ్ కార్యకర్త జ్యోతి జగతాప్ తమ నాట్య బృందపు కవిత్వం, పాటలు, కళా ప్రదర్శనలు ఏ ప్రేరణలనుంచి వికసిస్తాయో, నిర్బంధం కిందనే తమ విప్లవ–దళిత సమైక్య సృజనాత్మకత ఎలా విస్తరిస్తున్నదో వివరించింది.

వీళ్లందరూ ఆయా ఉద్యమాల భాగస్వాములు, నాయకులు, కార్యకర్తలు, పరిశోధకులు కాగా, బెంగాల్ విశ్వవిద్యాలయాల విద్యార్థులు, పరిశోధక విద్యార్థులు సమర్పించిన పత్రాలు, చేసిన ప్రసంగాలు, అందులోనూ కవిత్వం గురించి వచ్చిన మూడు నాలుగు పత్రాలు చెప్పుకోదగినవి. 'మాతృభూమి పరాధీనమైనప్పుడు కవి – మహమూద్ దర్వీష్', 'మొదటి ప్రపంచ యుద్ధంలో వికసించిన మహిళల కవిత్వం – స్త్రీవాద ఉద్యమంపై దాని ప్రభావం', 'ప్రతికూల పరిస్థితులు: సృజనశీలత – నబరుణ్ భట్టాచార్య' అనే ఆలోచనాస్ఫోరకమైన పత్రాలను ఇరవై– ఇరవై ఒక్క ఏళ్ల వయసులోని విద్యార్థినీ విద్యార్థులు సమర్పించారు. మహమూద్ దర్వీష్‌నూ, నబరుణ్ భట్టాచార్యనూ తెలుగులోకి అనువాదం చేసి ఉండడం వల్లా, మహిళల కవిత్వ సృజన మీద ఆసక్తి వల్లా ఆ పత్రాలు నాకు హృదయానికి దగ్గరగా అనిపించాయి.

ఇవన్నీ ఒక ఎత్తయితే, కాంచన్ దా అని ముప్పై ఐదేళ్లుగా ప్రేమగా పిలుచుకుంటున్న కాంచన్ కుమార్‌ను ఆయన గదిలో కలిసి ఆయన కొత్తగా బెంగాలీలోకి అనువాదం చేసి ప్రచురించిన పాష్ కవిత్వ అనువాదం పుస్తకం తీసుకోవడం మరొక అనుభవం. కాంచన్

బెంగాలీ, హిందీ, ఇంగ్లిష్‌లలో ఒక భాష నుంచి మరొక భాషలోకి గత మూడున్నర దశాబ్దాలలో కనీసం 200 పుస్తకాలు అనువాదం చేసి ప్రచురించి ఉంటాడు. ఎందరో తెలుగు విప్లవకవులను బెంగాలీలకు పరిచయం చేశాడు. అనువాదాల కోసం ఆవురావురుమంటూ ఉంటాడు. డెబ్బై ఐదేళ్ల వయసులో, పుస్తకాలు నిండిన గదిలో ఒంటరిగా కూచుని ఏకదీక్షగా అనువాదాలు చేస్తూ, అనువాదాల అవసరాన్ని వచ్చినవారికల్లా చెపుతూ ఉన్న నిరంతర కష్టజీవి, కవితా ప్రేమికుడు కాంచన్‌దా.

కోల్‌కతాతో సంబంధం లేదు గాని, తిరిగి వచ్చిన ఒకటి రెండు రోజుల్లోనే ఇద్దరూ కవులే అయిన స్త్రీపురుషుల మైత్రి మీద, ప్రేమ మీద, సహజీవనం మీద సున్నితంగా, ఆర్ద్రంగా, భావుకతతో తీసిన సినిమా 'పొజెషన్' చూడడం మరొక అనుభవం. ఇద్దరు విక్టోరియన్ కాలపు కవుల కాల్పనిక పాత్రలతో కెనడియన్ రచయిత్రి ఎఎస్ బ్యాట్ రాసిన నవల ఆధారంగా ఈ సినిమా తయారయింది. ఈ కాల్పనిక పాత్రలలో పురుష పాత్రకు రాబర్ట్ బ్రౌనింగ్ గాని, ఆల్ఫ్రెడ్ టెన్నిసన్ గాని ఆధారమై ఉంటారని, స్త్రీ పాత్రకు క్రిస్టినా రోజెట్టీ ఆధారం కావచ్చునని ఊహలు ఉన్నాయి. వాస్తవం అయినా కాకపోయినా, కవుల జీవితాలు వాటికవే ఎంత కవితాత్మకంగా ఉండవచ్చునో, ఉంటాయో ఆ సినిమా అద్భుతంగా చూపింది. సరిగ్గా అటువంటి కవిత్వ–జీవిత మమేకత గురించి విని, చూసి వచ్చిన కొన్ని గంటల్లోనే.

# కవిత్వానువాదంలో తొలి అడుగు

'యూత్ టైమ్స్' పత్రికలో అచ్చయిన సాహిర్ లూధియాన్వీ కవితను, బహుశా 1980 జూలై, ఆగస్ట్‌ల్లో ఇంగ్లిష్ నుంచి తెలుగు చేయడం గురించి ఇదివరకే రాశాను గాని, అది ఎక్కడా అచ్చు కాలేదు గనుక నా కవిత్వానువాదాలలో అది తొలి అడుగు అనడానికి వీలులేదు. అచ్చయిన కవితానువాదాలు చెప్పాలంటే 'సృజన' 1980 డిసెంబర్ సంచికలో అచ్చయిన మూడు కవితల గురించి చెప్పాలి.

అనువాదం ద్వారా కవిత్వంతో కలిగే ములాఖాత్ ఒక గొప్ప అనుభవం. ఆ అనుభవంలో అనేక స్థాయిల, పొరల అనుభూతులు, ప్రయోజనాలు, సామర్థ్యాలు, అవగాహనలు ఇమిడి ఉంటాయి. ఆ కవి గురించి తెలిసినా తెలియకపోయినా కవిత నచ్చి, అది మన భాషా పాఠకులకు పరిచయం కావాలనే కోరికతో అనువాదం చేయవచ్చు. కవిత నచ్చడం అన్నప్పుడు దాని వస్తు శక్తి కావచ్చు, లేదా ఆ శైలీ శిల్పాల ఆకర్షణ కావచ్చు. ఆ కవి గురించి తెలిసినందువల్ల ఆ కవినీ సందర్భాన్నీ పరిచయం చేయడానికి అనువాదం చేయవచ్చు. లేదా, ప్రస్తుతం మన చుట్టూ ఉన్న వాతావరణం ఒక కవితా సందేశాన్ని

కోరుతున్నప్పుడు, అది మరే భాషలోనైనా దొరుకుతుందా అని వెతుకులాటలో దొరికిన కవితను అనువాదం చేయడం కావచ్చు. లేదా ఒక రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక సందర్భాన్ని వివరిస్తున్నప్పుడు, ఆ సందర్భానికి తగిన కవిత్వం జోడిస్తే ఆ వివరణకు బలం చేకూరుతుందని, అందుకు తగిన కవితలు అనువాదం చేయడం కావచ్చు. 1980 డిసెంబర్ లో అచ్చయిన మొదటి కవితానువాదాల నుంచి ఈ ముప్పై ఐదు సంవత్సరాలలో నేను తెలుగులోకి అనువదించిన దాదాపు వంద్ర మంది కవులు, రెండు వందల దాకా కవితలు ఈ అన్ని రకాల సందర్భాలకూ సరిపోతాయి. నా అనువాదాలకు మరొక అదనపు అంశం హిందీ నుంచి నేరుగా చేసిన దాదాపు అరడజను కవితలు మినహాయిస్తే మిగిలినవన్నీ ఏదో ఒక మూలభాష నుంచి ఇంగ్లిష్ లోకి వచ్చి, నేను ఇంగ్లిష్ నుంచి తెలుగు చేసినవే. ఇలా రెండు వడపోతలు జరిగాక ఆ కవిత సారమూ శక్తీ ఎంత జారిపోయాయో, పాఠకులు ఎలా తీసుకున్నారో నాకు తెలియదు. కాని ఎలా చూసినా అనువాదకుడిగా నాకు మాత్రం కవితానువాదం ఒక అద్భుతమైన, సంతృప్తికరమైన, సార్థకమైనదనిపించే అనుభవం.

ఎమర్జెన్సీ తర్వాత దేశవ్యాప్తంగా పెల్లుబికిన ప్రజాస్వామిక చైతన్యం వల్ల వివిధ భాషా సాహిత్యాల మధ్య సంబంధం కూడ పెరిగింది. మొదట ఎమర్జెన్సీనీ, నిరంకుశత్వాన్నీ వ్యతిరేకించే రచనలు ఒక భాషనుంచి మరొక భాషలోకి, ముఖ్యంగా అన్ని భాషల నుంచి ఇంగ్లిష్ లోకీ, ఇంగ్లిష్ నుంచి మిగిలిన భాషలలోకీ అనువాదం కావడం మొదలైంది. ఎమర్జెన్సీ తర్వాత పునఃప్రారంభమైన 'సృజన' ఆ వెల్లువలో భాగంగానే రచనల అనువాదం, ప్రచురణ సాగించింది. అలా ఎమర్జెన్సీ అత్యాచారాల గురించీ, ఎమర్జెన్సీ అనంతరం బిహార్ వంటి చోట్ల సాగిన భూస్వామ్య, అగ్రవర్ణ దుర్మార్గాల గురించీ అప్పటి ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో వచ్చే వార్తావ్యాసాలను అనువాదం చేసే పని 'సృజన' 1979 ఏప్రిల్ సంచిక నుంచి ప్రారంభించాను. అలాగే దేశవ్యాప్త పౌరహక్కుల సంఘాల నిజనిర్ధారణ బృందాలు రావడం, వాటి నివేదికలు ఇంగ్లిష్‌లోనే ఉండడం, అవి తెలుగు చేసి 'సృజన'లో ప్రచురించడం కూడ నా వచనానువాదాలను విస్తరించింది. అలా వచనానువాదాలు ఒక ఏడాది, ఏడాదిన్నర సాగినతర్వాత అప్పటికే కవిత్వం మీద మక్కువ, ఇంగ్లిష్‌లో కవిత్వం చదవడం సాగుతున్నాయి గనుక కవిత్వానువాదాల వైపు మళ్లాను.

ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే ఆశ్చర్యం వేస్తుంది గాని అచ్చయిన నా మొదటి కవితానువాదం ప్రపంచ ప్రఖ్యాత కవి కె. సచ్చిదానందన్‌ది. ఆయన అప్పటికి అద్భుతమైన మలయాళీ విప్లవ కవి. విప్లవోద్యమానికి సన్నిహితుడు. ఆ తర్వాత విప్లవ రాజకీయాల నుంచి దూరమైనా, ప్రపంచ ప్రసిద్ధి పొందిన మంచి కవి. సాహిత్య అకాడమీ కార్యదర్శిగా కూడ పనిచేశాడు. ఆయన కవిత 'స్వేచ్ఛ' నేను తెలుగు చేయడానికి కాస్త చరిత్ర ఉంది. అది చెప్పాలి.

ఎమర్జెన్సీ అనంతర ప్రజాస్వామిక వెల్లువలో దేశవ్యాప్తంగా విప్లవ సాహిత్య, సాంస్కృతిక సంస్థల మధ్య సమన్వయం కూడ ప్రారంభమయింది. చాల రాష్ట్రాల్లో, భాషల్లో పాత సంస్థల పునరుద్ధరణ, కొత్త సంస్థల ఆవిర్భావం జరిగాయి. సాధారణంగా ఈ సంస్థలన్నీ మార్గదర్శకత్వం కోసం, సలహాల కోసం అప్పటికే ఒక దశాబ్ది అనుభవం ఉన్న విప్లవ రచయితల సంఘం వైపు చూశాయి. ఆ వరుసలోనే కేరళలో విప్లవోద్యమం ప్రేరణతో 1979 మేలో జనకీయ సాంస్కారిక వేది అనే విప్లవ సాహిత్య సంస్థ పుట్టింది. తెలుగు విప్లవ కవిత్వానికి భిన్నంగా మలయాళీ విప్లవ కవిత్వం మొదటి నుంచీ కూడ వెంటవెంటనే ఇంగ్లిష్ లోకి రావడం మొదలయింది. జనకీయ సాంస్కారిక వేది సభలకు వెళ్లిన విరసం నాయకులు ఆ ఇంగ్లిష్ రచనలను తీసుకురావడంతో వాటితో తెలుగు పాఠకులకు పరిచయం పెరిగింది. అలా వచ్చిన సివిక్ చంద్రన్ కవిత 'కబానీ' అనువాదం 'సృజన' అక్టోబర్ 1980 సంచికలో అచ్చయింది. ఈ లోగా 1980 ఆగస్టులో జరిగిన జనకీయ సాంస్కారిక వేది రెండో మహాసభల తర్వాత అప్పటి కేరళ వామపక్ష ప్రభుత్వం కవులు సివిక్ చంద్రన్, సచ్చిదానందన్, మలయాళీ సాహిత్య పత్రిక 'ప్రేరణ' సంపాదకుడు సదాశివన్‌లతో సహా సాహిత్యకారులను నిర్బంధించింది. అప్పుడు కేరళలోనూ, దేశంలోని ఇతర ప్రాంతాలలోనూ 'స్వేచ్ఛ – ఔను స్వేచ్ఛే సమస్య' అనే సచ్చిదానందన్ కవితా పంక్తులు రాసిన పోస్టర్లతో ప్రదర్శనలు జరిగాయి. ఆ పంక్తులు ఉన్న కవిత మొత్తాన్ని ఇంగ్లిష్‌లోకి అనువదించి బొంబాయి కమిటీ ఫర్ ప్రొటెక్షన్ ఆఫ్ డెమొక్రటిక్ రైట్స్ (సిపిడిఆర్) అధికార పత్రిక 'రక్షా' అక్టోబర్ 1980 సంచికలో ప్రచురించారు. ఆ ఇంగ్లిష్ అనువాదానికి నేను చేసిన తెలుగు అనువాదమే 'సృజన' డిసెంబర్ 1980 సంచికలో వచ్చింది. దానితో పాటే రెండు బెంగాలీ కవితలకు – ధూర్జటి ఛటోపాధ్యాయ 'జైలు కటకటాలు పట్టుకుని', ద్రోణాచార్య ఘోష్ 'నా స్వేచ్ఛ పిలుపు' – నా అనువాదాలు కూడ అదే సంచికలో వచ్చాయి.

ఈ సచ్చిదానందన్ కవితానువాదంతో ములాఖాత్ కవిసంగమం పాఠకులందరికీ కూడ కావలసిందేనని ఇక్కడ ఇస్తున్నాను. ఇవాళ చదువుతుంటే కొన్ని చోట్ల అనువాదం మరింత మెరుగ్గా ఉండవచ్చుననిపిస్తుంది గాని, దాని వస్తువు నా అనువాదలోపాల్ని అధిగమించి జాజ్వల్యమానంగా వెలిగే శక్తి కలిగినది. ఆ కవిత గురించి చెప్పవలసిన విషయాలు మరికొన్ని ఉన్నాయి. ఈ కవిత మలయాళంలో మొదట ఎమర్జెన్సీ తొలగిపోగానే సిపిఎం పత్రిక 'దేశాభిమాని'లో అచ్చయింది. మళ్లీ మూడు సంవత్సరాల్లోనే ఆ కవితా పాదాలనే ఉటంకించి నిరసన తెలిపే అవసరం కలిగించిన సచ్చిదానందన్ అరెస్టు జరిగిందీ ఆ సిపిఎం నాయకత్వంలోని వామపక్ష ప్రభుత్వం కిందనే. అలా రాసిన రెండు మూడేళ్లకు మాత్రమే కాదు, ముప్పై ఐదు సంవత్సరాల తర్వాత ఇవాళ్టికి కూడ ఆ కవిత ఇప్పుడే రాసినంత తాజాగా, ప్రాసంగికంగా ఉంటుంది. ఈ కవితను అల్లం నారాయణ ఎన్నో సభల్లో తన

ఉపన్యాసాల్లో ఉటంకించాడు. ఇదే కవితను బెంగాలీ కవి దేవవ్రత పాండా రాసినదిగా పొరపడుతూ కెవిఆర్ 'వజ్రపాణి' అనే కలం పేరుతో అనువాదం చేసి 'అరుణతార' ఫిబ్రవరి 1981 సంచికలో ప్రచురించి, మళ్లీ మార్చ్ 1981 సంచికలో సవరణ వేసి 'సృజన'లో అచ్చయిన నా అనువాదాన్ని ప్రస్తావించారు. ఇదీ ఆ కవిత:

## స్వేచ్ఛ

వార్తాపత్రికలు చదివేవాళ్లందరూ
ఇక మనం నిర్భయంగా తిరగొచ్చునంటారు
ఫైళ్ల కిందా, బడ్జెట్ల కిందా
దాగి ఉన్న రక్కసి వికారపు తోకను వాళ్లింకా చూడనేలేదు
అదే సమస్య

తెల్ల షేర్వానీల మనుషులు
కవిత్వం నిషేధించబడని నూతన యుగం వచ్చిందంటారు
కవిత్వం గొంతు ఊపిరాగిపోయేదాకా నులిమేయబడ్డవాళ్ల
అక్షరాకృతి ధరించని నిట్టూర్పులను వాళ్లింకా వినసే లేదు
అదే సమస్య

రంగు కళ్లద్దాల మనుషులు ప్రజాస్వామ్య విజయోత్సవం చేసుకుంటారు
పూజారీ జమీందారూ చేయీ చేయీ కలిపి నడుస్తారు
పోలీసులూ జడ్జీ కళ్లు కలుపుకుంటారు
గుత్త పెట్టుబడిదారు వడ్డీ వ్యాపారిని రాత్రి భోజనానికాహ్వానిస్తాడు
పిచ్చి స్త్రీ నిద్ర లేకుండా వాడలు తిరుగుతూ ఉంటుంది
శవమూ చుట్టూ ముసిరిన ఈగలూ పేవ్‌మెంట్ మీదనే ఉంటాయి
చెవులు మూసుకొని పక్కకు తొలగిపోతాయి

ముసుగు సరిపోయింది, బాగుంది
కాని ముఖం సంగతేమిటి?
నీ తాబేదార్లందరికీ వాళ్ల వాళ్ల వాటాలందినాయి, బాగుంది
కాని జనం సంగతేమిటి?

నువ్వు రాసే స్వేచ్ఛను తిరిగి పొందావు, బాగుంది
కాని పాఠకులకు వాళ్ల అక్షరాలు నేర్పే వాళ్లెవరు?
పోయిన ప్రతిష్ఠను నువు తిరిగి పొందావు, బాగుంది
కాని చనిపోతున్న శిశువుకు ఆహారం దొరికేదెప్పుడు?
అదీ సమస్య.

లెక్కలింకా అబద్ధాలాడుతూనే ఉన్నాయి
భూతం ఇంకా మారువేషంలో తిరుగుతూనే ఉంది
ప్రశ్నించే ధైర్యం కలిగినవాళ్లింకా జైళ్లలో మగ్గిపోతున్నారు

ఇంకా నువు బ్రాహ్మణ న్యాయస్థానం
మహర్‌కు న్యాయం కొలిచి ఇస్తుందనుకుంటావు
ఢిల్లీ గాలికబుర్ల దర్బారు ఆకలిగొన్న సంథాల్ కోసం విప్లవ బిల్లును
ఆమోదిస్తుందనే ఆశిస్తావు

హర్యానా రైతులు, కాన్పూరు మోచీలు
బీర్భూం గిరిజనులు, బీహార్ గనిపనివాళ్లు
నీ ప్రజాస్వామ్యాన్ని నీకిచ్చారు
నువు వాళ్లకు తిరిగి ఏం ఇవ్వబోతున్నావు?

ఎద్దుల జతనా?
వద్దు – వాళ్లడిగేది మొత్తం భూమి
బోనస్ పెంపుదలా?
వద్దు – వాళ్లడిగేది మొత్తం కార్ఖానా
పలక ముక్కనా?
వద్దు – వాళ్లడిగేది మొత్తం సంస్కృతి
నువు వాళ్లకు వాటాలిస్తానంటావు
కాని పెట్టుబడేదీ?
అదీ సమస్య.

పెరికి వేయబడ్డ రక్తసిక్తనేత్రాలు మనను కనిపెడుతున్నయ్

కొరడా దెబ్బతిన్న వీపు మనముందు కొండలాగ నిలబడుతుంది
నరికివేయబడ్డ బొటనవేలు
ఇంకా ట్రిగ్గర్ కోసం వెతుకుతోంది

అయ్యా
స్వేచ్ఛ దుకాణం కాదు
ఒక 'మహాత్మాజీ' ప్రారంభించడానికీ
ఒక 'మాతాజీ' మూసివేయడానికీ
ఒక 'పితాజీ' మళ్లీ తెరవడానికీ
స్వేచ్ఛ
దుకాణం కాదు

వర్గాలకావల విశాలాకాశం వినిపించే సంగీతం స్వేచ్ఛ
హిమాలయాల కంటె బరువైన మరణం స్వేచ్ఛ
పసిఫిక్ కంటె లోతైన బతుకు స్వేచ్ఛ

ఇది నీకసలే అర్థం కాదు
అదే సమస్య
స్వేచ్ఛ, అవును స్వేచ్ఛే సమస్య

# కాగితం మీద ఒక మాటకు బలి

కవిత్వమే జీవితంగా పలవరించి 'కాగితం మీద ఒక మాటకు బలి' అయిపోయిన కొంపెల్ల జనార్దన రావు గురించి శ్రీశ్రీ రాసిన మాటలు మనందరికీ తెలుసు. మన జీవితంలో, మన పరిచయస్తులలో అట్లా కాగితం మీద ఒక మాటకు బలి అయిన కవులూ, హింసకూ పీడనకూ గురి అయిన కవులూ ఉంటే, వాళ్ల కవిత్వంతో ములాఖాత్ ఎంత రోమాంచకారి అవుతుంది?!

నాలుగు దశాబ్దాలకు పైగా అటువంటి చాలమంది కవులతో, వాళ్ల కవిత్వంతో ములాఖాత్ కలగడం నాకు వచ్చిన అరుదైన అవకాశం అనుకుంటాను. ఈ వారం నాకు సన్నిహితులైన అటువంటి ముగ్గురు కవుల గురించి చెపుదామనుకుంటున్నాను. ఒకరు కవిత్వం

రాసినందువల్ల హత్యకు గురైన జ్ఞానేశ్వర్ కీర్తి. మరో ఇద్దరు కవిత్వం రాసినందువల్ల విచారణ అవసరం లేని విధంగా ప్రభుత్వోద్యోగాల నుంచి తొలగింపుకు గురైన చెరబండరాజు, లోచన్.

జ్ఞానేశ్వర్ కీర్తి 1974 నుంచి 1980 లో హత్యకు గురయ్యేదాకా కవిత్వం రాశాడు. 'జార్జిరెడ్డీ, మేమూ నీ మార్గమే' అనే శీర్షికతో 1974లో 'సృజన'లో అచ్చయిన ఆయన కవిత చూడండి:

జార్జ్
నీవు అందించిన కొరడా కొస నుంచి
పిడివరకూ చేరుకున్నాం
నీవు కలలు గన్న
సమసమాజ స్థాపనకై
నెత్తురు ముగ్గులు పోస్తున్నాం
ఈ దోపిడీ గోడలను కూలదోసి
విద్యాలయాల లక్క ఇళ్లలోంచి
తప్పించుకుని
కార్మిక కర్షక రాజ్యం స్థాపించేవరకు
రాజీలేని పోరాటం చేస్తాం
జార్జ్
మేమూ నీ మార్గమే

జ్ఞానేశ్వర్ కులం రీత్యా, వృత్తి రీత్యా దర్జీ. జ్ఞానేశ్వర్ పేరు విప్లవ కవితాభిమానులకు తప్ప సాధారణ కవిత్వంలో పెద్దగా తెలిసిన పేరు కాదు. మొత్తం మీద ఇరవై దాకా కవితలు రాసి ఉంటాడేమో. ఇంకా రాయగలిగి ఉండేవాడు గాని ఇరవైల వయసు దాటకుండానే హత్యకు గురయ్యాడు. నేను హైస్కూల్‌లో ఉన్నప్పుడు జ్ఞానేశ్వర్‌ను – మిత్రులందరికీ జానీ – దాదాపు రోజూ కలిశాను. నిజానికి నా తొలి కార్మిక గురువులలో ఆయన ఒకరు. నేను చదువుకున్న మర్కజీ స్కూలు పక్కనే పది ఇరవై గజాల దూరంలో, రెండు మూడు ఇళ్లు దాటగానే బోర్డు కూడ లేకుండా జ్ఞానేశ్వర్ టేలర్ దుకాణం ఉండేది. అది దుకాణం అనేంత పెద్దది కూడ కాదు. ఒక కుట్టు మిషనూ, ఒక కటింగ్ టేబులూ, పక్కన రెండు స్టూళ్లు, మంచినీళ్ల కూజా పట్టే జాగా. అంతే. బడి నుంచి మధ్యాహ్నాలూ, ఖాళీ సమయాలూ అక్కడికి వెళ్లి కూచునేవాణ్ని. లష్కర్ బజార్, పెట్రోల్ పంపు షాపుల్లో 'సృజన' పెట్టడానికి వెళ్తూ వస్తూ ఆ షాప్‌లో కూచునేవాణ్ని.

జానీ తన కత్తెరతో బట్టలమీద విన్యాసాలు చేసినంత నైపుణ్యంతో కవిత్వం కూడ

రాసేవాడు. హాస్యస్ఫోరకంగా మాట్లాడేవాడు. నేను పదిహేనేళ్ల లోపు కుర్రవాడినీ, ఆయన ఇరవై దాటిన, చేతిలో అద్భుతమైన కళ ఉన్న దర్జీ. అయినా సరదాగా మాట్లాడుతూ ఉండేవాడు. మా స్కూలుకూ ఆయన టేలర్ షాపుకూ మధ్య ఉన్న ఇళ్లలో ఒక తొలితరం ప్రైవేటు విద్యాసంస్థ ఉండేది. ప్రైవేటు విద్యాసంస్థకు ఉండే అన్ని అవలక్షణాలతో, అక్రమాలతో, అన్యాయాలతో ఉండేది. జ్ఞానేశ్వర్ అవి సహించేవాడు కాదు. మరీ ముఖ్యంగా ఆ స్కూలు పిల్లల, తల్లిదండ్రుల, టీచర్ల బాధలు చూస్తుండేవాడు గనుక ఆ విద్యాసంస్థ యజమానితో నిత్యం గొడవ పెట్టుకునేవాడు. కవిత్వ, సాహిత్య అభిమానమే ఆయనకు ఆ ధర్మాగ్రహాన్నీ, ప్రతిఘటనాశక్తినీ ఇచ్చాయి. ప్రతిచోటా తన విద్యాసంస్థ అక్రమాలను ఎండగడుతూ, తనకు అడ్డు తగులుతూ ఉన్న జ్ఞానేశ్వర్ అడ్డు తొలగించుకోవాలనుకున్నాడు ఆ విద్యాసంస్థ యజమాని. 1980 ఫిబ్రవరి 8-9 రాత్రి తన దుకాణం ముందు అరుగు మీద పడుకుని ఉన్న జ్ఞానేశ్వర్ మీద పెట్రోల్ పోసి నిప్పంటించాడు. కొన్ని గంటల్లోనే జానీ మరణించాడు.

మెజిస్ట్రేట్ ముందు ఇచ్చిన మరణ వాంగ్మూలంలో జ్ఞానేశ్వర్ చెప్పిందిది: "నేను రచయితను. విప్లవ రచయితల సంఘంలో సభ్యుడను. సమాజంలో అన్యాయాలను, అక్రమాలను, దోపిడీ దౌర్జన్యాలను ప్రజలకు సవివరంగా తెలియజెపుతూ కవితలు, కథలు, నాటికలు, నాటకాలు, నవలలు రాస్తాను. వీలైనంతమేరకు ప్రతిఘటిస్తాము. అలాగే నేను కొండయ్య యొక్క శరత్ ప్రభుత్వామోదిత ఉన్నత పాఠశాల బోర్డు వెనక జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను, దోపిడీ దౌర్జన్యాలను ఎప్పటికప్పుడు మా వాడలోని ప్రజలకు వివరిస్తూ ప్రతిఘటిస్తూ వస్తున్నాను. అతడు సాగిస్తున్న వ్యాపారానికి నేను అడ్డంకిగా ఉన్నాను. అందుకే అతడు నన్ను శాశ్వతంగా నిర్మూలించాలనుకున్నాడు. ఆ ప్రయత్నంలో భాగంగానే నేను నిద్రిస్తున్న సమయం చూసి, పెట్రోల్, గ్యాస్ నూనె పోసి నిప్పంటించారు కొండయ్య, దామోదర్ కలిసి."

కవిత్వం రాసినందుకు, భావాలు కలిగి ఉన్నందుకు, వ్యక్తీకరించినందుకు అరెస్టులు, నిర్బంధాలు, కుట్రకేసులు అప్పటికే చూశాను, ప్రజా ఉద్యమ కార్యాచరణలో ఉన్నవారి హత్యలు కూడ చూశాను గాని, దర్జీగా తన పని తాను చేసుకుంటూ, ధర్మాగ్రహం, భావవ్యక్తీకరణ శక్తి ఉంటే కూడ ప్రతిఫలం హత్య అవుతుందని చూపిన అనుభవం అది.

ఏడాది తర్వాత కూడ కేసు విచారణ జరగక, హంతకులు బలాదూరుగా, వరంగల్ సామాజిక, సాంస్కృతిక రంగాల పెద్దమనుషులుగా తిరుగుతుంటే, 'జ్ఞాని – జానీ' అని 'సృజన' రాసిన సంపాదకీయంలో కొన్ని వాక్యాలు: "అతడు కామ్రేడ్ జార్జ్ మీదనో, పొలంలో పనిచేసే పాలేరు మీదనో, ట్యుటోరియల్ లో పనిచేసే అసహాయ అక్కచెల్లెళ్ల మీదనో, అట్టడుగు ప్రజలకోసం ప్రాణాలర్పించిన చిన్నాలు మీదనో, పాలడుగు కృష్ణ మీదనో కవిత్వం రాసాడు గాని, జార్ చక్రవర్తి మీద, పొలం కామందు మీద, ట్యుటోరియల్ విద్యాపోషకుని మీద,

ఇందిరాగాంధీ మీద, ఈ హంతక వ్యవస్థ మీద పొగడుతూ పద్యాలు రాయలేదు. పోనీ, రెండూ వదిలేసి యువకుడు గనుక ప్రేమ కవిత్వమో, ప్రభుత్వ కటాక్షం కోసం కుటుంబ సంక్షేమ కవిత్వమో రాయలేదు. మరి ఈ రోజుల్లో విప్లవ సాహిత్య 'విమర్శకులైన' పోలీసులకు, ప్రాసిక్యూటింగ్ మనస్తత్వంతోనే ఆలోచించే బూర్జువా మేధావులకు ఆయన కవి ఎట్లా అవుతాడు? కవులను చంపే గూండాలు పెద్దమనుషులుగా, 'పెద్దమనుషుల' గూండాయిజాన్ని బట్టబయలుచేసే కవులు 'గూండాలు'గా గుర్తించబడి ప్రచారం చేయబడుతున్న వ్యవస్థ ఇది..."

జానీ హత్య జరిగిన షాక్ నుంచి తేరుకోకముందే, నెల లోపుగానే, 1980 మార్చ్‌లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఉపాధ్యాయులుగా పనిచేస్తున్న చెరబండరాజు (బద్దం భాస్కర్ రెడ్డి), లోచన్ (జి. రాజలోచన్) లను ఉద్యోగాల నుంచి తొలగిస్తూ ఉత్తర్వులు జారీ చేసింది. రాష్ట్రపతి గాని, గవర్నర్ గాని "సంతృప్తి చెందితే", కారణం చూపకుండా, విచారణ లేకుండా, న్యాయవ్యవస్థ సమీక్షకు కూడ అవకాశం లేకుండా ప్రభుత్వోద్యోగులను తొలగించవచ్చుననే భారత రాజ్యాంగంలోని అధికరణం 311 (2)(సి) ప్రకారం ఈ తొలగింపులు జరిగాయి. చెరబండరాజు అప్పటికే బ్రెయిన్ కాన్సర్‌కు చికిత్సలో ఉన్నాడు. సికిందరాబాదు కుట్రకేసులో ముద్దాయిగా ఉన్నాడు. ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ కవిత్వం రాయడం మినహా ప్రత్యక్ష కార్యాచరణలో లేడు. లోచన్ తొలిరోజుల్లో 'తిరుగబడు' కవిగా, ఆ తర్వాత విరసం సభ్యుడిగా, 'సృజన' సాహితీమిత్రులలో ఒకరుగా ఉన్నారు. కవిత్వం రాయడం మినహా ఆయనకు కూడ ప్రత్యక్ష కార్యాచరణ లేదు. ఉత్తర్వులలోని చట్టపరమైన లొసుగులను ఉపయోగించుకుని కన్నబిరాన్ చేసిన వాదనలతో హైకోర్టు ఆ ఉత్తర్వులను కొట్టేసి, వారిద్దరినీ ఉద్యోగాలలో పునర్నియమించాలని తీర్పు చెప్పింది గాని, కేవలం కవిత్వ రచనకు కవులు పొందిన ప్రతిఫలం ఆ తొలగింపు. 'వీపు మీద కొట్టినా ఫరవాలేదు గాని కడుపు మీద కొట్టగూడదు' అంటారు. కాని తనకూ తన విధానాలకూ వ్యతిరేకంగా కవిత్వం రాశారన్న అక్కసుతో మాత్రమే ప్రభుత్వం కవుల కడుపు మీద కొట్టడానికి ప్రయత్నించిన ఉదంతం ఆ తొలగింపు.

# జీవితమే కవిత్వమైన కవి జీవితం

ఈవారం కూడ కవిత్వంతో ములాఖాత్‌ల పురాస్మృతుల పరంపర నుంచి పక్కకు జరిగి ఒక భావోద్వేగభరితమైన, కవితామయమైన సమీపగతపు అనుభవం చెప్పదలచాను. ఈ ములాఖాత్ కవిత్వంతోనా, కవితోనా, కవి సహచరితోనా, కాలంతోనా చెప్పలేను. అన్నీ కలగలిసినదది. ఈ ములాఖాత్ ఒక సామాజిక చరిత్ర శకలంతోననేది సుస్పష్టమే గాని ఆ చరిత్ర గతమా, వర్తమానమా, గతవర్తమానాలు అభేదమైన మన సామాజిక అనివార్యతనా చెప్పలేను. అది కైఫీ ఆజ్మీతో ములాఖాత్.

కైఫీ ఆజ్మీ కవిత్వం ఆయన పేరు తెలియకుండానే హిందీ సినిమా పాటల్లో అంతకుముందు విన్నానేమో గుర్తు లేదు గాని, 1980లో ఇంతకుముందే ప్రస్తావించిన 'యూత్ టైమ్స్' ప్రేమ కవిత్వ ప్రత్యేక సంచికలో కైఫీ కవిత ఒకటీ, కైఫీ గురించి ఆయన సహచరి షౌకత్‌తో ఇంటర్వ్యూ చేసి రాసిన వ్యాసం ఒకటీ చదివాను. బహుశా ఆ తర్వాత రెండు మూడేళ్లకనుకుంటాను ఉర్దూ-హిందీ రెండు భాషల్లో కైఫీ కవిత్వం అచ్చువేసిన ఒక చౌక ప్రచురణ కూడ ఎక్కడో ఉత్తరాది రైల్వే స్టేషన్ ప్లాట్‌ఫారం మీద కొనుక్కున్నాను. ఆ తర్వాత ఇరవై ఏళ్లకు పవన్ కె వర్మ అనువాదం చేసిన, పెంగ్విన్స్ ప్రచురించిన 'కైఫీ ఆజ్మీ సెలెక్టెడ్ పొయెమ్స్' హిందీ-ఇంగ్లిష్ ద్విభాషా ప్రతీ కొనుక్కున్నాను. సవ్యసాచిలా అద్భుతమైన ప్రేమకవిత్వమూ విప్లవకవిత్వమూ రాశాడనీ, కమ్యూనిస్టు అనీ, హైదరాబాద్ అల్లుడనీ, అసాధారణ రంగస్థల నటి షౌకత్ సహచరుడనీ, అపురూప నటీ, సామాజిక కార్యకర్తా షబానా ఆజ్మీకీ, విశిష్ట సినిమాటోగ్రాఫర్ బాబా ఆజ్మీకీ తండ్రి అనీ బహుశా డజన్ల కొద్దీ వ్యక్తిగత, సామూహిక, రాజకీయ అస్తిత్వాలు కలగలిసిన కైఫీ ఆజ్మీ గురించి ఎన్నెన్నో కథలూ గాథలూ విన్నాను. అలా ముప్పై ఐదేళ్లుగా మనసుకు దగ్గరగానే ఉన్న కైఫీ ఈ వారం పదిరోజుల్లో మరింత దగ్గరికి వచ్చాడు.

అయితే ఈ కవిత్వంతో ములాఖాత్‌కు వస్తువు కావడానికి నా మనసుకు దగ్గరికి రావడం ఒక్కటే కారణం కాదు. కవి వ్యక్తిత్వం ఎంత బహుముఖంగా, విశాలంగా ఉండాలో, కవిత్వమూ జీవితమూ ఎంతగా వాగర్థాలలా కలిసిపోవాలో, అత్యంత సున్నిత, సూక్ష్మ ఘటనల నుంచి అత్యంత విశాల, స్థూల ఘటనల దాకా ప్రపంచంలోని ప్రతి పరిణామమూ కవిని ఎలా కదిలిస్తుందో కైఫీ జీవితమూ కవిత్వమూ చూపుతాయి. కవిత్వం ఏకకాలంలో ఎంత సుకుమారంగానూ ఎంత కఠినంగానూ, ఎంత నిర్దిష్టంగానూ ఎంత సార్వజనీనంగానూ, ఎంత విశాలంగానూ ఎంత లోతుగానూ ఉండగలదో కైఫీ కవిత్వం చూపుతుంది. తన వ్యక్తిగత అనుభవాన్నీ, అనుభూతినీ ప్రతి పఠితకూ అంతే వ్యక్తిగత అనుభవంగా అనుభూతిగా సాంద్రంగా గాఢంగా అందించగల సామర్థ్యం కైఫీది. కైఫీ జీవితమూ కవిత్వమూ కూడ కవులకు ఒక పాఠ్యప్రణాళిక. అందువల్ల కైఫీ గురించి ఇక్కడ రాయడం అవసరమనుకుంటున్నాను.

కైఫీ నా జీవితంలోకి మళ్లీ ప్రవేశించిన సందర్భం చెప్పాలి. హైదరాబాదులో ఇంగ్లిష్ పుస్తకాల ప్రపంచానికి ఆరు దశాబ్దాలుగా ఒక విశాలమైన గవాక్షంగా ఉండిన ఎ ఎ హుస్సేన్ పుస్తకాల దుకాణం అక్కడ ఒక అత్యాధునిక మాల్ రాబోతున్నది గనుక మూతపడుతున్నది. నిలువ ఉన్న పుస్తకాలన్నిటినీ సగం ధరకు అమ్మేస్తామని యజమానులు ప్రకటించారు. ధర ఎక్కువ అనుకునో, వెలువడిందని తెలియకనో గతంలో కొనుక్కోలేకపోయిన పుస్తకాలు దొరుకుతాయి గదా అనీ, ఆ చిరస్మరణీయమైన దుకాణపు ఆఖరి జ్ఞాపకం తెచ్చుకుందామనీ

వెళ్లాను. అక్కడ దొరికిన పుస్తకాలలో ఒకటి షౌకత్ కైఫీ రాసిన ఆత్మకథాత్మక కవి జీవితం 'కైఫీ అండ్ ఐ'. కైఫీ 2002లో చనిపోతే, షబానా ఆజ్మీ, ఆమె సహచరుడు జావేద్ అఖ్తర్ పట్టుబట్టి షౌకత్‌తో ఈ జ్ఞాపకాల గుచ్ఛాన్ని – 'యాద్ కే రాహ్‌గుజార్' – రాయించి 2005లోనే ఉర్దూలో ప్రచురించారు. పాకిస్తాన్‌కు చెందిన, ప్రస్తుతం బ్రిటన్‌లో ఉంటున్న అర్థశాస్త్రవేత్త, రంగస్థల ప్రయోక్త, సినిమా స్క్రీన్ ప్లే రచయిత నస్రీన్ రెహ్మాన్ చేసిన ఇంగ్లిష్ అనువాదం 'కైఫీ అండ్ ఐ' పేరుతో 2010లో వచ్చింది. ఆ పుస్తకం ఇంగ్లిషులో వచ్చి ఐదు సంవత్సరాలైనా తెలియకుండా ఉన్న నా అజ్ఞానానికి నన్ను నిందించుకుంటూ పుస్తకం తెచ్చుకున్నాను.

ఆ పుస్తకం ఒక అద్భుతం. కవులూ కవిత్వాభిమానులూ భారత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర విద్యార్థులూ సామాజిక స్పందనలున్న ప్రతి ఒక్కరూ చదవవలసిన అసాధారణమైన కవి జీవితం అది. 'మనకాలపు కవికి ఏకాంతమూ సమూహమూ రెండూ ప్రాథమిక విధులుగానే ఉన్నాయి' అనీ, 'మనకాలపు కవి వేనవేల జీవితాలు జీవిస్తాడ'నీ పాబ్లో నెరూడా అన్నమాటలు సంపూర్ణంగా సరిపోయే కవి కైఫీ ఆజ్మీ. ఉత్తరప్రదేశ్ ఆజమ్‌గఢ్ జిల్లాలో మారుమూల కుగ్రామం మిజ్వాలో షియా ముస్లిం జమీందారీ కుటుంబంలో పుట్టిన సయ్యద్ అఖ్తర్ హుస్సేన్ రజ్వీ పదకొండో ఏట మొదటి కవిత రాశాడు. ఇరవైమూడో ఏట క్విట్ ఇండియా ఉద్యమ ప్రభావంలోకి వచ్చి, ఇల్లు వదిలి త్వరలోనే కమ్యూనిస్టు రాజకీయాల్లో ప్రవేశించాడు. ఒకవైపు కాన్పూర్ వస్త్రపరిశ్రమ కార్మికుల ఉద్యమాన్ని నిర్మిస్తూ మరొకవైపు కవిత్వ రచన కొనసాగించాడు. అప్పటికి ప్రబలంగా ఉండిన అభ్యుదయ రచయితల ఉద్యమంలో ప్రముఖుడయ్యాడు. అటు కార్మికోద్యమాన్నీ ఇటు సాహిత్య ఉద్యమాన్నీ నిర్మించడానికి పార్టీ పిలుపు మేరకు 1946 నాటికి బొంబాయి చేరి అలీ సర్దార్ జాఫ్రీతో కలిసి పార్టీ పత్రిక 'క్వామీ జంగ్' నిర్వహించాడు.

అప్పటికే కైఫీ ఆజ్మీ అనే కలంపేరుతో గుర్తించదగిన ఉర్దూ యువకవిస్వరంగా ప్రసిద్ధుడై, హైదరాబాదులో 1947 ఫిబ్రవరిలో జరిగిన ఉర్దూ అభ్యుదయ రచయితల కవిసమ్మేళనంలో పాల్గొని అక్కడ కలిసిన షౌకత్‌తో ప్రేమలో పడ్డాడు. తండ్రి నిజాం ప్రభుత్వంలో ఉన్నతోద్యోగిగా షౌకత్‌ది సంపన్న కుటుంబం. కైఫీదీ జమీందారీ కుటుంబమే గాని అది వదిలి వచ్చి కమ్యూనిస్టు పార్టీ పూర్తికాలం కార్యకర్తగా బొంబాయిలో కమ్యూన్‌లో ఉంటున్నాడు. షౌకత్ సున్నీ, తాను షియా. షౌకత్ తండ్రి మినహా కుటుంబంలో ఎవరూ వాళ్ల ప్రేమను ఆమోదించలేదు. అడ్డుకున్నారు. అయినా వాళ్ల ప్రేమ అన్ని అవరోధాలనూ జయించింది. కమ్యూన్‌లో, కష్టాల్లో, సుఖాల్లో, ఆలోచనల్లో, ఆచరణల్లో, మళ్లీ తన గ్రామానికి వెళ్లిన చివరి దశలోనూ ఆరు దశాబ్దాల పాటు కైఫీ షౌకత్ లిద్దరూ అవినాభావ అనురాగభరిత సహజీవనం గడిపారు. కమ్యూనిస్టు పార్టీ చీలికను వ్యక్తిగత విషాదంగా భావించి కవిత్వంలో వ్యక్తీకరించినప్పటికీ కైఫీ చివరిదాకా కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం ఒక గర్వకారణంగా భావించే విలువల్లోనే జీవించాడు. సినిమారంగంలోకి వెళ్లినా ఆ జిలుగువెలుగులు అంటకుండా చివరిదాకా

నిరాడంబరంగానూ కార్మికవర్గ పక్షపాతంతోనూ గడిపాడు. వ్యవస్థను మార్చే, సమసమాజాన్ని సాధించే పెద్దపోరాటాల మీద ఆశ వదులుకోక పోయినా, సమాజానికి తనకు వీలైన చిన్న సహాయమైనా చేయాలనుకుని ఆరు దశాబ్దాల తర్వాత తన గ్రామానికి వెళ్లి అక్కడ విద్యా వైద్య సామాజిక చైతన్య కార్యక్రమాలు ప్రారంభించాడు.

ఈ కాలమంతా కైఫీ నిర్విరామంగా కవిత్వం రాశాడు. కమ్యూనిస్టు పత్రికలలో, కార్మిక సంఘాలలో, అభ్యుదయ రచయితల సంఘంలో, ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ (ఇప్టా)లో పనిచేశాడు. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం జరుగుతున్నప్పుడే 1948లో రాసిన తెలంగాణ కవిత నుంచి, పార్టీ చీలిక, లెనిన్, బంగ్లాదేశ్, చారు మజుందార్, దేశంలో జరుగుతున్న మతకల్లోలాలు, వర్గ పోరాటంలో మధ్యతరగతి విచికిత్స వంటి ఎన్నో రాజకీయ, సామాజిక అంశాల మీదా, అతి సున్నితమైన, హృద్యమైన వ్యక్తిగత అనుభూతుల మీదా విస్తారంగా కవిత్వం రాసి ఇరవయో శతాబ్ది ఉర్దూ కవులలో అగ్రగణ్యుడిగా గుర్తింపు పొందాడు. ఇక షౌకత్ పృథ్వీరాజ్ కపూర్ నేతృత్వంలోనూ, ఇప్టాలోనూ రంగస్థల కళాకారిణిగా దేశవ్యాప్తంగా డజన్ల కొద్దీ నాటకాల్లో నటించింది. సినిమారంగంలో కూడ ప్రవేశించింది. ఆ ఇద్దరి అపురూప సహజీవనానికి కళాత్మక చిత్రణ 'కైఫీ అండ్ ఐ'.

ఆ పుస్తకం చదవగానే, ఉర్దూలో వెలువడి పదేళ్లూ, ఇంగ్లిష్‌లో వెలువడి ఐదేళ్లూ అయినా తెలుగులోకి ఇంకా ఎందుకు రాలేదా అని విచారం కలిగింది. షౌకత్ హైదరాబాదీ గనుక, బాల్యమూ తొలియవ్వనమూ గడిపిన నేలలో, తెలిసిన భాషలో ఈ పుస్తకం పరిచయం అయి ఉండవలసిందని అనిపించింది. కైఫీ జీవిత కవిత్వాల నుంచి మనం తెలుసుకోగలిగింది ఎంతో ఉంది గనుకా, ఈ పుస్తకంలో చిత్రణ పొందిన సామాజిక చరిత్ర మనం తప్పకుండా గ్రహించవలసింది గనుకా ఇది తెలుగులోకి రావాలనిపించింది. వెంటనే షౌకత్‌కు ఒక ఉత్తరం రాసి ముంబాయి మిత్రుల ద్వారా చేర్చాను. ఆ ఉత్తరం అందిన వెంటనే, పుస్తకం తెలుగు అనువాదం మాట విని షౌకత్ చాల సంతోషపడ్డారనీ, అనువాదానికి అనుమతి ఇస్తున్నామనీ, అయినా ఇంగ్లిష్ అనువాదకురాలి అనుమతి కావాలి గనుక నస్రీన్ రెహ్మాన్‌కు కూడ రాస్తున్నామనీ షబానా ఆజ్మీ నుంచి ఉత్తరం వచ్చింది. కొన్ని గంటల్లోనే నస్రీన్ రెహ్మాన్ నుంచీ అనువాదానికి అనుమతిస్తూ ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరాలు అందిన మరికొన్ని గంటల్లోనే, షౌకత్ మాట్లాడతానంటున్నారని షబానా ఆజ్మీ ఫోన్ చేశారు. తన పుస్తకం, కైఫీ గురించిన తన జ్ఞాపకాలు తన బాల్య కౌమారాల భాషలోకీ, నేలలోకీ అనువాదం అవుతున్నాయంటే ముప్పిరిగొన్న ఆనందం ఎంత ప్రగాఢమైనదో ఎనభై ఐదేళ్లు దాటిన షౌకత్ గొంతులో వినడం అంచితానంద శాంత సామ్రాజ్యం చేరిన అనుభవమే. ఆమె పదిహేనో ఏటికన్న ముందే, 1940లలో వరంగల్‌లో రెండు సంవత్సరాలు గడిపారనీ, అక్కడ ఒక బడిలో పాఠాలు చెప్పారనీ పుస్తకంలో చదివాను గనుక, నేను వరంగల్ వాడినని కూడ చెప్పాను. ఆమె మరింత సంతోషించి తన వరంగల్ రోజులు తలచుకున్నారు.

కవిత్వంతో ములాఖాత్ సరే, కవులతో, కవుల సహచరులతో, కవుల జీవితాలతో ములాఖాత్ కూడ ఎంత అద్భుతంగా, రోమాంచకారిగా, హృద్యంగా ఉంటుంది!!

కైఫీ ఆజ్మీ కవితలు రెండు:

### ఒక ముద్దు (1951)

ఈ సౌందర్యభరితమైన కళ్లను ముద్దాడినప్పుడల్లా
కటిక చీకటిలో వందల దీపకళికలు వెలుగుతాయి

పూలూ, మొగ్గలూ, జాబిల్లీ, నక్షత్రాలూ మాత్రమే కాదు
ప్రత్యర్థి కూడ ఆమె పాదాల ముందు మోకరిల్లుతాడు

అజంతా శిల్పాలు నాట్యం చేయడం మొదలెడతాయి
అనాదిగా నోళ్లు మూతబడిన గుహలు పాటలు వినిపిస్తాయి

దిక్కూ మొక్కూ లేని ఉద్యానవనాలు మోసులెత్తుతాయి
దప్పికగొన్న బీడు భూమిపై కాలమేఘాలు పరచుకుంటాయి

ఒక క్షణం ఈ లోకం పీడనను పరిత్యజిస్తుంది
ఒక క్షణం బండరాళ్లు సైతం చిర్నవ్వుతాయి

### ఇల్లు (1962)

ఈ రాత్రి మాడ్చే వేడిగాలి వీస్తున్నది
దారిపక్క ఈ రాతిరి నిద్ర చేర రాకున్నది
పద లేద్దాం నువ్వూ నేనూ నువ్వు కూడ నువ్వు కూడ
ఈ గోడకెక్కడో కిటికీ తప్పక తెరుచుకుంటుంది

మనను మింగేయడానికి ఈ భూమి ఎదురుచూస్తున్నది
చెట్ల కొమ్మల నుంచి జారి ఈ నేలను మన పాదాలు తాకినప్పుడు

ఈ ఇళ్లూ లేవు, ఆ ఇళ్లలో నివసించేవాళ్లూ లేరు
గుహల్లో దాగి ఉండిన రోజుల కథలెవరికీ తెలియవు

పనిముట్లుగా మారిన మన చేతులెన్నడూ అలసిపోలేదు
ఆకృతి మీద ఆకృతి కొత్త రూపాలు తయారు చేశాం మనం
గోడలు నిర్మించాం, కట్టుదిట్టం చేశాం, ఇంకా బలోపేతం చేశాం
కప్పుల్ని అలంకరించాం, ద్వారబంధాలను బలసంపన్నం చేశాం

మంటలను గాలి సులభంగా చల్లార్చింది గనుక
మనం ఆకసాన్ని విద్యుత్తుతో తీర్చిదిద్దాం
భవంతి తయారయ్యాక, కాపలాదారు మనను అడ్డగించాడు
నిర్మాణపు సందోహంలో ఆకలితో నిద్రించాం మనం

నరనరాన పరచుకున్న నిరంతర శ్రమ అలసట
మూసిన కళ్లలో నిర్మించిన భవంతి దృశ్యాలు
అంతులేని దినం మన తలల మీద అలా కరిగిపోతుంది
నిద్రలేని రాత్రులు యథావిధిగా మిగిలిపోతాయి

# అనుబంధాలు, వెంటనే పగలని గాజు గ్లాసులు

సుబ్బారావు పరిచయం చేసిన కవితా సంప్రదాయాలు, సందర్భాలు, కవులు నా కవిత్వ ములాఖాత్‌లలో నాకు అత్యంత ఆత్మీయమైనవీ, ఆర్ద్రమైనవీ, సాంద్రమైనవీ.

సురా పేరుతో తెలుగులో కవిగా, సాహిత్య విమర్శకుడిగా, విశ్లేషకుడిగా సుప్రసిద్ధుడైన సి వి సుబ్బారావు (1953–1994) రాడికల్ విద్యార్థి సంఘం నిర్మాణంలో ఉన్నాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థి ఉద్యమ ప్రతినిధిగా ఆర్ఎస్‌యు 1975 ఫిబ్రవరి మొదటి మహాసభలో ముగ్గురు ఉపాధ్యక్షులలో ఒకరుగా ఎన్నికయ్యాడు. విశాఖపట్నం శ్రీశ్రీ షష్టిపూర్తి నాటి నుంచే సాహిత్యంలో, సాహిత్యంతో ఉన్నాడు. విప్లవ రచయితల సంఘంలోనూ ఉన్నాడు. ఎమర్జెన్సీ విధించగానే అరెస్టయి, ఆ కాలమంతా జైల్లో ఉన్నాడు. జైలులోనుంచే ఎంఎ ఎకనమిక్స్ పరీక్షలు రాసి అగ్రశ్రేణిలో ఉత్తీర్ణుడై, ఎమర్జెన్సీ అనంతరం ఢిల్లీ విశ్వవిద్యాలయ శ్రీ గురు తేగ్ బహదూర్ ఖాల్సా కళాశాలలో లెక్చరర్‌గా చేరాడు. ఎమర్జెన్సీ కాలపు అత్యాచారాల

పరిశోధననూ, ఎమర్జెన్సీ అనంతర దేశవ్యాప్త ప్రజావెల్లువను సమన్వయించడాన్నీ తమ భుజాలకెత్తుకున్న ఢిల్లీ బుద్ధిజీవుల బృందంలో ప్రముఖుడయ్యాడు. ఒక దశాబ్దానికి పైగా ఢిల్లీ పీపుల్స్ యూనియన్ ఫర్ డెమొక్రటిక్ రైట్స్ (పియుడిఆర్) కు సమస్తమూ అయ్యాడు. ఎమర్జెన్సీ అనంతరం పునఃప్రారంభమైనప్పటి నుంచి 1985 చివర ఆగిపోయేదాకా 'సృజన' సాహితీమిత్రులలో కీలకంగా ఉన్నాడు.

ఆ రోజుల్లో సుబ్బారావు ఎండకాలం సెలవులన్నీ హనుమకొండ కేంద్రంగా పెట్టుకుని రాష్ట్రమంతా తిరిగేవాడు. ఆ సెలవుల్లో మాత్రమే కాక, ఎప్పుడు సెలవులు దొరికినా, ఏదైనా ఘటనమీద నిజనిర్ధారణ కమిటీ వచ్చినా, సభలు, సమావేశాల కోసమైనా హనుమకొండకు తరచుగా వస్తుండేవాడు. 1975 నుంచీ మిత్రుడుగా, అపార ప్రజ్ఞావంతుడుగా, ఉద్వేగాన్నీ, విశ్లేషణనూ అద్భుతంగా సమ్మేళనం చేసే వ్యక్తిగా, సంభాషణా చతురుడిగా, స్నేహశీలిగా నాకు తాను ఒక హీరో. ఢిల్లీలో తాను పనిచేస్తుండిన కాలేజి ఈవినింగ్ కాలేజి గనుక, ప్రతిరోజూ సాయంత్రం బయల్దేరి ఏ అర్ధరాత్రికో తన గదికి చేరేవాడు గనుక తన దివారాత్రాల దినచర్య మారిపోయింది. ఉదయం ఆరు, ఏడు నుంచి మధ్యాహ్నం ఒంటిగంట దాకా తన నిద్రాసమయం. హనుమకొండలో ఉన్నప్పుడు కూడ ఆ దినచర్యే అమలయ్యేది గనుక తనతో పాటు నేనూ నిశాచరుణ్ని కావలసివచ్చేది.

ఆ అనంత నిశీధి సంభాషణలన్నీ వెలుగుల రవ్వల జడులు. 'ఆనో భద్రా క్రతవో యంతు విశ్వతః' (విశ్వం అంతటి నుంచీ ఉదాత్తమైన ఆలోచనలు వచ్చుగాక) అనే రుగ్వేదపు మాట ఆ తర్వాత చాల ఏళ్లకు విన్నాను గాని, 'ఐ హావ్ టేకెన్ ఆల్ నాలెడ్జ్ టు బి మై ప్రావిన్స్' (సమస్త జ్ఞానాన్నీ నా పరిధిలోకి తీసుకున్నాను) అనే ఫ్రాన్సిస్ బేకన్ మాట అప్పటికే విన్నాను. సుబ్బారావుతో సంభాషణ, సుబ్బారావును వింటూ ఉండడం ఆ రెండు మాటలకూ అచ్చమైన నిదర్శనం. మిగిలిన విషయాలు ఇక్కడ అవసరం లేదు గాని కవిత్వం మీద సుబ్బారావు ప్రేమ గురించీ, అది ఆయన వ్యక్తం చేసే తీరు గురించీ మాత్రం చెప్పుకోవాలి.

సుబ్బారావు స్వయంగా చిక్కనైన కవిత్వం రాశాడు. కవిత్వం పట్ల మంచి అభిరుచి ఉండేది. ఆధునిక తెలుగు వచన కవుల్లో కనీసం ఇరవై మందినైనా పుస్తకం చూడకుండా నోటి మీద చెప్పగలిగేవాడు. ఆ కవితా ఉచ్చారణ కూడ భావస్ఫోరకంగా ఉండేది. శ్రీశ్రీ, తిలక్, దిగంబరకవులు దాదాపు ప్రతి అక్షరమూ తనకు నాలుక మీద ఆడుతుండేవారు. ఒక మనిషికి అంత విస్తృతమైన జ్ఞాపకశక్తి ఉండడం చూసి ప్రతి సందర్భంలోనూ నాకు ఆశ్చర్యం కలుగుతుండేది. అధ్యయనం ద్వారా తనకు ఇతర భాషాకవులు లెక్కలేనంతమంది తెలుసు. ఇక పౌరహక్కుల ఉద్యమంలో భాగంగా దేశమంతా తిరిగాడు గనుకా, రాజధానిగా ఢిల్లీకి అన్ని భాషల వాళ్లూ వస్తారు గనుకా భారతీయ భాషలన్నిటి కవిత్వం గురించీ, కవుల గురించీ కూడ తన దగ్గర చాల సమాచారం ఉండేది.

ఎమర్జెన్సీ ఎత్తివేయగానే ఢిల్లీ నుంచి వెలువడిన బహుభాషల ఎమర్జెన్సీ వ్యతిరేక కవితల హిందీ అనువాదాల చిన్న పుస్తకం 'రక్తబీజ్', ఇంగ్లిష్ సంకలనం 'డిసెంటింగ్ వాయిసెస్', జాన్ ఆలివర్ పెర్రీ సంపాదకత్వం వహించిన పదిహేను మంది భారతీయ కవుల ఎమర్జెన్సీ వ్యతిరేక కవిత్వపు పెద్ద ఇంగ్లిష్ సంపుటం 'వాయిసెస్ ఆఫ్ ఎమర్జెన్సీ', చెరబండరాజు కవిత్వానికి మొదటి ఇంగ్లిష్ అనువాదం 'స్వోర్డ్ సాంగ్ అండ్ అదర్ పొయెమ్స్' వంటి ఎన్నో కవిత్వ పుస్తకాల వెనుక సుబ్బారావు కృషి ఉంది. 1978 నుంచి పది, పదిహేనేళ్ల పాటు సుబ్బారావు నాకు చదివి వినిపించిన, పరిచయం చేసిన, నాతో అనువాదం చేయించిన కవులు డజన్లకొద్దీ ఉంటారు. పాబ్లో నెరూడా, బెర్టోల్ట్ బ్రెహ్ట్ వంటి కవులనూ, పాలస్తీనా పోరాట కవులనూ నేను మరింతగా తెలుసుకున్నది సుబ్బారావు ద్వారానే. మార్గె పియర్సీ వంటి అంతగా ప్రముఖులు కాని అమెరికన్ కవులనెందరినో సుబ్బారావే నాకు పరిచయం చేశాడు. ఫైజ్ అహ్మద్ ఫైజ్ నుంచి కుమార్ వికల్, అమర్‌జిత్ చందన్‌ల దాకా ఎంతో మంది సుబ్బారావు ద్వారానే పరిచయం కావడమో, ఎక్కువ తెలియడమో జరిగింది. నిజానికి ఏ కవిత్వాభిమానికైనా ఇటువంటి విలువైన కవిత్వ ములాఖాత్‌ల అవకాశం ఇవ్వగల మిత్రులు ఉండడం గొప్ప అదృష్టమనుకుంటాను.

సుబ్బారావు నాకు పరిచయం చేసిన అనేకమంది కవులలో పంజాబీ కవి అమితోజ్ ఒకరు. ఆ సందర్భం గురించి నా కవితా సంపుటం 'పాఁవురం' ముందుమాటలో రాసింది ఇక్కడ ఉటంకిస్తున్నాను:

"ఇప్పటి అవగాహనలతో వెనక్కి తిరిగి చూసినప్పుడు, కవిత్వం మీద నా పాఁవురంలో చెప్పుకోవలసిన మరొక మైలురాయి 'గాజుగ్లాసులు' అనువాదం.

ప్రతి సంవత్సరం లాగే 1982 ఎండాకాలంలో కూడ సివి సుబ్బారావు హనుమకొండలో ఉన్నాడు. సుబ్బారావు ఉన్నాడంటే ఆ నెలో, నెలన్నరో నాకు రాత్రులు నిద్రలేదన్నమాటే. అటువంటి రాత్రుల్లో ఒకరాత్రి రెండింటికి హనుమకొండ చౌరస్తాలో కోహినూర్ హోటల్లో చాయ్ తాగి వెనక్కి తిరిగివస్తున్నాం. కుమార్‌పల్లి రోడ్డులో డా. నరసింహారావు ఆసుపత్రికీ, సెంట్రల్ బ్యాంకుకూ మధ్య హఠాత్తుగా రోడ్డు మధ్య నిలబడిపోయాడు సుబ్బారావు. We are not just glass tumblers that fall from the hand and off they break అని కవిత మొత్తం చదివాడు. ఉద్వేగం వస్తే నడుస్తూ నడుస్తూ ఉన్నవాడు అట్లా ఆగిపోయి కవిత్వం వినిపించడం నాకు కొత్త కాదు. అటువంటి ఉద్వేగ సమయాల్లోనూ, ప్రశాంతతలోనూ తన ద్వారా నాకు పరిచయమైన కవులూ కవిత్వాలూ లెక్కలేనన్ని.

ఈ కొత్త కవిత అమితోజ్ అనే అంత ప్రముఖుడు కాని పంజాబీ కవిది. సుబ్బారావు ఎవరో పంజాబీ స్నేహితుడి దగ్గర విన్నాడు. మానవసంబంధాల గురించీ, అవి బలపడే తీరు గురించీ, తెగిపోయే తీరు గురించీ అప్పటికే ఆలోచిస్తున్న నాకు ఈ కవిత గొప్ప

ఊరటనిచ్చింది. కొత్త వెలుగులు పరిచింది. హృదయానికి చాల సన్నిహితమనిపించింది. మానవ సంబంధాల పెరుగుదలా విచ్ఛిత్తీ, సామీప్యమూ దూరమూ కూడ ఎంత దీర్ఘకాలికమైనవో, సంక్లిష్టమైనవో ఈ కవిత చూపింది. సుబ్బారావు ఢిల్లీ వెళ్లిన వెంటనే ఆ కవిత పూర్తి పాఠం ఇంగ్లిష్ అనువాదం చేసి పంపాడు. దానికి నేను చేసిన తెలుగు అనువాదం 1982 సెప్టెంబర్‌లో 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో అచ్చయింది."

అమితోజ్ అంత ప్రముఖుడు కాదని 2002లో ఆ ముందుమాటలో రాశాను గాని, ఇప్పుడు ఇంటర్నెట్ పుణ్యమా అని వెతికితే, 1947లో పుట్టి 2008లో మరణించిన అమితోజ్ పంజాబీ కవిత్వ, నాటక రంగాలలో సుప్రసిద్ధుడని తెలుస్తున్నది. 1960 దశకం చివరిలో పంజాబీ కవిత్వంలోకి శక్తిమంతంగా దూసుకొచ్చిన అవతార్ సింగ్ పాష్, సుర్జిత్ పాతర్, మంజిత్ తివానాల వంటి యువతరంగాలలో అమితోజ్ పేరు కూడ ఉంది. పంజాబీ సాహిత్యంలో పిఎచ్ డి చేసి, పంజాబ్ విశ్వవిద్యాలయంలో తులనాత్మక సాహిత్య శాఖలోనూ, నాటకరంగ శాఖలోనూ అధ్యాపకుడిగా పనిచేశాడు. బంగ్లాదేశ్ యుద్ధ సమయంలో పాకిస్తాన్ టాంకులకు ఎదురువెళ్లి ఆత్మత్యాగం చేసిన వీరనారి రోషనారా గురించి 1971లో అమితోజ్ రాసిన కవితను వార్తా సంస్థ యుఎన్ఐ దేశవ్యాప్తంగా పంపి ప్రచారం చేసింది. బ్రెహ్ట్ సుప్రసిద్ధ నాటకం 'కకేషియన్ చాక్ సర్కిల్' ను అమితోజ్ పంజాబీలోకి అనువర్తింపజేసి అనేక చోట్ల ప్రదర్శింపజేశాడు. ఈ 'గాజుగ్లాసులు' కవిత మొదటి చరణం ఇంటర్నెట్ మీద దొరుకుతున్నది. పంజాబీ మిత్రుల ద్వారా విని సుబ్బారావు చేసిన ఇంగ్లిష్ అనువాదం కన్న ఇంటర్నెట్ మీద అనువాదపు చరణం కొంచెం భిన్నంగా ఉంది. (పడిపోయిన వెంటనే పగిలిపోవడానికి/ మనం గాజుగ్లాసులం కాము/ నేస్తం, మనం ప్రియస్నేహితులం కదా/ మొదట ఒకరి చూపుల్లోంచి ఒకరం చెరిగిపోతాం/ ముక్కలు ముక్కలుగా విరిగిపోతాం). పూర్తి పాఠానికి కూడ మరొక అనువాదం ఉందేమో తెలియదు గాని అది దొరకడం లేదు. సుబ్బారావు ఇంగ్లిష్ చేసిన పాఠానికి, ఆంధ్రజ్యోతి వారపత్రిక 1982 సెప్టెంబర్ 10 సంచికలో అచ్చయిన నా తెలుగు అనువాదం చూడండి:

## గాజుగ్లాసులు

పడిపోయిన వెంటనే పగిలిపోవడానికి
మనం గాజుగ్లాసులం కాము నేస్తం!
మనం స్నేహితులం

మొట్టమొదట –

మనం ఒకరినొకరం చూసుకోవడం మానేస్తాం
తర్వాత
క్రమక్రమంగా విడిపోతాం

ఇట్లా విడిపోవడం మనను బాధిస్తుంది
నాకు తెలుసు

కానీ –
పడిపోయిన వెంటనే పగిలిపోవడానికి
మనం గాజుగ్లాసులం కాము

తెలియని తలుపుల్ని మళ్లీ మళ్లీ తట్టడం
తెలిసి తెలిసీ శ్వాసనాపుకోవడం
ఒక్క వ్యక్తి కోసం ఎదురుచూస్తూ
కూడలిలో నిలబడడం
ఎంత బాధాకరమో నీకూ నాకూ తెలుసు
లేదు – మనం ఇట్లా చేయడానికి వీల్లేదు... వీల్లేదు

నువ్వెక్కడికో వెళిపోతావు
'నేనిక్కడ క్షేమంగా ఉన్నాను
భగవంతుడు నిన్ను చల్లగా చూడాలి'
అని ఓ ఉత్తరం రాస్తాన్నేను

జవాబివ్వడం ఆలస్యం చేసి
అందుకు క్షమించమని కోరుతావు నువ్వు

నీ పెళ్లైన సంవత్సరానికి
నేనీకో 'మంచి బహుమతి' పంపుతాను
'మీ నాన్న చనిపోయినందుకు
బాధగా ఉంది' అని జవాబు రాస్తావు నువ్వు

తర్వాత –
క్రమక్రమంగా అప్పుడొస్తుంది
ముప్పైఒకటో డిసెంబర్ చల్లని సాయంకాలం
ఆ వేళ ఎక్కడో ఓ పోస్టాఫీసులో
మన గ్రీటింగ్ కార్డ్సు కలుసుకుంటాయి

నాకు తెలుసు
ఇట్లా విడిపోవడం మనను బాధిస్తుంది
కానీ –
పడిపోయిన వెంటనే పగిలిపోవడానికి
మనం గాజుగ్లాసులం కాము

# పశ్చిమాసియా యుద్ధబీభత్స కవిత్వం

సచ్చిదానందన్ కవితానువాదంతో మొదలైన ఇతరభాషా కవిత్వాల ములాఖాత్ ఆ తర్వాత ఒకటి రెండు సంవత్సరాల్లో ఎన్నో దిశల్లో విస్తరించింది. అప్పుడే పర్షియన్ మూలం, ఉర్దూ – హిందీ – ఇంగ్లిష్ మూడు భాషల అనువాదాలతో నసీరా శర్మ సంపాదకత్వం వహించిన పదహారు మంది కవుల దాదాపు నలభై కవితల పెద్దపుస్తకం 'ఎకోస్ ఆఫ్ ఇరానియన్ రెవల్యూషన్' హైదరాబాదు ఫుట్‌పాత్‌ల మీదికి వచ్చింది. ఆ పుస్తకం ఎందరో తెలుగు కవుల, కవిత్వ పాఠకుల అభిమానాన్ని చూరగొంది. ముఖ్యంగా, ఆ సంపుటంలో మర్జియా ఒస్కూయి రాసిన 'నేనొక స్త్రీని' కవిత అప్పటికప్పుడే కనీసం మూడు తెలుగు అనువాదాలు వెలువడ్డాయి. అలాగే, 'సృజన'లో హిందీ, పంజాబీ, మరాఠీ, పాలస్తీనియన్ కవిత్వం గురించి వ్యాసాలు ఆయా భాషల కవిత్వాలకు కిటికీలు తెరిచాయి. స్వయంగా నేను కె జి శంకరపిళ్లై, నాజిం హిక్మత్, డెమ్యాన్ బెడ్నీ వంటి కవులను అనువాదం చేశాను. ఆ ములాఖాత్‌లన్నీ మరొకసారి. ఈసారి మాత్రం అత్యంత విషాదకరమైన, బీభత్సమైన జీవన వాస్తవికత లోంచి అత్యద్భుతమైన వ్యక్తీకరణకు, పదచిత్రాలకు, సూటిదనానికి, విస్ఫోటకశక్తికి పర్యాయపదంగా నిలిచిన పాలస్తీనా కవిత్వంతో నా ములాఖాత్ గురించి చెపుతాను. అంతకుముందే 'సృజన'లో పాలస్తీనా కవి ఘసన్ కన్‌ఫానీ గురించి ఒక వ్యాసం వచ్చినప్పటికీ, మొత్తంగా పాలస్తీనా కవిత్వానికీ, పాలస్తీనా ప్రజా పోరాటానికీ నా మేధకూ హృదయానికీ కిటికీలు తెరిచినది కూడ సుబ్బారావే.

1982 ఏప్రిల్‌లో నా బిఎ అయిపోయింది. అప్పటికి సుబ్బారావు మహేంద్రజాలంలో తలమునకలుగా ఉన్నాను గనుక, ఆర్ఎస్ రావు ఉపన్యాసంతో, రచనతో, విశ్లేషణతో మైమరచి పోతున్నాను గనుక వాళ్లిద్దరి లాగనే అర్థశాస్త్రవేత్త కావాలని, అంటే ఎంఎ ఎకనమిక్స్ తప్ప మరొకటి చదవగూడదని అనుకున్నాను. అది కూడ ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ అని పిలుచుకునే ఢిల్లీ విశ్వవిద్యాలయం అయితే బాగుంటుందని అక్కడ ఎంట్రెన్స్ రాయడానికి ఢిల్లీ వెళ్లాను. బహుశా అది జూన్ లేదా జూలై కావచ్చు. "ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్, ఆ తర్వాత లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ అని పైపైకి వెళ్తూ కెరీరిస్టు కాదలచుకున్నావా, వెనక్కి వెళ్లి కాకతీయ లోనో, ఉస్మానియా లోనో ఎంఎ లో చేరి, ఆర్ ఎస్ యు లో పనిచేస్తూ, తెలుగు సమాజానికి ఉపయోగపడదలచుకున్నావా, తేల్చుకో" అని సుబ్బారావు ఒక రాత్రంతా నాతో సంభాషణ జరిపి, అసలు నేను ఢిల్లీ స్కూల్ ఎంట్రెన్స్ రాసే ఆలోచనే వదులుకునేలా చేశాడు. కాని ఢిల్లీ స్కూల్‌కు తీసుకువెళ్లి అక్కడ ఇద్దరు ముగ్గురు ప్రొఫెసర్లను పరిచయం చేశాడు. ఆ క్లాసురూంలూ, లైబ్రరీ చూపెట్టాడు. మేం అక్కడ తిరుగుతుండగానే ఒక నలుగురైదుగురు విద్యార్థుల బృందం వచ్చి సుబ్బారావును పాలస్తీనా సమస్య మీద వివరాలు చెప్పమని అడిగారు. అక్కడ క్యాంటీన్‌లో కూచుని సుబ్బారావు ఒక గంట రెండు గంటల పాటు పాలస్తీనా చరిత్ర, రాజకీయాలు, సామ్రాజ్యవాద ప్రయోజనాలు, ప్రజా పోరాటాలు, పాలస్తీనా కవిత్వం వంటి విషయాలన్నీ వివరించాడు.

సరిగ్గా నేను ఢిల్లీ వెళ్లడానికి కొద్ది ముందో అటూ ఇటూగానో పశ్చిమాసియాలో యుద్ధం ప్రారంభమయింది. లెబనాన్ రాజధాని బీరుట్‌లో యాసర్ అరాఫాత్‌తో సహా అప్పటి పాలస్తీనా విమోచన సంస్థ ప్రవాస కార్యాలయం, పిఎల్ఒ బలగాలు ఉన్నాయనే సాకుతో ఇజ్రాయెల్ ప్రభుత్వం బీరుట్ మీద విచ్చలవిడిగా బాంబుదాడులు ప్రారంభించింది. జూన్ 13 నుంచి ఆగస్ట్ 21 దాకా జరిగిన ఆ బాంబుదాడుల్లో వేలాది మంది ప్రజలు మరణించారు. పాకిస్తాన్ సైనిక ప్రభుత్వాల నిర్బంధకాండ నుంచి తప్పించుకుని బీరుట్ లోనే ప్రవాసంలో గడుపుతున్న మన మహాకవి ఫైజ్ అహ్మద్ ఫైజ్ 'ఎక్ నగ్మా కర్బలా - ఎ- బీరుట్ కె లియే' అని అజరామరమైన కవిత రాశాడు.

ఆ విద్యార్థులతో సమావేశం అయిపోయాక కూడ సుబ్బారావు ఆ రోజంతా పాలస్తీనా గురించే మాట్లాడుతున్నాడు. అలా మాట్లాడుకుంటూ, కవిత్వం చదువుకుంటూ ఉండగా, ఈ విషయం 'సృజన'కు ఒక వ్యాసం రాద్దామా అని ఆలోచన వచ్చింది. 'వ్యాసం సరే, దానితో పాటు పాలస్తీనా కవిత్వానువాదం ఉండాలి' అని సుబ్బారావు అన్నాడు. కేవలం పోరాటాన్ని వివరిస్తూ రాజకీయార్థిక విశ్లేషణా వ్యాసం అయితే నిస్సారంగా, హృదయం లేకుండా ఉంటుందని, కేవలం కవిత్వానువాదాలే అయితే, ఆ కవిత్వానికి జన్మనిచ్చిన లోతైన సామాజిక, రాజకీయార్థిక పునాది తెలియని నిర్మాణం అవుతుందనీ, అందువల్ల రెండూ

ఉండాలనీ సుబ్బారావు అన్నాడు. అలా ఆ రాత్రికి రాత్రే ఇద్దరమూ కలిసి మూడు పేజీల పాలస్తీనా పోరాట వివరణ వ్యాసం రాశాం. నేను రెండు పాలస్తీనా కవితలను అనువాదం చేయగా సుబ్బారావు వాటిని దిద్దాడు. ఆ తర్వాత ముప్పై సంవత్సరాలలో మహమూద్ దర్వీష్‌తో సహా కనీసం పది మంది పాలస్తీనా కవులను నేను తెలుగులోకి అనువాదం చేయడానికీ, పాలస్తీనా మీద దాదాపు పది వ్యాసాలు రాయడానికీ అది తొలి అడుగు.

ఇజ్రాయెల్ పాలకవర్గాల దురాక్రమణకు మూలమైన, ఒక శతాబ్ది కిందటి నినాదం 'భూమిలేని ప్రజల కోసం ప్రజలు లేని భూమి' అనే శీర్షికతో ఆ వ్యాసం తయారు చేశాం. పాలస్తీనియన్లు వేల సంవత్సరాలుగా జీవిస్తున్న భూమిని జియోనిస్టు ఆక్రమణదారులు 'ప్రజలు లేని భూమి' అని పిలిచారు. చరిత్ర పొడవునా అన్యాయానికి గురై, కాందిశీకులై తమదంటూ భూమి లేని యూదులకు ఈ భూమిని అప్పగించడమే తమ పవిత్ర కర్తవ్యమన్నారు. ఒక అన్యాయాన్ని సవరించే పేరుతో మరింత ఘోరమైన అన్యాయానికి మార్గం వేశారు. ఈ విషయం పాఠకులకు అర్థం చేయించడానికి, ప్రత్యేకంగా అప్పుడు జరుగుతున్న బాంబుదాడుల దుర్మార్గాన్ని విప్పిచెప్పడానికి మేం చేసిన ఆ ప్రయత్నం 'సృజన' ఆగస్ట్ 1982 సంచికలో వెలువడింది.

ఆ వ్యాసంలో కొన్ని వాక్యాలూ, అ రెండు కవితల అనువాదాలూ ఇక్కడ ఇస్తున్నాను:

"చరిత్ర ఎప్పుడూ గెలుపొందిన వాళ్ల ఆస్తి. అందుకే పాలస్తీనా ప్రజల చరిత్ర నిండా అపార్థాలూ దుష్ప్రచారాలూ ఒంటరి పోరాటాలూ. ఈ చరిత్ర మరుగున ఉజ్వలమైన అన్వేషణా, వీరోచితమైన పోరాటమూ దాగి ఉన్నాయి. శతాబ్దంగా సాగుతున్న ఈ యుద్ధంలో పాలస్తీనా రైతాంగం తమ భూమినీ, దేశాన్నీ పోగొట్టుకొని, 'శరణార్థుల జాతి'గా నెట్టివేయబడ్డారు. తర్వాతి కాలంలో గెరిల్లా విప్లవకారుల జాతిగా రూపొందిన ఈ నలభై లక్షల మంది ప్రజలు తమ పోరాట చరిత్రలోకెల్లా భయంకరమైన దశను ఇవాళ ఎదుర్కొంటున్నారు. గత జూన్ నుండి సాగుతున్న ఇజ్రాయెల్ దాడి ఈ జాతి జాతినీ హత్య చేయడానికి జరుగుతున్న ప్రయత్నం......

జూన్ నెలలో బీరూట్ మహానగరంపై దాడిలో ఇళ్లూ బళ్లూ ఆస్పత్రులూ ఫాక్టరీలూ పొలాలూ ఇజ్రాయెలీ అగ్నివర్షంలో మండి మాడి మసైపోయాయి. వేలాది పాలస్తీనియన్లు మిలిటరీ క్యాంపుల్లో బందీలయ్యారు. నలభై వేలమంది ప్రజలు మరణించారు. ఎనిమిది వేల మంది సైన్యంతో అరాఫత్ చక్రబంధంలో ఇరుక్కున్నాడు. అయినా పాలస్తీనా ప్రజల సాయుధ పోరాటం ఆగలేదు.....

చరిత్ర నిండా ఎన్ని జాతీయ విముక్తి పోరాటాలు జరగలేదు! కాని నిలబడి పోరాడడానికి తమదంటూ ఒక అడుగు భూమైనా లేకుండా పాలస్తీనియన్లు సాగిస్తున్న పోరాటం అపూర్వమైనది. ఇరవయో శతాబ్దపు ఈ విషాద వీరోచిత విముక్తి పోరాటానికి

తన విప్లవాభినందనలు చెపుతూ 'సృజన' కవిహృదయంతో గొంతు కలుపుతోంది.... ఇప్పటికీ ఎప్పటికీ పాలస్తీనా!"

## ఇప్పటికీ ఎప్పటికీ పాలస్తీనా

– ఫద్వా తుఖాన్

పాలస్తీనా!
ఓ పాలస్తీనా!
వేదన నిండిన మసకరాత్రుల్లో
కాలపు గుదిబండలు
తిరుగుతూ తిరుగుతూ ఉంటాయి
కానీ
నీ వెలుగును అవి ఆర్పేయలేవు
వాటికా శక్తి లేదు
ఎందుకంటే
చితికిపోయిన నీ స్వప్నాల నుంచీ
శిలువవేయబడ్డ నీ ప్రగతి నుంచీ
దొంగిలించబడ్డ నీ నవ్వుల నుంచీ
నీ బిడ్డల చిరునవ్వుల నుంచీ
విధ్వంసం నుంచీ, హింస నుంచీ
నెత్తురంటిన గోడల నుంచీ
చావు బతుకుల ఊగిసలాటల నుంచీ
జీవం మొలకెత్తుతుంది
పాలస్తీనా ఓ పాలస్తీనా!
అద్భుతమైన భూమివి నువ్వు
లోతైన గాయానివి నువ్వు
ఏకైక ప్రేమవు నువ్వు

# ఇరవయో శతాబ్దం

– సమీ అల్ కాసిం

శతాబ్దాల కింద
ద్వేషించడానికి నేనలవాటు పడలేదు
ఐనా
అలసట ఎరగకుండా
పాము మీదికి ఈటె విసురుతున్నప్పుడో
మంటల ఎదురుగా కత్తి దూస్తున్నప్పుడో
ఆ కత్తిని బాల్ ఆటవిక విగ్రహం మీదికి
గురిచేస్తున్న
ఎలిజా కావలిసొచ్చింది నేను
శతాబ్దాల కింద
సమాధులు తవ్వడానికి నేనలవాటు పడలేదు
ఐనా
ఇరవయో శతాబ్దంలో
నా ప్రజలను అమ్మేసిన దేవతలను,
నా గుండెల్లోని దొంగదేవతలను
కొరడాలతో హింసించాను నేను

శతాబ్దాల కింద
నా ముంగిట్లోకొచ్చిన అతిథుల్ని
నేను వెనక్కి తిప్పికొట్టలేదు
కానీ
ఒకానొక ఉదయం కళ్లు తెరిస్తే
నాకెంతో ప్రియమైనవన్నీ దొంగిలించబడ్డాయి
నా జీవిత సహచరి ఉరితీయబడింది
నా పసిబిడ్డల వీపులు
గాయాల పొలాలయిపోయాయి
నా అతిథులు ద్రోహులని నాకు తెలుసు
ఇక నా వాకిట్లో మందుపాతరలూ కత్తులూ నాటాను

మిగిలిపోయిన నా కత్తి తునుకల మీద
నేనివాళ ప్రతిజ్ఞ చేస్తున్నాను
ఇరవయో శతాబ్దంలో
ఈ అతిథుల్లో ఏ ఒక్కణ్నీ
నా ఇంట్లో అడుగుపెట్టనివ్వను
శతాబ్దాల కింద
నేను యోగుల గుంపుల్లో
ఒకానొక కవిని తప్ప మరేమీ కాను
కాని ఈ ఇరవయో శతాబ్దంలో
నేనో విప్లవ అగ్నిపర్వతాన్ని

(బైబిల్ కథనం ప్రకారం యావె మతాన్ని విగ్రహారాధన స్థాయికీ, ప్రకృతి ఆరాధన స్థాయికీ దిగజార్చిన బాల్ నూ, బాలిజాన్నీ మొట్టమొదట ఖండించినవాడూ ఉద్యమించినవాడూ ఎలిజా)

# తునికి చెట్ల కింద వెన్నెల తరకల్లో కవిత్వం

నా కవిత్వ ములాఖాత్‌లు ఇప్పటిదాకా ప్రధానంగా వరంగల్ కేంద్రంగా సాగినవే. కాని 1982 సెప్టెంబర్-అక్టోబర్‌లలో నేను ఉస్మానియా విశ్వవిద్యాలయ పిజి కాలేజిలో ఎంఎ ఎకనమిక్స్‌లో చేరి, ఓల్డ్ పిజి హాస్టల్ రూం నంబర్ 19 వాసినయ్యాక, నా కన్నతల్లి వరంగల్ నుంచి ప్రవాసినయ్యాక, నా కవిత్వ ప్రపంచంలోకి సువిశాలమైన కొత్త కిటికీలు తెరుచుకున్నాయి. లెక్కలేనన్ని కొత్త కవిత్వ ములాఖాత్‌లు నన్ను చేరపిలిచాయి, చేరవచ్చాయి. అవి పాత, కొత్త కవిమిత్రుల రూపంలో కావచ్చు, ఇతర మిత్రుల రూపంలో కావచ్చు, సందర్భాల రూపంలో కావచ్చు, ఆదివారం ఫుట్‌పాత్ పుస్తకాల వెతుకులాటల్లో కావచ్చు, నాగదిలో సొంత పుస్తకాల దగ్గరినుంచి ఇతర మిత్రుల గదుల్లో, ఓల్డ్ పిజి హాస్టల్ లైబ్రరీలో, ఉస్మానియా విశ్వవిద్యాలయం కొండమీది లైబ్రరీలో, బషీర్‌బాగ్‌లోని మా పిజి కాలేజి లైబ్రరీలో దొరికిన పుస్తకాలలో కావచ్చు, ఎన్నెన్నో కవిత్వ ములాఖాత్‌లు. అన్నిటికన్న మించి ఓల్డ్ పిజి హాస్టల్ ముందు నుంచి తార్నాక వైపు వెళ్లే రోడ్డు పక్కన ఉన్న చిక్కని తునికిచెట్ల ఆకుల మధ్య నుంచి వెన్నెల కాలంలో నల్లని తారు రోడ్డు మీద జారి పడే వెన్నెల తరకల మీద పంచుకున్న కవిత్వ ములాఖాత్‌లు ఒక అపూర్వ అనుభవం. ఆ గదిలో నేను నిండా రెండు

సంవత్సరాలు కూడ లేను గాని దశాబ్దాలకు సరిపడిన జ్ఞాపకాలున్నాయి. ఆ గది అని మాత్రమే కాదు, అప్పటి హైదరాబాద్ వాతావరణమే కవితావరణమే నన్ను ఇవాళ్టికీ ఎంతగానో ఉద్వేగపరిచే జ్ఞాపకాల గని. మూడు దశాబ్దాలు దాటినతర్వాత ఇవాళ్టికీ నేనా జ్ఞాపకాలను ఉద్వేగభరితంగా తలచుకుంటాను. వాటి గురించి నిర్మమంగా, ఉద్రేకరహితంగా, నిదానంగా రాయలేను. ఎందరి గురించి రాసినా, మరెందరినో మరిచిపోతానని, ఎన్ని జ్ఞాపకాలు రాసినా శతాంశమైనా రాయలేనని అనిపిస్తున్నది.

నేను ఓల్డ్ పిజి 19లో చేరడానికి ముందే ఆ గదితో అనుబంధం ఉంది. మా అన్నయ్య రాంగోపాల్ లింగ్విస్టిక్స్ ఎంఎ, ఎంఫిల్ చేస్తూ మూడు సంవత్సరాలకు పైగా ఆ గదిలో ఉన్నాడు. అప్పటికి హైదరాబాదులో 'సృజన' తానే పంపిణీ చేస్తుండేవాడు. కవిత్వం రాసేవాడు. ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్ తోనూ, బైటి సాహిత్యకారులతోనూ సంబంధాలుండేవి. అలా ఆ గది నేను చేరేటప్పటికే సాహిత్య, కవిత్వ వాసనలతో ఉంది. ఎంఫిల్ లో ఉండగా తనకు ఉద్యోగం రావడం, నేను ఎంఎలో చేరడం దాదాపు ఒకేసారి జరిగాయి గనుక నేను ఆ గదిలో కొనసాగాను.

అప్పటి ఉస్మానియా కవుల ఉద్యానవనం. గుడిహాళం రఘునాథం, నందిని సిధారెడ్డి, నాళేశ్వరం శంకరం, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, సలంద్ర, జింబో, గుంటూరు ఏసుపాదం, శివకుమార్ వంటి వాళ్లందరూ పరిశోధక విద్యార్థులుగానో, ఏవైనా ప్రాజెక్టులలోనో ఉన్నారు. ఓల్డ్ పిజి నుంచి ఆర్ట్స్ కాలేజి దాకా నడిచే లోపల ఆ పది నిమిషాల్లో ఇద్దరు ముగ్గురు కవులైనా కలిసే వాతావరణం ఉండేది.

నాకు ఒక సంవత్సరం సీనియర్ అయినప్పటికీ అత్యంత ప్రాణసమానమైన మిత్రుడుగా మారిన చారి (కె నరసింహాచారి) నాకు ఓల్డ్ పిజి హాస్టల్ మేట్. మహబూబ్‌నగర్ కంసాలి కుటుంబం నుంచి, కష్టభరితమైన జీవితం నుంచి ప్రారంభమై, మహబూబ్‌నగర్‌లో ఎస్ఎఫ్ఐ రాజకీయాలు నేర్చుకుని, ఉస్మానియాలో పీపుల్స్ వార్ అభిమానిగా, తర్వాత విరసం సభ్యుడిగా మారిన గొప్ప ప్రవాహశీలి. ఆ తర్వాత అస్తిత్వ రాజకీయాలో కొంత, వ్యక్తిగత జీవిత, ఆర్థిక సమస్యల్లో కొంత కూరుకుపోయి, చివరికి అకాలంగా మరణించాడు గాని, 1980ల్లో మాత్రం చాల ప్రభావశీలంగా ఉండేవాడు. 'ఇంత చిరుగీతి ఎద వేగిరించునేని' అని కృష్ణశాస్త్రి అన్నట్టు ప్రతి మాటనూ, అనుభవాన్నీ కవిత్వంగా మార్చాలని తపన పడేవాడు. మాటల్లో, ఉత్తరాల్లో కూడ కవిత్వమే రాసేవాడు. ఆ రెండు సంవత్సరాలూ మేం కొన్ని వందల గంటలు మాట్లాడుకుని ఉంటాం. తర్వాత దాదాపు పదిహేను సంవత్సరాలు అత్యంత సన్నిహితంగా సాగిన మైత్రి పడిపోయిన గాజుగ్లాసుల లాగ క్రమక్రమంగా ఎప్పుడో చెదిరిపోయింది గాని ఎప్పుడూ గుండె రవరవలాడే జ్ఞాపకం అది. తాను రాసిన కవిత్వంలో అచ్చయినవి తక్కువేననుకుంటాను. అవీ ఎన్నెన్నో పేర్లతో వచ్చాయి. వాటిలో దాదాపు ప్రతి కవితకూ నేను తొలి శ్రోతగా ఉన్నాను.

చారి ద్వారా పరిచయమైన మరొక కవిత్వ ప్రేమికుడు, తన పాండిత్యంతో, ప్రపంచ అనుభవంతో, అధ్యయనంతో అవతలివాళ్లను సమ్మోహితులను చేయగల మహాశక్తిమంతుడు గడియారం శ్రీవత్స. అప్పటికి హైదరాబాదులో ఒక కాలేజిలో లైబ్రేరియన్‌గా పనిచేస్తూనే ఏదో లైబ్రరీ సైన్సు కోర్సు చదువుతుండేవాడు. ప్రాచీన కవిత్వమైనా, ఆధునిక కవిత్వమైనా నోటికి అప్పజెప్పేవాడు. బౌద్ధం నుంచి అమెరికన్ రాజకీయాల దాకా అలవోకగా మాట్లాడేవాడు. వేరువేరు కవుల సామ్యాలూ భేదాలూ సోపపత్తికంగా చెపుతుండేవాడు. తనతో ఉండడమంటే ఉపన్యాసంలా సాగే తన మాటలు వింటూ ఉండడమే. సాహిత్యం మాత్రమే కాదు, సంగీతం, చిత్రలేఖనం, సినిమా వంటి రంగాల గురించి కూడ అంతే ధారతో మాట్లాడేవాడు. అమ్జాద్ అలీఖాన్ పేరు, సరోద్ అనే వాయిద్యం పేరు నేను మొదటిసారి విన్నది తన నోటి నుంచే. "అమ్జాద్ అలీఖాన్ సరోద్ విన్నావా? మన నాడులు ఒక్కొక్కటీ పీకి వాటి మీద వాయిస్తున్నంతగా మన దేహమూ మనసూ కదిలిపోతాయి" అని ఒకరోజు అర్ధరాత్రి వేళ మల్లయ్య క్యాంటీన్‌కు చారీ తానూ నేనూ నడుస్తుండగా తానన్న మాట నాకు ఇప్పుడు వింటున్నట్టే ఉంది. అప్పటికే తానూ కె శ్రీనివాస్ కలిసి శ్రీనివాస శ్రీవత్స అనే పేరుతో కవిత్వమూ వచనమూ రాస్తున్నారు. 'కళాసౌరభం' అనే పత్రిక తెస్తున్నారు. అలా శ్రీనివాస్ కూడ పరిచయమయ్యాడు.

ఓల్డ్ పిజి లో నా ఎదురుగదిలో లక్ష్మారెడ్డి ఉండేవాడు. అప్పటికే విరసంలో క్రియాశీల సభ్యుడిగా, విమోచన రాజకీయాభిమానిగా ఉన్న లక్ష్మారెడ్డిది అద్భుతమైన కవితాభివ్యక్తి. అప్పుడే గ్రామంనుంచి వచ్చిన రైతుబిడ్డలోని అమాయకత్వం ఒకవైపు, తట్టితే మేల్కొనేంత అపార కవితా శక్తి నిద్రాణంగా ఉన్న సృజనశీలత ఒకవైపు. ఎన్నెన్ని గొప్ప కవితలు రాశాడో. మా ఇద్దరి మధ్య రాజకీయ భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ తానప్పుడు రాసిన కవితలలో చాలవాటికి మొదటి శ్రోతను నేనే. తాను ఎన్నికలలో పాల్గొనడాన్ని సమర్థిస్తూ 'రణకాంక్ష' అని ఒక శక్తిమంతమైన కవిత రాసి 'విమోచన'లో ప్రచురించాడు. రాతప్రతి దశలోనే చదివి, విభేదించిన నేను, అంత శక్తిమంతమైన కవిత జవాబు లేకుండా పోగూడదనుకుని వెంటనే 'విస్తరణాకాంక్ష' అని వ్యంగ్యంగా ఖండన కవిత రాశాను. అది ఆరోజుల్లో చాల రచనలలాగే నా పేరు లేకుండా 'సృజన' జనవరి 1983 సంచికలో అచ్చయింది.

ఇది రాస్తుంటే, ఆ కాలపు వాద వివాదాలు, తక్షణ ప్రతిస్పందనల స్ఫూర్తి గుర్తుకు వచ్చి ఆశ్చర్యం కలుగుతోంది. ఇటీవల మరొకరిని పట్టించుకోకుండా ఎవరి శిబిరాలలో వాళ్లం ఉండడమో, ఎక్కడైనా దారులు కలిసినా నొప్పింపక తానొవ్వక తప్పుకుపోవడమో, సహజీవనం చేయడమో నేర్చుకున్నాం. చలం భాషలో చెప్పాలంటే ఇవాళ అందరమూ మర్యాదస్తులమైపోయాం. కాని అప్పుడు స్నేహం స్నేహమే, అభిప్రాయభేదం అభిప్రాయభేదమే అన్నట్టుండేది. లక్ష్మారెడ్డీ నేను ఒకేచోట, నిరంతర సంభాషణలో ఉండి కూడ అవసరమనిపించి

నప్పుడు కఠినమైన పాలిమికల్ కవిత్వం రాసుకున్నాం. నిజానికి రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక సిద్ధాంతాలెన్నో నిగ్గుదేలినది ఆరోగ్యకరమైన పాలిమికల్ చర్చలలోనే. ఆ ఆరోగ్యకరమైన పాలిమిక్స్‌ను మరిచిపోతున్న తెలుగు మేధో లోకం ఎక్కడికి చేరుతుందో తెలియడం లేదు.

అప్పటికే కవిగానూ, ఉద్యమ సహచరుడుగానూ నాకెంతో ప్రియమైన అల్లం నారాయణ సి హాస్టల్‌లో ఉండేవాడు. తను రాసే కవిత్వం రాశిలో తక్కువైనా వాసిలో అపురూపమైనది. సాహిత్యంలోనూ, అభిరుచులలోనూ ఆత్మీయ మిత్రుడు ఎస్ రామకృష్ణ ఓల్డ్ పిజి లోనే ఉండేవాడు. ఇక యూనివర్సిటీకి బైట శివారెడ్డి, నగ్నముని, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, ఎన్ గోపి వంటి కవులు ఏదో ఒక సభలో నిత్యం కలుస్తుండేవారు. యూనివర్సిటీ లోపల, ఓల్డ్ పిజికి కూతవేటు దూరంలో చేకూరి రామారావు సరేసరి.

ఈ కవితావరణం మాత్రమే కాదు, నాటి రాజకీయ వాతావరణం కూడ సాహిత్యానికి సన్నిహితంగా ఉండేది. నాకు వరంగల్ ఆర్ట్స్ కాలేజిలో సీనియర్, హైదరాబాదు వచ్చిన తర్వాత మార్గదర్శి, అత్యంత సన్నిహితుడు ఎర్రంరెడ్డి సంతోష్ రెడ్డి ఎ హాస్టల్ లో ఉండేవాడు. ఆ తర్వాత పీపుల్స్ వార్ రాష్ట్ర కార్యదర్శి అయ్యాడు. నల్లా ఆదిరెడ్డి, శీలం నరేష్ లతో పాటు 1999 డిసెంబర్‌లో బెంగళూరులో పోలీసుల చేత చిక్కి, హత్యకు గురై, లక్ష్మీరాజం అనే గ్రామస్తుడితో పాటు కరీంనగర్ జిల్లా కొయ్యూరు అడవిలో ఎన్‌కౌంటర్ కథకు వస్తువయ్యాడు. నా 'అమ్మకానికి ఆంధ్రప్రదేశ్' వ్యాససంకలనం రెండో కూర్పు 1999 డిసెంబర్‌లో వెలువడ్డప్పుడు, "...1982–84 మధ్య నేనుండిన ఓల్డ్ పిజి హాస్టల్‌కీ, తానుండిన ఎ హాస్టల్‌కీ, మల్లయ్య హోటల్ కీ మధ్య త్రిభుజంలో ఎర్ర నక్షత్రాలు వెలిగించి, నిన్న మొన్నటిదాకా నా ఈ అవగాహనలను చదివి, చర్చించి, విమర్శించి, ప్రోత్సహించి, ఇటువంటి వందల పుస్తకాల కోసం కలలుగన్న నా అద్భుత సహచరుడు, నాయకుడు సంతోష్... " అని గుర్తు చేసుకుంటూ అంకితం చేశాను.

సంతోష్‌తో పాటు కవిత్వాన్నీ సాహిత్యాన్నీ రాజకీయాలనూ విద్యార్థి యువజన ఉద్యమాలనూ కలగలిపి నడిపించిన ఆర్ఎస్‌యు అధ్యక్షుడు ఎం సాంబమూర్తి ఎ హాస్టల్‌లో ఉండేవాడు. ఆర్‌వైఎల్ కార్యదర్శి జగన్ ఎన్ఐఎన్ పక్కన ఒక ఇంట్లో ఉండేవాడు. శ్రీశ్రీ చనిపోయాడని వార్త వినగానే జగనూ నేనూ పిచ్చెక్కినట్టు సికింద్రాబాద్ స్టేషన్ దాకా శ్రీశ్రీ గురించి మాట్లాడుకుంటూ వెళ్లి, ఏ పత్రిక శ్రీశ్రీ గురించి ఏమి రాసిందో చదువుకుంటూ స్టేషన్ ఎదురుగా బస్‌స్టాండ్‌లో కూచున్న, కవిత్వమే జీవితంగా బతికిన ఆ రోజులు మళ్లీ వస్తాయా?

నా హైదరాబాద్ తొలిరోజుల కవిత్వ ములాఖాత్‌లలో అతి ముఖ్యమైనది విప్లవ రచయితల సంఘం సిటీ యూనిట్‌లో అప్పుడు వెల్లివిరిసిన కవిత్వం. విరసం గురించి

1970 నుంచీ వింటున్నప్పటికీ, 1973లో హనుమకొండ వచ్చినప్పటి నుంచీ విరసం కార్యక్రమాలను దగ్గరిగా చూస్తున్నప్పటికీ, వరంగల్‌లో ఉన్నన్ని రోజులూ ఎందుకో నేను విరసంలో చేరాలనుకోలేదు. 'సృజన' చాలనుకున్నాను. కాని వరంగల్ వదిలి హైదరాబాదు వచ్చాక విద్యార్థి ఉద్యమంలో ఉన్నప్పటికీ, సాహిత్య వాతావరణం కోసం విరసంలో చేరదామనిపించింది. అలా 1983 జనవరిలో విరసంలో చేరాను. విరసం సిటీ యూనిట్ గొప్ప కవితా సంరంభం నిండిన వాతావరణం. సలంద్ర, అలిశెట్టి ప్రభాకర్ వంటి ఎప్పుడో ఒకసారి వచ్చే కవులు మాత్రమే కాదు, విరసం కార్యక్రమాల్లో తలమునకలుగా ఉండే నమ్ము, హెచ్చార్కె, జయ, విమల, నర్సాగౌడ్,కృష్ణుడు అందరికందరూ కవిత్వం రాసేవాళ్లే. రత్నమాల, అమర్ కూడ అప్పుడప్పుడు కవిత్వం రాసేవాళ్లే. ఉర్దూ, ఇంగ్లిష్, హిందీ, తెలుగు భాషల కవిత్వ రుచి తెలిసిన పెద్దదిక్కు ఖాన్ సాబ్. విరసం సిటీ యూనిట్ సమావేశాలు ప్రతి పదిహేను రోజులకొకసారి జరుగుతుండేవి. సాధారణ రాజకీయ, సాహిత్య కార్యక్రమాల చర్చ అయిపోయాక తప్పనిసరి అంశం, ఆసక్తిదాయకమైన అంశం స్వీయరచనా పఠనం. అందరి లోకీ ఎక్కువ కవిత్వం ఆవహించిన హెచ్చార్కె కవిత లేకుండా వచ్చిన సందర్భం ఒక్కటి కూడ లేదనుకుంటాను. జయ, విమలల కవితాభివ్యక్తి పదునెక్కుతున్న రోజులవి. అప్పుడే ఇంజనీరింగ్ మొదటి సంవత్సరంలోనో, రెండో సంవత్సరంలోనో పిడిఎస్‌యు క్రియాశీల కార్యకర్తలుగా ఉన్న ఇద్దరు ఇరవై నిండని కుర్రవాళ్లు విరసంలో చేరడానికి వచ్చారు. ఇద్దరికిద్దరూ విస్తృతమైన అధ్యయన ఆసక్తులు ఉన్నవాళ్లు. అంతకన్న ముఖ్యంగా నిలువెల్లా కవులు, కవిత్వాభిమానులు. ఒకరు నారాయణస్వామి, మరొకరు సుధాకిరణ్. ఆ ఇద్దరూ కవులుగా ఎదగడం నేను కళ్లారా చూశాను.

అలా హైదరాబాద్ నా కవిత్వ ములాఖాత్‌లకు రంగులు దిద్దింది.

# 'కన్నీటి సరుల దొంతరల' కవిత్వం

మళ్లీ ఒకసారి నా కవిత్వ ములాఖాత్‌ల కాలక్రమం నుంచి పక్కకు జరిగి అతి సమీపమైన తాజా ములాఖాత్ గురించి చెప్పాలనిపిస్తున్నది. ఇది నావరకు నాకు చాల ఆశ్చర్యకరమైనదీ, అనూహ్యంగా జరిగినదీ కాగా, ఇందులో కవిత్వాభిమానులు గుర్తించవలసిన అంశాలెన్నో ఉన్నందువల్ల ఈ ములాఖాత్ కాలక్రమం మధ్యలోకి తోసుకొస్తున్నది.

మా విభాత మంచు చూడాలని చాలరోజులుగా అడుగుతుండడంతో హిమాచల్ ప్రదేశ్‌లోని రోహ్‌తంగ్ పాస్ వెళ్లాలని గత వారం మనాలికి వెళ్లాం. రోహ్‌తంగ్ పాస్ దాకా వెళ్లలేకపోయాం గాని రెండు వేల అడుగుల దిగువన మాఢి అనే పదకొండు వేల అడుగుల

ఎత్తయిన ప్రదేశం దాకా వెళ్లి మంచు చూడగలిగాం. ఏ ఊరికి వెళ్లినా అక్కడ పుస్తకాల దుకాణాలు ఉన్నాయా అని వెతకడం, ఆ స్థలపు జ్ఞాపకంగానైనా ఒక పుస్తకం కొనుక్కోవడం అలవాటు. మనాలిలో ఒక పుస్తకాల దుకాణం ఉంది గాని రెండు రోజులూ భోరున వర్షమూ కొంకర్లు తిరిగిపోయే చలీ వల్ల ఆ దుకాణానికి వెళ్లడం కుదరలేదు. మంచు కిరీటాలు దాల్చిన పర్వతశ్రేణులు, ఉధృతమైన నదీప్రవాహాల లోయలు, మన కింది నుంచి ప్రయాణిస్తుండే మేఘాల వరుసల దృశ్యమాలికల గొప్ప కవిత్వావరణంలో, వర్షంలో, చలిలో, మౌనమూ, ధ్యానమూ తప్ప మరొక పని చేయడానికి అవకాశమే తక్కువ. కుల్లు జిల్లా నగ్గర్‌లో ఇంటర్నేషనల్ రోరిక్ మెమోరియల్ ట్రస్ట్ మ్యూజియంలోనూ పుస్తకాల దుకాణంలోనూ గొప్ప చిత్రకళాఖండాలు, రోరిక్‌ల రచనలు ఉన్నాయి గాని కవిత్వం లేదు. మాడికి వెళ్లేటప్పుడు కారులో హిమాచల్ జానపద గీతాలలో ఆకర్షణీయమైన సంగీతం, గొప్ప కవితాభివ్యక్తి వినబడ్డాయి గాని, అవి కూడ ప్రపంచమంతటా జానపద గీతాలలో కనిపించే దూరప్రయాణం, విరహం, స్నేహం, శృంగారం, వీరం వంటి భావాలే.

తిరుగుప్రయాణంలో ఢిల్లీలో అనుకోకుండా ఒక అద్భుతమైన కవిత్వ ములాఖాత్ జరిగింది. మనాలి నుంచి ఉదయం దిగి సాయంత్రం హైదరాబాదు రైలు ఎక్కేలోపు నాటకరంగంతో, పౌరహక్కుల ఉద్యమంతో పనిచేస్తున్న మూడు దశాబ్దాల మిత్రులు దేవరకొండ సుబ్రహ్మణ్యం గారింటికి గుడ్‌గావ్‌కు వెళ్లాం. వాళ్లింటి పక్కనే ఉన్న మాల్‌లో మిడ్‌లాండ్ అని ఒక పుస్తకాల దుకాణం కనబడింది. ఆ దుకాణంలో ఒక గంట గడిపితే చాల సాదాసీదా ముఖచిత్రంతో Poems that Make Grown Men Cry (ఎదిగిన మగవాళ్లను ఏడిపించే కవితలు) అనే 300 పేజీల పుస్తకం. 100 men on the words that move them (తమను కదిలించే మాటల గురించి వందమంది పురుషులు) అనే ఉపశీర్షిక. ఆంథొనీ హోల్డెన్, బెన్ హోల్డెన్ అనే తండ్రీకొడుకులు సంపాదకత్వం వహించిన కవితా సంకలనం. తండ్రీ కొడుకులిద్దరూ ముప్పై సంవత్సరాల తేడాతో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో ఇంగ్లిష్ సాహిత్యం చదువుకున్నవాళ్లు. తండ్రి ప్రఖ్యాత జర్నలిస్టు, జీవితచరిత్రల రచయిత. కొడుకు సినిమా నిర్మాత, రచయిత. సైమన్ అండ్ షుస్టర్ అనే ప్రఖ్యాత ప్రచురణ సంస్థ ప్రచురించిన ఈ పుస్తకం గత ఏప్రిల్‌లో హార్డ్ బౌండ్ వెలువడి, ఈ సంవత్సరమే పేపర్ బాక్ విడుదలయింది. అంటే ఈ కన్నీటి కవితల ధారలు ఇంకా చెంపలమీద వేడివేడిగా ఉండగానే చదివే అవకాశం నాకు కలిగిందన్నమాట. సంపాదకత్వంలో, ప్రచురణలో అంతర్జాతీయ మానవ హక్కుల సంస్థ ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ భాగం పంచుకోవడం, ఈ పుస్తకపు అమ్మకాల నిధులను ఆమ్నెస్టీకి విరాళంగా ఇవ్వడం ఈ పుస్తకానికి సంబంధించిన మరొక ముఖ్యమైన అంశం.

కవిత్వం గాఢమైన అనుభూతులను రేకెత్తిస్తుందనీ, ఉద్వేగపరుస్తుందనీ, చాల సందర్భాలలో కంట తడి పెట్టిస్తుందనీ, కదిలిస్తుందనీ, ఊపిరి సలపకుండా చేస్తుందనీ,

ప్రేరణగా నిలుస్తుందనీ కొత్తగా చెప్పనక్కరలేదు. కఠిన హృదయులుగా, హృదయం లేనివాళ్లుగా, గట్టివాళ్లుగా పేరున్నవాళ్లు కూడ ఏదో ఒక కవిత చదువుతూ ఎప్పుడో ఒకప్పుడు కళ్లు తుడుచుకున్న సందర్భం ఉంటుంది. హృదయం లేని వాళ్లు అని లోకమంతా అనుకునేవాళ్ల కళ్లు చెమర్చేలా చేయగల శక్తి కవిత్వానికి ఉంది. అందులోనూ భావోద్వేగాలు బైటికి ప్రకటించడం మర్యాద కాదనీ, ముఖ్యంగా పురుషులు తమ కన్నీళ్లు బైటికి కనిపించనివ్వ గూడదనీ సాంస్కృతిక విలువలు ఉన్న సమాజాలలో పురుషుల కన్నీరు కార్పించే కవిత్వం ఉంటుందా అనేది చాల ఆసక్తిదాయకమైన ప్రశ్న.

ఆ ప్రశ్ననూ, కవిత్వపు భావోద్వేగ శక్తినీ గుర్తించే సందర్భం ఒకటి ఈ పుస్తక సహసంపాదకుడు ఆంథొనీ హోల్డెన్ 1990ల మధ్య అనుభవించారు. ఒక సంక్షోభంలో చిక్కుకున్న మిత్రుడిని ఓదార్చడానికి ఆంథొనీ, ఆయన సహచరి వెళ్లినప్పుడు ఆ మిత్రుడు తనకు వచ్చిన కష్టం గురించి చెపుతూ, థామస్ హార్డీ రాసిన కవితలోంచి కొన్ని పంక్తులు ఉటంకించి, డగ్గుత్తికతో ఆ కవితను పూర్తి చేయలేకపోయాడట. మరికొద్దిరోజులకు సుప్రసిద్ధ ఇంగ్లిష్ సాహిత్య విమర్శకుడు ఫ్రాంక్ కెర్మోడ్ దగ్గర ఆ విషయం ప్రస్తావిస్తూ, దుఃఖపడకుండా తప్ప చదవలేని కవిత ఏదైనా ఉందా అని ఆంథొనీ అడిగారట. తన భావోద్వేగాలను ఎప్పుడూ బైటికి ప్రదర్శించని ఆ సాహిత్య విమర్శకుడు కూడ ఫిలిప్ లార్కిన్ కవిత చదువుతూ, మధ్యలో గొంతు పూడుకుపోయి, చదవలేక పుస్తకం మరొకరికి ఇచ్చేశారట.

అప్పటినుంచి ఈ విషయం చర్చించడమే పనిగా పెట్టుకున్న ఆంథొనీ వచనం కన్న మిన్నగా కవిత్వం కన్నీరు ఎలా తెప్పిస్తుందో, ఎందుకు తెప్పిస్తుందో పరిశీలించడం ప్రారంభించారు. తన పురుష మిత్రులందరినీ ఏడవకుండా ఏదైనా కవిత చదవగలరా అని ప్రశ్నిస్తూ Poems that Make Strong Men Cry (గట్టి మనుషులను ఏడిపించే కవితలు) అనే కవితా సంకలనం తయారు చేసే పని మొదలుపెట్టారు. ఆ ఆలోచన, కవితల సేకరణ, వాటి మీద ఫ్రాంక్ కెర్మోడ్ తో నిరంతర చర్చ దాదాపు పదిహేను సంవత్సరాల పాటు, 2010లో కెర్మోడ్ చనిపోయేదాకా సాగుతూ వచ్చింది. తనను ఆ పుస్తక సంపాదకత్వానికి పురికొల్పిన కెర్మోడ్ చనిపోయాక, తప్పనిసరిగా ఆ పని పూర్తి చేయవలసిందేనని ఆంథొనీ నిశ్చయించుకున్నారు. అందుకు తాను సహకరిస్తానని కొడుకు బెన్ హోల్డెన్ అన్నాడు. కాకపోతే బెన్ అంతకుముందరి శీర్షికలోని స్ట్రాంగ్ మెన్ అనే పురుషాధిపత్య మాటను గ్రోన్ మెన్ అని మార్చమన్నాడు. ఇక ఇద్దరూ కలిసి ప్రపంచవ్యాప్తంగా ఇరవై దేశాలకు చెందిన సుప్రసిద్ధులైన వందమంది రచయితలనూ ప్రముఖులనూ ఎంపిక చేసి, ఒక్కొక్కరినీ తమను కన్నీరుపెట్టించిన ఒక కవిత గురించి కొన్ని వాక్యాల వ్యాఖ్య రాయమని కోరారు. వారు పద్దెనిమిది దేశాలకు చెందిన కవులు, అందులో డజను మంది స్త్రీలు, రాసిన కవితలను ఎంపిక చేశారు. ఈ వ్యాఖ్యాతలలో ఇరవై ఏళ్ల వాళ్లనుంచి ఎనబై ఏళ్లవాళ్ల వరకూ ఉన్నారు.

ఎంపిక చేసిన కవితల్లో పదహారో శతాబ్ది నుంచి ఇరవయో శతాబ్ది వరకూ ఉన్నాయి. వారు ఎంపిక చేసిన కవిత, వారి వ్యాఖ్య, వారి గురించి పరిచయం కలిపి ఈ పుస్తకం తయారు చేశారు. అంటే వందమంది ప్రభావశీల వ్యక్తులను కదిలించిన వంద ప్రభావశీల కవితల సంకలనం అన్నమాట ఇది.

షేక్స్‌పియర్, బెన్ జాన్సన్, గెథె, కాలరిడ్జ్, వర్డ్స్‌వర్త్, కీట్స్, షెల్లీ, వాల్ట్ విట్మన్, రోజెట్టీ, డికిన్సన్, ఇబ్సెన్, స్టీవెన్సన్, హార్డీ, బ్రూక్, సాసూన్, గాబ్రియెలా మిస్ట్రాల్, గ్రేవ్స్, డి ఎచ్ లారెన్స్, ఆడెన్, రవీంద్రనాథ్ టాగోర్, జేమ్స్ జాయిస్, బ్రెష్ట్, పాల్ ఎలువా, ఎజ్రా పౌండ్, డిలాన్ థామస్, పాబ్లో నెరూడా, సీమస్ హీనీ, డిరెక్ వాల్కాట్ వంటి కవుల కవితలను ఎరియెల్ డార్ఫ్‌మన్, జాన్ లె కారి, హెరాల్డ్ ఇవాన్స్, రాబర్ట్ ఫిస్క్, సీమస్ హీనీ, కెన్ ఫాలెట్, క్రిస్టొఫర్ హిచెన్స్, హెరాల్డ్ బ్లూమ్, సాల్మన్ రుష్దీ, బెన్ ఓక్రి వంటి ప్రముఖులు ఎంపిక చేశారు.

“ఈ సంకలనం కొన్ని మంచి కవితలను పాఠకుల దృష్టికి తెస్తుంది. కళకు ఉన్న భావోద్వేగ ప్రేరణా శక్తి ఎటువంటిదో, కళ భిన్నమైన మనుషులను ఎలా ప్రభావితం చేస్తుందో మంచి చర్చను ఇది ప్రేరేపిస్తుంది” అని ఒక ఇంగ్లిష్ సాహిత్యవేత్త తమను ప్రోత్సహించాడని ఆంథొనీ తన ముందుమాటలో రాశాడు.

సహ సంపాదకుడిగా బెన్ కూడ ఒక చిన్న ముందుమాట రాశాడు: “తాను అర్థం కావడానికి కవిత్వం రాయననీ, అర్థం చేసుకోవడానికి రాస్తాననీ సిసిల్ డే లూయిస్ అన్నాడు. ఈ అర్థం చేసుకోవాలనే తపన ఎన్నో దారుల్లో సాగుతుంది. కాని మనందరిలోనూ ఉమ్మడిగా ఉన్నది ఆ తపనే. అలాగే మనుషులందరినీ ఏకం చేసేది కన్నీళ్లే. సమస్త ప్రాణికోటిలోనూ ఏడ్చే జీవజాతి మనం ఒక్కరమే. ఈ విలక్షణమైన మానవ స్వభావాన్ని వివరించడంలో విఫలమై చార్లెస్ డార్విన్ కూడ దాన్ని ‘మనిషికి చెందిన ప్రత్యేక వ్యక్తీకరణ’ అని అభివర్ణించాడు” అని ప్రారంభించి, కంటి నిర్మాణం, కన్నీరు రావడానికి శాస్త్రీయమైన కారణాలు వివరించి, కన్నీరు పెట్టడం గురించి కవితాత్మకమైన వివరణ ఇచ్చాడు. పురుషుల కన్నీటి నాళం స్త్రీల కన్నీటి నాళం కన్న విశాలమైనదనే శాస్త్రీయ సత్యాన్ని చెపుతూ, కాని పదో ఏటి నుంచి సాధారణంగా స్త్రీలకన్న పురుషులు తక్కువ ఏడుస్తారని, ఇది సాంస్కృతిక కారణాలవల్ల జరుగుతుందా, శారీరక కారణాలవల్ల జరుగుతుందా, రెండు కారణాలూ కలుస్తాయా చెప్పలేమనీ అంటాడు. మనలో పురుషులు బైటికి ఏడ్వడానికి అనుమతి లేకపోవడమే విచారకరమైన విషయమనీ, పురుషులకు కన్నీళ్లు వచ్చినా వెంటనే తుడిచేసుకునే అలవాటు పెరిగిపోయిందనీ అంటాడు.

“మేం ఈ సంకలనంతో దానికి ముగింపు పలకదలచుకున్నాం. ఈ సంకలనపు పాఠకులు ఒకరితో ఒకరు ఈ కవితలను బిగ్గరగా చదువుకొని కన్నీరు కార్చాలని మేం

కోరుకుంటున్నాం. ఉన్నత భావోద్వేగ ప్రకటనను మనం వేడుకగా జరుపుకుందాం. ఉమ్మడిగా మానవాళి అంతటికీ సామాన్య ధర్మమైన కన్నీటిని వ్యక్తీకరిద్దాం. మీ లింగం, నేపథ్యం, పరిస్థితులు ఏవైనా కావచ్చు. ఈ కవితలు దుఃఖభాజనమైనవి అయినప్పటికీ, మీరు నిరాశలో ఉన్నప్పుడు ఈ పుటలు మిమ్మల్ని ఓదారుస్తాయి. మీరు కుంగిపోయి ఉన్నప్పుడు అవి మిమ్మల్ని లేవనెత్తుతాయి. ఈ కవితలతో ప్రేరణ పొందకుండా మీరు ఉండజాలరు... ఈ పుటలు చదువుతున్నప్పుడు మీ కనుగుడ్లు కన్నీటితో వెల్లువెత్తుతాయని మా ఆశ. మన భావోద్వేగాన్ని వ్యక్తీకరించలేని అశక్తతనే ఏడుపు వ్యక్తీకరిస్తుంది. అటువంటప్పుడు కన్నీళ్ల కన్న ఎక్కువ మానవీయమైన, నిజాయితీ నిండిన, స్వచ్ఛమైన వ్యక్తీకరణ మరేముంటుంది? బహుశా ఆ 'ప్రత్యేక వ్యక్తీకరణ'కు ఏకైక ప్రతిస్పందన కవిత్వమే కావచ్చు" అని బెన్ రాశాడు.

దక్షిణాఫ్రికా రచయిత్రి నదీన్ గోర్డిమర్ చివరిమాట, ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ తరఫున కవిత్వం గురించీ, భావప్రకటనా స్వేచ్ఛ గురించీ రాసిన వివరణ కూడ చాల విలువైనవి.

ప్రతి కవితా ఒక కన్నీటి సరుల దొంతర.

తెలుగులో ఇటువంటి ఒక సంకలనం తయారు చేయగలిగితే ఎంత బాగుండును!

# కిక్కిరిసిన కొత్త కవిత్వాల ములాఖాత్‌లు

హైదరాబాదులో, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో చదువు, ఓల్డ్ పిజి హాస్టల్‌లో నివాసం ఎన్నెన్ని కొత్త కవితావరణాలకు తలుపులు తెరిచాయో ఇదివరకు రాశాను. అక్కడ ఉన్న సమయంలోనే ప్రారంభమై, స్థలంలోనూ కాలంలోనూ మరింత విస్తృతమైన మరిన్ని కవిత్వ ములాఖాత్‌ల గురించి ఇప్పుడు చెప్పదలచాను. ఈ సారి కవిత్వ ములాఖాత్‌ల స్థలాలు బెజవాడకూ ఇతర స్థలాలకూ కూడ విస్తరించాయి.

నాకు ఉస్మానియా ఆర్ట్స్ కాలేజి భవనంలోని ఎకనమిక్స్ డిపార్ట్‌మెంట్‌లో కాక, బషీర్‌బాగ్‌లోని పిజి కాలేజిలో సీటు రావడం ఒక మంచీ ఒక చెడూ. ఆ కాలేజి నిజానికి ఉద్యోగుల సౌకర్యార్థం సాయంకళాశాలగా ఉండవలసింది. ఎందువల్లనో దాన్ని సాయం కళాశాల చేయదలచుకోలేదు. కాని ఉద్యోగుల ప్రాధాన్యత వల్ల ఉదయం ఏడుకు మొదలై పదికల్లా ఎక్కువ భాగం క్లాసులు అయిపోయేలా తయారు చేశారు. అది ఉద్యోగులకు బాగుండేది గాని నా లాంటి క్యాంపస్ హాస్టల్ విద్యార్థులకు అరగంట ప్రయాణం, అది కూడ ఆ సమయానికి ఉండే 136 బస్సు దొరకడం, ఆ ప్రయాణ కాలాన్ని కలుపుకుంటే క్యాంపస్ నుంచి ఆరింటికే బయల్దేరవలసి ఉండడం, ఆ సమయానికి మెస్‌లో బ్రేక్‌ఫాస్ట్ తయారు కాకపోవడం వంటి సమస్యలతో కాలేజికి వెళ్లిన రోజుల కన్న వెళ్లని రోజులే

ఎక్కువ ఉండేవి. వెళ్లినప్పుడైనా రెండు మూడు పీరియడ్లు మాత్రమే ఉండగలిగి, పదిన్నర, పదకొండు కల్లా రోడ్లమీద, ముఖ్యంగా ఆబిడ్స్, కోఠీల్లో గడపడమే సరిపోయేది. ఆబిడ్స్ ఫుట్‌పాత్‌లు ఆదివారం పుస్తక నెలవులైతే, కోఠీ విమెన్స్ కాలేజి గోడ వెంబడి ప్రతి రోజూ పుస్తకాల పండగే. వాటిలో ఎన్నో కవిత్వం పుస్తకాలు. హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ కవితా సంపుటాలు కొత్తవీ, ఆయన ఎవరికో ఒకరికి సంతకం చేసి ఇచ్చినవీ విరివిగా దొరుకుతుండేవి.

ఎట్లాగూ నా చదువు వానాకాలం చదువు అయిపోయింది గనుక విప్లవ విద్యార్థి, సాహిత్యోద్యమ పనులూ, విప్లవోద్యమ పనులూ ఆ సమయాన్ని పూరించేవి. అప్పుడు పీపుల్స్ వార్ అధికార పక్షపత్రిక 'క్రాంతి', రాడికల్ విద్యార్థి యువజన సంఘాల పత్రిక 'రాడికల్ మార్చ్', కార్మికోద్యమ పత్రిక 'కార్మిక పథం' హైదరాబాదులో తయారై, అచ్చుకోసం బెజవాడ వెళ్తుండేవి. అంటే ఆ పత్రికల మెటీరియల్ ప్రెస్‌లో ఇచ్చిరావలసిన పని నెలకు రెండుసార్లు ఉండేది. కనీసం రెండు నెలలకొకసారైనా ఆ పని నాకు పడేది. అలా 1982 సెప్టెంబర్ అక్టోబర్‌లలో ఓల్డ్ పిజిలో చేరినప్పటి నుంచి ఎంఎ సెమిస్టర్ పరీక్షలు ఒక్కటి కూడ రాయకుండానే 1984 ఏప్రిల్‌లో హాస్టల్ వదిలేసేదాకా, పది పదిహేను సార్లు బెజవాడ వెళ్లి ఉంటాను. ఆ రోజుల్లో హైదరాబాదు నుంచి బెజవాడ ప్రయాణం ఏడెనిమిది గంటలు – చదువుకోవడానికి బోలెడు అవకాశం.

ఆ రోజుల్లో పత్రికలన్నీ వెతికివెతికి కవిత్వం చదువుతూ, మంచి కవితలను ఇతరులకు చదివి వినిపిస్తూ, మననం చేసుకుంటూ ఉండేవాణ్ని. ఆంధ్రజ్యోతి సాహిత్యవేదికలో 1983 మొదట్లో అఫ్సర్ కవిత ఒకటి కనిపించింది. అది సర్వేశ్వర్ దయాళ్ సక్సేనా మరణం తర్వాత తాను రాసిన కవిత అని అఫ్సర్ అంటాడు గాని, అది బాల్యం మీద కవిత అని నా గుర్తు. అఫ్సర్ పేరుతో అప్పటికే కొన్ని కవితలూ వచ్చి ఉన్నాయి, బెజవాడ ఆంధ్రజ్యోతిలో పనిచేస్తాడని తెలుసు. ఆ తర్వాత బెజవాడ వెళ్లినప్పుడు ఆంధ్రజ్యోతి ఆఫీసుకు వెళ్లి మరీ అఫ్సర్‌ను పరిచయం చేసుకున్నాను. ఆ తర్వాత బెజవాడలో నాలుగైదేళ్లు కలిసి ఉన్నాం. తాను ఖాళీ చేసిన గదిలో నేను కొన్నాళ్లున్నాను. నిజంగా కవి అనే మాటకూ, లోతైన, గాఢమైన మానవ సంస్పందనలకూ పర్యాయపదం అఫ్సర్. వ్యక్తిగానూ కవిగానూ అఫ్సర్‌తో ములాఖాత్ మూడు దశాబ్దాల పైబడి సాగుతున్నది.

హైదరాబాదు నుంచి నా బెజవాడ ప్రయాణాలకు ఆరు నెలల ముందు నుంచే బెజవాడలో నాకు ఉద్యమం ఇచ్చిన కుటుంబం ఒకటి ఏర్పడింది. అమ్మా అని నేను నోరారా పిలిచిన, నన్ను తన కొడుకులాగే చూసుకున్న కరుణ (కొండపల్లి సీతారామయ్య కూతురు, కావూరి రమేశ్ బాబు సహచరి), నన్ను తమ సొంత అన్నగా భావించుకుని సమస్తం పంచుకున్న చిన్ని (అనురాధ), చుక్క (సుధ), నన్ను ఇంటి మనిషిగా, మనవడిగా చూసిన కోటేశ్వరమ్మ, మొగల్రాజపురం కొండ నీడన వెచ్చని చలివేందిర వాళ్ల ఇల్లు. వాళ్ల ఇంట్లో బోలెడు పుస్తకాలు.

కొండపల్లి సీతారామయ్య గారివీ, కావూరి రమేశ్ బాబువీ, కరుణవీ. ఆ ఇంట్లో వాళ్లందరూ కవులుగా పేరుపొందినవాళ్లు కాదు గాని ఏదో ఒక సమయంలో కవిత్వం రాసినవాళ్లే. దానికన్న మిన్నగా కవిత్వ ప్రేమికులు. ఆ ఇంట్లోనే నేను మొట్టమొదటిసారి ఫైజ్ అహ్మద్ ఫైజ్ కవితలకు వి జి కీర్నన్ అనువాదం పీపుల్స్ పబ్లిషింగ్ హౌజ్ పుస్తకం చూశాను. ఆ ఇంట్లోనే నండూరి సుబ్బారావు ఎంకి పాటల సాహిత్య శక్తినీ, వాటి గానంలోని మాధుర్యాన్నీ మొదటిసారి అనుభవించాను. అక్కడి కవిత్వ ములాఖాత్‌లలో మరింత ముఖ్యమైనవి హిందీ సినిమా పాటల కవిత్వానికి తెరుచుకున్న కిటికీలు. చిన్ని, చుక్క ఇద్దరూ కూడ అద్భుతమైన గాయకులు. చిన్నతనమంతా ఢిల్లీలో గడిపినందువల్ల హిందీ సినిమాలు, పాటలు, నుడికారం బాగా తెలిసినవాళ్లు. గొప్ప హిందీ, ఉర్దూ కవులందరూ హిందీ సినిమాల పాటలు రాశారనీ, ఆ పాటల్లో అపురూపమైన కవిత్వం ఉందనీ కొత్తగా చెప్పనక్కరలేదు. కైఫీ ఆజ్మీ, షకీల్ బదాయూనీ, సాహిర్ లూధియాన్వీ, మజ్రూహ్ సుల్తాన్‌పురీ, హస్రత్ జయపురీ, ఇందీవర్, శైలేంద్ర, గుల్జార్, నీరజ్ వంటి కవుల పాటల మహత్తర కవితాభివ్యక్తి మా చిన్ని, చుక్కల గొంతుల్లోంచి జాలువారుతుంటే వినగలిగే గొప్ప అదృష్టం నాకు కలిగింది.

నేను హైదరాబాదులో ఉన్న రెండు సంవత్సరాలూ కొండపల్లి సీతారామయ్య జైలులో ఉన్నారు. 1982 జనవరి 2న బేగంపేట రైల్వేస్టేషన్‌లో అరెస్టయి, 1984 జనవరి 4న ఉస్మానియా హాస్పిటల్ నుంచి తప్పించుకుపోయేవరకూ ఆయన ముషీరాబాదు జైలులో ఉండడం వల్ల ఆయనను కలవడానికి కరుణ, చిన్ని, చుక్క హైదరాబాదుకు వస్తూ ఉండేవారు.

కొండపల్లి సీతారామయ్య జైలు నుంచి తప్పించుకుపోవడంతో హైదరాబాదులో విప్లవ ప్రజాసంఘాల నాయకులందరి మీద పోలీసులవైపు నుంచి దాడులు, వేధింపులు, నిఘా మొదలయ్యాయి. అప్పటివరకూ 'రాడికల్ మార్చ్' సంపాదకుడిగా ఉండిన అప్పటి రాడికల్ విద్యార్థి సంఘం రాష్ట్ర అధ్యక్షుడు ఎంఎఫ్ గోపీనాథ్ అజ్ఞాతానికో ప్రవాసానికో వెళ్లవలసిన స్థితి వచ్చింది. అప్పుడు తాత్కాలిక ఏర్పాటుగా 1984 జనవరి సంచిక నుంచి వర్కింగ్ ఎడిటర్ అని నా పేరు వేయడం మొదలయింది. అప్పటికి 'రాడికల్ మార్చ్'లో అచ్చువేసే వ్యాసాలు రాయడానికి, అనువాదం చేయడానికి, విద్యార్థి యువజన పోరాట వార్తలు, ఒక కథ, మూడు నాలుగు కవితలు ఎడిట్ చేయడానికి ఒక బృందం ఉండేది. 1984 ఏప్రిల్‌లో నన్ను ఆ బృందంలోకి తీసుకుని, కవితల ఎడిటింగ్ బాధ్యత నాకు అప్పగించారు. ఎ4 సైజు పత్రికలో చివరి పేజీ నిండా రెండో మూడో నాలుగో కవితలు వేయడానికి అవకాశం ఉండేది. సంక్షోభ, విప్లవ సమయాల్లో కవితాభివ్యక్తి విరివిగా ఉంటుందనేది ప్రపంచ చరిత్ర అంతటా తేలిన సత్యమే. అలాగే రాడికల్ విద్యార్థి యువజనుల నుంచీ, సాధారణ విప్లవాభిమానుల నుంచీ కూడ ప్రతినెలా దాదాపు యాభై కవితలు వచ్చేవి. వాటి నుంచి నాలుగు ఎంపిక చేసి, దిద్ది, ప్రచురణకు సిద్ధం చేయడం నా పని. 'సృజన'లో అటువంటి

పనేచేశాను గాని అది ఒక సామూహిక కార్యాచరణలో భాగంగా జరిగింది. ఇక్కడ అంతిమంగా నా ఎంపికను సరిచూడడానికి సామూహిక నిర్మాణం ఉండేది గాని అంతకు ముందరి పని నాదే. నా కవిత్వ ములాఖాత్‌లలో నాకు ఎన్నో పాఠాలు నేర్పిన సందర్భం అది. గొప్ప ఉద్వేగ సందర్భంతో ప్రభావితమైన విద్యార్థి యువజనులు ముడి కవితలు ఎలా రాస్తారు, వాటి వస్తువులోని వైవిధ్యాన్ని, అసాధారణత్వాన్ని, శక్తిని అంగీకరిస్తూనే, గౌరవిస్తూనే, వాటికి కవిత్వ శిల్ప, శైలీ ప్రమాణాలు ఎలా అద్దాలి అని నిరంతర తపనకు, అన్వేషణకు నేను లోనైన సందర్భం అది. అలా నా ఎంపికలో దాదాపు రెండు సంవత్సరాలపాటు, ఇరవై నాలుగు సంచికల్లో వెలువడిన కనీసం వంద కవితలు సమకాలీన సామాజిక రాజకీయ ఘటనలకు, ఆ ఘటనల మీద విప్లవ విద్యార్థి యువజనోద్యమ స్పందనకు, మరో మాటల్లో చెప్పాలంటే కళ్ల ముందరి చరిత్రకు కవితా స్పందనలుగా నిలుస్తాయని ఇవాళ్టికీ గర్వంగా చెప్పుకోగలను.

ఈ 'రాడికల్ మార్చ్' నిర్వహణ బాధ్యతలలో ఉండగానే ఒక గడ్డు సమస్య వచ్చింది. అది కూడ నా కవిత్వ ములాఖాత్‌లకు మరొక కొత్త అవకాశం ఇచ్చింది. హైదరాబాదులో పీపుల్స్ వార్ నాయకత్వ స్థావరాల మీద 1986 ఏప్రిల్‌లో పోలీసులు దాడులు చేసి, ఎంతో మందిని అరెస్టు చేసి రాంనగర్ కుట్రకేసు బనాయించారు. అప్పటికి పార్టీ మీద గాని, ప్రజాసంఘాల మీద గాని నిషేధమేమీ లేదు. కాని, ఎన్‌టి రామారావు రెండోసారి అధికారంలోకి వచ్చిన తర్వాత 'ఆట, పాట, మాట బంద్' అని ప్రకటించి, 1985–89 మధ్య అమలు చేసిన దారుణ నిర్బంధంలో మొదటి అడుగు ఈ దాడులు, రాంనగర్ కుట్రకేసు. ఈ స్థితిలో హైదరాబాద్ నుంచి పనిచేయడం సాధ్యం కాదనీ, మొత్తం పత్రికల నిర్వహణ బృందం విడిపోయి ఎవరికి వారు విడివిడిగా కోస్తా పట్టణాలలో ఉంటూ పత్రికలను ప్రచురణకు పంపే సమావేశానికి మాత్రం కలుస్తుండాలని నిర్ణయం జరిగింది.

అలా నేను, నాతోపాటు ఒక సహచరుడు ఒక సముద్ర తీర పట్టణంలో తలదాచు కోవలసి వచ్చింది. గ్రాండ్ ట్రంక్ రైలు మార్గం మీద ఉన్న ఆ చిన్న పట్టణం అన్ని రకాలుగానూ చిన్నదే. రైల్వేస్టేషన్ పుస్తకాల దుకాణంలో దొరికే ఇలస్ట్రేటెడ్ వీక్లీ తప్ప నా ఆసక్తులను తీర్చగల అవకాశాలు చాల తక్కువ. ఆ అన్వేషణలో భాగంగా అక్కడి శాఖా గ్రంథాలయానికి వెళ్తే, అక్కడ చాగంటి శేషయ్య రాసిన 'ఆంధ్ర కవి తరంగిణి' సంపుటాలు దొరికాయి. పూర్తిగా అననుకూలమైన పరిస్థితులలో సాంప్రదాయిక తెలుగు కవితా ధార గురించి తెలుసుకోవడానికి నాకు దొరికిన పెన్నిధి ఆ సంపుటాలు. ఆయన ఒక్కొక్క కవినీ తీసుకుని, జీవితం, రచనలు వివరిస్తూ, ఆ కవి పద్యాలు కూడ ఇచ్చారు. తెలుగు సాంప్రదాయిక పద్య సాహిత్యంలోని కవిత్వ సొగసులతో నా ములాఖాత్ బలపడింది అక్కడే.

అక్కడే నేను మొదటిసారి నన్నెచోడుడి 'కుమార సంభవం' గురించి తెలుసుకొని, అందులోని అద్భుతమైన పద్యం చదివాను. అది కేవలం వసంతకాలంలో అడవిలో ఏ

వరుసలో ఏ పూలు పూచాయో చెప్పే పద్యంగా, వసంతవర్ణనగా మాత్రమే నాకు కనిపించదు. అది ప్రకృతి గతితర్కానికి కవితాత్మక వ్యక్తీకరణ అనిపిస్తుంది నాకు. అది ఎప్పటికెయ్యది ప్రస్తుతంబొ అనుకునే తక్షణ వాదుల వాదనలను తుత్తునియలు చేసే అభివ్యక్తి అనిపిస్తుంది. ప్రకృతిలో, సమాజంలో, మనిషిలో ఏదీ విడి అంశం కాదనీ, ఏదీ పరమం కాదనీ, అన్నీ ఒకదానితో ఒకటి కలిసినవనీ, అన్నీ సాపేక్షికమనీ, అన్నీ ఒక క్రమంలో ఉన్నాయనీ, ఉంటాయనీ చెప్పిన పద్యం అది. ఇవాళ్టికీ ఘటనతో, సందర్భంతో, సన్నివేశంతో పొంగిపోయేవాళ్లను చూసినా, కుంగిపోయేవాళ్లను చూసినా నాకు ప్రతి దృగ్గోచరాంశానికీ క్రమం ఉందని చెప్పిన ఈ ఎనిమిది శతాబ్దాల కింది వివేకం గుర్తుకొస్తుంది:

*పొన్నలు పూచె, బొన్న లొగి బూవక ముందర బూచె గోగు, లా*
*పొన్నలు గొండగోగులును బూవకముందర బూచె బూరువులు,*
*పొన్నలు గొండగోగులును బూరువులు న్నొగి బూవకుండగా*
*మున్న వనంబునం గలయ మోదుగులొప్పుగ బూచెనామనిన్*

# నానా భాషల, అనేక వర్ణాల అద్భుత కవిత్వం

గత వారం ప్రస్తావించిన 1984–86 సమయంలోనే నా జీవితంలోకి 'నానా తారక లనేకవర్ణా లనంతరోచులు దిక్కుదిక్కులా దివ్యగీతములు' అనుకోవలసిన లెక్కలేనన్ని కవిత్వ ములాఖాత్‌లు వచ్చిపడ్డాయి. ఆ రెండు సంవత్సరాలలో దాదాపు నలభై కవితలు అనువాదం చేశాను. ఒక్కొక్క భాషదీ, ఒక్కొక్క కవిదీ ఒక ప్రత్యేకమైన అభివ్యక్తి, ప్రత్యేకమైన శిల్పం, ప్రత్యేకమైన నేపథ్యం, ప్రత్యేకమైన వస్తువు.

నిజానికి ఈ కవిత్వ ములాఖాత్‌లకు ముందరి ఒక కవితామయ, సాహిత్యమయ, నిత్య చలనశీల వాతావరణం గురించి కూడ చెప్పాలి. ఎట్లాగూ ఎంఎ పరీక్షలు రాయడం లేదు గనుక 1983 మధ్యనుంచే ఉద్యోగం వేటలో పడ్డాను. ఆంధ్రభూమిలో సంపాదకీయ పేజీలో మారుపేర్లతో వారానికి ఒకటో రెండో వ్యాసాలు రాసి డబ్బులు సంపాదించే అవకాశం వచ్చింది గాని ఉద్యోగం రాలేదు. అప్పుడే బొలీవియన్ గని కార్మికోద్యమ నాయకురాలు డొమితిలా బారియోస్ ది చుంగారా ఆత్మకథ 'లెట్ మి స్పీక్' తెలుగులోకి అనువదించడం, 'మాకథ' పేరుతో హైదరాబాద్ బుక్ ట్రస్ట్ దాన్ని ప్రచురించడం జరిగాయి. అప్పుడే ఎబికె ప్రసాద్ సంపాదకుడిగా తెలుగు పత్రికారంగ చరిత్రలోనే విశిష్టమైన ప్రయోగం 'ఉదయం' ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. ఉపసంపాదకులుగా, విలేఖరులుగా సిద్ధంగా దొరికినవాళ్లను

తీసుకోవడం కాకుండా, కొత్తవాళ్లను తీసుకుని ప్రత్యేకమైన శిక్షణ ఇచ్చి తమకు కావలసిన విధంగా మలచుకోవాలని 'ఉదయం' నిర్వాహకులు భావించారు. పరీక్షలో నెగ్గిన పదిహేను, పదహారు మందితో 1983 డిసెంబర్‌లో 'ఉదయం' ట్రెయినింగ్ కాలేజి ప్రారంభమయింది. ఎకెఆర్‌బి కోటేశ్వర రావు, కె వాసుదేవరావు, కెఎన్‌వై పతంజలి, టి ప్రకాశ్ మాకు గురువులు. గుడిహాళం రఘునాథం, కె శ్రీనివాస్, సి మృణాళిని, వాడ్రేవు ఆంజనేయులు, టివి రమణమూర్తి, ఎ ఎం అయోధ్యారెడ్డి, టి రఘురాములు వంటి అప్పటికే ఏదో ఒక రంగంలో కొంత ప్రముఖులైనవాళ్లు, నాంచారయ్య, సత్యవతి, రమణారావు, రత్నబాబు, సుబ్రహ్మణ్యేశ్వరరావు, సురేష్ వంటి ఆ తర్వాత పత్రికారంగంలో ప్రముఖులైనవాళ్లు నా సహాధ్యాయులు, సహోద్యోగులు.

మా అందరికీ అది మొదటి ఉద్యోగమే గాని, మాలో చాలమందిమి అప్పటికే సాహిత్యం చదువుకున్నవాళ్లం, రాసేవాళ్లం. అందరికన్న మిన్న గుడిహాళం రఘునాథం. ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్ రోజుల నుంచీ మిత్రుడు, శక్తిమంతమైన, సున్నితమైన కవి. 'అంకితం' అని తన కవిత 1981లో 'భారతి'లో అచ్చయితే, వెంటనే మరుసటి సంచిక 'సృజన'లో పునర్ముద్రించినంత సమ్మోహ పరిచినవాడు. ఆ కవితలోని కొన్ని పాదాలు:

'....ఇంకా ఎంతకాలమెంతకాలం?
రా, అన్నా, రా!
ఇల్లొదిలి, బారొదిలి
తడి తడి వెన్నెలల చంద్ర బింబాలొదిలి
ఆశల భ్రమల్నొదిలి
సాయంత్రాల్ని కార్చుకునే ఆదివారాల్నొదిలి
మురికి మురికి ఆకాశాల్నొదిలి
విరిగి విరిగి పడుతున్న వచన కవిత్వాల్నొదిలి
రా, భాయీ, రా!!
మన సముద్రంలో కలుద్దాం
మన సముద్రం – కోపంలో కలుద్దాం
మన సముద్రం – పగలో కలుద్దాం
తరతరాలుగా మన మేధావులు చేసిన వంచనకి
మనం పడే పశ్చాత్తాపంలో కలుద్దాం
జనాల్లో అల్లుకుంటున్న గహనాటవుల్లో కలుద్దాం.'

అశోక్ నగర్ చౌరస్తాలో ఒక అద్దె భవనంలో మాకు శిక్షణ ప్రారంభించారు. ఆ చౌరస్తాలో ఒక మూల మేమైతే, సరిగ్గా మాకు ఎదురు మూల 'ఆజాద్ కేఫ్' అని ఇరానీ

హోటల్. ఇక తరగతి గదిలోనూ, ఆ ఇరానీ హోటల్‌లోనూ సాహిత్యానికీ, కవిత్వానికీ, భాషకూ, చర్చలకూ సంపూర్ణ ఆజాదీ.

ఆ అద్భుతమైన వాతావరణాన్నీ, ఉద్యోగాన్నీ నేను నాలుగైదు నెలల తర్వాత అర్ధాంతరంగా వదులుకోవలసి వచ్చింది. అప్పటి నుంచి దాదాపు రెండు సంవత్సరాలు 'రాడికల్ మార్చ్' మాసపత్రిక నిర్వహణ బాధ్యతలు పంచుకుంటూ ఉన్నప్పుడు, చదువుకోవడానికీ, రాయడానికీ, అనువాదం చేయడానికీ చాల సమయం దొరికింది. ఇంతకుముందు రాసినట్టు చివరి రోజుల్లో తెలుగు పద్య కవిత్వం చదువుకున్నాను గాని తొలిరోజుల్లో ఇంగ్లిష్, హిందీ పత్రికల్లో, పుస్తకాల్లో ఎక్కడ కవిత్వం కనిపించినా చదవడం, తెలుగువాళ్లకు అవి అందించడం నా బాధ్యత అనుకున్న కవితలు అనువదించడం, సాధారణంగా 'సృజన'లో అచ్చువేయడం జరిగింది. వాటిలో జోస్ మారియా సిజాన్ (ఫిలిపినో) కవితలు పదహారు, బీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ (బెంగాలీ) కవితలు ఐదు, సచ్చిదానందన్ (మలయాళం), మహమూద్ దర్వీష్ (పాలస్తీనీ), కుమార్ వికల్ (హిందీ) ల కవితలు తలా రెండు, ఫౌజి అల్ అస్మర్ (పాలస్తీనీ), ఫైజ్ అహ్మద్ ఫైజ్ (ఉర్దూ), నబరుణ్ భట్టాచార్య (బెంగాలీ), ఆదిల్ మన్సూరి (ఉర్దూ), ఉదయ్ ప్రకాశ్ (హిందీ), అరుణ్ కమల్ (హిందీ) ల కవితలు ఒక్కొక్కటి అనువాదం చేశాను.

మూడు దశాబ్దాల కింది ఆ కవితలన్నీ ఈ తరంతో పంచుకోవాలని ఉంది గాని, ఇక్కడ స్థలం దృష్ట్యా కొన్ని మాత్రం పంచుకుంటాను. పాలస్తీనీ కవితలన్నీ, సచ్చిదానందన్ 'ముక్తకంఠం', నబరుణ్ భట్టాచార్య 'మృత్యులోయ నా మాతృభూమి కాదు', ఉదయ్ ప్రకాశ్ 'కొత్త నియంత' కవితాభిమానులందరూ తప్పక చదవవలసినవి. నిడివి దృష్ట్యా చివరి మూడూ పెద్దవే గాని, వాటిలో చిన్నదైన 'కొత్త నియంత', పాలస్తీనీ కవిత్వానికి ఉదాహరణగా దర్వీష్ కవిత ఒకటీ ఇక్కడ ఇస్తున్నాను.

సి వి సుబ్బారావు, నేను కలిసి రాసిన పాలస్తీనా పోరాట పరిచయ వ్యాసం, దానికి అనుబంధంగా కొన్ని పాలస్తీనీ కవితలు అనువదించడం గురించి ఇదివరకు చెప్పాను. ఒక చిన్న సామాజిక, రాజకీయ నేపథ్య వివరణతో పాటు కొన్ని కవితలు ఇచ్చే ఈ పద్ధతి వల్ల పాఠకులు అటు ఆ కవిత్వం ఆవిర్భవించిన భూమికను తెలుసుకునే అవకాశమూ, ఇటు ఆ కవిత్వపు ప్రత్యేక అభివ్యక్తినీ శక్తినీ గ్రహించే అవకాశమూ కలిగాయి. ఆ పద్ధతినే మరొక ఐదారు సందర్భాలలో కొనసాగించాను. ఈ రెండు సంవత్సరాలలో అటువంటివి మూడు ప్రయత్నాలు చేశాను. ఆ పని వల్ల నాకు వ్యక్తిగతంగా కూడ చాల మేలు జరిగింది. ఆ సమాజం గురించీ, ఆ కవి గురించీ చదవడానికీ ఎక్కువ తెలుసుకోవడానికీ, ఆ కవితల నేపథ్యాలు తెలుసుకుని అనువదించడానికీ అవకాశం వచ్చి నా పరిధిని విశాలం చేయడంలో అవి దోహదం చేశాయి.

ఆ మూడు ప్రయత్నాలలో ఒకటి, ఫిలిప్పైన్స్ విప్లవోద్యమ నాయకుడు, ఫిలిప్పైన్స్ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి జోస్ మారియా సిజాన్ గురించీ, ఫిలిప్పైన్స్ విప్లవ మార్గం గురించీ పరిచయ వ్యాసంతో పాటు, సిజాన్ రాసిన పదహారు కవితల అనువాదం. ఫిలిప్పైన్స్ విశ్వవిద్యాలయంలో రాజనీతిశాస్త్ర అధ్యాపకుడిగా ఉండిన సిజాన్ 1968లో అజ్ఞాతవాసానికి వెళ్లి విప్లవోద్యమాన్ని నిర్మిస్తూ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి అయ్యాడు. మార్కోస్ నియంతృత్వ పాలనలో 1970ల తొలినాళ్లలో అనేక విజయాలు సాధించిన నూతన ప్రజా సైన్యానికి సారథి అయ్యాడు. ఫిలిప్పైన్స్ చరిత్ర గురించీ, విప్లవోద్యమం గురించీ ఉజ్వలమైన రచనలెన్నో చేశాడు. 1977 నవంబర్‌లో అరెస్టయి జైలు నిర్బంధంలో ఉన్నప్పుడు ఆయన రాసిన కవితలు బైటికి స్మగుల్ అయి, అమెరికాలోని ఒక అంతర్జాతీయ సంఘీభావ సంస్థ ప్రచురించింది. ఆ చిన్న పుస్తకంలోని కవితలన్నీ అనువదించాను. ఉదాహరణకు ఒకటి:

## గెరిల్లా కవిలాగే ఉంటాడు

– జోస్ మారియా సిజాన్

గెరిల్లా కవిలాంటి వాడే
ఆకుల గలగలలకు
రెమ్మలు విరిగే సవ్వడికి
సెలయేటి బుడగలకి
మంటల వాసనకి
వియోగాల బూడిదకు
అతను స్పందిస్తాడు

గెరిల్లా కవిలాంటి వాడే
అతను వృక్షాలతో
పొదలతో, శిలలతో మమేకమవుతాడు
సందిగ్ధంగా ఐనా సూటిగా ఉంటాడు
గతిసూత్రాలను స్పష్టంగా
అవగాహన చేసుకుంటాడు
అనేకానేక భావచిత్రాలకు
అధికారం వహిస్తాడు

గెరిల్లా కవిలాంటి వాడే
ప్రకృతి శ్రుతిలో కలగలిసిన
పచ్చదనపు అంతర్లయలో
మిళితమైన ఉక్కుపట్టు
చుట్టూ అల్లుకున్న నిశ్శబ్దంలో
అమాయకత్వంలో
శత్రువుకు వలపన్నుతుంది

గెరిల్లా కవిలాంటివాడే
కిరీటమై అందరినీ ఆహ్లాదపరిచే
ఎర్రపూలు జ్వలించే పొదల్లో
అతను ఆకుపచ్చని, గోధుమరంగు
సమూహాలతో సంచరిస్తాడు
ఆ ప్రాంతాన్నంతా వరదలా ముంచెత్తి
అంతిమంగా కేంద్రం మీదికి కవాతు చేస్తాడు...

రెండోది, అమృతసర్ స్వర్ణమందిరం మీద ఇందిరాగాంధీ జరిపించిన సైనిక దాడి జరిగి ఏడాది అయిన సందర్భంగా పంజాబ్ ఉద్యమం గురించీ, ప్రధానంగా నిర్బంధం గురించీ పరిచయ వ్యాసం రాసి ఆ ఇతివృత్తానికి సరిపోయే నాలుగు కవితలు అనువాదం చేశాను.

మూడోది, 1940ల నాటి ప్రముఖ బెంగాలీ విప్లవ కవి బీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ మరణించినప్పుడు ఆయన గురించి పరిచయం, ఇంటర్వ్యూతోపాటు ఆయన రాసిన ఐదు కవితలు అనువాదం చేశాను.

"కళ్లురిమి చూసినప్పుడు గెలీలియో లొంగిపోయాడు
'భూమి తిరగడం లేదు' అని రాశాడు
అయినా భూమి తిరుగుతోంది, తిరుగుతూనే ఉంటుంది
ఎందరు కళ్లురిమి చూసినా సరే" అంటాయి ఆయన ఎమర్జెన్సీలో రాసిన కవితలో కొన్ని పాదాలు.

అవి ఆయా సందర్భాలకు అవసరమైన పెద్ద పనులైతే ఎప్పటికప్పుడు ప్రభావితం చేసిన కవితలో, అవసరమైన కవితలో అనువాదం చేసే పనీ చాల ఉండేది. అలా ఎందరు కవుల కవిత్వంతో ములాఖాత్‌లు జరిగాయో లెక్కలేదు. అటువంటి కవితల్లోంచి రెండు,

ఒకటి అజరామరమైన పాలస్తీనీ కవి మహమూద్ దర్వీష్ రాసిన 'ఓ మనిషి గురించి', మరొకటి, హిందీ కవి ఉదయ్ ప్రకాశ్ అంతకుముందు ఎన్నో సంవత్సరాల కింద రాసిన కవిత 'కొత్త నియంత' అప్పుడే రెండోసారి గెలిచివచ్చి నియంతృత్వ పాలన చలాయిస్తున్న ఎన్ టి రామారావు సందర్భానికి అన్వయిస్తూ అనువదించినది.

## ఓ మనిషి గురించి

– మహమూద్ దర్వీష్

వాళ్ళు ఆయన నోటికి సంకెళ్లేశారు
ఆయనను వధ్యశిలకు కట్టేశారు
ఆయనను హంతకుడన్నారు
ఆయన తిండినీ గుడ్డల్నీ
జెండాల్నీ వాళ్లెత్తుకుపోయారు
ఆయనను మృత్యు గహ్వరంలోకి నెట్టేశారు
ఆయనను వాళ్లు దొంగ అన్నారు
ఆయనను అన్ని రేవుల్నించీ నెట్టేసి
ఆయన నెచ్చెలిని లాక్కొని
వాళ్లాయనను శరణార్థి అన్నారు

మంటలు మండే మీ కళ్లకూ
నెత్తురంటిన చేతులకూ చెప్పుకోండి
రాత్రి ముగిసిపోతుంది
ఏ జైలూ ఏ సంకెలా మిగలవు
నీరో చచ్చాడు గాని
రోమ్ చావలేదు
రోమ్ తన చూపులతో పోరాడింది
ఎండిపోతున్న గోధుమకంకి విత్తనాలే
మైదానాన్ని లక్షల పచ్చని కంకులతో నింపుతాయి

## కొత్త నియంత

– ఉదయ్ ప్రకాశ్

నియంత ఇంకా
అట్లాగే ఉంటాడని
కనీసం చాల పోలికలుంటాయని
ఆయననుకుంటాడు

అంటే
పైపెదవి మీద
సీతాకోక చిలుకలా కత్తిరించిన మీసాలు
పతకాలూ రిబ్బన్లూ
ప్రజాసమూహాలను సమ్మోహపరిచే
వాక్పటిమా ఉంటాయనుకుంటాడు

కాని ఏమయిందంటే
వాడు మునుపటిలాగ లేడు
ఒకవేళ వాడు మళ్లీ
పాత రూపంలో పాత దుస్తుల్లో
వచ్చే ప్రయత్నం చేస్తే
ద్వేషంతో రగిలే గుండెలున్నా సరే
దుర్మార్గపుటాలోచనలు మసిలే మనసున్నాసరే
వాడు కేవలం విదూషకుని లాగే కనబడతాడు

కనబడిన వెనువెంటనే
తెలిసిపోయే నియంత లేడివాళ
ఉంటే
జనం వాణ్ని వెంటాడుతారు
వెక్కిరిస్తారు, భయపెడతారు
చిన్నారి పాపలు కూడ వాణ్ని
ఎగిరెగిరి తంతారు

బహుశా వాడు

'నేనీ శతాబ్దంలో
అందరికన్న ఎక్కువ అపార్థానికి గురైన వాణ్ని'
అంటూ వస్తాడు
బహుశా వాడు
వినోబా భావే గురించీ
సంత్ తుకారాం గురించీ
నిరాయుధీకరణ గురించీ మాట్లాడతాడు

బహుశా వాడు
గడ్డం శుభ్రంగా గీసుకుని
మర్యాదస్తుడి ముఖంతో
పక్షుల పట్లా, శిశువుల పట్లా
అవ్యాజమైన ప్రేమ కనబరుస్తాడు

బహుశా వాడు
సైన్యం అవసరాన్నీ
పోలీసు అవసరాన్నీ వ్యతిరేకిస్తాడు

బహుశా వాడు
ఎక్కడో ఒక ఆసుపత్రి నిర్మిస్తాడు
ఒక చలివేంద్రం తెరుస్తాడు
ఎక్కడో ధర్మశాలనో
నాటక కేంద్రాన్నో
గ్రంథాలయాన్నో నెలకొల్పుతాడు

వాడి సద్గుణాలకు
ఇవన్నీ సాక్ష్యాలు కావా అని
మనలోనే కొందరు
మనతో చర్చించవచ్చు కూడ
ఆ సమయానికి
వాడు నోబెల్ శాంతి బహుమతి
అందుకుంటుండవచ్చు కూడ

లేదా
బహుమతి జాబితాలో
వాడిపేరు పైపైన
ఉండవచ్చు కూడ.

# బెజవాడలో, ఆ మూల సౌధంలో కవిత్వం

1986 చివరలో నా జీవితగమనంలో వచ్చిన ఒక మార్పు నాకు మరిన్ని కొత్త కవిత్వ ములాఖాత్‌లకు అవకాశం ఇచ్చింది. నా ఉద్యోగం నేను చేసుకుంటూ 'రాడికల్ మార్చ్'కు గాని, విప్లవోద్యమానికి గాని అవసరమైన రాతపనులు చేయవచ్చు గదా, ఒక మాసపత్రిక నిర్వహణ కోసం మరే ఉద్యోగం లేకుండా పూర్తికాలం ఉండడం ఎందుకు అని చర్చ ప్రారంభించి, ఓడిపోయి, 'రాడికల్ మార్చ్' నిర్వహణ బాధ్యతలనుంచి తప్పుకున్నాను.

అది ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావు 'ఆట, పాట మాట బంద్' అని స్పష్టంగా ప్రకటించిన నిర్బంధకాలం. కొద్ది కాలం ఆగిపోయిన ఎన్‌కౌంటర్లు మళ్లీ మొదలయ్యాయి. రాజమండ్రిలో 1985 మే లో జరగవలసిన రైతుకూలీ సంఘం సభలను అడ్డుకుని విచ్చలవిడి అరెస్టులు చేశారు. పలాసలో 1986 జనవరిలో జరగవలసిన విరసం మహాసభలను అడ్డుకున్నారు. మార్చ్‌లో ఇంద్రవెల్లి స్థూపాన్ని డైనమైట్లు పెట్టి కూల్చేశారు. ఏప్రిల్‌లో హైదరాబాద్‌లో అరెస్టులు జరిపి రాంనగర్ కుట్రకేసు బనాయించారు. ఈ నిర్బంధాన్ని ప్రశ్నిస్తూ, దేశవ్యాప్తంగా ప్రచారం చేస్తున్న బాలగోపాల్‌ను కూడ అరెస్టు చేశారు. గద్దర్ అజ్ఞాతవాసానికి వెళ్లవలసి వచ్చింది. వరవరరావు బెయిల్ రద్దు చేసుకుని జైలుకు వెళ్లవలసి వచ్చింది. లాటిన్ అమెరికన్ సైనిక నియంతృత్వాల తరహాలో మనుషుల్ని మాయం చేయడం మొదలుపెట్టారు. అటువంటి స్థితిలో అప్పుడప్పుడే 'రాడికల్ మార్చ్' నిర్వహణ బాధ్యతల నుంచి బైటికి వచ్చిన నేను ఎక్కడ ఉండాలి, ఏం చేయాలి అని చర్చ జరిగింది. 'హైదరాబాదులో వద్దు, దృష్టి ఎక్కువగా ఉంటుంది. ఇప్పుడున్న స్థితిలో అరెస్టు చేస్తారో, చంపుతారో తెలియదు. బెజవాడలో అంత దృష్టి ఉండదు గనుక బెజవాడలో ఏదైనా ఉద్యోగం చూసుకో' అని బాలగోపాల్ సలహా ఇచ్చారు.

రాత తప్ప మరే పనీ రాదు గనుక, అంతకు ముందు ఆరు నెలలు ఉదయంలో పనిచేశాను గనుక చూపు పత్రికల వైపే పడింది. 'ఉదయం'లో ఉండిన ఆత్మీయమిత్రులు నాకు మళ్లీ ఉద్యోగం ఇవ్వడం గురించి పెద్దలతో ప్రస్తావించారు. 'వేణు లాంటి వాళ్లు ఉద్యోగాలను త్యాగం చేయాలి. మన వంటి పత్రికలు వేణు లాంటి వాళ్లను త్యాగం చేయాలి' అనే వ్యంగ్యమో, వాస్తవమో తెలియని ఆ పెద్దల ప్రతిస్పందనను నిరాశతో మోసుకొచ్చారు.

అప్పటికి చాల రచనలూ, రెండు అనువాద పుస్తకాలూ అచ్చయి ఉన్నాయి గాని, అవన్నీ డజన్లకొద్దీ మారుపేర్లతోనో, పేరు లేకుండానో ఉన్నాయి. ఆ స్థితిలో ఒక ప్రధాన స్రవంతి ప్రచురణ అయినా ఉంటే ఉద్యోగం రావడం తేలిక అని మిత్రుడు అఫ్సర్ నన్ను ఏదైనా మామూలు విషయం మీద వ్యాసం రాయమనీ, తాను అప్పుడు బాధ్యుడుగా ఉన్న 'ఆంధ్రజ్యోతి' సాహిత్యవేదికలో అచ్చువేస్తాననీ అని, నా చేత 'కృష్ణశాస్త్రి వచనంలో కవిత్వం' అనే వ్యాసం రాయించి నా పూర్తి పేరుతో అచ్చువేశాడు. (అప్పటికీ ఇప్పటికీ నా పూర్తి పేరుతో వచ్చిన ఏకైక రచన అదేననుకుంటాను!) అది పట్టుకుని నేను ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికలకు సబ్ ఎడిటర్ ఉద్యోగం ఇమ్మని ఉత్తరాలు రాశాను. మూడు చోట్లా వరుసగా ఉద్యోగం వచ్చింది. మొదట ఆంధ్రజ్యోతిలో చేరి మూడు వారాలు చేసి, వంద రూపాయలు ఎక్కువ ఇస్తామంటే ఆంధ్రప్రభకు మారాను. (ఆంధ్రజ్యోతిలో ఆరువందలు, ఆంధ్రప్రభలో ఏడువందలు అని గుర్తు. అదే చాల పెద్ద జీతం ఆరోజుల్లో!) తీరా చేరాక, హైదరాబాదు ఆఫీసులో చేరమంటే, ఒక వారం మాత్రం చేసి, వదిలేసి, చివరికి నవంబర్‌లో ఆంధ్రపత్రిక వారపత్రిక కొలువుకు కుదిరాను.

దుర్గా విలాస్. కాశీనాథుని నాగేశ్వరరావు నిర్మించిన ఆ సువిశాల భవనం ఇప్పుడు రియల్ ఎస్టేట్‌కు బలి అయి నేలమట్టం అయిపోయింది గాని అది ఒక చారిత్రక భవనం. ఇటు రైల్వే స్టేషన్‌కూ అటు పాత బస్ స్టాండుకూ మధ్య గాంధీనగర్ సెంటర్‌లో ఏలూరు లాకుల దగ్గర ఆ భవనంలోనే ఒకప్పుడు గాంధీ ఉన్నాడు. 1933లో హరిజన నిధి విరాళాల సేకరణలో కృష్ణా జిల్లా పర్యటించినప్పుడు గాంధీ ఈ భవనంలో ఉండడం మాత్రమే కాదు, ఒకవైపు వరండాలో కూచుని ప్రసంగాలు చేశాడు. ఆ వరండాలో కొంత భాగాన్ని ఆ తర్వాత గదిగా మార్చారు. ఆ గదిలోనే నేను నాలుగు సంవత్సరాలు ఉద్యోగం చేశాను. ఆ గది పక్కన మరొక గదిలో భారతికీ, ఆంధ్రపత్రికకూ సమీక్షకు వచ్చిన పుస్తకాల గుట్టలు ఉండేవి. ఆ గది తాళం తీసి, ఆ గుట్టలోంచి ఏ పుస్తకమైనా తీసి చదువుకోవడానికి శివలెంక రాధాకృష్ణ గారు నాకు అనుమతి ఇచ్చారు.

బెజవాడ ఆంధ్రపత్రికలో 1986 నవంబర్ నుంచి 1990 నవంబర్ దాకా ఉన్నాను. ఆ నాలుగు సంవత్సరాలు ఎందరి మైత్రినో అనుభవించాను. ఎంతో చదివాను. ఎంతో మాట్లాడాను. ఎన్నో నేర్చుకున్నాను. బెజవాడ నా జీవితానికీ, అధ్యయనానికీ, ఆచరణకూ, మానవ సంబంధాలకూ, సాహిత్య, కళా అభిరుచులకూ ఎంత దోహదం చేసిందో ఎంత చెప్పినా తక్కువే. అందులో భాగంగానే ఎన్నెన్నో కవిత్వ ములాఖాత్‌లు. ఆ నాలుగు సంవత్సరాలు కృష్ణా జిల్లా విరసం యూనిట్ సభ్యుడుగా పొందిన కవిత్వ ములాఖాత్‌లు మరింత వివరంగా చెప్పవలసినవి గాని, ఆంధ్రపత్రిక ఇచ్చిన కవిత్వ ములాఖాత్‌లు ఈ వారం చెపుతాను.

మొదట చేరింది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సంపాదకుడు మాధవరావు గారి దగ్గర ఉపసంపాదకుడిగా. కథలూ నవలలూ చదివి ఎంపిక చేయడం, భారత ఆర్థిక వ్యవస్థ మీద జయ్ దుబాషీ రాసే వారం వారం శీర్షిక ఇంగ్లిష్ నుంచి తెలుగు చేయడం, ప్రూఫులు చూడడం నా పనులుగా ఉండేవి. వారపత్రికలో కవిత్వం ఎప్పుడో ఒకసారి మాత్రమే వచ్చేది. ఆ తర్వాత ఆంధ్రపత్రికలో చాల మార్పులు జరిగాయి. వారపత్రిక ఎడిటర్‌గా వీరాజీ గారు వచ్చారు. అప్పుడే దినపత్రికకు ఎడిటర్‌గా జి శ్రీరామమూర్తి గారు వచ్చి పత్రికలో చాల మార్పులు తెచ్చారు. నన్ను వారపత్రిక నుంచి దినపత్రికకు బదిలీ చేయించి, నాకు సంపాదకీయ పేజీ, సోమవారం సాహిత్య పేజీ, ఆదివారం అనుబంధం అప్పగించారు. ఆ తర్వాత వాడుకలోకి వచ్చిన భాషలో చెప్పాలంటే ఫీచర్స్ డెస్క్ అన్నమాట.

అప్పటివరకూ ఆంధ్రపత్రిక సాహిత్య పేజీకి ఆధునిక వాసనలు తక్కువ. అటువంటిది ఎకాఎకిన నా చేతుల్లో పడింది. సారస్వత అనుబంధం అనో అటువంటిదే మరోపేరో ఉన్న ఆ పేజీకి 'సాహితి' అని కొత్తపేరు పెట్టాం. విశ్వనాథ సత్యనారాయణ తిరోగమన భావజాలం మీద త్రిపురనేని మధుసూదనరావు వ్యాసపరంపర, దాని మీద చర్చోపచర్చలతో సహా, ఎప్పుడూ ఆంధ్రపత్రికవైపు చూసి ఉండని సాహిత్యకారులెందరినో పనిగట్టుకుని రచనలు అడిగి, వేధించి, రాయించి వేశాను. అప్పటికి ఆంధ్రపత్రికంటే ప్రధానంగా పద్య రచనలే అనే స్థితి నుంచి 'కవిత్వమొక తీరనిదాహం' శీర్షిక కింద సమకాలీన వస్తువుల వచన కవిత్వం వేయడం ప్రారంభించాను. 'దేశదేశాల కవిత్వం' శీర్షిక కింద ప్రతి వారమూ అనువాద కవిత కనీసం ఒకటైనా ఉండేట్టు చూశాను. అలా ఒకటిన్నర, రెండు సంవత్సరాలు వందకు పైగా తెలుగు కవితలు, అనువాద కవితలు వేసి ఉంటాను. ఆ పేజీ కోసం చాల కవితలు అప్పటికప్పుడు నేనే అనువాదం చేశాను. త్రిపురనేని శ్రీనివాస్ 'రహస్యోద్యమం', వసీరా 'లోహనది' వంటి ఎన్నో కవితా సంపుటాల మీద సమీక్షలు రాశాను. దురదృష్టవశాత్తూ, ఆ సాహిత్య పేజీలు గాని, కనీసం నా అనువాద కవితలు గాని ఒక్కటైనా ఉంచుకోలేకపోయాను. మనం చేసే, మన అనుభవానికి వచ్చే, మనకు పరిచయమయ్యే చాల విషయాలకూ, పనులకూ, మనుషులకూ వర్తమానంలో విలువ ఇవ్వకపోవడం, కాలం గడిచిన కొద్దీ వాటి విలువ తెలిసిరావడం, అప్పుడు ఎంత విచారించినా అవి దొరకకపోవడం, తెలుగువాళ్ల చారిత్రక స్పృహ లేమికి కొట్టవచ్చినట్టు కనబడే నిదర్శనం అనుకుంటాను.

ఆంధ్రపత్రిక ఆదివారం అనుబంధం కూడ అప్పటికి చాల అనాసక్తికరంగా వస్తుండేది. దానిపేరు 'ఆదివారం ఆహ్లాదవేదిక' అని మార్చి, బ్రాడ్‌షీట్ నుంచి టాబ్లాయిడ్ సైజుకు మార్చి, లోపల ఆసక్తికర అంశాలతో నింపాం. కవర్ పేజీ నిండా ఒకటో రెండో ముఖచిత్ర కథనం ఫొటోలు మాత్రమే ఉండేవి. మూడో పేజీలో ముఖచిత్ర కథనం మొదలయ్యేది. రెండో పేజీ పై సగం ఒక కవిత. ఆ కవితల్లో ఎన్నో నేను చాల ఇష్టంగా కవులతో కోరి రాయించినవి. కింది సగం 'కడలితరగ' అనే పేరుతో నేను కళా, సాహిత్యాల మీద ఒక

కాలమ్ కవిత్వ వచనంలో రాసేవాణ్ని. 'మాంత్రిక భాషలో రాస్తున్నారు' అని అప్పుడు నన్ను వెక్కిరిస్తుండిన కె శ్రీనివాస్ ఆ తర్వాత పది, పదిహేను సంవత్సరాలకు తాను రాసిన కాలమ్స్ అన్నీ అదే భాషలో రాయడం ప్రారంభించారు. 'కడలితరగ' 1989 మే నుంచి 1990 మే దాకా సరిగ్గా యాబైరెండు వారాలు నిర్వహించాను (ఆ తర్వాత పది సంవత్సరాలకు పుస్తకంగా వేసినప్పుడు దాంట్లో నలబై మాత్రమే అచ్చువేశాను). అందులో దాదాపు ప్రతి వ్యాసంలోనూ కవిత్వ స్పర్శ ఉన్నప్పటికీ ప్రత్యేకంగా భూపేన్ హజారికా, శ్రీశ్రీ, సుద్దాల హనుమంతు, గద్దర్, శివారెడ్డి, ట్రేసీ చాప్‌మన్, విమల, అవతార్ సింగ్ పాష్, పుట్టపర్తి నారాయణాచార్యుల కవిత్వం మీద రాసినవీ ఉన్నాయి. అలాగే, అప్పటికి పద్దెనిమిది, పందొమ్మిదేళ్ల వయసులోనే ఉన్నా, అటు చిత్రకళలోనూ, ఇటు వ్యక్తీకరణలోనూ పరిణతి సాధించిన వేగుంట మమతతో ఆదివారం ఆహ్లాదవేదికకు 'కుంచెకదలిక' అని చిత్రకళ మీద వారంవారం కాలమ్ రాయించాను. ఆ కాలమ్ కూడ కవిత్వానికీ, చిత్రకళకూ అనుసంధానం కుదిర్చినదే.

ఆంధ్రపత్రికలో ఫీచర్స్ డెస్కులోనూ, దినపత్రికలోనూ నాకు సహోద్యోగులుగా పనిచేసిన అనురాధ, సుధ, జివిఎల్ నరసింహారావు, జగన్మోహనరావు, వాసిరెడ్డి వేణుగోపాల్, లే ఔట్ ఆర్టిస్టులు శంకర్, వెంకట్, సహాయకుడు సోమయ్య, పేస్టింగ్, పేజి మేకింగ్, ప్రింటింగ్ కార్మికులు అందరూ ఆ పనిలో నాకు సహకరించినవారే, ఎప్పటికప్పుడు కవిత్వాన్ని అభిమానించినవారే.

నేను ఆంధ్రపత్రికలో ఉన్నప్పుడే, 1987 నవంబర్ లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖ, 'తెలుగు, హిందీ, తమిళ భాషల్లో ఆధునిక కవితారీతులు' అనే అంశంపై జాతీయ సదస్సు నిర్వహించింది. కేతవరపు రామకోటిశాస్త్రి గారు 'తెలుగు విప్లవ కవిత్వం మీద నువ్వు ఒక వ్యాసం రాసి ఆ సదస్సులో చదవాలి' అని ఆదేశించారు. ఆ ఆదేశాన్ని కాదనడానికి లేదు. అప్పటికి రెండు దశాబ్దాలు నిండిన విప్లవ కవిత్వం మొత్తాన్నీ ఈ సదస్సు పత్రం కోసం మళ్లీ చదవడం మొదలుపెడితే దాని మహాసముద్ర విస్తృతి తెలిసింది. అందువల్ల తొలిరోజుల (1968–1975) కవిత్వానికి మాత్రం పరిమితమై 'చారిత్రక అవసరంగా విప్లవోద్యమ కవిత – తెలుగు విప్లవ కవిత ప్రారంభ దినాలు – ఒక పరిశీలన' అని వ్యాసం రాశాను. దాదాపు ముప్పై పేజీల ఆ వ్యాసం రాయడానికి నెలల తరబడి విప్లవ కవిత్వాన్నీ, సామాజిక నేపథ్యాన్ని మళ్లీ మళ్లీ చదవవలసి వచ్చింది. ఆ పత్రం శివలెంక రాధాకృష్ణ గారికి కూడ నచ్చి, అడిగి మరీ, భారతి 1988 ఏప్రిల్, మే రెండు సంచికలలో ప్రచురించారు.

విరసం ప్రచురించిన శ్రీశ్రీ సాహిత్య సర్వస్వంలో భాగంగా శ్రీశ్రీ 'సిప్రాలి' (సిరిసిరి మువ్వలు, ప్రాసక్రీడలు, లిమరుక్కులు) ఒకే పుస్తకంగా 1988 జనవరిలో వెలువడింది. దాని ఆవిష్కరణ, పరిచయ సభలు కోస్తాలో చాలచోట్ల జరిగి నేనూ చాలచోట్ల మాట్లాడాను. ఆ వరుసలోనే భీమవరంలో సభ పెడతామని, నన్ను రమ్మని అక్కడి సాహితీమిత్రులు పిలిచారు.

తీరా అక్కడికి వెళ్తే ఒక పెద్ద హాలులో సభ గాని వేదిక మీద ముగ్గురం కింద ఐదుగురు లాగ ఉంది పరిస్థితి. అయినా సరే, మాట్లాడి, బస్సు పట్టుకుని ఏలూరు చేరేసరికి అర్ధరాత్రి అయింది. అక్కడ బెజవాడ బస్సుకోసం ఎదురుచూస్తుండగా, బెజవాడ వెళ్లి తమిళనాడు ఎక్స్‌ప్రెస్ అందుకోవాలని తొందరపడుతున్న రాజస్థానీ యువకుడొకరు షేరింగ్ టాక్సీలో వెళ్దామని అన్నాడు. ఆ టాక్సీ బెజవాడ పొలిమేరల్లో ఉండగా, మరొక పావుగంటకు నా గది దగ్గర దిగిపోతాననగా, నిలబడి ఉన్న లారీని గుద్దుకుని ఆనవాలు లేకుండా ఇనుపరేకుల కుప్ప అయిపోయింది. ఆ రాజస్థానీ యువకుడు అక్కడికక్కడే చనిపోయాడు. వెనుక కూచున్న మరొక కుటుంబం గాయాలతో బైటపడ్డారు. నేను దవడ ఎముకలు రెండూ విరిగి, కుడి చెయ్యి మోచేయి పైన విరిగి, వైద్యసహాయం అందడానికి ఎక్కువసమయం పట్టినందువల్ల అపస్మారకంలోకి వెళ్లాను. రెండు వారాలు ఆసుపత్రిలో ఉన్నాను. ఆ అనుభవం నుంచి బైటపడ్డాక రాసిన కవిత 'పునరుత్థానం' భారతి డిసెంబర్ 1988 సంచికలో వచ్చింది.

అలా బెజవాడ, దుర్గా విలాస్, ఆంధ్ర పత్రిక నాకు ఎన్నో కవితానుభవాలూ, కవిత్వంగా మారిన అనుభవాలూ, మారని అనుభవాలూ ఇచ్చింది. ఆంధ్రపత్రికలో ఆర్థిక కష్టాలూ, యాజమాన్య సంక్షోభం తలెత్తాక పొట్ట చేతపట్టుకుని హైదరాబాదు వచ్చినా, బెంగళూరు వెళ్లినా, మళ్లీ హైదరాబాదు చేరినా బెజవాడ అనుభవం ఎప్పుడూ గుండెలో రవరవలాడుతుండేది. ఆంధ్రపత్రిక మూతపడ్డాక దాదాపు ఇరవై ఏళ్లు ఎప్పుడు బెజవాడ వెళ్లినా ఒకసారి ఆ నిర్మానుష్యమైన, తాళాలు పడిన దుర్గా విలాస్ భవనాన్ని, నాకు నాలుగు సంవత్సరాలు ఆశ్రయం ఇచ్చిన ఆ గది వరండాను బైటినుంచి చూసి వస్తుండేవాణ్ణి. ఈ మధ్య వెళ్లినప్పుడు చూస్తే ఆ భవనం నేలమట్టమై ఉంది. బహుశా మరో ఆకాశహర్మ్యానికి సిద్ధమవుతోంది. శ్రీశ్రీ అన్నట్టు అక్కడి సుప్తాస్థికలు ఎప్పుడైనా తమ బతికినదినాల తలపోత బరువుచేత కదులుతాయా?

## పునరుత్థానం

మృత్యువును మునివేళ్లతో పట్టుకొని వచ్చాను
అంతమయ్యే కాలమేఘం అంచు తాకి
అనంతమైన తటిల్లతను తీసుకొచ్చాను
చావుడప్పు మీద బతుకుపాట పాడుతూ వచ్చాను
రహదారం పుటుక్కున తెగిపోయి
జీవితం
తెలియని తీరాలకు కొట్టుకుపోయే గాలిపటమయ్యేచోట

గాలిలో స్నేహ పరిమళం మీద కదిలివచ్చాను
బతుకు ఒక అవాంఛనీయ అతిథి అయినవేళ
కళ్లముందు హఠాత్తుగా తెరచుకున్నది ఆత్మీయ పర్ణశాల
నీలినీలి ఆకాశమే నా సంరక్షకుల ఇంటికప్పు
ఒక గ్రీష్మాంతరాత్రి నెత్తుటిమడుగులో పడి ఉన్న నన్ను
భూమి భూమంతా వసంతపు చిగుళ్ల చేతులెత్తి పిలిచింది
క్షితిజం దాకా ప్రయాణం పెట్టుకున్నవాణ్ని
మధ్యదారిలో ఆగిపోతానేమోనని
అడుగుల ముందర మంచిమనసుల బాట పరచుకుంది
మృత్యువుమీద మనిషి విజయాన్ని ప్రకటిస్తూ
సమాధినుంచి మేల్కొన్న నా చుట్టూ
లక్షోపలక్షల జనం, అనేకుల్లో ఒకడినై నేను
బాధాగ్నిని మరిపించే స్నేహహస్తాల పందిరిలో

# కృష్ణా తీరంలో కవిత్వమే జీవితంగా

నా జీవితంలోనూ, కవిత్వ, సాహిత్య కృషిలోనూ, ప్రజాజీవితాచరణలోనూ, మానవ సంబంధాలలోనూ చెరపరాని ముద్ర వేసినదీ, కొత్త కొత్త కవిత్వ ములాఖాత్‌లను ఇచ్చినదీ బెజవాడ జీవితం. అచ్చుపని అవసరాల కోసమో, పనుల కోసమో, అమ్మ (కరుణ)–చిన్ని–చుక్కల కోసమో వెళ్తూ వస్తూ బెజవాడతో నా అనుబంధం 1980ల తొలిరోజుల్లో మొదలయింది. అదే బెజవాడలో మొగల్రాజపురంలో మధు కళా మంటపంలో, విరసం సాహిత్య పాఠశాల సందర్భంగా 1983లో నేను విరసంలో చేరాను. ఇక 1986 నవంబర్‌లో బెజవాడ ఆంధ్రపత్రికలో చేరాక మొగల్రాజపురం కొండనీడన ఉంటూ నేనెంతగా బెజవాడ మనిషినై పోయానంటే అప్పటికి ఉన్న దజన్లకొద్దీ కలం పేర్లలో 'బెజవాడ కృష్ణ' కూడ చేరింది.

ఉద్యోగం చేసుకుంటూ విరసంలోనూ, సాహిత్యరంగంలోనూ పనిచేద్దామని అనుకున్నాను గనుక బెజవాడ చేరిన వెంటనే విరసం కృష్ణా జిల్లా యూనిట్ కార్యక్రమాల్లో భాగమయ్యాను. అసలు దానికన్న ముందు నాకై నేను పెట్టుకున్న కర్తవ్యం 'సృజన'ను పునః ప్రారంభించడం.

ప్రఖ్యాత శిశువైద్యులు, పౌరహక్కుల సంఘం నాయకులు, 'సృజన' సాహితీమిత్రులలో ఒకరు డా. రామనాథం గారిని వరంగల్‌లో 1985 సెప్టెంబర్ 3న ఆయన పిల్లలకు వైద్యం

చేస్తున్న ఆస్పత్రి ముందు నుంచి వెళ్తున్న ఊరేగింపులోంచి లోపలికి జొరబడిన పోలీసులు కాల్చిచంపారు. తర్వాత, ఆ పోలీసుల ఊరేగింపు 'వరవరరావును చంపుతాం', 'బాలగోపాల్‌ను చంపుతాం' అని నినాదాలు చేస్తూ సాగింది. ఇక వరంగల్‌లో ప్రగతిశీల, విప్లవ రాజకీయాలు, భావజాలం ప్రకటించడానికి వీలులేని స్థితి ఏర్పడింది. బాలగోపాల్ వరంగల్ వదిలేశారు. వరవరరావు డిసెంబర్ దాకా చూసి బెయిల్ రద్దు చేసుకుని జైలుకు వెళ్లారు. 'సృజన' అక్టోబర్ సంచికనూ, నవంబర్/డిసెంబర్ సంచికనూ సుబ్బారావూ నేనూ హైదరాబాదులో అతి కష్టం మీద అచ్చు వేయించగలిగాం. వరంగల్ నుంచి 'సృజన' తెచ్చే అవకాశం లేదు. హైదరాబాదులో బాధ్యత వహించగలిగిన వారు లేరు. దానితో 'సృజన' ఆగిపోయింది.

ఆ బాధ్యత తీసుకునే స్థితిలో నేను లేకపోవడం వల్లనే 'సృజన' ఆగిపోయిందనే అపరాధభావమే నేను 'రాడికల్ మార్చ్' బాధ్యతలు వదులుకోవడానికి ఒక కారణం. బెజవాడ నుంచి 'సృజన'ను పునరుద్ధరించడం నా బాధ్యత అనుకున్నాను. ఆగస్ట్ నుంచి బెజవాడలో ఉద్యోగం వెతుకులాట సాగిస్తూనే, వరంగల్ నుంచి రాగలిగిన సాహితీమిత్రులతో బెజవాడలో రెండుమూడు సార్లు సమావేశమయ్యాం. 'సృజన' నవంబర్ 1986 సంచిక తయారు చేశాం. 'సృజన' నవంబర్ 1966లో పుట్టింది గనుక 'ఇరవయ్యవ జన్మదిన సంచిక'తో పునః ప్రారంభించడం బాగుంటుందనుకున్నాం. ఆ 74 పేజీల సంచికలో ఇరవై పేజీల కవిత్వం, 'సృజన'లో ఇరవై ఏళ్లలో వెలువడిన కవిత్వంపై ఇరవై పేజీల విశ్లేషణా వ్యాసం, వెనుక కవర్ మీద వ్లాదిమిర్ మయకోవస్కీ కవితానువాదం, సెప్టెంబర్‌లో మరణించిన కవి సలంద్ర సంస్మరణలో ఆయన కవిత ఒకటి – అంటే దాదాపు మూడింట రెండు వంతులు కవిత్వమే. అది పునఃప్రారంభపు తొలి సంచిక గనుక రచనలన్నీ సాహితీమిత్రులవే కావడంలో ఆశ్చర్యం లేదు. వరవరరావు జైలు నుంచి బైటికి పంపిన రెండు కవితలు సహజంగానే మారుపేర్లతో వచ్చాయి. వాటిలో రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనను ఖండిస్తూ రాసిన, తర్వాతి కాలంలో సుప్రసిద్ధమై, ఎన్నో భాషల్లోకి అనువాదమైన 'డర్ఖావు' ఒకటి. ఎన్‌కె కవిత ఒకటీ, కె రాంమోహన్ రాజు కవిత ఒకటీ వచ్చాయి గాని అవి రెండూ కూడ అప్పుడున్న స్థితి వల్ల మారుపేర్లతోనే వచ్చాయి. అలా చాల అపురూపంగా, కవితాత్మకంగా వచ్చిన ఆ 'సృజన' సంచిక మొత్తానికి బైటికి రానేలేదు. సాంకేతిక కారణాల వల్ల కొంత, నిర్బంధ తీవ్రత వల్ల కొంత 'సృజన'ను కొనసాగించడం కష్టమని, బైటి నుంచి వచ్చినా దాని ప్రభావం వరంగల్‌లో ఉంటున్న సాహితీమిత్రుల మీద ఉంటుందని, సంచిక పూర్తిగా అచ్చయి వచ్చాక అర్థమై ఆ సంచిక బైటికి విడుదల చేయకుండానే ఆపేశాం.

వరవరరావు 1978–85 కవిత్వాన్ని ఒక సంపుటంగా 'భవిష్యత్తు చిత్రపటం' పేరుతో బెజవాడలో సరిగ్గా అప్పుడే అచ్చు వేయించాను. అది విడుదలైన మూడు నెలల లోపలే ప్రభుత్వం దాన్ని నిషేధించింది. ఆ పుస్తకం అచ్చు వేసిన ప్రెస్ యజమానులను పోలీసులు వేధించారు.

ఇక ఆతర్వాత నాలుగు సంవత్సరాల పాటు నా శక్తి సామర్థ్యాలన్నీ విరసం కృష్ణా జిల్లా యూనిట్‌కే వెచ్చించాను. నిజంగా ఆ నాలుగు సంవత్సరాలు విరసం కృష్ణా జిల్లా యూనిట్‌కు రచనల రీత్యా, కార్యక్రమాల రీత్యా ఉజ్వలమైన దినాలు. అప్పుడు ఆ యూనిట్‌లో ఆలూరి భుజంగరావు, పల్లెర్లమూడి దశరథరామయ్య వంటి వయోవృద్ధుల నుంచి అప్పటికింకా ఇరవైల తొలిరోజుల్లో ఉన్నవారి దాకా ఎంతోమంది ఉండేవారు. ఆలూరి భుజంగరావు గారు ఉపాధ్యాయులుగా పదవీ విరమణ చేశాక, అంటే అరవై దాటాక విరసంలో చేరారు. ఇరవై ఏళ్ల యువకులకన్న ఎక్కువ ఉత్సాహంగా ఉండేవారు. తక్కువలో తక్కువ ఏడుగురు, ఎక్కువలో ఎక్కువ పదిహేను మంది ఉండిన యూనిట్ అది. అందులో శ్రీశ్రీ షష్టిపూర్తి నాటినుంచి విరసం ప్రయత్నాలలో ఉన్న స్థాపక సభ్యులు టి కృష్ణాబాయి, అప్పటికే ఉపన్యాసకుడిగా, విశ్లేషకుడిగా, కథకుడిగా పేరు వచ్చిన ఉషా ఎస్ డానీ, ఆంధ్రప్రభలో పనిచేస్తుండిన జగన్, అప్పుడే బెంగళూరు ఆంధ్రప్రభ నుంచి బెజవాడ ఆంధ్రజ్యోతికి మారిన అల్లం నారాయణ, తిరుపతి ఉదయం నుంచి బెజవాడ ఉదయంకు మారిన త్రిపురనేని శ్రీనివాస్, ఆంధ్రభూమి బెజవాడ ఎడిషన్ పెట్టినప్పుడు చేరిన కె నరసింహాచారి, నవత, అప్పటికే 'ఎల్లి' నవల ద్వారా ప్రఖ్యాతురాలైన అరుణ, గుడివాడలో ఉపాధ్యాయినిగా పనిచేస్తూ కాళీపట్నం రామారావు కథల మీద పిఎచ్‌డి చేస్తుండిన రజని, ఆంధ్రపత్రికలో నా సహోద్యోగి, చిత్రకారుడు జి శ్రీనివాస్, కంచికచెర్ల నుంచి విప్లవోద్యమంలోకి వచ్చి, విరసంలో చేరి, ఆ తర్వాత ఆంధ్రభూమిలో జర్నలిస్టు అయిన యువక, అద్భుతంగా పిల్లనగ్రోవి వాయిస్తుండిన మరొక కంచికచెర్ల యువకుడు మరియదాసు, కష్టం మీద కష్టం మీద కష్టం తోసుకురాగా జీవితం నుంచి పారిపోతూ, అన్వేషిస్తూ, బెజవాడలో చిరుద్యోగంలో చేరి స్థిరపడుతున్నానను కుంటూ విరసంలో చేరిన ఈశ్వరి, వ్యవసాయ శాస్త్రంలో పట్టభద్రురాలై విరసంలో చేరిన అనురాధ, గుడివాడ దగ్గరి గ్రామంలో నేత కార్మికుడిగా పనిచేస్తూ పూట గడవని స్థితిలో ఉండిన నాగేశ్వరరావు, నిత్యోత్సాహి భరద్వాజ... అలా అది ఒక అద్భుతమైన సమ్మేళనం. అందులో తొమ్మిది, పది మంది కవిత్వం రాసేవాళ్లు. అందరికందరూ కవిత్వాభిమానులు, నిరంతర కవిత్వ పాఠకులు. ఇక ఆ యూనిట్ సమావేశాలు ఎలా ఉండి ఉంటాయో చెప్పనక్కర లేదు. స్వీయ కవితా పఠనాలు, ఒక్కొక్క మాట మీద చర్చలు, ఇతర కవుల కవితల మీద వ్యాఖ్యలు, సంవాదాలు... పసిడిరెక్కలు విసిరి కాలం పారిపోయిన జాడలేవీ?

మా సహసభ్యురాలు ఈశ్వరి ఆత్మహత్య మాకందరికీ ఒక షాక్. మనుషులు ఎన్నో పెద్ద పెద్ద కష్టాలను సాహసికంగా ఎదుర్కొంటూ, అధిగమిస్తూ మనుగడ సాగించగలరు గాని, అవన్నీ తీరాయి, గట్టెక్కాము అనుకునేవేళ చిన్న గడ్డిపోచ తాకిడి కష్టానికి కూడ నిగ్రహించుకోలేనంత ఆందోళన పడతారని, ఆ ఆందోళన ప్రాణాంతకం కూడ కాగలదని జీవిత సత్యాన్ని నేర్పిన అనుభవం అది. ఆమె మరణించిన రెండు మూడు నెలల్లో మేం వెలువరించిన 'ఈశ్వరికోసం' అనే ఆర్ద్రమైన కవితా సంస్మరణలో మిత్రులందరమూ ఆమె

గురించి చెప్పినవి ఆమె వ్యక్తిత్వాన్ని, సాహసికత్వాన్ని, ప్రతిభను, ఆత్మగౌరవాన్ని కొంతవరకు మాత్రమే చెప్పగలిగాయి.

యూనిట్ సభ్యుల మధ్య చర్చలు మాత్రమే కాదు, ఆ నాలుగు సంవత్సరాలు మొత్తంగా సంస్థలోను, బైటి యూనిట్లలోను కవిత్వమే జీవితంగా బతికే, కవిత్వాన్ని ప్రధానంగా భావించే సందర్భాలూ సన్నివేశాలూ ఎన్నో వచ్చాయి. అక్టోబర్ 1986లో గుంటూరు జిల్లా ఉన్నవలో వచన కవిత మీద విరసం వర్క్‌షాప్ జరిగింది. ఆ రెండు రోజుల వర్క్‌షాప్‌లో నాకు బాగా గుర్తుండిపోయినది వచన కవితలో పంక్తులు లేదా పాదాలు ఎలా తయారవుతాయని జరిగిన చర్చ. పద్య రచనలో, గణబద్ధ ఛందస్సులో పాద విభజనకు ఒక సూత్రం ఉంది, వచన కవితలో అటువంటి సూత్రమేదైనా ఉందా అని ఒక పూటంతా చర్చ జరిగింది. ఒక భావచిత్రం, భావశకలం, ఊహ, ఆలోచన, ప్రతిపాదన ఒక పాదంలో ఉంటుంది అని సూత్రం చేయబోతే అందుకు భిన్నంగా జరిగిన పాద విభజన ఉదాహరణలు లెక్కలేనన్ని ఉన్నాయి. కవి ఇష్టానుసారమే పాదవిభజన జరుగుతుంది తప్ప వస్తుగత నియమాలేమీ లేవు అని సూత్రీకరించడానికి తగిన దృష్టాంతాలెన్నో ఉన్నాయి. కాని అలా అనుకోవడానికి కూడ వీలు లేకుండా పాద విభజనకు కచ్చితమైన నియమాలు పాటించిన కవులూ ఉన్నారు. అసలు వచనం రూపంలోనో, ఎటువంటి విరామచిహ్నాలు లేకుండానో రాసిన కవులూ ఉన్నారు. నాకు గుర్తున్నంతవరకు ఏమీ తేలలేదు గాని చాల ఆసక్తికరమైన చర్చ మాత్రం జరిగింది.

'సృజన' పునరుద్ధరణ ప్రయత్నం విఫలమైన తర్వాత ఏదైనా ఒక సాహిత్య పత్రికను ప్రారంభిస్తే బాగుంటుందని మళ్లీ పురుగు తొలవడం మొదలుపెట్టింది. ఖాదర్ మొహియుద్దీన్, డానీలతో నిరంతర సంభాషణ ఫలితంగా డానీ సహచరి ఏలూరి అజిత సంపాదకురాలిగా 'సమీక్ష' అని మాసపత్రిక ప్రారంభించాం. 'కళా సాహిత్య అన్వేషణ' అని దాని ఉపశీర్షిక. 1987 జూలైలో ప్రారంభ సంచిక, ఆగస్ట్‌లో రెండో సంచిక చాల ఆశావహంగా, గొప్ప వాగ్దానంతో వెలువడ్డాయి గాని అనేక కారణాల వల్ల దాన్ని కొనసాగించలేకపోయాం. ఆ రెండు సంచికలలోనే వరవరరావు (జైల్లో ఉన్నందువల్ల మారుపేరుతో), కె శివారెడ్డి, నగ్నముని, గుడిహాళం రఘునాథం, ఖాదర్ మొహియుద్దీన్, నందిని సిధారెడ్డి, కె రాంమోహన్ రాజు, విమల, పాపినేని శివశంకర్ వంటి వారి కవితలు వేశామంటే ఆ పత్రిక కవిత్వానికి ఇచ్చిన ప్రాధాన్యత అర్థం చేసుకోవచ్చు.

అప్పటిదాకా తుమ్మల వేణుగోపాలరావు గారి ఉద్యోగ రీత్యా బెజవాడలో ఉంటుండిన కృష్ణాబాయి ఆ నాలుగు సంవత్సరాల చివరిరోజుల్లో విశాఖపట్నం వెళిపోయారు. ఆమెకు వీడ్కోలు పలకడానికి విరసం సభ్యులమూ, కొందరు మిత్రులమూ కలిసి కవిత్వం, పాటలు, చర్చలతో ఒక రాత్రంతా గడిపి, మహిళలు రాసిన కొన్ని మంచి కవితలను అందమైన చేతిరాతతో రాసి, అందంగా బైండ్ చేయించిన పుస్తకం ఆమెకు కానుకగా ఇచ్చాం. త్రిపురనేని

శ్రీనివాస్ తెచ్చిన మహిళల కవిత్వ సంకలనం 'గురిచూసి పాడేపాట' కు దాదాపు ఒక ఏడాది ముందు. ఆ పుస్తకం తయారీ సందర్భంగానే తెలుగు కవిత్వ చరిత్రను ఒక రూపకంగా మలిచి ఒక్కొక్కరు ఒక్కొక్క కవిత చదువుతూ ఒక గంట ప్రదర్శన ఇవ్వాలనే ఆలోచన వచ్చి, 'కవిత్వంపై ఎర్రజెండా' అనే రూపకాన్ని తయారుచేసి, నేను వ్యాఖ్యాతగా రాష్ట్రంలో దాదాపు పదిచోట్ల ప్రదర్శించాం.

బెజవాడ రోజుల్లో అదనంగా దొరికిన సాహిత్య, కవిత్వ కానుకలు మరెన్నో ఉన్నాయి. మొదటి రెండు సంవత్సరాలు నేనున్న ఇంటికి రెండిళ్ల అవతల అఫ్సర్ ఉండేవాడు. అఫ్సర్ ఖాళీ చేశాక నేను ఆ ఇంట్లోకే మారాను. రెండు నిమిషాల దూరంలో ఒకవైపు ఖాదర్ మొహియుద్దీన్ (అప్పటికింకా 'పుట్టుమచ్చ' రాయలేదు), మరొకవైపు మోహన్ ప్రసాద్. ఓ పది నిమిషాల దూరంలో సతీష్ చందర్. తిరువూరు నుంచి అప్పుడప్పుడు వచ్చే కొండేపూడి నిర్మల. మరెందరో కథకులు, విమర్శకులు, సాహితీమిత్రులు. అపురూపమైన స్నేహం అందించిన మమత. అప్పుడే అజ్ఞాతవాసం నుంచి బైటికి రావడానికి ప్రయత్నిస్తూ తన దృక్పథాన్ని వివరించడానికి వస్తుండిన కెజి సత్యమూర్తి (శివసాగర్)... అది ఒక గొప్ప సంరంభం.

అప్పటికింకా అజ్ఞాతవాసంలో ఉండిన గద్దర్ చేతిరాతతో రెండు మూడువందల పేజీల రచనలు నాకు చేరాయి. వాటిని ఎడిట్ చేసి ప్రచురణకు సిద్ధం చేయమన్నారు. వాటిలో ఆయన ఒక్కొక్క పాటనూ తీసుకుని నేపథ్యాన్ని వివరించిన రచన చాల ఆసక్తికరంగా ఉండి, బైటి పత్రికల్లో వస్తే బాగుంటుందనిపించింది. దాదాపు ఇరవై పాటలకు ఆయన రాసిన నేపథ్యాలు ఎడిట్ చేసి, అప్పుడు ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకుడిగా ఉండిన తోటకూర రఘు దగ్గరికి వెళ్లాను. ఆయన ఎగిరి గంతేసి వాటిని సీరియల్ చేస్తానన్నాడు. నేను రాసిన ఒక ఉపోద్ఘాతంతో ఇరవై వారాల పైనే గద్దర్ అజ్ఞాతంలో ఉండగానే అవి అచ్చయ్యాయి. ఆ తర్వాత పుస్తకంగా కూడ వచ్చాయి. అలాగే, గద్దర్ రచనల్లో సాంస్కృతికోద్యమ నిర్మాణ సమస్యలు ఎడిట్ చేసి 1990 జనవరిలో జరిగిన విరసం ద్విదశాబ్ది సభల నాటికి 'సృజన' ప్రచురణగా తెచ్చాం. ఈ రెండు పుస్తకాల కన్న ఎక్కువ విలువైనదీ, అద్భుతమైనదీ ఆయన ప్రజల పాటల గురించి సిద్ధాంత పత్రం స్థాయిలో రాసిన పుస్తకం. అది ఎడిట్ చేసి 'తరగని గని' అని పేరు పెట్టి అచ్చుకు సిద్ధం చేస్తూ ఉండగా, 1990 ఫిబ్రవరిలో ఆయన అజ్ఞాతవాసం నుంచి బైటికి వచ్చారు. నేను హైదరాబాద్ మారాక, ఇద్దరమూ ఒకటి రెండు వారాలు ఆ పుస్తకం మీద కూచుని ప్రచురణకు ఇచ్చాం.

ఆంధ్రపత్రిక ఆర్థిక ఇబ్బందులలో పడి, ఎవరెవరికో అమ్మజూపి, చివరికి మూతపడక తప్పని స్థితి వస్తున్నప్పుడు, హైదరాబాదు నుంచి 'సమయం' అని కొత్త దినపత్రిక ప్రయత్నాలు మొదలయ్యాయి. అలా బెజవాడ వదిలి హైదరాబాదుకు రావడానికి సిద్ధపడి 1990 నవంబర్‌లో ఆంధ్రపత్రిక వదిలేసి, డిసెంబర్‌లో 'సమయం'లో చేరాను. కృష్ణా జిల్లా విరసం

సభ్యులందరూ నాకు బెజవాడ నుంచి అసాధారణమైన వీడ్కోలు పలికారు. ఒక రోజంతా కలిసి ఉండి, ఉండవల్లి గుహలూ, కృష్ణాతీరమూ తిరిగి, ఆటలతో, పాటలతో, పరిహాసాలతో సరదాగా గడిపాం. నా బెజవాడ జీవితం ఎంత చిరస్మరణీయమైనదో, ఆ వీడ్కోలూ అంత చిరస్మరణీయంగా గడిచింది. ఆ ఉద్వేగభరిత మనఃస్థితిలో బెజవాడకు నా వీడ్కోలును నవంబర్ 19–20 ల్లో రాసి, అచ్చువెయ్యని, అచ్చుకు ఇయ్యని ఒక వ్యక్తిగత కవితగా గుండెలలో భద్రపరచుకున్నాను.

## వీడ్కోలు

వెళతానిక వెళతానిక
వెళిపోయిన మనిషి ముద్ర చిరకాలం నిలుచుచోట
మండుటెండలో ఆగని కృష్ణవేణి ధారవోలె
రాలిన పువ్వొదిలిన పరిమళపు ఛాయవోలె
జీవనది వెల్లువలో మునగని ఒక అశ్రువోలె

వెళతానిక వెళతానిక
కన్నీటిలొ పదునెక్కిన స్వరాలనే వెదజల్లి
కొన్నెత్తుట విరబూసిన ఉద్వేగపు పంటనొదిలి
ఈ విస్మృత వీథుల్లో నా అడుగుల జాడలొదిలి
తప్పటడుగులను దిద్దిన ఆప్త హస్తాలనొదిలి

వెళతానిక వెళతానిక
పెనుతుపానులో ఒణికిన లేలేత రెమ్మనై
ఆగని వర్షపుధారల మురిసిపోవు పాపనై
స్తంభించిన కాలాన రవళించిన వయొలిన్నై
పరుగెత్తిన క్షణాలలో ప్రవహించిన మైత్రినై

వెళతానిక వెళతానిక
అడుగడుగున వినిపించే ఆర్ద్ర మాతృస్పర్శనొదిలి
నింగినేల వారధిగా సాగిన ఊహలనొదిలి
రక్తజ్వలన భాషణల రాత్రిందివాలనొదిలి

విషాదాన్ని విజయాన్ని హృదయంలో నింపుకుని
ఆత్మీయుల త్యాగఫలమె పతాకమై ఎగిరినట్లు
వెళతానిక వెళతానిక

# స్వభావమే కవిత్వం

బమ్మెర పోతనను సహజ కవి అంటారు గాని అసలు సహజ కవులుంటారా అనుమానమే. స్పందనాశీలత, భావుకత, ఊహాశాలిత వంటివి మానవ మేధకు సహజమైన లక్షణాలు. వాటిని వ్యక్తీకరించే కవి కావడానికి సాధన కావాలి, అధ్యయనం కావాలి, ఆలోచన కావాలి, సామాజిక జీవితం కావాలి.

సహజ కవుల సంగతి ఎలా ఉన్నా, కవిత్వ స్వభావాన్ని సంతరించుకుని, కవిత్వమే స్వభావంగా మార్చుకున్నవాళ్లు ఉండవచ్చు. అంటే తమ అనుభవంలోకి వచ్చిన ప్రతి అంశానికీ స్పందించి 'ఇంత చిరుగీతి ఎద వేగిరించునేని' దాన్ని కవిత్వంగా మలచగలవాళ్లు, తమ మాటతో, చేతతో, కవితతో, మొత్తం అస్తిత్వంతో ఎదుటిమనిషిలో విద్యుత్తేజాన్ని కలిగించగల వాళ్లు, తమ కళ్ల ముందర కదిలిపోయే సామాజిక చరిత్రకు కవితారూపం ఇవ్వగలిగినవాళ్లు, తమ కవిత్వం ద్వారా సాంఘికచరిత్ర రచనకు అవకాశం ఇవ్వగలిగేవాళ్లు.

అటువంటి స్వభావమే కవిత్వమైన మనిషి నాకు రక్తబంధువు కావడం, ఊహ తెలిసిననాటి నుంచీ నేనాయన నీడలో పెరుగుతూ రావడం నాకు అప్రయత్నంగా, సహజంగా దొరికిన అపురూపమైన కవిత్వ ములాఖాత్. ఆధునిక తెలుగు కవిత్వంలో ఒక గణనీయమైన కవితో సాన్నిహిత్యాన్ని అనుభవించగలగడం, ఆ కవిత్వంతో, కవిత్వమే స్వభావమైన కవితో నిత్య ములాఖాత్‌లో ఉండగలగడం అదృష్టాన్ని ఎంత నమ్మకపోయినా ఆ మాట కన్న మరొక మాట లేదు.

ఆయన కవి వరవరరావు. నాకు మేనమామ. మా అమ్మ తమ్ముడు. మా అక్కయ్య సహచరుడు. నా కంటె ఇరవై ఒక్క సంవత్సరాలు పెద్ద గనుక నేను పుట్టడానికి చాల ముందు నుంచే కవిత్వంలో ఉన్నారు. తన తొలి యవ్వనంలోనే కవిత్వ రచన ప్రారంభించారు. పదిహేడో ఏట 'తెలుగు స్వతంత్ర'లో కవిత అచ్చయింది. పద్దెనిమిదో ఏట ఆంధ్ర అభ్యుదయోత్సవాలలో కవిత్వ బహుమతి పొందారు. ఇరవై ఆరో ఏట అపురూపమైన ఆధునిక సాహిత్య వేదిక 'సృజన'ను ప్రారంభించారు. ఇరవై ఎనిమిదో ఏట తొలి కవితా సంపుటి 'చలినెగళ్లు' అచ్చువేశారు. అదీ, 1971లో అచ్చయిన రెండో కవితా సంపుటి 'జీవనాడి' మినహాయిస్తే, మిగిలిన పదమూడు కవితా సంపుటాల (ఊరేగింపు – 1974, స్వేచ్ఛ –

1978, సముద్రం - 1983, భవిష్యత్తు చిత్రపటం - 1986, ముక్తకంఠం - 1990, ఆ రోజులు - 1998, ఉన్నదేదో ఉన్నట్లు - 2000, దగ్ధమవుతున్న బాగ్దాద్ - 2003, మౌనం ఒక యుద్ధనేరం - 2003, అంతస్సూత్రం - 2006, తెలంగాణ వీరగాథ - 2007, పాలపిట్ట పాట - 2007, బీజభూమి 2014) తయారీలో, 2008లో వెలువడిన 'వరవరరావు కవిత్వం 1957–2007' సమగ్ర కవితా సంపుటపు తయారీలో నా పాత్ర ఎంతో కొంత ఉండడం కేవలం ఆయన కవిత్వంతో మాత్రమే కాదు, తెలుగు సామాజిక చరిత్రను, విప్లవోద్యమ చరిత్రను కవిత్వీకరించిన అసాధారణ అభివ్యక్తితో అద్భుతమైన ములాఖాత్.

నేనింకా ఎనిమిదో తరగతికి హనుమకొండ వచ్చి ఆ 'సృజన' కవిత్వ శాలలో చేరడానికి ముందే మా రాజారం ఇంట్లో ఉంటూ ఉండిన 'చలినెగళ్లు', 'జీవనాడి' సంపుటాలను ఎన్నోసార్లు చదివాను. ముఖ్యంగా 'చలినెగళ్లు'లో అత్యంత ఆర్ద్రమైన 'రాఖీ బంధన్' కవిత గాని, గొప్ప ఆశను ప్రేరేపించే 'భళ్లున తెల్లవారునింక భయం లేదు' గాని వందల సార్లు చదివి నోటికి అప్పగించగలిగేవాణ్ని. 'మంచివాని కంఠం కంచయి మ్రోగాలి/ మంచివాని కష్టం కనకమయి పండాలి' అని ఆ కవితలోని ఒక మాట మన కంఠం కంచులా మ్రోగాలంటే మంచివాళ్లమై ఉండాలనే సూచనను ఆ లేతమనసులో నాటింది. నిజానికి ఐదు దశాబ్దాలకు పైగా వరవరరావు కంఠమైనా, ప్రజల పక్షం వహించే మరెవరి కంఠమైనా కంచులా మోగుతున్నాయంటే కారణం వెయిపుట్లు పండించి, కనకం పండించి గంజిలో మెతుకెరగని కష్టజీవుల పట్ల సహానుభూతి తెచ్చిన మంచితనం వల్లనే.

ఇక హనుమకొండకు వచ్చి, ప్రూఫులు చూడడం, ప్రింటింగ్ ప్రెస్సుకు వెళ్లి అచ్చుపనులు చూడడం మొదలయ్యాక చూసిన తొలి పుస్తకాలలో 'ఊరేగింపు' కవితాసంపుటం ఒకటి. అసలు ప్రింటింగ్ ప్రెస్ - అది కూడ ఏమీ తెలియకుండా రహస్యంగా జరిగిపోయే ఇవాళ్టి ఆధునిక ప్రింటింగ్ ప్రెస్సు కాదు - ఏటవాలు చెక్క పీటల్లో వందల గడుల్లో విడివిడిగా ఉండే సీసం అక్షరాలు, వాటి ముందు నిలబడి ఒక్కొక్క అక్షరాన్నీ ఏరుతూ స్టిక్ మీద కూచోబెట్టి పంక్తులుగా, వాక్యాలుగా, భావాలుగా మార్చే కంపోజిటర్లు, ట్రెడిల్ అని పిలిచే మిషన్ ముందు నిలబడి కాగితం వెనుక కాగితం బెడ్ మీద పెడుతూ, పైనుంచి చెస్ వచ్చి ఆ కాగితం మీద ముద్రవేస్తుంటే ఒడుపుగా లాగే మిషన్‌మెన్లు - అది ఒక అద్భుత ప్రపంచం. అసలు అదే ఒక కవితామయ ప్రపంచం. అక్కడ 'ఊరేగింపు' అచ్చవుతుండగా చూశాను. 'ఊరేగింపు' సంపుటంలో ఆ పుస్తక శీర్షికతోనే ఉన్న కవిత విప్లవ రచయితల సంఘం మొదటి మహాసభలు ఖమ్మంలో జరిగినప్పటి ఊరేగింపును దృశ్యమానం చేస్తుంది. నలభై ఐదు సంవత్సరాల తర్వాత ఇవాళ చదువుతుంటే కూడ ఆ ఊరేగింపు మనకళ్లముందు కదులుతున్నట్టు ఒళ్లు పులకరిస్తుంది, విద్యుత్తేజం చెలరేగుతుంది.

ఆ తర్వాతి కవితాసంపుటాలైతే అచ్చయిన, అచ్చుకాని కవితలను సేకరించడం, వరుసలో పెట్టడం, సంపుటానికి పేర్లు సూచించడం, చర్చించడం, ప్రూఫులు చూడడం,

అచ్చుపని చూడడం, ప్రెస్ నుంచి కట్టలు తేవడం, పంపిణీ చేయడం అన్ని పనులనూ నేను ఎంతో కొంత పంచుకున్నాను. అలా ఆ సంపుటాలలో అచ్చయిన ప్రతి ఒక్క కవితనూ కనీసం రెండు మూడు సార్లు చదివి ఉంటాను. నా కవిత్వంతో ములాఖాత్‌లన్నిటిలోనూ గొప్ప అనుభవం అది.

"నేరమే అధికారమై/ ప్రజల్ని నేరస్తుల్ని చేసి వేటాడుతుంటే/ ఊరక కూర్చున్న/ నోరున్న ప్రతివాడూ నేరస్తుడే" అనీ, "కష్టజీవి చెమటచుక్క చెప్పని సత్యం/ కష్టజీవి ఆకలిడొక్క చెప్పని సత్యం/ కష్టజీవి కన్నీటిచుక్క చెప్పని సత్యం/ కష్టజీవి పోరాడే రెక్క చెప్పని సత్యం/ కవి కలం నుంచి చిందే సిరాచుక్క ఏం చెప్తుంది!/...మట్టి చేతులు నిను మేధావిగా మలిస్తే/ ఆ చేతులు కట్టిన రక్తగాయాలతో/ నువ్వెవరిపై గేయాలు కట్టావని అడుగు" అనీ ఎమర్జెన్సీలో జైలు జీవితంలో రాసిన, 'స్వేచ్ఛ' సంపుటంలో వచ్చిన రెండు చిన్న కవితలు ఈ నలభై ఏళ్లుగా నా మనసులో ఎప్పుడూ మెదలుతుంటాయి. అవి ఏ కవికైనా, బుద్ధిజీవికైనా ఎల్లప్పుడూ మదిలో మెదలవలసిన మాటలని అనుకుంటాను.

ఇక 'సముద్రం' ఊహలోనూ, అభివ్యక్తిలోనూ, వైరుధ్యాల చిత్రీకరణలోనూ, ఆర్ద్రతలోనూ, భావ సాంద్రతలోనూ ఆధునిక తెలుగు కావ్యాలలో, దీర్ఘ కవితలలో అత్యంత విశిష్టమైన రెండు మూడిట్లో ఒకటని నేననుకుంటాను.

అప్పటికే ఒక కుట్రకేసు, మూడు సార్లు నిర్బంధాలు, రెండు సంవత్సరాలకు పైగా జైలు జీవితం గడిపినా, 'సముద్రం' వెలువడిన తర్వాత కాలం మరింత పదునెక్కింది. కవి మీద హత్యా ప్రయత్నాలు మొదలయ్యాయి. చంపుతామని బెదిరింపులు మొదలయ్యాయి. 'రచించే, జీవించే స్వేచ్ఛ కోసం బెయిల్ రద్దు చేసుకుని జైలుకు వెళ్లకతప్పడం లేదు' అనే భయానక, విచిత్ర స్థితి తెలుగుదేశంలో 'ఆట పాట మాట బంద్' రూపంలో మొదలయింది. ఆ స్థితిని తొలగించాలని, ఆయన బైట స్వేచ్ఛగా జీవించే స్థితి కల్పించాలని ఆయన జైలులో ఉండగా దేశవ్యాప్తంగా ప్రజాస్వామిక మేధావులు, కవులు, బుద్ధిజీవులు నిరసన ప్రకటించడం ప్రారంభించారు. ఆ నిరసన కార్యక్రమాలకు ఒక సహకారంగా ఆయన కొత్త కవితాసంపుటం అచ్చువేయాలని ఆలోచించాం. ఖమ్మం సభల ఊరేగింపు గురించి ఎటువంటి ఉద్వేగ భావచిత్రాన్ని నిర్మించారో, సరిగ్గా అటువంటి, అంతకన్న సాంద్రమైన దీర్ఘ కవితను కరీంనగర్ రైతుకూలీ సంఘం 1983 మహాసభల గురించి రాసి దానికి 'భవిష్యత్తు చిత్రపటం' అని శీర్షిక పెట్టారు. ఆ శీర్షిక తోనే 1978-85 కవితల సంకలనంగా 1986లో బెజవాడలో అచ్చువేయించాను. సెప్టెంబర్ 1986లో ఆ సంపుటం వెలువడితే, 1987 జనవరి 3 న అంటే నిండా మూడు నెలలు కూడ గడవకముందే, ఆ పుస్తకం ఇంకా పాఠకుల చేతికి చేరకముందే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దాని మీద నిషేధం విధించింది. ఆ నిషేధాన్ని 1990 మార్చిలో ఎత్తివేసినప్పటికీ 1970ల తొలిరోజుల నిషేధాల తర్వాత ఒక కవితాసంపుటాన్ని నిషేధించడం అప్పుడే.

ఆ తర్వాత వెలువడిన విడివిడి కవితా సంపుటాల గురించీ, 2008 సమగ్ర కవితా సంపుటం గురించీ చెప్పవలసిన విశేషాలు ఎన్నో ఉన్నాయి గాని, ఈ శీర్షిక పరిధి దాటిపోతాననే భయంతో ఇక్కడ ఆపుతాను.

అయితే ఒక్క విషయం మాత్రం చెప్పాలి. దాదాపు వెయ్యి పేజీలకు పైన, పదిహేను సంపుటాల కవిత్వం రాసినప్పటికీ, ఐదు దశాబ్దాలుగా తెలుగు కవితాలోకంలో కవిగా గుర్తింపు ఉన్నప్పటికీ, ఆయన రాజకీయ, విప్లవ భావప్రచార, విప్లవోద్యమ గుర్తింపు వల్ల కవిగా రావలసినంత గుర్తింపు రాలేదనే అనిపిస్తుంది. ముఖ్యంగా ఆయన విప్లవ రాజకీయ భావాలను వ్యతిరేకించదలచినవాళ్లు ఆయనను కవిగా కూడ విస్మరించడం, కవిగా కొట్టివేయడం ప్రారంభించారు. విప్లవ రాజకీయ, సాహిత్య ఉద్యమాలలో ఆయనకు సహచరులుగా ఉండినవారు కూడ తమ అభిప్రాయాలు మార్చుకున్న తర్వాత ఆయన కవిత్వం మీద చౌకబారు విమర్శలు చేసిన సందర్భం ఉంది. ఆయన నిర్బంధం వల్ల, త్యాగం వల్ల, విప్లవోద్యమ నిబద్ధత వల్ల వచ్చిన పేరును కవిగా చలామణీ కావడానికి వాడుకుంటున్నారని అన్యాయమైన, చిల్లర విమర్శలు చేసిన పెద్ద కవులూ విమర్శకులూ కూడ ఉన్నారు. ఆయనలోని కవి పట్ల వ్యతిరేకతకు ఈ చౌకబారు విమర్శలు ఒక కోణమైతే, ఆయనను మంచి కవిగా గుర్తించేవాళ్ల మౌనం, విస్మరణ కూడ మరొక కోణం. ఒకటి రెండు సంపుటాల కవిత్వంతోనే ఎంఫిల్, పిఎచ్‌డి పరిశోధనలకు లక్ష్యంగా మారిన కవులు తెలుగులో ఎంతో మంది ఉండగా, వరవరరావు కవిత్వం మీద ఇంతవరకూ ఏ విశ్వవిద్యాలయ తెలుగు శాఖలోనూ పరిశోధన జరగలేదు.

"వరవరరావు పేరు తలచుకొన్నప్పుడల్లా నాకు కొంపెల్ల జనార్దనరావు జ్ఞాపకం వస్తుంటాడు. ఒక విధంగా జనార్దనరావు లేని లోటును తీరుస్తున్నది పెండ్యాల వరవరరావే. ఇంకో గొప్ప విశేషమేమిటంటే జనార్దనరావు కవిత్వంలో ఉన్న అన్వయకాఠిన్యం వరవరరావు కవిత్వంలో లేకపోవడం.... కవిత్వం ఎలా ఉంటే బాగుంటుందని నేననుకుంటున్నానో అలా ఉంటుంది వరవరరావు కవిత్వం" అని శ్రీశ్రీ 1977లోనే అన్నప్పటికీ తర్వాత గడిచిన నాలుగు దశాబ్దాలలో ఐదారుగురి కన్న ఎక్కువమంది విమర్శకులు వరవరరావు కవిత్వం మీద విశ్లేషణ ప్రకటించలేదు. అందుకు స్పష్టమైన రాజకీయ, సామాజిక కారణాలున్నాయి.

ఇటువంటి విమర్శలనూ, విస్మరణలనూ వరవరరావు సాధారణంగా పట్టించుకోరు గాని, ఎప్పుడో ఒకసారి ఆయనలోని సున్నిత, భావుక మనస్తత్వం వాటిని గుర్తిస్తుంది. అటువంటి ఒక సందర్భంలో నేను ఒక కవిత రాశాను. అప్పటికి అచ్చయిన ఆరు కవితా సంపుటాలకు ఆరు భావచిత్రాలనూ, ప్రతీకలనూ తీసుకుని ఒక నిర్మాణంతో ఆ కవిత రాశాను. ఆ కవిత 1987 నవంబర్ 29 ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధంలో అచ్చయింది.

# స్వభావమే కవిత్వం!

ఎట్లా చెప్పను?
నీ మనసు ముడినెట్లా విప్పను?
ముఖభూమిక మీద ఘనీభవిస్తున్న విచారజలధి
మస్తిష్కక్షేత్రం మీద కీకారణ్యమవుతున్న అసహనం
హృదయాకాశం మీద భయపెడుతున్న ఉద్వేగ రక్తస్రావం
నీకు తగవని ఎట్లా చెప్పను?
ఎండిన నా పెదాలతో
నీ మీద సాహచర్యాన్నెట్లా అద్దను?

అద్భుత శిఖరారోహణ నీది
పర్వత పాద శిబిరంలో గుసగుసలు నీకెందుకు?

అయోమయాంధకారంలో
నెగడు ముందర ఏక్‌తార మీది పాట కవిత్వం
రాలిపడుతున్న జీవస్పందనను
మునివేళ్ల మీద పదిలంగా ఎత్తిపట్టడం కవిత్వం
రహదారిమీద సూర్య శకలాలు పరిచి
వెలుగుల సెలయేళ్లు తవ్వడం కవిత్వం
కన్రెప్పల మీద గోడలు లేచినప్పుడు
దేహాగ్రం నుంచి దిగంతం దాకా
నీడలు ముసురుకున్నప్పుడు
గవాక్షాల స్వచ్ఛ కాంతి కవిత్వం
ఆకాశ కంఠరవం కవిత్వం
ఆత్మీయ హస్తాల మధ్య పెరిగిన అఖాతాల్ని
ఉద్విగ్న భాషా సలిలాలతో పూడ్చడం కవిత్వం
సజీవ భవనం మీద శైథిల్యం కమ్ముకునే వేళ
గునపాల సంభాషణ కవిత్వమే!
కాపుకొచ్చిన పంట మిడతల పాలైనవేళ
నేల మీద నాగటికర్రు రాసేది కవిత్వమే!

కవీ, నువ్వెవరివో
రగులుతున్న కుంపటినడుగు
మోగుతున్న హృదయాన్నడుగు
మునుసాగుతున్న పాదాల్నడుగు
వికసిస్తున్న ఆకాంక్షనడుగు
ఎగసిపడుతున్న కడలినడుగు
ఆవిష్కరించబడుతున్న చిత్రాన్నడుగు

# మళ్లీ హైదరాబాద్, మళ్లీ 'సృజన', మళ్లీ కవిత్వం

*మన మధురగీతికలన్నీ*
*మహావిషాద చిత్రణలే* అని షెల్లీ అన్నట్టు 'సృజన' గురించీ, 'సృజన' కవిత్వం గురించీ తలచుకున్నప్పుడల్లా అది సాధించిన విజయాలు ఎంత మహోజ్వల మధురగీతాలో అని గర్వం కలుగుతుంది. 'సృజన' అకాల అంతర్ధానం గురించీ, 1992 తర్వాత దాన్ని నడపలేకపోయిన పరిస్థితుల గురించీ తలచుకున్నప్పుడల్లా, అందులోనూ 'సృజన' ఆగిపోవడానికి ప్రధాన బాధ్యత నాదేనేమోననే అపరాధభావన నిలువెల్లా మహావిషాదాన్ని నింపుతుంది. 'సృజన' జీవితంలో మూడో దశ గురించీ, ఆ దశలో జరిగిన కవిత్వ ములాఖాత్‌ల గురించీ ఈసారి చెప్పదలచాను.

పదిహేను సంవత్సరాల సుదీర్ఘ వేధింపు విచారణ తర్వాత 1989 ఫిబ్రవరి 27న సికింద్రాబాద్ కుట్రకేసు కొట్టివేసి అందులో నిందితులందరినీ నిర్దోషులుగా ప్రకటించారు. ఆ కేసు సందర్భంగా 1985 డిసెంబర్ నుంచి జైలులో ఉండగానే వరవరరావు మీద ప్రభుత్వం మరికొన్ని కేసులు బనాయించినందువల్ల, సికిందరాబాద్ కుట్రకేసు కొట్టివేత తర్వాత కూడ మూడు వారాలకు, మార్చ్ 21న గాని ఆయన విడుదల కాలేకపోయారు. అప్పటికి నేనింకా బెజవాడ ఆంధ్రపత్రికలోనే ఉన్నాను. ఎలాగూ వరవరరావు బైటికి వచ్చారు గనుక 'సృజన'ను పునరుద్ధరించాలనీ, ఆయన హైదరాబాదులో ఉండబోతున్నారు గనుక 'సృజన'ను హైదరాబాద్ నుంచే వెలువరించాలనీ ప్రయత్నాలు ప్రారంభించాం. వరంగల్‌లో ఉండిన సాహితీమిత్రుల వాతావరణం హైదరాబాదులో సాధ్యం కాకపోవచ్చునని తెలిసినా, వరంగల్ నుంచి రాగలిగినవాళ్లతో, హైదరాబాద్‌లో కొత్త సాహితీమిత్రులను సమీకరించి 'సృజన' నిర్వహించాలనుకున్నాం. అలా నాలుగు సంవత్సరాల నిర్బంధ విరామం తర్వాత, విరసం ద్విదశాబ్ది సభల నాటికి, 171 వ సంచికతో 1990 జనవరిలో 'సృజన' పునరుత్థానం జరిగింది.

నేను ఆ తర్వాత ఏడాదికి గాని హైదరాబాద్ చేరలేకపోయాను గాని ప్రతి సంచికకూ రచనలు చేయడం, సాహితీమిత్రుల సమావేశానికి వచ్చి రచనల ఎంపికలో పాలుపంచుకోవడం చేస్తూ వచ్చాను. ఆ డిసెంబర్ నాటికి హైదరాబాదు వచ్చి 'సమయం'లో చేరాను. కాని ఆరు నెలలకే యాజమాన్యం జీతాలు ఆలస్యం చేసి, ఎనిమిదో నెలకల్లా చేతులెత్తేస్తే, మిత్రులను కూడగట్టి సమ్మె, ఘెరావ్ లాంటివాటికి ముందు నిలబడ్డందుకు అక్టోబర్ కల్లా నా ఉద్యోగం ఊడింది. అప్పటినుంచి ఏప్రిల్ దాకా హైదరాబాదులో ఉద్యోగం దొరకక, తిరువనంతపురం నుంచి ఢిల్లీ దాకా ఉద్యోగాల వేటలో తిరిగి, చివరికి 1992 ఏప్రిల్‌లో బెంగళూరులో రిసర్చ్ అసిస్టెంట్‌గా కుదురుకున్నాను. అప్పటికే రెండు నెలలకూ మూడు నెలలకూ ఒక సంచిక వస్తున్న 'సృజన' మే 1992 సంచిక తర్వాత వెలువడడం కష్టమైపోయింది. 200 సంచికగా వెలువడవలసిన జూన్ సంచిక తేలేక, డిసెంబర్‌లో 200 వ సంచిక తెచ్చి, ఇక 'సృజన' మూసేస్తున్నాం అని ప్రకటించాం. ఆర్థిక, నిర్వహణా, రచనా సమస్యలెన్నో ఉన్నప్పటికీ, వాటన్నిటి వెనుక అప్పుడే కోరలు చాస్తున్న ప్రపంచీకరణ విధానాల ఛాయలున్నాయని ఇప్పుడు గుర్తించగలిగినప్పటికీ, నావల్లనే 'సృజన' ఆగిపోయిందనే మనసు మెరమెర నా జీవితమంతా వదలదు.

'సృజన' ఈ రెండో పునరుత్థాన దశలో మూడు సంవత్సరాలకు గాను ముప్పై ఆరు సంచికలు రావలసి ఉండగా ఇరవై రెండు సంచికలు మాత్రమే వెలువరించగలిగాం. కాని ఇప్పుడు పావు శతాబ్ది గడిచాక వెనక్కి తిరిగి చూసుకుంటే, ఇక్కడ కవిత్వ సందర్భం గనుక కేవలం కవిత్వం మాత్రమే చూసినా, ఆ ఇరవై రెండు సంచికలూ ఇరవై రెండు ఆణిముత్యాలు. తెలుగు కవిత్వపు కొత్త పోకడలు, తెలుగు కవిత్వ విమర్శలో అపురూపమైన వెలుగులు, ఇతర భాషా కవిత్వాలతో తెలుగు కవిత్వానికి ములాఖాత్‌లు ఎన్నెన్నో ఆ ఇరవై రెండు సంచికల్లో మిరుమిట్లు గొలుపుతాయి.

అసలు పునఃప్రారంభ సంచికలోనే అద్భుతమైన కవిత్వం వెల్లివిరిసింది. ఆ తర్వాత సుప్రసిద్ధమై, గత ఇరవై ఐదు సంవత్సరాలుగా వేలాది సభల్లో మారుమోగిన గద్దర్ సుదీర్ఘ గీతం

"వందనాలు వందనాలమ్మో మా బిడ్డలు
వీరులార వీరులార రాడికల్ల సూరులార
రాడికల్ల శూరులార రైతుకూలీ బిడ్డలార" ఆ 'సృజన' సంచికలోనే తొలిసారి అచ్చయింది. అమరుల తల్లిదండ్రులు అనుభవించే వేదనను వ్యక్తీకరించడంలో సాంప్రదాయిక అభివ్యక్తిని వినియోగించడం అమరవీరుల స్మృతిగీతాలలో ఒక అరుదైన ప్రయోగం. ఈ పాటలో గద్దర్ ఆ ప్రయోగం అనన్యసామాన్యంగా చేశాడు. బహుశా అందువల్లనే ఈ స్మృతిగీతం ఇరవై ఐదు సంవత్సరాల తర్వాత కూడ అంతే ప్రేరణాత్మకంగా, ఆర్ద్రంగా, ప్రభావశీలంగా ఉంది.

అలాగే

"ఇల్లు ఖాళీ చేసినంత సులభంగా

జీవితం ఖాళీ చెయ్యలేం కదా..." అంటూ మొదలయ్యే నందిని సిధారెడ్డి సుప్రసిద్ధ కవిత 'ఉసురు',

"రెండు చేతుల్తో దీపాన్ని రక్షించుకున్నట్టు

ఆ తల్లి ఆ పిల్లని పదిలంగా కాపాడుకుంటుంది..." అని మొదలయ్యే కె శివారెడ్డి సున్నితమైన కవిత 'తల్లి తల్లినే వర్షిస్తుంది', డా. రామనాథం మీద సుధాకిరణ్ రాసిన అద్భుతమైన కవిత 'డాక్టర్, మిమ్మల్ని వాళ్లు వైద్యం చేయనివ్వలేదంతే',

"చీకటివనము నడుగుదునా

చినబోయిన జాబిలినడుగుదునా

క్రుంగిన నింగినడుగుదునా

బండబారిన కొండల గుండెల నడుగుదునా" అంటూ స్వర్ణలత కోసం విమల రాసిన ఆర్ద్రమైన కవిత, 'ఏడాదికొకరోజు' అని అమరస్మృతిలో కృష్ణారావు (కృష్ణుడు) రాసిన కవిత, వరంగల్ మీద వరవరరావు సుప్రసిద్ధ కవిత 'ప్రేమనగర్' లతో పాటు అవతార్ సింగ్ పాష్ అనువాదకవిత 'ప్రమాదకరం' ఈ సంచికలోనే వచ్చాయి.

తెలుగు కవిత్వంలో అప్పుడు తీవ్రమైన చర్చలో, వివాదంలో ఉండిన అస్పష్టత – స్పష్టత, సంక్లిష్టత – సరళత్వం, అనిర్దిష్టత – నిర్దిష్టత అనే ద్వంద్వాలను తీసుకుని 'స్పష్టత కోసం అన్వేషణ' అని నేను రాసిన సుదీర్ఘ కవితావిమర్శ వ్యాసం కూడ ఆ సంచికలోనే ఉంది. అంతకు కొన్ని సంవత్సరాల ముందు 'ఉదయం' దినపత్రిక సాహిత్య పేజీల్లో కొన్ని నెలల పాటు సుదీర్ఘంగా సాగిన చర్చకు ఈ వ్యాసం కొనసాగింపు అని గుర్తు.

ఆ సంచిక విరసం ద్విదశాబ్ది సభల సందర్భంగా వెలువడితే, దాని తర్వాతి సంచిక (172 – ఫిబ్రవరి 1990) గద్దర్ అజ్ఞాతవాసం నుంచి బైటికి వస్తున్న సందర్భంగా, చిత్తప్రసాద్ వేసిన ఆదివాసుల సామూహిక నృత్య గాన సంగీతాల బొమ్మ ముఖచిత్రంతో, జననాట్యమండలికి విప్లవాభినందనలు చెపుతూ వెలువడింది. అందులో 1973 నుంచి 1990 వరకూ వెలువడిన జననాట్యమండలి పాటల నుంచి ఎంపిక చేసిన పదమూడు పాటల పునర్ముద్రణ జరిగింది. గద్దర్ రాసిన 'ప్రజాసంగీతం – పట్టించుకోవలసిన సంగతులు', గూగీ వా థియోంగో నవలలో భాగం 'ప్రజాసంగీతం కోసం అనంతాన్వేషణ' అనువాదం, చిలీలో పినోషె సైనికకుట్ర సందర్భంగా ప్రజా గాయకుడు, సంగీతకారుడు విక్టర్ యారా చేత గిటార్ వాయింపజేస్తూ ఒక్కొక్క వేలూ నరుకుతూ ఎలా చంపారో మిగ్యూల్ కాబెజాస్ రాసిన ప్రత్యక్షసాక్షి కథనం అనువాదం ప్రచురించాం. ఇవన్నీ కవిత్వ విస్తృత ఆవరణలో భాగమైనవే.

ఇక మిగిలిన ఇరవై సంచికల్లో ఒకటో రెండో కవితలు ఏవో మారుపేర్లతో రాసి, ఆ

తర్వాత కవిత్వం రాయనివాళ్లను మినహాయించినా, ఆ తర్వాత విరివిగానే కవిత్వం రాసిన, సంపుటాలు కూడ వేసిన ఎంతోమంది కవుల కవితలు వెలువడ్డాయి. గద్దర్, వంగపండు, వరవరరావు, ఎంటి ఖాన్, జెసి, కె సంజీవి (హెచ్చార్కె), సర్వధారి (ఎన్కె), నందిని సిధారెడ్డి, నారాయణస్వామి, యార్లగడ్డ రాఘవేంద్రరావు, సుధాకిరణ్– కృపా, ఆర్కే, సౌదా, శ్రీనివాసమూర్తి, గౌతమ్ (అద్దేపల్లి ప్రభాకర్), ఉదయమిత్ర, పరమాత్మ, రుద్రజ్వాల, వసీరా, కూర్మారావు, చెరుకు సుధాకర్, కాట్రగడ్డ దయానంద్, బజరా, తిర్మల్ వంటి అప్పటికే లేదా ఆ తర్వాత లబ్ధప్రతిష్ఠులైన కవులు మాత్రమే కాదు, అప్పటికే విప్లవోద్యమంలో ఉండి, గొప్ప కవిత్వం రాసి, తర్వాతి కాలంలో అమరులైన సముద్రుడు, కౌముది, మంజీర, ఎంఎస్ ఆర్ వంటి కవుల కవితలు కూడ ఆ ఇరవై సంచికల్లో వెలువడ్డాయి.

అలాగే దక్షిణాఫ్రికా కవితల అనువాదాలు, సర్వేశ్వర్ దయాల్ సక్సేనా, పాబ్లో నెరూడా, బ్రజ్ మోహన్, అనిర్బన్ దత్తా, గువాన్ యోంఘె, పెట్రోస్ బ్రోవ్క, నజర్ కబ్బానీ వంటి కవుల అనువాదాలు కూడ ఆ సంచికల్లో వచ్చాయి. సామాజిక రాజకీయ నేపథ్య వివరణ వ్యాసంతో పాటు కవిత్వానువాదం ఇచ్చే సంప్రదాయం కొనసాగింపుగా నికరాగువన్ విప్లవ విజయ వైఫల్యాల గురించి ఏడు పేజీల వ్యాసం రాసి, పదమూడు కవితలు అనువాదం చేశాను. అలాగే కశ్మీరీల స్వయం నిర్ణయాధికార హక్కు మీద ఒక సుదీర్ఘ వ్యాసం రాసి, దానితోపాటు మూడు కశ్మీరీ కవితలు అనువాదం చేశాను గాని నిడివి వల్ల అవి వేరు వేరు సంచికల్లో అచ్చువేయవలసి వచ్చింది.

ఈ కాలపు 'సృజన'లో వెలువడిన కవిత్వ, సాహిత్య విమర్శ వ్యాస పరంపర ఉజ్వలమైనది. ఆ ఇరవై రెండు సంచికల్లో మొత్తం పదకొండు లోతైన కవిత్వ, సాహిత్య విమర్శ వ్యాసాలు వెలువడ్డాయి. అందులో 'కవిత్వం – గతితార్కికత' అని జెసి రాసిన సుదీర్ఘ వ్యాసం నాలుగు సంచికల్లోను, 1910ల రష్యన్ సాహిత్య, సామాజిక వాతావరణాన్ని విశ్లేషిస్తూ మక్సీం గోర్కీ రాసిన అద్భుతమైన వ్యాసం 'విచ్ఛిన్నమౌతున్న వ్యక్తిత్వం' వ్యాసం నాలుగు సంచికల్లోను వచ్చిందంటే దాదాపు ప్రతి సంచికలోనూ దృక్పథానికి పదునుపెట్టిన కవిత్వ, సాహిత్య విమర్శ వెలువడిందని అర్థం. అరుదైన సాహిత్య విమర్శకుడు, 'సృజన' సాహితీమిత్రులలో ఒకరు జెసి (ఎ జగన్మోహనాచారి) రాసిన అద్భుతమైన కవిత్వ విమర్శ గురించి ఇదివరకు కూడ చెప్పాను. 'కవిత్వం –గతితార్కికత' అనే పేరుతో ఆయన సాహిత్య విమర్శ వ్యాసాల సంకలనం 1991 జనవరిలో 'సృజన' ప్రచురణగా వెలువడింది. ఆ తర్వాత ఆయన ఆ భావనను కొనసాగిస్తూ, అప్పుడు వెలువడుతుండిన కవిత్వం ప్రచురణల కవితా సంపుటాలకు అన్వయిస్తూ 'కవిత్వం – గతితార్కికత' పేరుతోనే నాలుగు సంచికల్లో సుదీర్ఘ వ్యాసం రాశారు. అలాగే కెవిఆర్ ఆధునిక కవితాధోరణుల గురించీ, అనుభూతివాదం గురించీ వ్యాసాలు రాశారు. త్రిపురనేని మధుసూదన రావు 1970 నుంచి 90 దాకా తెలుగు కవిత్వ ధోరణులన్నిటినీ సమీక్షిస్తూ 'నేటి కవిత్వ తత్వం' అనే సుదీర్ఘ వ్యాసం రాశారు.

ఇవన్నీ ‘సృజన’లో అచ్చుకుముందే చదవడానికీ, చర్చలో పాల్గొనడానికీ, అచ్చుపనిలో భాగంగా ప్రూఫులు దిద్దుతూ మరొకసారి చదవడానికీ నాకు అవకాశం దొరకడం అపురూపమైన ములాఖాత్.

‘సృజన’లో ఈ దశలో నేను చేసిన రెండు కవితానువాదాలు మీతో పంచుకోవాలని ఉంది. మొదటిది సర్వేశ్వర్ దయాల్ సక్సేనా కవిత. ‘సృజన’ జనవరి/ఫిబ్రవరి 1991 సంచిక ముఖపత్ర కవితగా వచ్చింది.

నీ ఇంట్లో
ఒక గదిలో నిప్పంటుకుంటే
మరో గదిలో
నిద్రపోగలుగుతావా?
నీ ఇంట్లో
ఒక గదిలో శవం పడి ఉంటే
మరో గదిలో పాడగలుగుతావా?
నీ ఇంట్లో
ఒక గదిలో శవాల కుప్పలు కుళ్లుతోంటే
మరో గదిలో
ప్రార్థన చేయగలుగుతావా?
నువ్వట్లా
నిద్రపోగలిగితే
పాడగలిగితే
ప్రార్థన చేయగలిగితే
నీతో ఇంక నాకు
మాట్లాడవలసిందేమీ లేదు

రెండవదైన చైనీస్ కవిత గురించి ప్రత్యేకంగా చెప్పాలి. అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి మహాసభల కోసం 1990 అక్టోబర్‌లో కేరళ లోని త్రిస్సూర్ వెళ్లాం. అక్కడ పుస్తకాల దుకాణంలో నాలుగువందల పేజీలకు పైబడిన, దాదాపు నాలుగువందల యాభై చైనీస్ కవితల ఇంగ్లిష్ అనువాదం పుస్తకం Light and Shadow along a Great Road కనబడింది. ఆ పుస్తక సంకలన కర్త, అనువాదకుడు రెవి అలే న్యూజిలాండ్ నుంచి 1920లలో చైనా చూడడానికి వెళ్లి, అక్కడి విప్లవంతో ప్రభావితుడై, చైనాలో, చైనా కమ్యూనిస్టు పార్టీతో ఉండిపోయాడు. చైనీస్ భాష నుంచి ఎంతో సాహిత్యం అనువదించాడు, స్వయంగా

కవిత్వం రాశాడు. తిరుగు ప్రయాణంలో రైలులో ఆ పుస్తకం తిరగేస్తుంటే, గువాన్ యోంఘె అనే 1937లో పుట్టిన కవి 1982లో రాసిన 'స్ట్రీమ్ ఎట్ నైట్' అని పాదవిభజన లేకుండా వచనం లాగ రాసిన కవిత ఆకర్షించింది. దానికి నా అనువాదం 'సృజన' మే 1991 సంచికలో వచ్చింది.

రాత్రిపూట సెలయేటి పాట

రాత్రిపూట, సెలయేరు ఇంకా ఎందుకు పాడుతోంది? దాని హృదయతంత్రుల్ని చంద్రకాంతి మీటుతున్నందువల్లనా? చంద్రుడే లేకపోయినట్టయితే, దాని నీళ్లలో నక్షత్రాలు మిలమిలలాడుతున్నందువల్లనా? చుక్కలే లేకపోతే, దాని మీద సయ్యాటలాడుతున్న మిణుగురులు వెలుగుతున్నందువల్లనా? మిణుగురులే లేకపోతే, దానిలోకి చొచ్చుకొస్తున్న మెరుపు వల్లనా? మెరుపు కూడ లేదు గదా, విద్యుద్దీపాలు దానిలో ప్రతిఫలిస్తున్నందువల్లనా?....

ఒక్కమాటలో, సెలయేరు చిమ్మచీకటిలో పాడుతోంది. చీకటిని ప్రశంసిస్తూ మాత్రం కాదు...

# మావో శతజయంతికి తెలుగు కానుక

మావో సేటుంగ్ ఒక అద్భుతమైన వ్యక్తి. తన ఇరవై ఎనిమిదో ఏట చైనా కమ్యూనిస్టు పార్టీని స్థాపించిన చిన్న బృందంలో ఒకడైన బడిపంతులు. ఇరవై ఎనిమిది సంవత్సరాల పాటు కష్టభరితమైన, కంటకావృతమైన, ధీరోదాత్తమైన, వివాదాస్పదమైన విప్లవమార్గానికి నాయకత్వం వహించి, కొత్తదారిలో విజయం సాధించిన విప్లవనేత. విజయం తర్వాత ఇరవై ఏడు సంవత్సరాలపాటు ఆ సమసమాజ స్వప్నాన్ని సాకారం చేయడానికీ కాపాడడానికీ సర్వశక్తులూ ధారపోసిన ప్రభుత్వాధినేత.

మావో సేటుంగ్ గురించి విద్యావంతులందరికీ అంతో ఇంతో అబద్ధాలో నిజాలో అపోహలో అతిశయోక్తులో తెలుసు. కాని ఆయన ఒక అపురూపమైన కవి అని కవిత్వాభిమానులకు కూడ చాలమందికి తెలియకపోవచ్చు. మావో కవిత్వంతో నా ములాఖాత్ 1972-73ల్లో మొదలై ఇరవై సంవత్సరాల పాటు సాగి చివరికి 1993లో ఆయన శతజయంతి సందర్భంగా ఆయన కవితలన్నిటినీ తెలుగులోకి అనువదించి 'మావో కవితలు' పుస్తకంగా వెలువరించడంగా పర్యవసించింది. ఈ కవిత్వ ములాఖాత్ ఒక ప్రాచీన భాషా కవితో, విప్లవనాయకుడైన కవితో, మూలం నుంచి ఇంగ్లిష్ జల్లెడలోంచి దిగిన కవిత్వంతో అనువాదంతో గనుక కాస్త వివరంగానే చెప్పవలసి ఉంది.

ఎప్పుడైనా జనజీవన సంఘర్షణే గొప్ప సృజనాత్మక ప్రేరణ. అందువల్ల ఆ జనజీవన సంఘర్షణకు గొంతునిచ్చేవారు, నాయకత్వం వహించేవారు సృజనాత్మక జీవులుగా, సాహిత్యకారులుగా మారడంలో ఆశ్చర్యమేమీ లేదు. అందులోనూ వర్గపోరాటం వంటి ఉన్నతస్థాయి జీవన సంఘర్షణ అపారమైన భావుకతకూ, అద్భుతమైన 'సృజన'కూ, అనంత వైవిధ్యానికీ కారణమవుతుంది. మరొకవైపు నుంచి చూస్తే ఆర్ద్రమైన, స్పందించే హృదయం గల భావుకులూ సున్నిత మనస్కులూ వర్గపోరాటంలోకి రావడం అనివార్యం. అంటే అటు సమాజంవైపు నుంచి చూసినా, ఇటు వ్యక్తి వైపు నుంచి చూసినా మార్క్సిస్టులు సాహిత్యకారులు కాకుండా ఉండడం కష్టసాధ్యం.

అందుకే మార్క్స్ ఎంగెల్స్‌ల నుంచి మన నేల మీద సముద్రుడు, ఎంఎస్ఆర్, కౌముది, మంజీర, శివసాగర్, అజ్ఞాత సూరీడుల వరకూ ప్రజా పోరాటాలలో వికసించిన, పదనుదేరిన కవులెందరో ఉన్నారు. కార్ల్ మార్క్స్ తొలిరోజుల్లో యవ్వనంలో ప్రధానంగా జెన్నీని ఉద్దేశించి ప్రేమ కవిత్వం రాశాడు. ఎంగెల్స్ జానపద గీతాలను అనుసరిస్తూ కవిత్వం రాశాడు. ప్రాచుర్యం పొందనప్పటికీ లెనిన్, స్టాలిన్‌లు రాసిన కవితలున్నాయి. ఇక మావో, హోచిమిన్, కిమ్ చిహో, చే గెవారాలు కవులుగా, సృజనాత్మక జీవులుగా వస్తు శిల్పాలలో చాల పరిణతి చూపారు.

అసలు కమ్యూనిస్టు రాజకీయాలకూ కవితాత్మక 'సృజన'శక్తికీ ప్రపంచవ్యాప్తంగా కనబడే అవినాభావ సంబంధాన్ని ఇంకా లోతుగా పరిశీలించవలసి ఉంది. విప్లవ కార్యాచరణకూ, విద్యుత్తేజాన్ని ప్రేరేపించగల సృజనాత్మక రచనకూ చాల సామ్యాలు కనబడతాయి. ఒక నూతన ప్రపంచాన్ని స్వప్నించే భావుకత, విశాల సామాజిక భవిష్యదుజ్వల ఆశ కమ్యూనిస్టులకూ కవులకూ ఉమ్మడి అంశం. ఒక్కొక్క అక్షరాన్నీ, పదాన్నీ ఏరి, చెక్కి, కూర్చి, తీర్చిదిద్దే అక్షర శిల్పికీ, సమాజ తత్వాన్ని ఒక్కొక్క మెట్టుగా అర్థం చేసుకుంటూ పోరాడుతూ మారుతూ మారుస్తూ సాగే కార్యకర్తకూ అంతస్సారం ఒకటే. ఆ రెండు రంగాల్లోనూ సమానమైన కృషి చేసిన ఎంతో మందిలో మావో అగ్రగణ్యుడు.

మావో కవిత్వంతో నా ములాఖాత్ 1974 జనవరిలో వెలువడిన వరవరరావు కవితాసంపుటం 'ఊరేగింపు'తో బలపడింది. ఆ పుస్తకాన్ని అప్పటికి అజ్ఞాతంలో ఉన్న విప్లవకవి, "మార్క్సిస్టు లెనినిస్టు నాయకుడు కామ్రేడ్ కె జి సత్యమూర్తికి అంకితం" చేస్తూ, ఆ పేజీ లోనే పైన 'ప్రజను సాయుధం చేస్తున్న/ రెవల్యూషనరీ నేడు కవి' అనే శివసాగర్ (సత్యమూర్తి) సుప్రసిద్ధ కవితాచరణంతో పాటు 'To find heros in the grand manner/ We must look rather in the present - Mao Tse-Tung' అని కొటేషన్ ఇచ్చారు. 'అబ్బ ఎంత గొప్ప వాక్యాలు' అని అబ్బురపడ్డాను. అంతకు రెండు సంవత్సరాల ముందు 'సృజన' ముఖపత్రం మీద వేసిన 'The tyrant dies and his rule is over;/ The martyr dies and his rule begins

అనే Soren Kierkegaard కవితామయ వాక్యాలకు అబ్బురపడ్డట్టే! ఒకరకంగా అప్పటి నుంచీ మావో కవిత్వం కోసం వెతుకులాట మొదలైంది.

నిజానికి దానికి సంవత్సరం ముందే 'సృజన' లో 'విప్లవకవిగా మావో' అనే పేరుతో కొన్ని కవితలను అనువాదం చేస్తూ చార్వాక పేరుతో శివసాగర్ ఒక వ్యాసం రాశారు. ఆ కవితల అనువాదంలో చార్వాక ఇంగ్లిష్ మూలం నుంచి చాల దూరం వెళ్లారని విమర్శిస్తూ కె వి రమణారెడ్డి మరుసటి సంచికలోనే ఒక వ్యాసం రాశారు.

"ఇంగ్లీషు అనువాదాలలో కనిపించని 'మనోహర దృశ్యాలు', వసంతస్వప్నాలు', 'పారాణి', 'పడవల పడుచులు', ఇంకా స్వేచ్ఛాపోరాటాలు, విముక్తి పోరాటాలు చార్వాక అనువాదంలోకి వచ్చి చేరుతున్నాయి. ఏ మంచి అనువాదకుడూ ఇంతటి స్వేచ్ఛ తీసుకోడు. ఒక చరణానికి నాలుగేసి చరణాల మేర కొన్నిచోట్ల అనువాదం సాగింది. సరికొత్త చరణాలే అవతరించిన చోట్లు కూడ లేకపోలేదు..." అని కెవిఆర్ విమర్శించారు.

దానికి జవాబుగా 'మంచి అనువాదమంటే ఒక సృజనాత్మక కళే' అనే నిర్వచనమే తనకు ప్రమాణమని, అందువల్ల మూలంలో లేని పదాలు, చరణాలు అనువాదంలో వచ్చాయని చార్వాక తన అనువాదాలను సమర్థించుకున్నారు.

ఆ తర్వాత కెవిఆర్ ఈ వివాదం జోలికి పోకుండా 'మావో కవిత్వం: విప్లవ కాల్పనికత? విప్లవ వాస్తవికత?' అనే మరొక సమగ్రమైన వ్యాసం 'సృజన'లోనే రాశారు.

అలా అటు 'ఊరేగింపు'లో మాటలూ, ఈ చర్చలూ నేపథ్యంలో మావో కవిత్వం మీద ఆసక్తి పెరిగి, వెతుకుతూ ఎక్కడ దొరికినా చదువుతూ వచ్చాను. క్రమంగా మావో కవితలకు ఐదారు వేరు వేరు ఇంగ్లిష్ అనువాదాలు ఉన్నాయని తెలిసి వచ్చింది. మిగిలిన అన్ని ప్రాచీన భాషల లాగే చైనా భాష సులభంగా అనువాదానికి లొంగేది కాదు. ప్రతి పదానికీ నాలుగో, ఐదో, అంతకన్న ఎక్కువో అర్థాలు ఉంటాయి. ఈ విభిన్న పర్యాయ పదాల, భిన్న అర్థాల, అర్థచ్ఛాయల నేపథ్యంలో మావో కవితలను ఇంగ్లిష్ లోకి ఒక్కొక్కరు ఒక్కొక్క రకంగా అనువదించారు. ఆ అనువాదాలు వేరువేరు అన్వయాలకు దారితీశాయి.

మావో రాసిన పద్దెనిమిది కవితలకు ఆండ్రూ బాయిడ్ చేసిన ఇంగ్లిష్ అనువాదాన్ని 'చైనీస్ లిటరేచర్' పత్రిక 1958లో తొలిసారిగా ప్రచురించింది. ఆ తర్వాత చైనా నుంచే చౌ చె ఫు అనువదించి, ట్సాంగ్ కె చియా వ్యాఖ్యానం రాసిన పందొమ్మిది కవితల సంపుటం వచ్చింది. సాంస్కృతిక విప్లవం తర్వాత 1960ల చివరా, 1970ల మొదట్లో చైనా మీద పాశ్చాత్య దేశాలలో పెరిగిన ఆసక్తిలో భాగంగా ఒకవైపు పెంగ్విన్స్, మరొకవైపు కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ ప్రెస్ మావో జీవితచరిత్రలను ప్రచురించాయి. స్టువార్ట్ ష్రామ్ రాసిన మొదటి పుస్తకంలోను, జెరోమ్ చెన్ రాసిన రెండో పుస్తకంలోనూ మావో కవితల అనువాదాలు చేర్చారు. ఈ రెండో పుస్తకంలోనే మొదటిసారిగా జెరోమ్ చెన్, మైకేల్ బుల్లక్ లు మావో రాసిన 37 కవితలను అనువాదం చేశారు. చివరికి చైనా ప్రభుత్వ అధికారిక ప్రచురణ

సంస్థ ఫారిన్ లాంగ్వేజెస్ ప్రెస్, పెకింగ్ 1976లో 39 కవితలతో మావో కవితల సాధికారిక అనువాదాన్ని ప్రచురించింది. కాకపోతే జెరోమ్ చెన్ అనువాదంలో ప్రతి ఒక్క కవితకూ వివరణలు ఉండగా, సాధికారిక సంపుటంలో వివరణలు లేవు. మావో కవిత్వంలో చాల చైనా పౌరాణిక, సామాజిక ప్రతీకలను ఉపయోగించాడు గనుక, నిర్దిష్టంగా తన స్థలానికీ కాలానికీ చెందిన అనుభవాలను వ్యక్తీకరించాడు గనుక, కొన్ని సాధారణీకరించిన వ్యక్తీకరణలు ఉన్నప్పటికీ వివరణలు లేకుండా అర్థం చేసుకోవడం కష్టం.

ఈ సమాచారమంతా, మావో రాసిన కవితలన్నీ, వాటి అనువాదాలన్నీ పోగు చేసుకుంటుండగా, నేను బెజవాడలో ఉన్నరోజులలోనే అనుకోకుండా మరొక పెన్నిధి దొరికింది. అప్పటి విరసం సహచరుడు, విశాఖపట్నం పురపాలక సంస్థ ఉద్యోగి శివరాం ప్రసాద్ ఏదో ఉద్యోగపు పని మీద 1980ల చివర లండన్ వెళ్లాడు. ఆయన అక్కడి నుంచి హాంగ్‌కాంగ్‌లోని జాయింట్ పబ్లిషింగ్ కంపెనీ ప్రచురించిన, నాన్సీ టి లిన్ అనువాదం చేసిన 'రివర్బరేషన్స్' అనే మావో కవితల సంపుటాన్ని తెచ్చాడు. (నాకు దేశదేశాలనుంచి పుస్తకాలు కానుకలిచ్చిన మిత్రుల, ఆ పుస్తకాల ములాఖాత్‌ల గురించి రాస్తే ఎంత ఉద్వేగభరితమైన, కన్నీళ్లూ మహదానందాలూ కలగలిసిన గ్రంథం అవుతుందో!) ఈ నాన్సీ టి లిన్ సంపుటం గత సంపుటాలన్నిటికన్న ఎక్కువగా నలబై రెండు కవితలు ఉన్నది. ప్రతి కవితకూ దీర్ఘమైన వివరణలూ, అన్వయాలూ, సంబంధిత ఉటంకింపులూ ఉన్న సమగ్రమైన సంకలనం అది.

నిజానికి నాన్సీ టి లిన్ సంకలనం కూడ సమగ్రమని చెప్పడానికి లేదు. మావో చౌ ఎన్ లైని ఉద్దేశిస్తూ 1975లో ఒక కవిత రాశాడని చెపుతూ ఆ కవితను మావో మరణానంతరం 'టైమ్' పత్రిక ప్రచురించింది. అది నాన్సీ టి లిన్ తన సంకలనంలో చేర్చలేదు. అలాగే, 1936–49 మధ్య మావో రాసిన కవితలు ఏ సంకలనం లోను ఒక్కటి కూడ లేవు. ఆ కాలంలో కూడ మావో కవిత్వం రాసి ఉంటాడని, అవి ఇంకా సంపుటాలకు ఎక్కలేదని భావించవచ్చు.

అప్పటికి రెండు మూడు సంవత్సరాలలో మావో శతజయంతి రానుండడంతో చైనా అధికారిక సంపుటం, జెరోమ్ చెన్ అనువాదం, నాన్సీ టి లిన్ అనువాదం మూడూ పక్కన పెట్టుకుని, అవసరమైన చోట్ల ఇతర అనువాదాలు కూడ సంప్రదిస్తూ మొత్తం మావో కవితలను తెలుగు చేసే పని పెట్టుకున్నాను.

మావో కవితల తెలుగు అనువాదాల చరిత్ర కూడ విస్తృతమైనదే. తొలిరోజుల్లో దాశరథి ఒక కవితను అనువదించారు. 'అభ్యుదయ'లో 1950లలో అడపాదడపా కొన్ని కవితల అనువాదాలు వచ్చాయి. ఇంతకుముందే చెప్పినట్టు, 1972లో చార్వాక (శివసాగర్) దాదాపు పది కవితలు, కొన్ని కవితల్లో భాగాలు స్వేచ్ఛానువాదం చేశారు. వీటిలో కొన్ని

బహుళ ప్రచారంలోకి వచ్చాయి గాని, వాటిని మావో కవితల అనువాదాలు అనడం కన్న మావో ప్రేరణతో శివసాగర్ రాసిన కవితలుగా గుర్తించడమే మేలు. ఈ కవితల మీద చర్చలో భాగంగా కెవిఆర్ ఆరు కవితలు అనువదించారు. సికిందరాబాదు కుట్రకేసులో జైలులో ఉండగా 1974లో వరవరరావు చాల కవితలను అనువదించారు. వాటిలో కొన్ని 1977లో 'సృజన'లో ప్రచురణ అయ్యాయి.

ఈ తెలుగు అనువాదాలన్నిటినీ కూడ సంప్రదిస్తూ నా అనువాదం కొనసాగించాను. మూలం నుంచి దూరం పోగూడదనీ, లక్ష్యభాషా సంప్రదాయాలకు అనుగుణంగా అనువాదం ఉండాలనీ నా నియమం. అలా 42 కవితలూ అనువదించి, నా అనువాదాలకు చార్వాక–కెవిఆర్ చర్చను, అనువాదాలను కూడ అనుబంధంగా చేర్చి, మావో కవితలలో నాలుగు కవితలు ఇతర కవులకు జవాబుగా రాసినవి గనుక ఆ కవుల కవితలను కూడ అనువదించి అనుబంధంలో చేర్చి, మొత్తానికి మావో శతజయంతి నాటికి (1993 డిసెంబర్ 26), విప్లవ రచయితల సంఘం ప్రచురణగా 'మావో కవితలు' వెలువరించాను. అప్పటికి పదిహేను సంవత్సరాలుగా భద్రంగా దాచిపెట్టుకుంటున్న ఒక భావస్ఫోరకమైన చైనీస్ పెయింటింగ్‌తో ముఖచిత్రం తయారు చేయించి పుస్తకాన్ని ఇష్టంగా మావో శతజయంతి కానుకగా తెచ్చాను.

మావో కవిత్వం గురించీ, అనువాదాల గురించీ వివరిస్తూ రాసిన ముందుమాటలో "మూడు అనువాదాలను పోలుస్తూ, వివరణల సాయంతో కవితలను ఎక్కువగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ తెలుగు అనువాదం చేశాను. ఇప్పటికీ ఈ తెలుగుసేత పూర్తి సంతృప్తికరంగా ఉందని చెప్పలేను" అని అప్పుడే రాశాను. ఇప్పుడు చదువుతుంటే ఆ అసంతృప్తి మరికాస్త పెరుగుతున్నట్టే ఉంది. ఏది ఏమైనా ఒక కవిత చూడండి:

### మంచు

ఉత్తరాది దృశ్యమాలిక
కనుచూపు మేర కప్పుకున్న పొగమంచు
దిగంతాల దాకా గింగరాలు తిరిగే మంచు
మహాప్రాకారానికి రెండు వేపులా
ఒకేఒక్క అనంత శ్వేతభూమి
ఇటుకొస నుంచి అటుకొస దాకా నిశ్చలమైపోయిన
పసుప్పచ్చ నది ప్రవాహ ఉధృతి
రజతసర్పాల వలె నాట్యమాడే పర్వతాలు

మైనపు ఏనుగుల్లా మోహరించి
ఆకాశంతో పోటీపడే పీఠభూములు
శ్వేతాంబరధారి ఈ భూమి
మహత్తర దినాల కెంపు రంగులద్దుకుని
మరింత అందంగా మారుతుంది

ఈ నేల సౌందర్య ఖని
ఎంతమంది వీరులను
వినయంగా తలవంచేలా చేసింది!
అయ్యో - చిన్ షి హువా, హాన్‌వుటిలకు
సాహిత్య స్ఫూర్తి లేకపోయింది
తాంగ్ ట్రై సుంగ్, సుంగ్ తాయి సు లకు
హృదయంలో కవిత్వ జల కరువైపోయింది
ఒకానొకప్పుడు ఘనత వహించిన దైవపుత్రుడు
చెంఘిజ్ ఖాన్ కు విల్లు ఎక్కుపెట్టి
గద్దల్ని వేటాడ్డం మాత్రమే తెలిసింది
అందరూ గతించిపోయారు
నిజంగా ధీరుల కోసం ఈ తరంలోకి మాత్రమే చూడు

(1936 ఫిబ్రవరి)

వివరణ: లాంగ్‌మార్చ్ విజయవంతంగా ముగిసిన తర్వాత నాలుగు నెలలకు, కమ్యూనిస్టు పార్టీ పొలిటికల్ బ్యూరోకు చెందిన వేపో సమావేశం జరిగిన తర్వాత రెండు నెలలకు మావో ఈ కవిత రాశాడు. అక్కడే జపాన్‌కు వ్యతిరేకంగా జాతీయ ప్రతిఘటనా ఐక్యసంఘటన విధానాన్ని చేపట్టాలని, ప్రజా రిపబ్లిక్‌ను ఏర్పరచాలని నిర్ణయాలు జరిగాయి. "శత్రువును చివరి రక్తపుబొట్టు దాకా ఎదిరిస్తూ ఉండే స్ఫూర్తి మా చైనీయులకుంది. మేం పోగొట్టుకున్న భూభాగాన్ని మా సొంత కృషితో తిరిగి గెలుచుకోవాలనీ, అన్ని దేశాల మధ్యా మా కాళ్లపై మేం నిలబడాలనీ మేం భావిస్తున్నాం" అని మావో అన్నాడు. ఈ కవితను ఈ నేపథ్యంలో చూడాలి.

పీఠభూములంటే షెన్సీ, షాన్సీ పీఠభూములు. చిన్ షి యువాంగ్ అంటే చిన్ వంశం (క్రీ.పూ. 259-210) మొదటి చక్రవర్తి. హాన్ వుటి అంటే హాన్ వంశానికి (క్రీ.పూ. 156-

87) చెందిన వు చక్రవర్తి. తాంగ్ టై సుంగ్, తాంగ్ వంశానికి (క్రీ.శ. 599–649), సుంగ్ తాయి సు, సుంగ్ వంశానికి (క్రీ.శ. 927–976) చెందిన చక్రవర్తులు. చెంఘిజ్ ఖాన్ క్రీ.శ. 1206–1227 మధ్య పాలించిన మంగోల్ చక్రవర్తి.

ఈ ప్రసిద్ధ పాలకుల గురించిన పాదాలు ప్రశంస కన్న ఎక్కువగా విమర్శకే ఉద్దేశించినవి. మావో 1958లో వివరించినట్టుగా, "రెండు వేల సంవత్సరాల భూస్వామ్య వ్యవస్థలో అత్యంత అభివృద్ధి నిరోధక దశలపై విమర్శ అది. సంస్కృతి, కవిత్వం, గద్దలు – ఇటువంటి పదచిత్రాలు వాడే అవకాశం మాత్రమే ఉందిక్కడ. ఎందుకంటే రాస్తున్నది కవిత్వం గదా. ఇక్కడ ఇంతకన్న కరుకయిన పదచిత్రాలు వాడవచ్చునా? అందుకే ఇంకే వివరణయినా సరిపోదని నేననుకుంటాను."

ఇదే వివరణలో చివరి రెండు పాదాల గురించి చెపుతూ, అవి శ్రామికవర్గాన్ని ఉద్దేశించినవని మావో అన్నాడు. ఈ కవితలో కొన్ని పదాలగురించి, ప్రతీకల గురించి చాల వ్యాఖ్యానాలు వచ్చాయి. అందువల్ల మావో స్వయంగా ఈ వివరణ ఇచ్చాడు.

# శిలలు ద్రవించి ఏడ్చినవి....

కవిత్వంతో నా ములాఖాత్‌లు ఎన్నెన్ని గుర్తు తెచ్చుకుని రాస్తున్నా, కన్నీటితో, ఉద్వేగంతో గడిచిన జీవితాన్ని ఎంతగా పునర్జీవిస్తున్నా, ఇంకా మిగిలిపోతున్న అనుభవాలెన్నో ఉన్నాయి. రక్తమజ్జాస్థిగతమైపోయి, మరుగున పడి, చెప్పనక్కరలేదన్నంత మామూలుగా మారిపోయిన జ్ఞాపకాలు మరెన్నో ఉన్నాయి. అలా మనసు అడుగుపొరల్లో ఉండిపోయిన ఉజ్వలమైన ములాఖాత్‌లను హఠాత్తుగా తట్టిలేపి గుర్తు తెచ్చే సందర్భాలూ వస్తున్నాయి. జడివానలో మెరుపులు మెరిసినట్టు, సాధారణంగా కనిపించే కవిత్వంలో అకస్మాత్తుగా ఒక వెలుగు విరజిమ్మినట్టు, కొత్త కన్నీటికెరటాలలో పాత వెన్నెలలు గుర్తుకొస్తున్నాయి.

నా హృదయంలో అవిభాజ్య భాగమైన చలసాని ప్రసాద్ హఠాన్మరణం నలబై రెండు సంవత్సరాల పరిచయంలో, ముప్పై ఐదు సంవత్సరాల సాన్నిహిత్యంలో ఆయన ద్వారా నాకెన్ని కవిత్వ ములాఖాత్‌లు జరిగాయో గుర్తు తెచ్చింది. ఆ ములాఖాత్‌లు ఎంత మామూలై పోయాయంటే ఈ వరుసలో బహుశా అవి రాసి ఉండేవాణ్ని కాదు. కాని ఇప్పుడు ప్రసాద్ కోసం తీరని దుఃఖాన్నీ, ఆరని కన్నీళ్లనూ, మోయలేని గుండెబరువునూ కొంతవరకు దించుకోవడానికైనా ఆ ములాఖాత్‌లు చెప్పాలి.

చలసాని ప్రసాద్‌ను నాకు గుర్తున్నంతవరకు నా పన్నెండో ఏట, 1973 అక్టోబర్ లో హనుమకొండలో జరిగిన విరసం సాహిత్య పాఠశాలలో మొదటిసారి చూశాను. అది చూపు

మాత్రమే గాని పరిచయం అని కూడ అనలేను. ఎమర్జెన్సీ ముగిసిపోయాక, సివి సుబ్బారావు ఢిల్లీ చేరి, వరంగల్‌కు ఎక్కువగా రావడం మొదలయ్యాక, తన విశాఖ అనుభవాలూ జ్ఞాపకాలూ చెప్పే సమయంలో ప్రసాద్ వ్యక్తిత్వం నాకు తెలుస్తూ వచ్చింది. అప్పుడే వరంగల్ లో జరిగిన సభలకు ప్రసాద్ వస్తూ ఉండడంతో, ఇతర ప్రాంతాల్లో సభలకు నేను వెళ్లినప్పుడు ప్రసాద్‌ను కలుస్తూ ఉండడంతో క్రమంగా సాన్నిహిత్యం పెరుగుతూ వచ్చింది.

ఆ సాన్నిహిత్యంతోనే 1981 డిసెంబర్‌లో మొదటిసారి విశాఖపట్నం వెళ్లాను. ప్రసాద్ వేలు పట్టుకుని సముద్రాన్నీ రావిశాస్త్రి గారినీ కారా మాస్టారునూ, వంగపండునూ మరెంతో మందినీ కలుసుకున్నాను. ప్రసాద్ నోట విశాఖ వీథుల్లో శ్రీశ్రీ జ్ఞాపకాలన్నీ స్వయంగా అనుభవించాను. అప్పటికింకా ప్రసాద్, విజయక్క, నవత, మమత సిరిపురం జంక్షన్‌లో ప్రొఫెసర్ల క్వార్టర్లలో 5/37 లో తుమ్మల వేణుగోపాలరావు గారితో, కృష్ణక్కతో పాటే ఉంటున్నారు. అక్కడి నుంచి సముద్ర తీరం ఐదు నిమిషాల నడక. అప్పటికే పుస్తకాలు చదివే, కొనే పిచ్చి ఎక్కి ఉంది గనుక ప్రసాద్ పుస్తక సముద్రంలో తలమునకలై ఉక్కిరి బిక్కిరి అయ్యాను. నాలుగైదు రోజులు ఆ ఇంట్లోనూ, సముద్ర తీరంలోనూ, విశాఖ వీథుల్లోనూ ప్రసాద్ మాటల హోరు. కిక్కిరిసిన చరిత్ర సందర్భాల, మనుషుల, మానవసంబంధాల, ఆత్మీయతల సంరంభం. శ్రీశ్రీ, రావిశాస్త్రి వంటి తనకు సన్నిహితులైన అనేకమంది మాటల్లో కవిత్వం ఎలా అలవోకగా దొర్లేదో ప్రసాద్ ధారలా ఎన్నో విషయాలు చెప్పడం అప్పుడు మొదలై చనిపోవడానికి పది రోజులముందు నేను చివరిసారి కలిసినదాకా ముప్పై నాలుగు సంవత్సరాలు ఎడతెగకుండా కొనసాగిన సంభాషణ. వయసు పెరుగుతున్న కొద్దీ చెప్పిందే చెప్పడం అలవాటయింది గాని, అంతకుముందు కూడ శ్రీశ్రీ, రావిశాస్త్రి, కవిత్వం ఎందుకైనా మంచిదని ఒకటికి రెండుసార్లు చెప్పేవాడు. 'వెన్నెలా వెన్నెలా పేదోడి దీపమా' అని మామూలు మనిషి ఎంత గొప్ప కవిత్వం చెప్పాడో చూడమని రావిశాస్త్రి గారు అన్నారని ప్రసాద్ నోట వందసార్లయినా విని ఉంటాను.

మొదటిసారి విశాఖపట్నం వెళ్లి తిరిగి వస్తున్నప్పుడు చదివి పంపిస్తానని నేను తీసుకున్న పుస్తకాల్లో విద్వాన్ విశ్వం నవలిక 'ప్రేమించేను' ఒకటి. నిజానికి ఆ అరవై డెబ్బై పేజీల పుస్తకం అక్కడే చదివేశాను గాని అప్పుడప్పుడే హనుమకొండకు వచ్చిన ఫొటోస్టాట్ సాంకేతిక పరిజ్ఞానంతో సొంతానికి ఒక కాపీ చేయించుకోవాలని తెచ్చుకున్నాను. రెండో పుస్తకం థార్న్‌టన్ వైల్డర్ నవల 'ఐడ్స్ ఆఫ్ మార్చ్'. అవి అలా ఉంచి, ప్రసాద్ నాకు ప్రేమతో అని రాసి సంతకం చేసి ఇచ్చినవి రెండూ కవిత్వానికి సంబంధించినవి. ఒకటి కొడాలి వెంకటసుబ్బారావు కావ్యం 'హంపీక్షేత్రము', రెండోది, కేశవపంతుల నరసింహశాస్త్రి వ్యాస సంపుటి 'ప్రబంధ పాత్రలు'.

అంతకు ముందు మూడు నాలుగు రోజుల్లోనూ ఏదో ఒక సందర్భంలో నాకు చెపుతున్న

కవిత్వ, సాహిత్య విషయాల్లో భాగంగా భావకవిత్వం గురించి ఎంతో చెప్పాడు. “శిలలు ద్రవించి యేడ్చినవి జీర్ణములైనవి తుంగభద్రలోపల...” అని పద్యం చదువుతుంటే నాకు దుఃఖం ఆగలేదు. అందుకే తనదగ్గర ఉన్న రెండో కాపీ నాకు కానుకగా ఇచ్చాడు. పుస్తకం చూడకుండానే ఆ పద్యాలు చదివి వినిపిస్తూ, కొడాలి వెంకటసుబ్బారావు ఎంత సున్నితమైన, ఆర్ద్రమైన కవో ప్రసాద్ చెప్పిన మాటలు ముప్పైనాలుగు సంవత్సరాల తర్వాత ఇప్పటికీ విశాఖ సముద్రహోరు లాగ వినిపిస్తూనే ఉన్నాయి. అలాగే తెలుగు ప్రాచీన సాహిత్యంలోని పారిజాతాపహరణము, మనుచరిత్రము, వసుచరిత్రము, నీలాసుందరీ పరిణయము, ప్రభావతీప్రద్యుమ్నము, పాండురంగ మాహాత్మ్యముల నుంచి ఒక్కొక్క పాత్రను తీసుకుని నరసింహశాస్త్రి చేసిన కవిత్వ విమర్శ, లేదా కవిత్వ పరిచయ వ్యాసాలు రెండో పుస్తకం.

నిజానికి ఆ రెండు పుస్తకాలూ ప్రసాద్ నమ్మిన, అప్పటికి మూడు దశాబ్దాలకు పైగా పాల్గొంటున్న రాజకీయ విశ్వాసాలకూ, ఆచరణకూ భిన్నమైనవి. కొండొకచో వ్యతిరేకమైనవి కూడ కావచ్చు. కాని తాను పూర్తిగా విభేదించే అంశంతో కూడ స్నేహం నెరపగలగడమే ప్రసాద్ వ్యక్తిత్వంలోని గొప్ప ప్రజాస్వామిక స్వభావం. భిన్నమైన దానిపట్ల కూడ సమానమైన ఆసక్తినీ, అభిమానాన్నీ చూపగలగడం ప్రసాద్‌లో సహజంగా ఉండేది. పాత సాహిత్యం మీద తనకుండే అంచనాలు ఉంటూనే, అవసరమైన చోట దాన్ని విమర్శిస్తూనే దాన్ని గాఢంగా అభిమానించడం, దానిలో ఎక్కడైనా గుణం ఉంటే దాన్ని ఆమోదించడానికి వెనుకాడకపోవడం, చర్చించడం ఆయన విపరీతంగా చేసేవాడు. ఇప్పుడు వెనక్కి తిరిగి ఆలోచిస్తే విభిన్నమైన, వైవిధ్యపూరితమైన కవిత్వ, సాహిత్య ధోరణుల పట్ల విమర్శలు ఉన్నప్పటికీ చదవడం, ఆసక్తి కలిగి ఉండడం, అభిమానించడం వంటి అలవాట్లు నాకు ఎంతో కొంత చలసాని ప్రసాద్ నుంచే వచ్చి ఉంటాయని అనిపిస్తున్నది.

స్టాలిన్‌కు వీరాభిమానిగా, నిరంతరం విప్లవ రాజకీయాల వైపు, ఆచరణ వైపు, విప్లవ సాహిత్యోద్యమం వైపు నిలిచిన వ్యక్తిగా చలసాని ప్రసాద్ ఇంత విభిన్నమైన, వైవిధ్యభరితమైన కవితా, సాహిత్య ఆసక్తులనూ అభిమానాన్నీ ఎలా నిలుపుకోగలిగాడనేది ఆశ్చర్యకరం కాదు గాని అన్వేషించదగిన ప్రశ్న.

‘కవిత్వమంటే నాకు విపరీతమైన ఆసక్తి’ అని ప్రసాద్ 1982లో ఒక ఇంటర్వ్యూలో చెప్పాడు. తొమ్మిదో తరగతి విద్యార్థిగా పదిహేనో ఏట ఆయన అచ్చయిన మొదటి రచన కవిత్వమే. ఆ తర్వాత ఆయన జీవితంలో చాల ఒడిదుడుకులు వచ్చాయి. కమ్యూనిస్టు భావాలు, ఆచరణ ఉన్నందుకు కుటుంబంలోనే అన్ననూ, పినతండ్రినీ, బావనూ పోలీసులు కాల్చి చంపారు. అదంతా ఆయన ఇంకా పదహారు–పదిహేడేళ్ల వయసులోనే. అలా ఆయన మార్గం కమ్యూనిస్టు పార్టీతో, అభ్యుదయ రచయితల సంఘంతో, శ్రీశ్రీతో కలిసి సాగక తప్పదని చరిత్ర నిర్ణయించింది. కాని ఆ సమయంలోనే ఆయన బహుశా డిగ్రీ చదువుకు

బెజవాడలో ఉన్నప్పుడు మారుతీనగర్‌లో విశ్వనాథ సత్యనారాయణగారి పక్కింట్లో ఉన్నాడు. రాజకీయాభిప్రాయాలలో సంపూర్ణమైన వ్యతిరేకత ఉన్నప్పటికీ విశ్వనాథకు శిష్యుడయ్యాడు. విశ్వనాథ కవిత్వాన్ని, ముఖ్యంగా కిన్నెరసాని పాటలను, మొత్తంగా కవితా అభివ్యక్తిని అభిమానించాడు. 'వేయిపడగలు' స్థాపించదలచిన భావజాలాన్ని తీవ్రంగా విమర్శిస్తూనే, వలసపాలనలో మారుతున్న విలువలను విశ్వనాథ ఆ నవలలో యథాతథంగా, వాస్తవికంగా చిత్రించారని అంచనా కట్టాడు. అంటే కవిత్వమూ, నిజాయితీ, వాస్తవికత ఎక్కడున్నా ప్రసాద్ అభిమానించాడు. చలం అభిమానిగానూ కమ్యూనిస్టుగానూ తాళాలు లేని ఇళ్లు, పరీక్షలు లేని చదువులు, పోలీసులు లేని సమాజం కావాలని కవితాత్మకంగా కోరుకున్నాడు.

అలాగే ఎంకి పాటలను కూనిరాగాలు తీయడం, అనేక సందర్భాలలో నండూరి సుబ్బారావు గారి పదబంధాలను, పాదాలను ఉటంకించడం, శ్రీశ్రీ మీద అభిమానంతో ఆకటి దశాబ్దం కవులందరినీ, సరియలిస్టు, డాడాయిస్టు కవులందరినీ చదవడం, తెలుగు కవిత్వంలో ఏ మాత్రం పలుకు ఉన్న కవినైనా అభిమానించడం ప్రసాద్ విశాల కవితాసక్తులకు అద్దం పడతాయి. ఇదంతా అన్నిటినీ ఆమోదించే హోల్డాల్ ఔదార్యం కూడ కాదు. అది మన సమాజపు బహుళత్వం గురించిన ఎరుక అనుకుంటాను. మన సమాజంలో అనేక అంతరాలున్నాయని, మనుషుల అభిప్రాయాలు, ప్రవర్తనలు వేరువేరు స్థాయిల, పొరల, కోణాల, రంగాల, దృక్పథాల ప్రభావాలలో ఉన్నాయని ప్రసాద్ గుర్తించాడు. అందుకే ఎవరినైనా 'మంచాడే' అనగలిగాడు. రొడ్డకొట్టుడు పిడివాదంతో యాంత్రికంగా మిత్రులు – శత్రువులు అని విభజించడం సరికాదని అనుకున్నాడు. అటువంటి విభజన స్వయంగా మార్క్స్, ఎంగెల్స్ లే అన్నట్టు 'అంతిమ సారాంశంలో వాస్తవమే' గాని ఇప్పటికిప్పుడు భారత సమాజం వంటి సంక్లిష్ట సమాజంలో నిజం కాదని ఆయన నమ్మాడు. ఆ నమ్మకాన్ని ఆచరణలో చూపాడు.

అలా అటుకొసన ప్రాచీన, ప్రబంధ, సాంప్రదాయిక, భావ కవిత్వాన్నంతా అభిమానించడంతో పాటే 1940 ల నుంచీ తాను నమ్మిన రాజకీయ విశ్వాసాల వల్ల అభ్యుదయ కవిత్వాన్నీ అభిమానించాడు. రాజకీయాలూ కవిత్వమూ కలగలిసిన అసాధారణమైన అభినివేశం అది. ఆ తరానికి కళ్లముందరి చరిత్ర అయిన రెండో ప్రపంచ యుద్ధం, అందులో స్టాలిన్ గ్రాడ్ పై నాజీ సైన్యాల దాడి, ఆ దాడిని తిప్పికొట్టిన ఎర్రసైన్యం వంటి రోమాంచకారి అనుభవాల నుంచి ఆ కవిత్వం ఉద్భవించింది. అందుకే ఆయన తొలియవ్వనంలో, 1943–44ల్లో విన్న పాట, 'స్టాలినో నీ ఎర్ర సైన్యం/ ఫాసిజం వినాశ సైన్యం' అరవై సంవత్సరాల తర్వాత కూడ కళ్లు మూసుకుని, అవతలి వాళ్ల కళ్లు చెమర్చేలా ఆయన పాడుతుంటే కవిత్వమూ సమాజమూ రాజకీయమూ వ్యక్తిత్వంలో రసాయన సమ్మేళనం జరిగిన వ్యక్తి లేచినిలిచినట్టు కనబడేవాడు.

ఆ అభ్యుదయ సాహిత్యోద్యమం, దాని వెనుక ఉన్న కమ్యూనిస్టు పార్టీ వర్గపోరాటాన్ని

వదిలి, వర్గ సామరస్య మార్గాన్ని చేపట్టినతర్వాత, రెండు దశాబ్దాల పాటు ఆ చీకటిలో ఆ జ్వాలను కొడిగట్టిపోకుండా తమ అధ్యయనం ద్వారా, తాత్విక దృక్పథం ద్వారా కాపాడుకుంటూ వచ్చిన కొద్దిమందిలో ప్రసాద్ ఒకరు. అందుకే ప్రసాద్ కవిత్వపు నిప్పురవ్వ విశాఖపట్నం జీవితం ప్రారంభంతో, నక్సల్బరీ శ్రీకాకుళ విప్లవోద్యమ సాన్నిహిత్యంతో జ్వాలగా మారింది. వందలాది మందికి రాసిన ఉత్తరాల్లో ఎంత కవిత్వం రాశాడో, ఎంత కవితాత్మక వాక్యాలు రాశాడో పక్కనపెట్టినా, అచ్చయిన తన పద్నాలుగు కవితలలో పన్నెండు 1975 తర్వాతవే. ఎమర్జెన్సీలో జైలు నిర్బంధంలో ఉండగా రాసిన 'ఖైదు కవిత' విడుదల తర్వాత ఆంధ్రజ్యోతి లోనూ, ఉస్మానియా యూనివర్సిటీ రైటర్స్ సర్కిల్ ప్రచురించిన 'ఈ తరం యుద్ధకవిత' లోనూ ప్రచురితమై విశేషాభిమానాన్ని చూరగొంది.

శ్రీకాకుళ విప్లవోద్యమంలో అమరులన్నా, వారి మీద కవిత్వమన్నా, ముఖ్యంగా పాటలన్నా తాను ఎంతగా కదిలి పోయేవాడో, ఆ పాటలు పాడుతూ ఎంతగా లీనమయ్యేవాడో, శ్రోతలు కన్నీరు పెట్టకుండా ఉండలేని స్థితి ఎలా కల్పించేవాడో, నాకు వందలసార్లు అనుభవమయింది. అది మరెందరి అనుభవమో కూడ.

శ్రీకాకుళ విప్లవోద్యమ నాయకుడు వెంపటాపు సత్యం గురించి విశాఖపట్నం జైలులో ఉండిన పార్వతీపురం కుట్రకేసు ఖైదీ బయ్యా కామేశు రాసిన 'ఓ వెంపటాపు సత్యం/ నిను మరువలేము నిత్యం' పాట, ఆ కేసులోనే నిందితుడైన మరొక విశాఖ జైలు ఖైదీ రాసిన 'వీరనారి నిర్మలకు/ జోహార్లు జోహార్లు' పాట, పార్వతీపురం కుట్రకేసు నిందితుడైన మంచి వెంకటనరసయ్య రాసిన 'ఈ విప్లవాగ్నులు ఎచటివని అడిగితే' పాట ప్రసాద్ నోట వినడం ఒక గొప్ప అనుభవం. ఆ పాటల్లో కొన్నిచోట్ల ఎత్తడం, కొన్నిచోట్ల దించడం, వర్గకసిని రగిలించే చోట పళ్లు కొరికించేలా చేయడం, ఆ అమరుల సున్నిత స్వభావాన్ని చెప్పేచోట కన్నీరై కరిగిపోవడం ప్రసాద్‌కు మాత్రమే సాధ్యం అనిపించేది. ఇక రుద్రజ్వాల రాసిన విరసం పతాక గీతం 'ఎత్తినాం విరసం జెండా' ప్రసాద్ కాక మరెవరు పాడినా అంత తాదాత్మ్యంతో, అంత ఉద్వేగంతో పాడలేరనిపించేంత అద్భుతంగా వందలచోట్ల పాడినవాడాయన. గతంలో చెప్పినట్టుగా 'కవిత్వంపై ఎర్రజెండా' అని ఆధునిక తెలుగు కవిత్వ చరిత్ర మీద మేం తయారు చేసి ప్రదర్శించిన రూపకంలో చాల చోట్ల ప్రసాద్ కూడ భాగమై ఒకరో ఇద్దరో కవుల కవితలు చదివాడు.

చేకూరి రామారావు గారన్నట్టు జానపద సాహిత్యం మీద ప్రసాద్‌కు చాల పట్టు ఉండేది. ఆయన పాడే, ఉదహరించే జానపద గాథలు, గీతాలు లెక్కలేనన్ని. 'కియమ్మన్నదే కోడిపిల్ల' అనే పాట వాటన్నిటిలోకీ అద్భుతమైనది. తనను పట్టుకుని, మెడకోసి, రెక్కలు విరిచి, ఈకలు పీకి, ముక్కలు కోసి, పసుపూ కారం పట్టించి, పొయ్యి మీదికెక్కించి, ఉడికించి, తిని, ఎముకలు పెంటకుప్ప మీద పారేసినదాకా, తన మీద జరిగిన ప్రతి దాడినీ, తనకు

జరిగిన సన్మానంగా, గౌరవంగా కోడి ఎలా చెపుతుందో చిత్రించే సుదీర్ఘమైన హాస్య, విషాద, బీభత్స ప్రధానమైన పాట అది. ప్రసాద్ ఆ పాట పాడుతూ, ఒక్కొక్క వాక్యాన్నీ వివరిస్తున్నప్పుడు అందులో తనతో సమానంగా తన్మయం పొందవలసిందే.

అలా విభిన్న, వైవిధ్య భరిత కవిత్వంలో లీనం కావడం, తన్మయమై, మమేకమై, అదే జీవితంగా భావించడం ప్రసాద్ ఆచరించి చూపిన గొప్ప అనుభవం. నా కవిత్వ ములాఖాత్‌లలో విశాఖ సముద్ర తీరంలో దొరికిన ఆణిముత్యం.

## ఖైదు కవిత

మనసులోని ఆశలు మోసులు వేస్తాయో లేదో పెరట్లో పూలమొక్కనడుగు
ఎదదలోని కోర్కెల కాయలు పండుతాయో లేదో పెరటివెనక పెద్ద చెట్టునడుగు
నీ అలసాలసలాలస హస్తాలు నన్నలరిస్తాయో లేదో ఆకులలో గలగలలాడే
గాలి నడుగు
గుండెల్లోని రాగాలాపన రక్తికడుతుందో లేదో కోకిల కంఠాన్ని అడుగు
ఊహలకు పసిడి రెక్కలు మొలుస్తాయో లేదో కొమ్మకొమ్మకు ఎగిరే పిట్టనడుగు
రసరాజ్యంలో కాంక్షలు, రంజిల్లుతాయో లేదో ఆవులించిన ఆకాశాన్నడుగు
కళ్లల్లో కాంతులు ప్రతిఫలిస్తాయో లేదో లెక్కలేని చుక్కలనడుగు
కారుచీకట్లో కాంతిరాసులు కురిపిస్తావా అని రాబోయే రాకాసుధాకరుణ్ని అడుగు
కోటి కోటి అన్నార్తుల ఎండుడొక్కలు చూస్తున్నావా అని శతకోటి కిరణాల
సూర్యుణ్ని అడుగు
సహారాలో వసంతం వెల్లివిరుస్తుందా అని మలయజ శీతలాన్ని మందానిలాన్ని అడుగు
సైబీరియాలో సామ్యవాదం పునర్జన్మ పొందుతుందా అని శ్రామిక జన
సందోహాన్ని అడుగు
మా ఆశయాల రంగవల్లులు నిలుస్తాయా అని సాగరసైకతంలో రేణువుల్ని అడుగు
మా కలల వీణాగానం వినిపిస్తుందా అని కడలిలోని కెరటాల్ని అడుగు
ఎస్.డి. బర్మన్ కహాహై, కహాహై, కహాహై? అడుగుతున్నాం మనం
జలాదో, జలాదో, జలాదో అంటోంది లంక ఆకాశవాణి
సాగరం మీది మోజు సాహిణిలా సాగుతోంది
మిన్నీటిపై మమత మాధుర్యం చిలుకుతోంది
మేఘమాలికలు మనసులో దోబూచులాడుతున్నాయి
పావురాల మేలిమి నను మాలిమి చేసేస్తోంది

గీత, సంగీత సరస్సులు నన్ను పునీతం చేస్తున్నాయి
నా గుండె గోదావరి
సంతోష సలిలాలు
కలం కాలువల నుంచి
పాళీ బోదెలగుండా
ఆకుమడుల అక్షరాల్లో
ఇంకుతున్నాయి
దిగుడుబావి బందిఖానాలో
ఎడతెగని నీ తలపులే
నాకు నాకధునీ శీకరాలు

# కంటికీ చేతికీ హృదయానికీ అందిన కవిత్వం

అదృష్టమనేదాన్ని ఎంత మాత్రం నమ్మను గాని, నా స్థల కాలాలు నన్నొక స్థితిలో నిలబెట్టి నాచేత కొన్ని పనులు చేయించాయి. మరోమాటల్లో చెప్పాలంటే చరిత్ర ఉధృత ప్రవాహంలో నేనొక గులకరాయి పాత్ర పోషించాను. చరిత్ర చలనంలో నాకొక చిన్న పనిముట్టుగా ఉండే అవకాశం దొరికింది. బహుశా ఆ స్థానమే, ఆ పాత్రే నాకు కవిత్వంతో అపురూపమైన, అసాధారణమైన, అద్భుతమైన ములాఖాత్‌లనెన్నిటినో అందించింది. 'సృజన'లో అచ్చయిన ఏడెనిమిది వందల కవితలూ, అచ్చు కాని వేలాది కవితలూ ముందుగానే చదివే, చర్చించే, ప్రూఫులు దిద్దే అవకాశం వచ్చింది. కవితా సంపుటాలు, సంకలనాలు అమ్మే దుకాణాలు నిర్వహించే అవకాశం వచ్చింది. నలబైకి పైగా కవితా సంపుటాలు, సంకలనాల అచ్చు పనిలో భాగం దొరికింది. కనీసం పది కవిత్వ విమర్శ పుస్తకాల ప్రచురణలో భాగం దొరికింది. ఆ కవిత్వ ములాఖాత్‌లన్నీ అవి జరిగినప్పుడు యాదృచ్ఛికంగానో, చేయక తప్పని పనిగానో, స్థలకాలాల ఒత్తిడితోనో జరిగి ఉండవచ్చు గాని ఇవాళ వెనక్కి తిరిగి చూసుకుంటే అవన్నీ ఎంత గొప్ప అనుభవాలో, నన్నొక వ్యక్తిగా, సాహిత్యకారుడిగా, కవిత్వ ప్రేమికుడుగా తీర్చిదిద్దడంలో వాటిలో ప్రతి ఒక్క అనుభవానికీ ఎంత ప్రాధాన్యత ఉందో తెలిసివస్తున్నది.

నాకు కవిత్వ పఠనంలో, ఆస్వాదనలో, 'సృజన'లో, అను'సృజన'లో తొలి పాఠాలు నేర్పిన 'సృజన' సాహితీమిత్రుల సంప్రదాయం గురించి ఇదివరకు చాలసార్లే రాశాను. ఆ సంప్రదాయం నాకు కవిత్వం గురించి ప్రత్యక్షంగా నేర్పడం ఒక ఎత్తు అయితే, కవిత్వంతో మమేకం కావడానికి అవసరమైన సామాజికతనూ, దృక్పథాన్నీ అందించడం మరొక ఎత్తు.

మూడు నాలుగు దశాబ్దాలు గడిచివచ్చాక ఆ సామాజికతకూ దృక్పథానికీ మౌలిక సారాంశం ఏమిటని ఆలోచించినప్పుడు అది సమానత్వ ఆకాంక్ష అనీ, అన్ని అంతరాల మీద వ్యతిరేకత అనీ, ప్రత్యేకించి శారీరకశ్రమకూ మేధోశ్రమకూ మధ్య అంతరం మీద వ్యతిరేకత అనీ గుర్తిస్తున్నాను. కవిత్వానికి తొలిరూపం శారీరకశ్రమ నుంచి పుట్టిన పాట గనుక, ఇవాళ్టి రూపం మేధో శ్రమ వ్యక్తీకరణ అయిన వచన కవిత గనుక కవిత్వావగాహనలో ఇది కీలకమని అనుకుంటున్నాను.

మన సమాజంలో అన్ని అంతరాలూ రద్దు కావాలనే స్థూలమైన విశాలమైన ప్రజాస్వామిక ఆకాంక్ష సాహితీమిత్రుల తాత్విక దృక్పథం. సాహితీమిత్రులలో అత్యధికులం విద్యావంతులమూ బుద్ధిజీవులమూ గనుక, శారీరకశ్రమకూ మేధోశ్రమకూ మధ్య అంతరాన్ని వీలైనంతవరకు తగ్గించాలనీ, శారీరకశ్రమను చిన్నచూపు చూసే భావజాలం నుంచి బైటపడాలనీ మేం గాఢంగా విశ్వసించాం. ఆ విశ్వాసాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించాం. రచనలు చేసేవాళ్లూ, రచనల ఎంపికలో పాల్గొనేవాళ్లూ, సాహిత్య, రాజకీయ తాత్విక విషయాలు ఆలోచించేవాళ్లూ కూడ ప్రింటింగు ప్రెస్సులో కార్మికుల పక్కన నిలబడి కంపోజింగులో, అచ్చుపనిలో, బైండింగులో సహకరించడం దగ్గరినుంచి, బండచాకిరీ అనిపించే ప్రూఫులు చూడడం దగ్గరినుంచి, పత్రికల కట్టలు మోసుకువచ్చి, ప్యాకింగ్ చేసి, పోస్టాఫీసుకు చేర్చేదాకా అన్ని పనులూ అందరమూ చేశాం.

ప్రూఫ్ రీడింగ్ అంటే అది ప్రస్తుతకాలపు ఆధునిక లేజర్ ప్రింటవుట్ ప్రూఫులు చదివి దిద్దడం కాదు. అప్పుడు కంపోజింగ్ పద్ధతే వేరుగా ఉండేది. కంపోజిటర్లు ఏటవాలు చెక్క కేసు ముందర ఏడెనిమిది గంటలపాటు నిలబడి, ఆ కేసులోని గడుల్లోంచి సీసం అక్షరాలను ఒక్కొక్కటిగా ఏరి స్టిక్కు మీద ఏడెనిమిది పంక్తులుగా కూర్చి, ఆ స్టిక్కు నిండగానే ఒక ప్లేట్ మీద పేర్చేవారు. దాదాపు అటువంటి పది స్టిక్కులతో గాలీ తయారుచేసి, ఆ గాలీ మీద నల్లటి ఇంకులో ముంచిన రోలర్ తిప్పి, దాని మీద కాగితం పరిచి పైన చెక్కపీట పెట్టి సుత్తితో కొట్టేవారు. ఆ సుత్తి దెబ్బ ఎక్కువైతే అక్షరాలు గుచ్చుకుని కాగితం మీద చిల్లులు పడేవి. తక్కువైతే అక్షరం కనబడేది కాదు. ఆ కనబడీ కనబడని, అక్కడక్కడ చిరిగిన గాలీ ప్రూఫును చదివి దిద్దడమే అప్పటి ప్రూఫ్ రీడింగ్. అది కూడ ఇప్పటిలాగ పుస్తకమంతా అయిపోయాక ఒక్కసారి ప్రూఫు చూడడం కాదు. అప్పటి మిషన్లు ట్రెడిల్ అని 'సృజన' సైజులో రెండు పేజీలు మాత్రమే అచ్చువేయగలిగినవి. కాగితాన్ని ఒకవైపు అచ్చువేసి మరొకవైపు తిప్పి పెట్టి అచ్చువేస్తే ఒక్కొక్కసారి నాలుగు పేజీల ఫారం తయారయ్యేది. ఇక ఒక కేసులో సీసం అక్షరాలు అన్నిటికన్నీ వాడినా ఏడెనిమిది పేజీల కన్న ఎక్కువ వచ్చేవి కావు.

అప్పుడు ప్రూఫ్ రీడింగ్ అంటే కంపోజ్ అయింది దిద్ది, అది అచ్చు అయి, ఆ

అక్షరాలన్నీ విప్పి మళ్లీ గడుల్లో పోసుకుని మళ్లీ కంపోజ్ చేసేదాకా ప్రెస్సులోనే ట్రెడిల్ రణగొణధ్వని మధ్య, చేతికీ కాళ్లకూ బట్టలకూ ఇంకులు అంటుతూ, కార్మికులతో మాట్లాడుతూ వాళ్ల ఛలోక్తులలో భాగమవుతూ రోజంతా గడపడం. ఈ పని సాహితీ మిత్రులందరమూ చేశాం. నిజానికి అట్లా 'సృజన'కు ప్రెస్‌లో కంపోజిటర్‌గా ప్రారంభమైన ఎన్ రాజశేఖరం 'సృజన'లో అనేక కవితలూ పాటలూ కథలూ స్కెచ్‌లూ రాశాడు. సాహితీమిత్రులలో భాగమై రచనల ఎంపిక చేశాడు. చర్చల్లో పాల్గొన్నాడు. కార్మికులు కవులుగా మారితే ఎంత శక్తిమంతమైన సృజనకర్తలు కాగలరో అక్షరాలా చూపాడు. నా తొలి కార్మిక గురువులలో ఆయన ఒకరు.

పత్రిక అయిపోయాక కట్టలు కట్టడంలో బైండింగ్ కార్మికులకు సహకరించడంతో పాటు, కట్టలు రిక్షాలో ఎక్కించి, ఆ రిక్షాలో కట్టల మీద కూచుని ఇంటికి తేవడం, ఇంటికి వచ్చాక చందాదారులకు ఒక్కొక్క కాపీ ప్యాక్ చేయడం, వేరువేరు పట్టణాల ఏజెంట్లకు బండిల్స్ కట్టడం, వాటిమీద అడ్రసులు రాయడం, పోస్టేజి స్టాంపులు అతికించడం అన్ని పనులూ సాహితీమిత్రులందరమూ చేసేవాళ్లం. ప్యాకింగ్ పని అయిపోయాక మళ్లీ కట్టలు రిక్షాలో వేసుకుని పోస్టాఫీసుకు వెళ్లడం, రైల్వే పార్సిళ్లు, లారీ పార్సిళ్లు చేయడం, రోజువారీ సర్క్యులేషన్ పనులు, ఉత్తరాలు, ఉత్తరాలకు జవాబులు, అటువంటి శారీరక శ్రమ అవసరమైన పనులన్నీ ఆ సంచికలో రచనలు చేసినవాళ్లూ, కవులుగా రచయితలుగా సాహిత్యవిమర్శకులుగా ప్రసిద్ధులైనవాళ్లూ, వయసుతో నిమిత్తం లేకుండా చేసేవాళ్లు. నిజంగా అదంతా గొప్ప శిక్షణ. 'సృజన'లో ఆ శిక్షణ పొంది ఉండకపోతే నా వ్యక్తిత్వం ఇప్పుడున్నట్టుగా ఉండేది కాదు.

ఈ పనుల్లో భాగమే 'సృజన' పుస్తకాల దుకాణం. మొదటినుంచీ విప్లవ సాహిత్యోద్యమ కేంద్రంగా 'సృజన' దగ్గరికి కవులూ రచయితలూ ఎందరో తమ పుస్తకాలు పంపేవారు. 'సృజన' ప్రచురణలు ఎలాగూ ఉండేవి. రాష్ట్రవ్యాప్తంగా జరిగిన సభలన్నిటిలో, పది సంవత్సరాలకు పైగా కొన్ని డజన్ల చోట్ల నేను ఆ పుస్తకాల దుకాణాలు నడిపాను. అలా నా చేతి మీద ఇతర పుస్తకాలతో పాటు పదుల సంఖ్యలో కవుల కవితా సంపుటాలు, సంకలనాలు అమ్మాను.

అలా 'సృజన' సాహితీమిత్రులలో భాగంగా చదవడం, చర్చించడం, ప్రచురణకు ఎంపిక చేయడం, ప్రూఫులు చూడడం, అమ్మడం వంటి కవిత్వ ములాఖాత్‌లు ఒక ఎత్తు. చాల పుస్తకాల అచ్చుపని 1970ల మధ్య భాగం నుంచి 1985 దాకా వరంగల్‌లో, 1986–90 మధ్య బెజవాడలో, 1990ల తర్వాత హైదరాబాదులో జరిగినప్పుడు ఆ పుస్తకాల ప్రచురణలో ఏదో ఒక బాధ్యత నిర్వహించడం మరొక ఎత్తు. అలా ఎన్నెన్నో కవితా సంపుటాలు, సంకలనాలు నా కంటినీ, చేతినీ మాత్రమే కాదు, హృదయాన్ని స్పృశించాయి. అలా ఆ కవితా సంపుటాలతోనూ, ఆ కవి మిత్రులతోనూ ములాఖాత్ జరిగింది, పెరిగింది.

బహుశా నేను ప్రూఫులు దిద్దిన మొట్టమొదటి కవిత్వ సంపుటం 'విబి గద్దర్ పాటలు' (1973). విరసం మొదటి సాహిత్య పాఠశాలకు ముందు వెలువడిన 'సృజన' సెప్టెంబర్ 1973 సంచికలో గద్దర్ పాటలు పది పన్నెండు అచ్చువేసి, అవే సాహిత్య పాఠశాల నాటికి పుస్తకంగా తెచ్చాం. ఆ తర్వాత చారు మజుందార్ మీద వేరువేరు కవులు రాసిన సంస్మరణ కవితలతో, గీతాలతో వెలువడిన 'చారుమజుందారి' (1974), వరవరరావు కవితా సంపుటం 'ఊరేగింపు' (1974), శివసాగర్ జైలు కవితల సంపుటం 'జనం ఊపిరితో' (1974) ఎమర్జెన్సీకి ముందు నా చెయ్యి ఎంతో కొంత ఉండిన కవిత్వ పుస్తకాలు.

ఎమర్జెన్సీ తర్వాత పుస్తక ప్రచురణలో నా పాత్ర మరింత పెరిగింది. అప్పటి నుంచి 1985 దాకా ఒక దశ. వరంగల్‌లో ఎన్నో పుస్తకాలూ, కవితా సంపుటాలూ అచ్చయ్యాయి. విరసం సంకలనం చేసిన కవితల పాటల సంకలనం 'కిరణాలు' (1977), కెవిఆర్ సంపాదకత్వం వహించిన 'తెలంగాణ పోరాట పాటలు' రెండో భాగం (1977), పరిటాల శ్రీరాములు జీవితం, రచనలతోపాటు, ఆయన మీద సంస్మరణ రచనల సంకలనం 'పోరాటాల శ్రీరాములు' (1978), ఎమర్జెన్సీ తర్వాత గద్దర్ రాసిన పాటల సంకలనం 'విబి గద్దర్ పాటలు' (1978), వంగపండు ప్రసాదరావు నృత్యరూపకం 'భూమి భాగోతం' (1978), బి నరసింగరావు కవితాసంపుటం 'జననం' (1978), వరవరరావు కవితా సంపుటం 'స్వేచ్ఛ' (1978), 'కరీంనగర్ ఆదిలాబాద్ రైతాంగ పోరాట పాటలు' రెండు భాగాలు (1978, 1979), జన్ను చిన్నాలు సంస్మరణ కవితలు, పాటల సంకలనం 'జనం చిన్నాలు' (1979), శ్రీశ్రీ కవితా సంపుటం 'మరోప్రస్థానం' (1980), ఇంద్రవెల్లి మారణకాండ మృతుల సంస్మరణ కవితల సంకలనం 'తుడుం' (1981), ఎన్‌కె కవితాసంపుటం 'రిహార్సల్' (1981), కె రాంమోహన్ రాజు కవితా సంపుటం 'రోడ్డుమీద సూర్యుడు' (1981), శివసాగర్ సమగ్ర కవితా సంపుటం 'ఉద్యమం నెలబాలుడు' (1982), ఎన్‌కె దీర్ఘ కవిత 'లాల్ బనో గులామీ చోడో  బోలో వందేమాతరం' (1982), వరవరరావు దీర్ఘ కవిత 'సముద్రం' (1983), తెలుగు విప్లవ కవిత్వ ఇంగ్లిష్ అనువాదం 'రేజింగ్ స్టార్మ్' (1983), చెరబండరాజు కవితల ఇంగ్లిష్ అనువాదం 'స్వోర్డ్ సాంగ్' (1983), భారతీయ భాషల విప్లవ కవిత్వ ఇంగ్లిష్ అనువాదం 'హేల్ రెవల్యూషన్' (1983), భూపాల్ కవితలు, పాటల సంకలనం 'ఎన్నెలలో' (1984), కె రాంమోహన్ రాజు దీర్ఘకవిత 'వసంతమేఘం' (1985) అన్నిటిలోనూ ఏదో ఒక స్థాయిలో నా చెయ్యి ఉంది.

ప్రచురణ కేంద్రం బెజవాడకు మారి, నేనూ బెజవాడకు మారాక, వరవరరావు కవితా సంపుటాలు 'భవిష్యత్తు చిత్రపటం' (1986), 'ముక్తకంఠం' (1990), కరుణ కవిత్వం, ఇతర రచనల సంకలనం 'తర్జని' (1990), అల్లం నారాయణ కవితాసంపుటం 'జగిత్యాల పల్లె' (1990), ఈశ్వరి సంస్మరణ కవితల, రచనల సంకలనం 'ఈశ్వరికోసం' (1988),

అద్దేపల్లి ప్రభు (గౌతమ్) కవితాసంపుటం 'ఆవాహన' (1992) లలో కూడ నా పాత్ర ఉంది.

అవన్నీ ఒక ఎత్తయితే, విప్లవోద్యమంలో పూర్తికాలం కార్యకర్తలుగా పనిచేస్తూనే మరొకచేత కవిత్వ రచనను సమర్థంగా నిర్వహించిన మిత్రులు అమరులైన తర్వాత, లేదా ఒకటి రెండు సందర్భాలలో వారు సజీవంగా ఉండగానే వారి కవితాసంపుటాలు అచ్చువేయడం ఒక ఉద్విగ్నమైన అనుభవం. గొప్ప కవులు కాగలిగి, గొప్ప వాగ్దానాన్ని ప్రకటించే వ్యక్తీకరణ శక్తితో ఉన్న ఆ కవుల్ని రాజ్యహింస అర్ధాంతరంగా బలిగొన్నప్పుడు, వారి స్మృతినీ స్ఫూర్తినీ సజీవంగా చిరకాలం నిలిపి ఉంచడానికి మిగిలిన తక్కువ ఆధారాలలో కవిత్వం ఒకటి. అలా ఎంఎస్ఆర్ కవితల, రచనల సంపుటం 'కాగడాగా వెలిగిన క్షణం' (1992), వీరన్న కవితాసంపుటం 'భూమి పుత్రుడు' (1996), సిరా పేరుతో రాసిన సి రామచంద్రారెడ్డి రచనలు, కౌముది కవితాసంపుటం 'చనుబాల ధార' (2000), మంజీర కవితాసంపుటం 'మంజీర మూడ్స్', భూమన్న కవితాసంపుటం 'యుద్ధాన్ని కావలించుకునే తరం' (2000), వీరస్వామి కవితాసంపుటం 'ఆరిద్రపురుగు' (2000), పురుషోత్తం, ఆజం సంస్మరణ కవిత్వం 'ప్రశ్నలయాది' (2001), ఆజం కవిత్వం 'హెచ్చరిక' (2001), అమరగిరి అమరుల సంస్మరణ కవిత్వం 'మనిషే సెలయేరు' (2003) అటువంటి కన్నీరూ కసీ నిండిన సంపుటాలు.

నేను ఎంతో కొంత పనిచేసిన మరొక ఉజ్వలమైన కవిత్వ ములాఖాత్ చరిత్రాత్మకమైన 'మార్చ్ – ఝంఝ' పునర్ముద్రణ (1996). వీటిలో 'మార్చ్' 1970 జూలై 4 నాటికి వెలువడి నిషేధానికి గురయింది. కవుల పేర్లు లేకుండా, పెండ్యాల కిషన్ రావు సంపాదకుడుగా ఈ సంకలనం వెలువడింది గనుక కిషన్ రావును రాజద్రోహ నేరం కింద అరెస్టు చేసి కేసు నడిపారు. వరంగల్ సెషన్స్ కోర్టు ఆయనకు ఆరునెలల కఠిన కారాగార శిక్ష విధించింది. హైకోర్టు ఆ శిక్షను ధ్రువపరిచింది. ఇక 'ఝంఝ' 1970 అక్టోబర్‌లో విరసం మొదటి మహాసభలకు కెవి రమణారెడ్డి సంకలన కర్తగా విరసం ప్రచురణగా వెలువడింది. మూడు నెలల్లో రెండు ముద్రణలు జరిగి, నిషేధానికి గురయింది. కెవి రమణారెడ్డి మీద కేసు పెట్టారు. ఈ రెండు పుస్తకాలనూ మళ్లీ సికింద్రాబాదు కుట్రకేసులో కూడ చేర్చారు. సికిందరాబాదు కుట్రకేసు కొట్టివేసిన తర్వాత, మరొక కేసులో తీర్పు ఇస్తూ సుప్రీంకోర్టు ఈ నిషేధాలు చెల్లవని ప్రకటించిన తర్వాత, అవి వెలువడి ఇరవై ఐదు సంవత్సరాలు నిండిన సందర్భంగా రెండు సంకలనాలనూ ఒకే పుస్తకంగా ప్రచురించాం.

ఇక కెవిఆర్ రాసిన 'కవిత్వంలో నిబద్ధత', 'ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర', త్రిపురనేని మధుసూదనరావు రాసిన 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం – శేషేంద్రకు జవాబు', 'కవిసేన మానిఫెస్టో', జెసి రాసిన 'కవిత్వం – గతితార్కికత', గద్దర్ రాసిన 'తరగని గని', 'ప్రతి పాటకూ ఒక కథ ఉందా' లాంటి ఎన్నో కవిత్వ విమర్శ పుస్తకాల ప్రచురణలో కూడ నా చెయ్యి ఉండడం జీవనసాఫల్యమే. కవిత్వసాన్నిహిత్యమే.

# మరికొన్ని అపురూపమైన ములాఖాత్‌లు

అనేకమంది కవుల కవిత్వ పఠనానికీ, ప్రచారానికీ, ప్రచురణకూ నాకు దొరికిన అవకాశాల గురించీ, తద్వారా కలిగిన అపురూపమైన ములాఖాత్‌ల గురించీ గతవారం రాశాను. ఈ వారం మరింత ఆత్మీయమైన ములాఖాత్‌ల గురించి రాయదలిచాను. అవి ముందుమాటల, సమీక్షల, వ్యాసాల, ఉపన్యాసాల రూపంలో వచ్చిన ములాఖాత్‌లు. ఈ ములాఖత్‌లు నాకు ఆయా కవుల కవిత్వాన్ని లోతుగా చదవడానికీ, మరింత విస్తారంగా అర్థం చేసుకోవడానికీ ఉపకరించాయి. కవితాసంపుటాలకు ముందుమాటలు రాయడానికి, కవుల గురించీ, కవిత్వ ధోరణుల గురించీ రాయడానికీ, కవితా సంపుటాలు సమీక్షించడానికీ, కవితా సంపుటాల ఆవిష్కరణ సభల్లోనో, కవిత్వ ఉత్సవాల వేడుకల్లోనో మాట్లాడడానికీ నాకు ఆ అవకాశాలు రావడానికి ఆయా కవులకు నామీద ఉన్న ప్రేమాభిమానాలే కారణం గాని కవిత్వ విశ్లేషణలో నా శక్తి సామర్థ్యాలు కాదు.

ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటుంటే కవిత్వ ప్రశంసకు, విశ్లేషణకు అంతగా పూనుకున్న నా దుస్సాహసాన్ని చూసి నాకే ఆశ్చర్యం కలుగుతున్నది.

అంతకుముందు డిగ్రీ విద్యార్థిగా, కాలేజి మాగజైన్ సంపాదకుడిగా అప్పుడే మరణించిన కృష్ణశాస్త్రి మీద రాసిన వ్యాసాన్ని వదిలేస్తే, చాలమంది లాగే నేను కూడ శ్రీశ్రీ కవిత్వ పలవరింపుతో, వివరణతో, విశ్లేషణతో కవిత్వ విమర్శ లాంటిది మొదలు పెట్టినట్టున్నాను. శ్రీశ్రీ మరణించగానే 'మహాప్రస్థాన ఖడ్గసృష్టే మరోప్రస్థానం' అని శ్రీశ్రీ కవిత్వంలో నిరంతర ధారగా ఉండిన దృక్పథం గురించి ఆంధ్రభూమిలో రాసిన వ్యాసంతో శ్రీశ్రీ మీద నా వ్యాసాలు మొదలయ్యాయి. శతజయంతి నాటికి రాసిన ఏడు వ్యాసాలు 'శ్రీశ్రీ అన్వేషణ' పేరుతో శ్రీశ్రీ సాహిత్యనిధి, విజయవాడ ప్రచురణగా వెలువడింది (2010). ఆ తర్వాత కూడ మరికొన్ని వ్యాసాలు రాసి ఉంటాను. శ్రీశ్రీ కవిత్వం మీద కొన్ని డజన్ల సభల్లో మాట్లాడి ఉంటాను. శ్రీశ్రీ కవిత్వంలో ఎంత అన్వేషించినా ఇంకా మిగిలిపోయేదీ, ప్రతి పఠనంలోనూ కొత్తగా స్ఫురించేదీ ఏదో ఉంటుందని నా అనుభవం. ప్రతి ములాఖాత్ కూడ కొత్త ములాఖాత్ గా కనిపించే అపురూపమైన కవులలో శ్రీశ్రీ ఒకరు. అలా అనేకసార్లు శ్రీశ్రీని చదివే, కొత్త వెలుగులు చూసే అవకాశం పత్రికల వల్లనో, సభల వల్లనో కలిగింది.

ఇరవై ఐదేళ్లుగా ప్రపంచీకరణ మీద, హిందుత్వ మీద, మారుతున్న విలువల మీద ఉపన్యాసం ఇస్తున్నప్పుడు అనివార్యంగా గురజాడ దేశభక్తి గాని, కన్యాశుల్కం గాని ప్రస్తావనకు వచ్చేవి. అలా గురజాడ కవితలను, ప్రత్యేకించి దేశభక్తిని ఎన్నోసార్లు సూక్ష్మంగా, రాజకీయార్థిక నేపథ్యంతో చదివే అవకాశం వచ్చింది. ఆ ఆలోచనలన్నీ పోగై, గురజాడ నూట యాబయవ జయంతి సందర్భంగా విజయనగరం సాహితీ సాంస్కృతిక సంస్థ 'వెలుగు' నిర్వహించిన

సభలో దేశభక్తి మీద వివరమైన ఉపన్యాసంగా మారాయి. 'గురజాడ దేశభక్తి – ఒక శతాబ్ది కిందటి ముందుచూపు' పేరుతో అది వెలుగు ప్రచురణ (2012)గా వెలువడింది.

తెలుగు సాహిత్యం గురించి ఇంగ్లిష్‌లో, ఇతర భారతీయ భాషల్లో రావలసినంత రావడం లేదని, కనీసం ఇంగ్లిష్‌లో రాస్తే నలుగురికీ తెలుస్తుందని అనుకుని 1990ల మొదట్లో నాలుగైదు వ్యాసాలు రాశాను. వాటిలో తెలుగులో అజ్ఞాతకవుల కవిత్వం (Poetry from Underground) మీద The Economic Times లో ఒక పెద్ద వ్యాసం రాశాను. అలాగే Comprehensive History of Andhra Pradesh బహు సంపుటాల చరిత్ర రచనలో భాగంగా సంపాదకులు వకుళాభరణం రామకృష్ణ గారు నాచేత దిగంబర కవితోద్యమం మీద, విప్లవ కవితోద్యమం మీద పెద్ద వ్యాసాలు రాయించారు. ఇదివరకే ప్రస్తావించిన శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ సదస్సులో సమర్పించిన, భారతిలో అచ్చయిన 'చారిత్రక అవసరంగా విప్లవకవిత' తో పాటు, తెలుగు కవిత్వం మీదా, విప్లవ కవిత్వం మీదా కనీసం డజనుకు పైగా పెద్ద వ్యాసాలు రాసి ఉంటాను. అలాగే ఇతర భాషల కవులు మరణించినప్పుడో, ప్రత్యేక సందర్భాలలోనో ఏవైనా పత్రికలు అడిగినప్పుడో ఎందరో కవుల మీద పరిచయ వ్యాసాలు రాశాను. ఆంధ్రపత్రికలో నిర్వహించిన 'కడలి తరగ' శీర్షికలో పుట్టపర్తి నారాయణాచార్యులు, నండూరి సుబ్బారావు, శ్రీశ్రీ, గద్దర్, శివారెడ్డి, విమల, ట్రేసీ చాప్‌మన్ వంటి కవుల మీద రాశాను.

అలాగే పుస్తక సమీక్షల రూపంలోనో, ప్రత్యేక సంచికల వ్యాసాల రూపంలోనో శ్రీశ్రీ, దాశరథి, కాళోజీ, శివారెడ్డి, శీలా వీర్రాజు, దేవిప్రియ, వరవరరావు, త్రిపురనేని శ్రీనివాస్, వసీరా, రుద్రజ్వాల, నారాయణస్వామి, విఆర్ విద్యార్థి, అలిశెట్టి ప్రభాకర్ వంటి ఎందరో కవుల గురించి రాశాను. 'చైతన్యకవిత', 'అలావా', 'ఎడపాయలు' వంటి సంకలనాలను సమీక్షించాను. శివారెడ్డి కవిత్వ సమీక్షగా ఏర్పాటయిన ప్రత్యేక సదస్సులో మాట్లాడడంతో పాటు, ఎన్నో కవితా సంపుటాల ఆవిష్కరణ సభల్లో, కవిత్వ వర్క్‌షాపుల్లో మాట్లాడాను. ఈ పనులన్నిటికీ ఆయా కవులను, కవిత్వాన్ని మళ్లీ మళ్లీ చదవవలసి వచ్చేది. కొత్త ములాఖాత్‌లకు అవకాశం వచ్చేది.

ఇవన్నీ ఒక ఎత్తయితే, దాదాపు పదిహేను సంవత్సరాలుగా ఎందరో కవిమిత్రుల కవితా సంపుటాలకు ముందుమాటలు రాయడం మరొక ఎత్తు. తెలుగులో ముందుమాటకు చాల చరిత్ర ఉంది. పాఠకులకు ఆ కవిని పరిచయం చేసి, నేపథ్యం సమకూర్చి, కొంత విమర్శనాత్మక ప్రోత్సాహాన్ని ఇచ్చేదిగా ముందుమాట లేదా పీఠికకు సాహిత్యంలో గణనీయమైన పాత్ర ఉంది. ప్రాచీన కావ్యాల పరిష్కర్తలుగా పండితులెందరో అటువంటి సవివరమైన, సమగ్రమైన, విమర్శనాత్మకమైన పీఠికలు రాశారు. అది గతించిపోయిన కవుల విషయంలో కుదిరిందేమో గాని, ఆధునిక యుగంలో ఈ పద్ధతి కాస్త మారింది. సమకాలీన, వర్ధమాన కవుల సంపుటాలకు లబ్ధప్రతిష్ఠులైన కవులు, విమర్శకులు ఇచ్చే ప్రోత్సాహంగా, ధ్రువీకరణ

పత్రం (యోగ్యతా పత్రం) గా ముందుమాటకు అర్థం మారింది. తర్వాత కాలంలో కవుల సున్నితత్వం వల్ల, కవుల మధ్య సంబంధాల వల్ల మరింత మారి, కేవలం ప్రశంస, నాలుగు మంచి మాటలు, కొన్నిసార్లు అతిశయోక్తులు చెప్పడంగా మారింది. మొదటిసారి కవితాసంపుటం తెచ్చుకునే కవి విషయంలోనైనా, ఇదివరకే కవులుగా స్థిరపడినవారి విషయంలోనైనా ముందుమాటలో కటువైన, తీవ్రమైన విమర్శ ఉండడం సరైనదేమీ కాదు. అట్లని ఆ కవిత్వంలో ఉన్న, కనిపిస్తున్న, పాఠకులకు కూడ కనిపించే లోపాలను పక్కనపెట్టి ప్రశంస మాత్రమే రాయడం కూడ ఆ పీఠికాకర్తలకు ఉచితం కాదు. అంటే రెండు కొసలలో చేయగూడని పనుల మధ్య ఒక సమతూకాన్ని సాధించి ముందుమాట రాయడం కత్తిమీద సాము, తాడు మీద నడక.

నేను లబ్ధప్రతిష్ఠుడినైన కవినీ కాను, అంతగా కవిత్వ విమర్శకుడినీ కాను గాని ముందుమాటలు రాయవలసి వచ్చింది. కవిమిత్రులు కొందరు నామీద అభిమానంతో తమ సంపుటంలో నా మాటలు నాలుగు ఉండాలని ఆదేశించినప్పుడు, ఆ ఆదేశం తలదాల్చక తప్పలేదు.

శ్రీకాకుళం జిల్లాలో సుబ్బారావు పాణిగ్రాహి, తామాడ గణపతి ఉండిన చరిత్రాత్మకమైన గ్రామం బొడ్డపాడుకు పొరుగున ఉన్న అక్కుపల్లిలో విప్లవ రచయితల సంఘం సభ్యుడిగా ఉంటూ, ఎంతో నిర్బంధాన్ని అనుభవించి, అనారోగ్యంతో 2001లో మరణించిన మోహన్ కవిత్వాన్నీ, ఇతర రచనా శకలాలనూ 'ఉద్దానం పువ్వు' (2002) అనే సంకలనంగా తెచ్చినప్పుడు ఆ కవిత్వం గురించీ, మోహన్ గురించీ రాసిన ముందుమాటతో నా కవిత్వ ముందుమాటలు మొదలయ్యాయి. ఆయన సజీవంగా ఉండి ఉంటే పుస్తకం ఎప్పుడు వేసుకునేవాడో, అలా పుస్తకం వేసుకోదలచుకున్నప్పుడు ఎవరిని ముందుమాట రాయమని అడిగేవాడో తెలియదు గాని ఆ పుస్తకం ప్రచురించిన మిత్రులు, విరసం శ్రీకాకుళం యూనిట్, మోహన్‌తో నాకు ఉండిన సాన్నిహిత్యం వల్ల నన్ను ముందుమాట రాయమని అడిగారు.

ఇక ఆ తర్వాత చాల కవితా సంపుటాలకు ముందుమాటలు రాయవలసి వచ్చింది. ఎస్ రఘు నానీల సంపుటం 'జీవనలిపి' (2004), జూలూరు గౌరీశంకర్ దీర్ఘకవిత 'మొగిలిచర్ల' (2004), పరిమళ్ మొదటి కవితా సంపుటం 'మట్టిగంప' (2005), నారాయణస్వామి రెండో కవితా సంపుటం 'సందుక' (2006), పి మోహన్ మొదటి కవితా సంపుటం 'కిటికీ పిట్ట' (2006), పలమనేరు బాలాజీ మొదటి కవితా సంపుటం 'మాటల్లేని వేళ' (2007), వేణు సంకోజు మూడో కవితా సంపుటం 'నేలకల' (2008), అఫ్సర్ మూడో కవితా సంపుటం 'ఊరి చివర' (2009), వంశీకృష్ణ ఐదో కవితా సంపుటి 'ఒకదేశం రెండు పద ప్రయోగాలు' (2011) ఎన్వీ మొదటి కవితా సంపుటి 'ఆర్ద్ర సంద్రం' (2011), దేవిప్రియ కవితాశీర్షిక 'రన్నింగ్ కామెంటరీ' (2013), కాసుల లింగారెడ్డి కవితా సంపుటి 'ఇదుపుగాయిదం' (2013), లోచన్ తెలంగాణ ఉద్యమ కవితల సంపుటి 'ఆదాబ్ హైదరాబాద్' (2013), శాఖమూరి

రవి రెండో కవితా సంపుటి 'పాదముద్రలు' (2014) లకు ముందుమాటలు రాశాను. 2002 లో 'కాగితప్పులి కళ్లలో భయం' కవితా సంకలనానికి సంపాదకుడుగా ఉండి ముందుమాట రాశాను.

ఇక్కడే అచ్చుకాని రెండు ముందుమాటల గురించి కూడ చెప్పాలి. చిరకాల కవిమిత్రులొకరు ప్రపంచీకరణ వ్యతిరేక కవిత్వం రాసి, దానికి నా ముందుమాట రాయించుకుని, కారణం తెలియదు గాని, అది అచ్చువేయకుండానే సంపుటం వెలువరించారు. అలాగే అత్యంత ఆత్మీయుడైన, అమరుడైన ఒక కవి సమగ్ర సంకలనానికి ముందుమాట రాశాక, ప్రచురణకర్తలు మారినందువల్ల, ఆ ముందుమాట లేకుండా ఆ సంకలనం అచ్చయింది.

ఈ ముందుమాటలు ఆ సంపుటాల్లోని కవిత్వాస్వాదన, ప్రశంస, వివరణ, విశ్లేషణ ఎంత చేశాయో నేను చెప్పలేను గాని, వాటిలో ప్రతి ఒక్కటీ ఆ కవులకు నా మీద ఉండిన ప్రేమాభిమానాలకు, నమ్మకానికి చిహ్నమని నాకు తెలుసు. వాటిలో ప్రతి ఒక్కటీ ఆ కవులను నిశితంగా, మళ్లీ మళ్లీ చదవడానికి, ఆ కవిత్వం గురించి ఆలోచించడానికి, రాయడానికి నాకు అవకాశం ఇచ్చి అపురూపమైన కవిత్వ ములాఖాత్‌లను ఇచ్చాయి.

వల్లంపాటి వెంకటసుబ్బయ్య 'కథాశిల్పం', 'నవలాశిల్పం', 'విమర్శాశిల్పం' అని మూడు పుస్తకాలు రాసినట్టు, కథ, నవల, కవిత్వం, విమర్శ రంగాలలో నేను రాసిన సాహిత్య విమర్శను నాలుగు పుస్తకాలుగా తేవాలని ఒక కల ఉండేది. 'కథాసందర్భం' (2000), 'నవలాసమయం' (2006) తెచ్చాను గాని కవిత్వం మీద, విమర్శ మీద రాసినవి మరీ ఎక్కువైపోయి, ఆర్థిక కారణాలవల్ల కొంత, అసలు సాహిత్యానికే దూరమయ్యానేమోనని అనుమానంతో కొంత అవి పుస్తకంగా తేవడం మానేశాను. ఇప్పుడు మళ్లీ ఈ ములాఖాత్‌లను పంచుకుంటుంటే ఇవన్నీ ఒక్కదగ్గరికి చేరితే బాగుండును కదా అనిపిస్తున్నది.

ముగింపుగా, 'సందుక', 'ఊరిచివర' లకు నా ముందుమాటల్లోంచి కొన్ని వాక్యాలు పంచుకోవాలనిపిస్తున్నది:

'సందుక' కవిత్వంలో చరిత్ర ఉంది. ఆ చరిత్ర గురించి స్థలకాలాలలో దూరం జరిగి, నిర్మమంగా వేసిన అంచనాలున్నాయి. ఆ చరిత్రలో అప్పుడు ప్రత్యక్ష భాగస్వామ్యంలో వెలువడిన ఉద్వేగాలున్నాయి. ఆ చరిత్ర కొనసాగుతున్నవేళ పరోక్ష భాగస్వామిగానూ, సాక్షిగానూ, వ్యాఖ్యాతగానూ ప్రకటిస్తున్న ఉద్వేగాలున్నాయి. చరిత్ర నిరంతరాయత మీద విశ్వాసం ఉన్నందువల్ల వర్తమానం గురించి మాట్లాడుతున్న కవితలో గతమూ, గతం గురించి మాట్లాడుతున్న కవితలో వర్తమానమూ పడుగూపేకలా అల్లుకుని సాగుతాయి. ఉత్తిదారాలుగా కనిపించే ఈ పడుగూపేకా రేపు కలనేత వస్త్రమవుతుందనే భవిష్యదాశా ఉంటుంది.

'సందుక' కవిత్వం నిండా జ్ఞాపకం ఉంది. అది కేవలం పురావస్తువు లాంటి

స్థిరబిందువు కాదు. అది నెత్తురూ కన్నీళ్లూ నిండిన ఉద్వేగం. రక్తమజ్జాస్థిగతమైన ముద్ర. దానిలో ఉత్తేజ కారకమైన అంశమూ ఉంది. ప్రస్తుతంతో పోలికా ఉంది. ఆ నాటి ఆత్మీయతలూ ఉన్నాయి. ఆనాటి చేదూ ఉంది. ఇవాళ్టి అస్తిత్వానికి మూలం అదేననే స్పృహా ఉంది. ఆనాటినుంచి ఈనాటివరకు నడిచి వచ్చిన దారిలోని వైవిధ్యమూ వైశాల్యమూ ఆ జ్ఞాపకం మీద పరిచిన కొత్త వెలుగులు ఉన్నాయి.

అందువల్ల విశ్లేషణకోసం ఇది చరిత్ర, ఇది జ్ఞాపకం అని చెప్పవలసిందే కాని వాస్తవంలో వాటిని విడదీయడం సాధ్యం కాదు. జీవితం, విప్లవం, గతం, సమాజం, కుటుంబం, వ్యక్తిగతం, అధ్యయనం, పరిశీలన, మానవసంబంధాలు అన్నీ కలగలిసిన చరిత్ర, జ్ఞాపకం, చారిత్రక జ్ఞాపకం కవిత్వంలోకి అనువదిస్తే 'సందుక' అయింది. పాశ్చాత్య సాహిత్య విమర్శకులు చెప్పిన మతిమరపు కూడ ఇందులో అంతర్లీనంగా ఇమిడిపోయింది. ఆ మతిమరపు గురించిన ఒకింత ఆత్మనింద అక్కడక్కడా తొంగి చూస్తుంది."

"'మృగశిరను మింగలేక
బయటికి కక్కలేక
కడుపులో పొగులుతున్న దుంపనేల
నీటి చినుకు పడంగానే ముందు పొగలు చిమ్ముతుంది
తరువాత
మళ్లీ గతాన్ని తవ్వి తోడేసి పచ్చి వగరు వాసనవుతుంది' అన్నచోట జాగ్రత్తగా చదవండి. అవి మాటలు మాత్రమే కాదు, చేయి తిరిగిన కవి పదచిత్రాలను నిర్మించి ఒక సంపూర్ణ దృశ్యాన్ని సృష్టించడం మాత్రమే కాదు. వానకాలం తొలిరోజుల్లో, చినుకులలో తడుస్తూ మట్టివాసన పీల్చగలిగిన, మట్టి చిమ్మే ఆవిర్లను చూడగలిగిన పల్లెటూరి పిల్లలకు తప్ప మరొకరికి ఈ వర్ణమయ, వాసనామయ, శబ్దమయ ప్రపంచం అనుభవానికి రాదు. ప్రకృతి నుంచీ, సమాజం నుంచీ, మానవ జీవితం నుంచీ ఇటువంటి ఆర్ద్రమైన, విశ్వసనీయమైన, సాధికారికమైన ప్రతీకలను ఎన్నుకోవడం, విభిన్న ప్రతీకలను ఒక రసాయనిక ప్రక్రియలో మిళితం చేసి కొత్త సృష్టి చేయడం అఫ్సర్ సాధించిన విజయం."

# దేశదేశాల కవిత్వంతో ములాఖాత్

నా కవిత్వ ములాఖాత్‌లలో తెలుగు కవిత్వ ములాఖాత్‌లు మాత్రమే కాక, అనేకానేక ఇతర భాషల కవిత్వాల ములాఖాత్‌లు ప్రధానంగా ఇంగ్లిష్ నుంచీ, కొంతవరకు హిందీ నుంచీ ఎలా సంభవించాయో ఇంతకుముందు ఆయా సందర్భాలలో ప్రస్తావనవశాత్తూ

చెప్పాను. ఇక ఈ శీర్షిక నాలుగైదు వారాలలో ముగింపుకు వస్తున్న సందర్భంగా మొత్తంగా దేశదేశాల కవిత్వంతో నా ములాఖాత్‌ల గురించి మరిన్ని మాటలు చెప్పాలి.

ముప్పై ఏళ్లకు పైగా చేస్తున్న కవితానువాదాలలో రెండు మూడు వందల కవితలైనా అనువాదం చేసి ఉంటాను గాని వాటిలో కొన్ని అసలు అచ్చు కానివీ ఉన్నాయి. పత్రికల్లో అచ్చయినవి కూడ అన్నీ నాదగ్గర లేవు. ఆర్థిక కారణాల వల్ల కొంత, ఆ పోడు వ్యవసాయాన్ని స్థిర వ్యవసాయంగా మార్చడం ఎందుకని కొంత వాటిలో మావో కవితలు మినహా మిగిలినవాటిని ఒక సంకలనంగానూ తేలేకపోయాను. ఇప్పుడు పరిమాణం రీత్యా కూడ అవన్నీ ఒక్కచోట సంకలనం చేయడం అసాధ్యం, కష్టసాధ్యం.

వెనక్కి తిరిగి చూసుకుంటుంటే ఆ అనువాదాలన్నీ నాలుగు రకాలుగా కనబడుతున్నాయి. ఒకటి, 'సృజన' కోసమో, 'అరుణతార' కోసమో, ఆంధ్రపత్రిక సాహిత్య పేజీ కోసమో తప్పనిసరి అవసరమై అనువదించిన కవితలు. రెండు, ఎక్కడైనా చదివి, విని, ఆ కవితతో ప్రేమలో పడి, వారాలూ నెలలూ ఏళ్లూ దానితో జీవించి చేసిన అనువాదాలు. మూడు, ఒక కవిత నచ్చగానే అప్పటికప్పుడు, కొన్నిసార్లు నిమిషాల్లో, కొన్నిసార్లు ఒకటి రెండు రోజుల్లో, చేసిన సద్యో అనువాదాలు. నాలుగు, ఆ కవిత వస్తువు వల్ల, శైలి వల్ల తెలుగు కవితాభిమానులకు చేరవలసి ఉన్నదని భావించి చేసిన అనువాదాలు. అయితే ఈ విభజన స్థూలమైనది మాత్రమే. చాలసార్లు అటూ ఇటూ అయినవి కూడ ఉండి ఉంటాయి. మొత్తం మీద నాకు ఎంతమాత్రం నచ్చకుండా, నాలో నేను గున్గునాయించుకోకుండా, ఒక్కొక్క సమానార్థక శబ్దం కోసం తపన పడకుండా చేసిన అనువాదం ఒక్కటి కూడ లేదు.

సాధారణంగా చదివే కవిత్వంలో అత్యధికభాగం నాకు నచ్చుతుంది. నచ్చడానికి ఎన్నో కారణాలుండవచ్చు, ఏదో ఒకేఒక్క కారణమూ ఉండవచ్చు. మొత్తంగా కవిత ఇచ్చే అనుభూతి కావచ్చు, కవితలో దృశ్యాలు కావచ్చు, చదివినప్పుడల్లా పొరలు పొరలుగా విప్పుకునే అర్థాలు కావచ్చు, కవి స్వరం లేదా కవిత స్వరం కావచ్చు, పదసంయోజనం కావచ్చు, లయాత్మకత కావచ్చు, అవగాహన కావచ్చు, నవ్యత కావచ్చు, ఊహాశాలితలోని అద్భుతత్వం కావచ్చు... ఏదో ఒక అంశంతో నాకు దాదాపు ప్రతి కవితా ఒక ఆత్మీయమైన ములాఖాత్ గానే ఉంటుంది. అయితే వీటిలో ఏదో ఒకదాన్ని అపురూపంగా సృజించడంలో విజయం సాధించే కవులే ఓపిక లేకనో, సమయం లేకనో, సాధన లేకనో, చిత్రిక పట్టకనో మిగిలిన అంశాల్లో అంత జాగ్రత్తగా ఉండరు. అజాగ్రత్తగా వదులుతారు. అన్ని అంశాలనూ జాగ్రత్తగా చెక్కినప్పుడే కవిత అపురూపమైన శిల్పంలా తయారవుతుంది.

అలా ఏదో ఒక అంశం నన్ను కవితవైపు ఆకర్షిస్తుంది గనుక చాలసార్లు, మిగిలిన అంశాలను పక్కనపెట్టి దాన్ని తెలుగు పాఠకులకు చేరిస్తే బాగుండుననుకుంటాను. నేను అనువాదాలు మొదలుపెట్టిన 1980ల మొదటినుంచీ 1992 దాకా 'సృజన' తోనూ, ఈ

మధ్యలో 1989–90 ఆంధ్రపత్రిక 'సాహితి' పేజీ తోనూ, 2009 దాకా 'అరుణతార' తోనూ నాకు ఉండిన సంబంధం వల్ల నా అనువాదాలు చాలవరకు ఆ పత్రికల తక్షణ అవసరాల కోసమే చేయవలసి వచ్చింది. ప్రపంచభాషల, భారతీయ భాషల విప్లవ కవిత్వం సంకలనాల్లోనో, పత్రికల్లోనో దొరికేది గనుక ఆ కవితలు చదవగానే అవి 'సృజన'లోనో 'అరుణతార'లోనో వస్తే బాగుంటుందని అనుకోవడమూ వెంటనే అనువాదం చేయడమూ వెంటనే అవి ప్రచురణ కావడమూ జరిగేది. ఒక్కోసారి 'సృజన' సాహితీమిత్రులో, ఇతర మిత్రులో తాము చదివిన, తెలుగులోకి రావలసిన కవిత్వం గురించి సూచించేవారు. ఆంధ్రపత్రికలోనైతే 'సాహితి'లో ప్రతివారం 'దేశదేశాల కవిత' అనే శీర్షిక నిర్వహించాను గనుక అవి చాలసార్లు నేనే వెతుక్కుని అనువాదం చేయవలసి వచ్చేది. అక్కడ కవిత నిడివి ఎక్కువ ఉండగూడదు. తప్పనిసరిగా విప్లవ కవిత్వమే కానక్కరలేదు. కవిత్వ ప్రమాణాలను బట్టి, తెలుగు పాఠకులకు అది అందవలసిన అవసరం బట్టి ఏ కవిత అనువదించాలో నిర్ణయమయ్యేది. ఈ అనుభవాల వల్ల నాకు రెండు రకాల కవిత్వానువాదాలూ, ఆలోచనతో, అవసరం కొద్దీ, భావాల ఐక్యతతో చేసే అనువాదాలూ, తక్షణమే, అభివ్యక్తికోసం చేసే అనువాదాలూ అలవాటయ్యాయి.

'సృజన', 'అరుణతార'ల్లో మలయాళీ, బెంగాలీ, పంజాబీ, విదేశ భాషల విప్లవ కవిత్వ అనువాదాలూ, ఆంధ్రపత్రికలో ఎక్కువగా భారతీయ భాషల కవిత్వానువాదాలూ అలా చేశాను. ఆంధ్రపత్రిక రోజుల్లో ఒకసారి సంపాదకులు జి శ్రీరామమూర్తి గారు టెలిగ్రాఫ్ ఆదివారం అనుబంధంలో వచ్చిన మరాఠీ కవి కుసుమాగ్రజ్ కవిత ఇచ్చి తెలుగు చేసి వేయమన్నారు. అది పది పన్నెండు పంక్తుల కవితే గాని చాల గొప్ప, కదిలించే కవిత. వెంటనే అనువాదం చేసి ఆ వారం 'సాహితి'లో వేశాను గాని అది నాదగ్గర మిగలలేదు. అలాగే చైనా కవిత్వం పుస్తకం కేరళలో త్రిస్సూరులో కొనుక్కుని తిరుగుప్రయాణంలో రైల్లో చదివి వెంటనే అనువాదం చేసిన కవిత గురించి ఇదివరకు చెప్పాను. నాజిం హిక్మత్‌నూ, వాల్ట్ విట్మన్‌నూ, మహమూద్ దర్వీష్‌నూ, మాయా ఏంజెలోనూ, మార్గె పియర్సీనీ, మరెంతో మందినీ అలా వెంటనే చేయకుండా ఉండలేకపోయాను. ఇటీవలి కాలంలో ఫేస్ బుక్ మీద కనబడి వెంటనే తెలుగు చేయకతప్పదని ఒత్తిడి చేసిన ఇంగ్లిష్ కవితలు కొన్ని ఉన్నాయి. గాజా దుర్మార్గాల మీద ముసాబ్ ఇక్బాల్ రాసిన కవిత, యాకూబ్ మెమన్ ఉరిశిక్ష మీద రోహిత్ కవిత అటువంటివి. కవిసంగమం సమావేశం జరుగుతున్నప్పుడు అక్కడ పెట్టిన పుస్తకాల దుకాణంలో పాత ఇండియన్ లిటరేచర్ సంచిక ఒకటి కనబడి అందులో ఒక కవిత అప్పటికప్పుడు అనువాదం చేయించుకుని, నా ఉపన్యాసంలో భాగమయింది.

అంటే బహుశా ఆయా కవితలన్నీ తెలుగు పాఠకులకు చేరవలసి ఉన్నాయి. నేను ఒక సాధనంగా, మాధ్యమంగా మాత్రమే ఉన్నాను.

ముందే చెప్పినట్టు ఇష్టపడకపోతే నేనేదీ అనువదించలేదు గాని, ఆ ఇష్టాలన్నిటిలోకీ మరింత ఇష్టమైన రెండు కవితల గురించి చెప్పాలి.

మొదటిది పాబ్లో నెరూడా రాసిన 'టునైట్ ఐ కెన్ రైట్'. ఆయన తన పందొమ్మిదో ఏట 'ట్వెంటీ లవ్ పొయెమ్స్ అండ్ ఎ సాంగ్ ఆఫ్ డిస్పేర్' అనే సంపుటం ప్రచురించాడని కవితాభిమానులకు తెలుసు. పెంగ్విన్స్ వేసిన పాబ్లో నెరూడా సెలెక్టెడ్ పొయెమ్స్ స్పానిష్ – ఇంగ్లిష్ ద్విభాషా సంపుటంలో ఆ విషాదగీతం ఉంది. అది నేను 1979లోనో, 80లోనో చదివాను. నోటికి అప్పగించడం, ఉద్వేగభరితంగా చదవడం, స్పానిష్ వచ్చినవారితో మూల కవిత చదివి వినిపించుకోవడం, నెరూడా గొంతులో ఆ కవిత ఉందా అని వెతకడం... అలా ఆ కవిత నా రక్తమజ్జాస్థిగతం అయిపోయింది. దాన్ని తెలుగులోకి తేవాలని ముప్పై సంవత్సరాలుగా అనుకుంటూనే అంత లలితమైన ఊహలు, పదాలు సాధ్యం కావని అలా వాయిదా వేస్తూ వచ్చాను. చివరికి 'This is the last pain she makes me suffer/ And these are the last verses I write for her' అనే ప్రగాఢమైన విషాద అనుభవం నాజీవితంలో ఎదుర్కొన్న క్షణాన ఆ అనువాదం చేయగలిగాను. ఒక ప్రసిద్ధ తెలుగు కవిత్వ పత్రిక దగ్గర అది ఐదు సంవత్సరాలుగా ప్రచురణకు నిరీక్షిస్తూ ఉంది. అది కింద ఇచ్చాను, చూడండి.

ఇక మరొక కవిత, దేవీప్రసాద్ మిశ్రా అనే హిందీ కవి 1991లో రాసిన 'ముసల్మాన్'. బహుశా 1993 జనవరి 26న అనుకుంటాను నవభారత్ టైమ్స్ ఆదివారం అనుబంధం మొదటి పేజీ అంతా రెండు సుదీర్ఘ కవితలు మాత్రమే అచ్చువేశారు. 'భారత గణతంత్ర రాజ్యం ముందర ఇవాళ ఉన్న రెండు పెద్ద సవాళ్లకు రెండు కవితాత్మక వ్యక్తీకరణలు ఇవి' అనే క్లుప్తమైన వివరణతో వరవరరావు 'డరఘావు', దేవీప్రసాద్ మిశ్రా 'ముసల్మాన్' ప్రచురించారు. ఆ కవిత చదవగానే అనువాదం చేయాలనిపించింది. అది 'అరుణతార', జూన్ – జూలై 1993 సంచికలో అచ్చయింది. నా ముప్పై ఐదు సంవత్సరాల కవిత్వానువాదాలలో మొట్టమొదట చెప్పగలిగిన కవిత అదేననుకుంటాను. చూడండి:

## రాయగలను నేనీరాత్రి

– పాబ్లో నెరూడా

రాయగలను నేనీరాత్రి ఒక చేదుపాట
పాడగలను నేనీ కరాళరాత్రి శోకగీతి

ఇవాళ నా అక్షరాలనిండా తొణికిసలాడే కన్నీళ్లు
ఏమి రాస్తానా? వినండి ఉదాహరణకు:
మిలమిల మెరిసే చుక్కలు నిండిన నింగి

అనంత దూరాన నీలినీలి వెలుగుల తారలు
ఈ చీకటి ఆకాశపు గాలి గిరికీలు కొడుతూ పాడుతున్న పాట

రాయగలను నేనీరాత్రి ఒక చేదుపాట
నేనామెను ప్రేమించాను, కొన్నిసార్లు నన్నూ ఆమె ప్రేమించింది

ఇటువంటి అనేకానేక రాత్రులలో నా కౌగిలిలో ఆమె కౌగిలిలో నేను
అనంతాకాశపు కప్పుకింద ఆమెపై కురిసిన ముద్దులేముద్దులు

ఆమె నన్ను ప్రేమించింది, కొన్నిసార్లు నేనూ ఆమెను ప్రేమించాను
అయినా ఆ అద్భుత నిశ్చల నేత్రాలను ప్రేమించకుండా ఎవడుండగలడు

పాడగలను నేనీరాత్రి ఒక చేదుపాట
ఆమె నాతో లేదని చెప్పే పాట
నేనామెను కోల్పోయానని చూపే పాట

అసలే గడ్డకట్టిన చీకటి రాత్రి
ఆమె లేక మరింత చిక్కబడిన గాఢాంధకార రాత్రి
ఇక మంచుబిందువులు గడ్డిపరకలమీద రాలినట్టు
చేదుపాట నాలోంచి వెలువడుతుంది

నా ప్రేమ ఆమెను నాతో ఉంచలేకపోయిందంటే ఏం లెక్క
ఆకాశంలో చుక్కలు నిండాయి ఆమె నన్ను వదిలి వెళిపోయింది

అంతే. సుదూరాన ఎవరో పాడుతున్నారు. అందనంత దూరాన.
ఆమెను పోగొట్టుకున్న నా ఆత్మ అనంత దుఃఖాన్ని పాడుతోంది.

ఆమెను నా దగ్గరికి లాక్కోవాలని నా చూపులు చుట్టూ తడుముకుంటాయి
నా హృదయం ఆమెకోసం వెతుకులాడుతుంది. ఆమె మాత్రం నాతో లేదు

అటువంటిదే ఈ రాత్రి. అప్పటిలాగే వృక్షాలను వెలిగించే మసక వెన్నెల
కాని, అప్పటికాలానికి చెందిన మేం మాత్రం అప్పటిలా లేం

నేనింకెంతమాత్రమూ ఆమెను ప్రేమించడం లేదు
అది నిశ్చితం
కానీ నేనామెను ఎంత ప్రేమించాను
ఆమె వినే గాలిని స్పృశిద్దామని నా గొంతు తహతహలాడేది

మరొకరిది. ఆమె మరొకరిదయిపోయింది. నా ముద్దులకు ముందులాగ
ఆమె సవ్వడీ ఆమె మెరిసిపోయే దేహమూ ఆమె నిగూఢమైన కళ్లూ

నేనింకెంతమాత్రమూ ఆమెను ప్రేమించడం లేదు
అది నిశ్చితమే
కానీ నేనామెను ప్రేమించగలిగితే ఎంత బాగుండును
ప్రేమ ఎంత స్వల్పం, మరపు ఎంత దీర్ఘం

ఇటువంటి రాత్రులలోనే నేనామెను పొదివి పట్టుకున్నాను గనుక
ఆమెను కోల్పోయానంటే నా హృదయం అంగీకరించడం లేదు

ఆమె నా హృదయానికి చేయగల ఆఖరి గాయం ఇదే
ఆమె కోసం నే రాయగల ఆఖరి గేయమూ ఇదే

(అనువాదం చేద్దామని ముప్పై సంవత్సరాలుగా అనుకుంటూ ప్రయత్నిస్తూ శక్తి చాలదని ఆగిపోతూ ఉన్న పాబ్లో నెరూడా సుప్రసిద్ధ కవిత 'టునైట్ ఐ కెన్ రైట్' కు సరిగ్గా అటువంటి ఆఖరి గేయం తరలివచ్చిన క్షణాన – అక్టోబర్ 6, 2010)

తి తి తి

## ముసల్మాన్

– దేవీప్రసాద్ మిశ్రా

వాళ్లు విపత్తులా వచ్చారట
విషవాయువులా వ్యాపించారట

వాళ్లొక వ్యాధి అట
వాళ్లు మ్లేచ్ఛులని బ్రాహ్మలన్నారు
వాళ్లు ముసల్మానులు

వాళ్లు సింధూతీరాన గుర్రాలు దిగారు
హిందు! హిందు!! హిందు!!! అని నినదించారు
గొప్పజాతికి వాళ్లొక గొప్ప పేరు పెట్టారు
నది పేరు జాతికిచ్చారు
ప్రతి లోతయిన నదినీ
ప్రతి జీవధారనూ వాళ్లు దాటదలిచారు
వాళ్లు ముసల్మానులు
కాని వాళ్లకు కబీరుకున్నంత తెలివి ఉండి ఉంటే
హిందువుల లాగనే పుట్టి ఉండేవాళ్లు

వాళ్ల దగ్గర పెద్ద పెద్ద కథలుండేవి
నడిచే కథలూ ఆగే కథలూ
పోరాట కథలూ మృత్యుకథలూ
ప్రత్యర్థుల నెత్తుట్లో మోకాలి లోతు
తమ సొంత రక్తంలో భుజాలదాకా
వాళ్లు మునిగిపోతుండేవాళ్లు
వాళ్ల పిడికిళ్లలో గుర్రాల కళ్లాలుండేవి
వాళ్ల ఒరల్లో నాగరికతా చిహ్నాలుండేవి
కాదు, మృత్యువు కోసం కానే కాదు
వాళ్లు మృత్యువుకోసం ఎన్నడూ యుద్ధాలు చేయలేదు
వాళ్లు ముసల్మానులు

వాళ్లు పారశీకం నుంచి వచ్చారు
తురాన్ నుంచి వచ్చారు
సమర్‌ఖండ్, ఫర్గానా, సీస్తాన్‌ల నుంచి వచ్చారు
తుర్కిస్తాన్ నుంచి వచ్చారు
వాళ్లు చాల దూరం నుంచి వచ్చిన మాట నిజమే

కాని వాళ్లు ఈ అవనీతలం మీదినుంచే వచ్చారు
వాళ్లు రాగలిగారు గనుక వచ్చారు
వాళ్లు ముసల్మానులు
వాళ్లు ముసల్మానులు కాకపోతే
దైవం వాళ్ల రూపాలను
మనిషి రూపంతో సమానం చేసేవాడు
వాళ్లు మహాసంచారులు
వాళ్ల దగ్గర దుఃఖపు జ్ఞాపకాలుండేవి
వాళ్లు గుర్రాలతోపాటు నిద్రించేవాళ్లు
బండలమీదనే తమ శక్తిని వెదజల్లేవాళ్లు
నిర్మాణమే వాళ్ల తపన
వాళ్లు ముసల్మానులు
సత్యం సత్యంలాగ చెప్పబడేటప్పుడు
సత్యాన్ని సత్యం లాగనే వినాలి
బహుశా వాళ్లు ఇట్లా ఉండి ఉంటే
వాళ్లు ముసల్మానులవునో కాదో
బహుశా జాడే తెలిసేది కాదు
వాళ్లు ముసల్మానులు

వాళ్లు లేకపోతే లఖ్నో ఉండేది కాదు
సగం అలహాబాదు ఉండేది కాదు
మెహ్రాబ్ ఉండేది కాదు
గుమ్మటాలుండేవి కావు
ప్రణామాలుండేవి కావు
మీర్ మఖ్దూమ్ మోమిన్‌లుండేవాళ్లు కారు
షబానా ఉండేది కాదు
వాళ్లు లేకపోతే ఈ ద్వీపకల్పపు
సంగీతాన్ని వినే ఖుస్రో ఉండేవాడు కాదు
వాళ్లు లేకపోతే ఈ దేశపు ఆగ్రహంలో
ఆందోళన పడిన కబీర్ ఉండేవాడు కాదు
వాళ్లు లేకపోతే
ఈ భారత ఉపఖండపు దుఃఖాన్ని

గానం చేసిన గాలిబ్ ఉండేవాడు కాదు
ముసల్మానులే లేకపోతే
పద్దెనిమిది వందల యాభై ఏడు ఉండేది కాదు
వాళ్లున్నారు గనుక
చచా హసన్ ఉన్నాడు
వాళ్లున్నారు గనుక
గాలిపటాలతో రంగులద్దుకున్న ఆకాశం ఉంది
వాళ్లు ముసల్మానులు

వాళ్లు ముసల్మానులు, మరి హిందుస్తాన్‌లో ఉండిపోయారు
వాళ్ల బంధువులు పాకిస్తాన్‌లో ఉండిపోయారు
ఒక్కసారి పాకిస్తాన్ వెళ్లగలిగితే...!
అని వాళ్లు అనుకునేవాళ్లు
అనుకునీ అనుకునీ భయపడేవాళ్లు

ఇమ్రాన్ ఖాన్‌ను చూసి వాళ్లు సంతోషపడేవాళ్లు
సంతోషపడి భయపడేవాళ్లు
వాళ్లు పిఎసి కానిస్టేబుళ్లను చూసి ఎంత భయపడేవాళ్లో
రాముణ్ని చూసినా అంతే భయపడేవాళ్లు
మురాదాబాద్‌ను చూసి భయపడేవాళ్లు
మీరట్‌ను చూసీ
భాగల్‌పూర్‌ను చూసీ భయపడేవాళ్లు
ఠీవిగా ఉండేవాళ్లు కాని భయపడుతూనే ఉండేవాళ్లు
వాళ్లు పవిత్ర వర్ణాల్ని చూసి భయపడేవాళ్లు
తాము ముసల్మానులమైనందుకు భయపడేవాళ్లు

వాళ్లు పాలస్తీనీయులు కారు
కాని వాళ్లకు తమ ఇంట్లో తమకే
తమ దేశంలో తమకే మనశ్శాంతి ఉండేది కాదు
వాళ్లొక బహిష్కృత దేశం
వాళ్లు ముసల్మానులు

వాళ్లు బట్టలు నేసేవాళ్లు
బట్టలు కుట్టేవాళ్లు
తాళాలు తయారు చేసేవాళ్లు
పెట్టెలు తయారు చేసేవాళ్లు
వాళ్ల శ్రమ కలకలం
నగరమంతా ప్రతిధ్వనించేది
వాళ్లు నగరం బైట నివసించేవాళ్లు

వాళ్లు ముసల్మానులే
కాని డమాస్కస్ వాళ్ల నగరం కాదు వాళ్లు ముసల్మానులే కాని
అరబ్ పెట్రోలు వాళ్లది కాదు
వాళ్లు దజ్లా నీళ్లు కాదు
యమున నీళ్లే తాగేవాళ్లు
వాళ్లు ముసల్మానులు
వాళ్లు ముసల్మానులు గనుకనే
తప్పించుకు తిరిగేవాళ్లు
వాళ్లు ముసల్మానులు గనుకనే
సంకోచంతో మాట్లాడేవాళ్లు
ముసల్మానులవల్లనే కర్ఫ్యూ వచ్చిందని
దేశంలో చాల పత్రికలు అనేవి
కర్ఫ్యూ వచ్చేది
ఒకదాని తర్వాత ఒకటిగా
దుర్ఘటనల వార్తలొచ్చేవి
వాళ్ల స్త్రీలు మౌనంగా
దెబ్బలూ అవమానాలూ భరించేవాళ్లు
వాళ్ల పిల్లలు గోడల్లో దాక్కునేవాళ్లు
వాళ్లు ముసల్మానులు
వాళ్లు ముసల్మానులు
అందుకే తుప్పుపట్టిన తాళాల్లా
తెరుచుకునేవాళ్లు కాదు
ఐదు సార్లు నమాజ్ చదివితే
ఎన్నో రెట్లు ఎక్కువసార్లు

తల వంచుకునేవాళ్లు
వాళ్లు ముసల్మానులు
ఈ లాల్ ఖిలాను మేమేం చెయ్యం
అని అడగాలనిపించేది వాళ్లకు
ఈ హుమాయూన్ సమాధిని మేమేం చెయ్యం
అని అడగాలనిపించేది వాళ్లకు
కువ్వత్–అల్–ఇస్లాం
ఇస్లాం శక్తి అని పేరు పెట్టుకున్న
ఈ మసీదును మేమేం చెయ్యం?
అల్లం లాగ వాళ్లు
ముడుచుకుపోయి ఉండేవాళ్లు
వాళ్లు ముసల్మానులు
ఇంకెక్కడికన్నా వెళిపోదామా అనుకునేవాళ్లు
కాని వెళ్లలేకపోయేవాళ్లు
ఇక్కడే ఉండిపోదామా అనుకునేవాళ్లు
కాని ఉండలేకపోయేవాళ్లు
సగం మెడ తెగిన మేక లాగ
కష్టాల కుదుపుల్ని భరించేవాళ్లు
వాళ్లు ముసల్మానులు
అందుకనే తుపాను మధ్యన
ఓడలో ప్రయాణికుల లాగ
ఒకరిని పట్టుకుని ఒకరు ఉండేవాళ్లు
వాళ్లని విసిరి పారెయ్యాల్సి వస్తే
ఏ సముద్రంలో పారేద్దాం అనీ
కొందరు చర్చించారు
వాళ్లను దేశం నుంచి తరిమేస్తే
ఏ దేశంలోకి తరిమేద్దాం అనీ
చర్చ జరిగింది
వాళ్లను తోసెయ్యాల్సి ఉంటే
ఏ పర్వతం మీదినుంచి తోసేద్దాం అని కూడ
చర్చ జరిగింది
వాళ్లు ముసల్మానులు, చీమలు కాదు

వాళ్లు ముసల్మానులు, కోడిపిల్లలు కారు
వినండి!
సింధూ దక్షిణ తీరాన
వేల సంవత్సరాల నాగరికత తర్వాత
వాళ్లు కేవలం మట్టిబెడ్డలు కారు
వాళ్లు కొండల లాగ, కోనల లాగ వాస్తవం
వాళ్లు సింధు వలె, హిందుకుష్ వలె వాస్తవం
సత్యాన్ని ఎట్లా అర్థం చేసుకోవడం సాధ్యమో
అటువంటి సత్యం వాళ్లు
వాళ్లు నాగరికతలో అనివార్య నియమం
వాళ్లు ముసల్మానులు, గాలివార్త కాదు
వాళ్లు ముసల్మానులు
వాళ్లు ముసల్మానులు
వాళ్లు ముసల్మానులు

# సంపుటంతో కవితావరణంలోకి...

కవిత్వంతో నా ములాఖాత్‌ల ముగింపు దగ్గరికొస్తున్నకొద్దీ దిగులు పెరుగుతున్నది. కవితాభిమానులతో సాగుతున్న ఈ ఆత్మీయ సంభాషణ ఆగిపోతుందనే దిగులు ఒకవైపు అయితే, అయ్యయ్యో ఇంకెన్నో రాయవలసినవి వదిలేశానే, రాసినవి కూడ ఇంకా బాగా రాసి ఉండవచ్చునే అనే దిగులు మరొకవైపు. వెనక్కి తిరిగి చూస్తుంటే చెప్పినది తక్కువా చెప్పవలసినదీ చెప్పగలిగినదీ ఎక్కువా అని తెలిసి వస్తున్నది. రచనలోనూ ఉపన్యాసం లోనూ చెప్పగలిగినదానికన్న ఒకింత తక్కువ చెప్పడమే మంచిదని ముప్పై ఐదేళ్ల అనుభవంతో పాఠం నేర్చుకున్నాను. ఉపన్యాసం ఇచ్చేటప్పుడు నాలుగైదు గంటలయినా, పది నిమిషాలయినా ఇంకా చెప్పవలసింది ఉన్నదనిపించే దగ్గర ముగించడమే ఉపన్యాసకులకూ శ్రోతలకూ ఆరోగ్యకరమని స్వానుభవం మీద తెలుసుకున్నాను. అలాగే రాయకుండా ఒక్కరోజు గడవకపోయినా, ఇంకా రాయవలసినవి ఉన్నాయనిపించే దగ్గర ముగించడమే మర్నాడు రాయడానికి శక్తినీ ఉత్సాహాన్నీ మిగులుస్తుందని తెలుసుకున్నాను. అందువల్ల ప్రతి ఉపన్యాసాన్నీ, ప్రతి రచననూ అసంతృప్తితోనే ముగిస్తాను. బహుశా అసంతృప్తిని మించిన ప్రేరణాత్మక శక్తి మరేమీ లేదేమో. నా కవిత్వ ములాఖాత్‌లలో కూడ చెప్పవలసినవి మరెన్నో

ఉన్నాయనే అసంతృప్తి ఉన్నప్పటికీ, దాన్ని అలా ఉంచి, ముగించే ముందు రెండు మూడు మరీ సొంత, వ్యక్తిగత విషయాలు పంచుకోవలసి ఉంది.

మొదటి కవిత 1974లో అచ్చయినా, 1980ల నుంచీ క్రమబద్ధంగానే కవిత్వం రాస్తున్నా నా కవితాసంపుటం 'పాఁవురం' చాల ఆలస్యంగా 2002లో తీసుకొచ్చాను. ఆ తర్వాత కూడ రెండు సంపుటాలకు సరిపోయినన్ని కవితలున్నప్పటికీ మరొక సంపుటం వెలువరించాలని కోరిక కలగడంలేదు. అలా ఒకే ఒక్క సంపుటపు కవిగా మిగిలాను. ఆ ఆలస్యానికీ ఈ అలక్ష్యానికీ కారణాలు వెతుకుతుంటే, అసలు మొత్తం రెండు వందల దాకా కవితలు రాసినప్పటికీ వాటిలో సగం మాత్రమే పేరుతో ప్రచురించానని తెలిసివస్తున్నది.

మన సమాజంలో కవులకూ రచయితలకూ అవసరమైన దానికన్న ఎక్కువ ప్రాధాన్యత ఉన్నదనీ, రాసిన విషయానికే తప్ప రాసిన వ్యక్తికి అంత ప్రాధాన్యత అవసరం లేదనీ ఒక అభిప్రాయం నాకు రచన మొదలుపెట్టిన రోజుల్లోనే కలిగింది. తొలిరోజుల్లో ఆ అభిప్రాయం ఇంకా బలంగా ఉండేది. అందువల్ల కవిగా, రచయితగా కనబడగూడదని, కవితో, రచనో మాత్రమే చర్చనీయాంశం కావాలనీ, ఒక్కొక్కటీ ఒక్కొక్క పేరుతో, చాలసార్లు పేరు లేకుండా రాసేవాణ్ని. రాయడం మొదలుపెట్టాక పదేళ్ల వరకూ పేరుతో వచ్చినవి తక్కువ. ఆలోగా నాలుగైదు అనువాద పుస్తకాలు వెలువడినప్పటికీ, వచన రచనలు రాయడం మొదలుపెట్టిన ఇరవై సంవత్సరాలకు గాని, అప్పటికీ ఒక ప్రత్యేక అవసరం వచ్చిగాని, మొదటి పుస్తకం వేయలేదు. ఆ తర్వాత కాలంలోనే సమాజం – వ్యక్తి ద్వంద్వంలో వ్యక్తికి కూడ పాత్ర ఉందనీ, ఆ అర్థంలో కవికీ రచయితకూ ప్రాధాన్యత అవసరమేననీ గుర్తింపు వచ్చింది.

ఇక కవిత్వం విషయంలోనైతే, నేను కళ్లు తెరిచినదే చుట్టూ శిఖర సమానులైన కవుల వాతావరణంలో. వాళ్ల ముందర నన్ను నేను కవిగా భావించుకోవడానికే ఎంతో బెరుకు కలిగేది. ఇతర కవుల కవిత్వం చదవడం అలవాటయ్యాక, వేరు వేరు కవిత్వాలతో ములాఖాత్‌లు మొదలయ్యాక కవి అంటే నా మనసులో ఏర్పడిన ఒక మహా చిత్రంతో పోల్చుకుంటే నేను కవినేనా అనే ప్రశ్న ఎప్పుడూ ఎదురవుతూనే ఉండేది. అందువల్ల కూడ కవిత్వం అనబడేది రాస్తూనే, లోకం చేత కొంతవరకు కవిగా గుర్తింపు కూడ పొందుతూనే నేను కవిని కానేమో అనే అసంతృప్తితో పెరిగాను. ఇప్పటికీ నెరూడానో, ఫైజ్ నో, శ్రీశ్రీనో మాత్రమే కాదు, ఇవాళ కలం పట్టుకుంటున్న కవులను చదివినప్పుడు కూడ నాది కవిత్వం అనుకోవడానికి నాకు కాస్త బెరుకుగానే ఉంటుంది.

ఆ బెరుకు తోనే అప్పటికి యాభై కవితలు అచ్చయినప్పటికీ అవి సంపుటం చేయడానికి సంకోచించాను. కాని అంతకన్న తక్కువ కవితలు రాసినవాళ్లు కూడ సంపుటాలు వేసుకోవడం చూసి నాకూ ఒక సంపుటం వేసుకోవాలని కోరిక మొదలయింది. మరీ ముఖ్యంగా, 1995లో ఆంధ్రజ్యోతి వారపత్రికలో అచ్చయిన నా 'అనురాగాంతం' అనే కవిత చదివినప్పటినుంచీ, ఎన్ గోపీ గారు సంపుటం ఎప్పుడు వేస్తావని అడుగుతూ వచ్చారు. శివారెడ్డి గారు సరేసరి,

కవిత్వం రాయడానికీ, సంపుటాలు వేయడానికీ అవసరమైన ప్రోత్సాహం ఇవ్వడంలో ఆయనకు ఆయనే సాటి. అలా 1999 నాటికి కవిత్వ సంపుటం వేయాలని నిర్ణయించుకుని మొత్తం డిటిపి చేయించడం అయింది. కాని అప్పటికీ సంపుటానికి తగిన సమయం రాలేదనుకుంటాను, ఆ ప్రయత్నం విఫలమయింది. ఆ తర్వాత 2002 నాటికి నలబై ఐదు కవితలతో పుస్తకం తయారు చేశాను.

కవిత్వ సంపుటం వేస్తే తెలంగాణ నుడికారపు సౌందర్యాన్ని ప్రతిఫలించే పేరు పెట్టాలని అప్పటికే నిశ్చయించుకుని ఉన్నాను గనుక పుస్తకానికి 'పాంవురం' అనే పేరు, ఆ శీర్షికతో కవిత లేకపోయినా, నిర్ణయిమయింది.

"పాంవురం మా ఇంట్లో మాట. మా వరంగల్ మాట. అచ్చమైన తెలంగాణ మాట. ఏ 'ప్రామాణిక నిఘంటువు' లోకీ ఎక్కని పాంవురం అంటే ప్రేమ. అభిమానం. ఆప్యాయత. వాత్సల్యం. ఒక ఉన్నత ఉదాత్త మానవ సంబంధం పాంవురం" అని ముందుమాటలో చెప్పుకున్నాను.

పుస్తకానికి 'పాంవురం' అని శీర్షిక పెట్టడానికి రెండు కారణాలున్నాయి. మా ఇంట్లో ఎవరి గురించి అయినా, ముఖ్యంగా వాళ్లు మంచి మానవసంబంధాలు నెరిపేవాళ్లని చెప్పాలంటే 'పాంవురం  గల్ల మనిషి' అనేవాళ్లు. పాంవురం గల్ల మనిషిని కావాలనేది నా ఆదర్శం. అభిప్రాయాల దగ్గర, దృక్పథం దగ్గర ఎంత కటువైన మనిషినని పేరు వచ్చినా విస్తృత, విశాల మానవ సంబంధాలతో ఆ ఆదర్శాన్ని కొంతవరకైనా చేరగలిగాననే నేననుకుంటాను. ఒకవేళ చేరలేదనుకున్నా, అది నా ఆదర్శమనే చిహ్నంగానైనా నా పుస్తకం ఉంటుందని దానికి 'పాంవురం' అని పేరు పెట్టుకున్నాను.

అలాగే "ఇది మానవసంబంధాల కవిత్వం. ఇది పాంవురం కవిత్వం. కవిత్వం మీద, తెలంగాణ మీద, తెలంగాణ ప్రజల జీవన్మరణ పోరాటాల మీద, పోరాట శాస్త్రం మీద నా పాంవురానికి వ్యక్తీకరణ ఈ కవిత్వం" అనీ, "జ్ఞానానికీ జ్ఞాపకానికీ మధ్య, సిద్ధాంతానికీ జీవితానికీ మధ్య, ఆయుధానికీ ఆర్ద్రతకూ మధ్య, క్రమశిక్షణకూ స్వేచ్ఛకూ మధ్య, త్యాగానికీ భవిష్యత్తుకూ మధ్య, విడదీయరాని పాంవురం ఉన్నదని నేను దృఢంగా, స్థిరంగా విశ్వసిస్తున్న ఫలితమే ఈ కవిత్వం" అనీ నా కవిత్వ స్వభావాన్ని పట్టి ఇచ్చే ప్రతీకగా ఆ శీర్షిక సరిపోతుందనుకున్నాను.

"కవిత్వం నా కన్నతల్లి. కవిత్వం నా తొలి పాంవురం. కవిత్వం అంటే భావప్రకటనో, ఆగ్రహ వ్యక్తీకరణో, పదవిన్యాసమో, పశ్చాత్తాపమో, ఉద్వేగ ఉధృతో, ప్రశాంత పునరావలోకనమో, ఒత్తిడి నుంచి ఉపశమనమో, ఆనందోత్సాహమో, వెళ్లగక్కడమో... ఎన్ని నిర్వచనాలున్నాయో, అవి ఎప్పుడెప్పుడు ఎంతెంత నిజమో నాకు తెలియదు. నాకు తెలిసిందల్లా నా పాంవురాన్నో, పాంవురం కొరతనో మననం చేసుకున్నప్పుడల్లా అది ఇట్లా వెలువడిందని మాత్రమే. ఈ పాంవురమో, పాంవురాన్ని కోల్పోవడమో ఒక వ్యక్తి విషయంలో కావచ్చు.

మానవ సంబంధం విషయంలో కావచ్చు. మనుషుల సామూహిక చర్యల విషయంలో కావచ్చు. ప్రకృతి విషయంలో కావచ్చు. I have taken all knowledge to be my province అన్న ఫ్రాన్సిస్ బేకన్ స్ఫూర్తితో నా పాఁవురం పరిధిలోకి ప్రపంచమంతా వచ్చి చేరింది. లోకానికీ నాకూ పాఁవురం ఉన్నప్పుడూ లేనప్పుడూ కూడ కవిత్వానికీ నాకూ పాఁవురం కుదిరింది" అని ఆ సంపుటపు ముందుమాటలో చెప్పుకున్నాను.

నిజంగా పద్నాలుగేళ్ల కిందటి ఆ పుస్తకం చాల పాఁవురంతో తయారుచేసుకున్నాను. అంతకు ఒకటి రెండు సంవత్సరాల ముందే రవీంద్రనాథ్ టాగోర్ కవిత్వాన్ని ప్రచురించిన ఒక ఇంగ్లిష్ ప్రచురణకర్త ప్రతి పేజిలోనూ అంచులో పైనుంచి కింది దాకా ఒక శిల్ప ఖండమో, ఒక పూలతీగో ఉంచి ఆకర్షణీయంగా తయారుచేశారు. నా సంపుటంలో కూడ పేజి డిజైన్ అలాగే ఉండాలనుకున్నాను. నేను 1993లో బుద్ధగయకు వెళ్లినప్పుడు అక్కడ బుద్ధుడికి జ్ఞానోదయం అయిన బోధివృక్షపు ఆకు ఒకటి తెచ్చుకుని పది సంవత్సరాలుగా జాగ్రత్తగా పాఁవురంతో కాపాడుకుంటున్నాను. కవితా సంపుటం 'పాఁవురం' ముఖచిత్రంగా ఆ ఆకు వేయాలనీ, ఆ ఆకు నడిమి ఈనెను ప్రతి పేజీ అంచుల్లో చిత్రించాలనీ నిర్ణయించుకున్నాను.

పుస్తకం వేయాలని అనుకోక ముందు నుంచే కవితా సంపుటం అంటూ ఎప్పుడైనా వేస్తే దాన్ని మా అమ్మకూ బాపుకూ అంకితం చేయాలని నా కోరిక. మా అమ్మ పెండ్యాల – నెల్లుట్ల రంగనాయకమ్మ 1982లో మమ్మల్ని అంతులేని దుఃఖంలో వదిలి వెళ్లిపోయింది. మా బాపు నెల్లుట్ల వరవరరావు 1998లో వెళిపోయాడు. నామీద, మామీద, లోకం మీద వాళ్లిద్దరి పాఁవురం లేకపోతే మా ఆరుగురు పిల్లలమూ మా ఆలోచనలూ లేవు. వాళ్లమీద నా పాఁవురం లేకపోతే నేను లేను. అందువల్ల 'పాఁవురం' కవితాసంపుటాన్ని మా అమ్మ పుట్టినరోజు అయిన ఉగాదికి వెలువరించాలనుకున్నాను. పుస్తకావిష్కరణ సభలు మొక్కుబడిగా మారిన సందర్భంలో ఆవిష్కరణకు సభ అవసరం లేదు గాని, ప్రతి సంవత్సరం జరుపుకున్నట్టుగానే ఆ చిత్రభాను ఉగాదిన మా అమ్మ పుట్టినరోజు ఈ సారి కవిమిత్రుల మధ్య జరుపుకుని పుస్తకం ఆ రోజు విడుదల చేయాలనుకున్నాను.

అలా 2002 ఏప్రిల్ 13 ఉగాది రోజు సాయంకాలం అప్పుడు మేం అద్దెకుంటున్న ఇంటి డాబా మీద పాఁవురం విడుదల జరిగింది. చేకూరి రామారావు, కె శివారెడ్డి, ఎన్ గోపీ, హరి, సిధారెడ్డి వంటి నాకు ఆత్మీయులైన సాహితీమిత్రులు ముప్పై నలభై మంది మధ్య ఆ సాయంకాలం చిరస్మరణీయంగా జరిగింది. కాకపోతే నాకు అత్యంత ఆత్మీయుడు, గురువు, నాయకుడు కొండపల్లి సీతారామయ్య అంతకు ముందు రోజే మరణించడం, ఎన్నో ఏళ్లుగా ఎదురుచూస్తున్న నా పుస్తకం విడుదలను వాయిదా వేయడానికి వీలులేక నేను బెజవాడ వెళ్లలేకపోవడం ఎప్పటికీ గుర్తుండే విషాదం.

అలా కవిత్వం రాయడం మొదలుపెట్టిన ఇరవై ఎనిమిది సంవత్సరాలకు నేనూ ఒక

కవితా సంపుటం వెలువరించిన కవినయ్యాను. వినడం నుంచి, చదవడం నుంచి, రాయడం నుంచి, అనువదించడం నుంచి మరొక మెట్టు పైకి ఎక్కి కవిత్వ ములాఖాత్‌లు సంపుటం వేయడంగా పర్యవసించాయి.

ఆ సంపుటంలోంచి రెండు కవితలు మీతో పంచుకోవాలి.

## అనురాగాంతం

సాయుధుడో నిరాయుధుడో
మనిషికి నేను భయపడను
లక్ష రక్కసి కోరలు సాచే
బ్రహ్మజెముడు రాజ్యమన్నా భయం లేదు నాకు
రవరవలాడే గుండెను హఠాత్తుగా ఆపేసే
మృత్యువూ నను భయపెట్టదు

మనిషిని మనిషితో కలిపే
ఒక సున్నితార్ద్ర రాగం
ఆగిపోతుందంటే మాత్రం ఒణికిపోతాను
అంత బంధమూ
ఒక బలహీన నిరాధార దారంలా
తెగిపోతుందంటే మాత్రం
నిలువెల్లా భూకంపంతో కదిలిపోతాను
సముద్రఘోషాశ్రుపాతంలో కరిగిపోతాను

లక్ష ద్రోహాలు కాదు
ఒక్క తెగిపోయిన స్నేహం
కోటి ద్వేషాలు కాదు
ఒక్క మరిచిపోయిన ఉద్వేగం
నను బాధిస్తుంది వేధిస్తుంది అవమానిస్తుంది
నా అస్తిత్వాన్ని అవనతం చేస్తుంది

మానవీయ బంధం
ఒక రెపరెపలాడే పతాకం గదా

ఒక మోసులెత్తే మొలక గదా
ఒక ఆత్మీయ హృదయ స్పర్శ గదా
రోజురోజూ పొడిచే జ్ఞానోదయం గదా
మనిషినెట్లా మరిచిపోతాం?
మమతనెట్లా తెంచుకుంటాం?

పడితే పగిలిపోయే గాజుబుడ్డిలా
ఒక్క వరదతో తెగిపోయే కరకట్టలా
ఒక్క అక్షరంతో విరిగిపోయే భావంలా
గాలివాటుకు కొట్టుకుపోయే గడ్డిపోచలా
స్నేహమింత శబలం...

◆ ◆ ◆

## పాట ఒకటే

వెయ్యి నిద్రలేని రాత్రులు
లక్ష మరిచిపోయే కలలు
ఒకే ఒక్క వేకువ

కోటి చంచల చిత్రాలు
కోటానుకోట్ల వర్ణాలు
కుంచె ఒకే ఒకటి

ఆక్రోశాలు నిరీక్షణలు
త్యాగాలు లెక్కలేనన్ని
ఒకటే మానవతా స్వప్నం

నాలుగో వెయ్యో పడగలు విప్పిన
బ్రహ్మరాక్షసి కింద
చిట్లిన ఈ వాయిద్యానికి

తంత్రులు ఐదో ఆరో
ఏడు స్వరాలో ఏడుపురాగాలో
పాటమాత్రం ఒకటే

అది రాత్రిందివాల కలల నిజాల ఉదయాస్తమయాల
చిత్రవర్ణాల నిరీక్షణల త్యాగాల కుంచెల తుపాకుల పాట
పడగల్నీ ఉక్కుపాదాల్నీ బ్రహ్మారాక్షసినీ
పరిహసించే పల్లెటూరి పిల్లనగోవి పాట

# అపురూప కవితావరణంలో రెండు రోజులు

2002 డిసెంబర్ మొదటివారంలో ఒక రోజు శివారెడ్డి గారు ఫోన్ చేసి, ఎప్పట్లాగనే నానా అనీ, అయ్యా అనీ పలకరిస్తూ "నీకు కేరళ నుంచి ఒక ఉత్తరం వస్తుంది. అక్కడ తుంచన్ ఫెస్టివల్ అని కవితోత్సవం జరుగుతుంది. దానికి రమ్మని ఆహ్వానం అది. రాననకు. వెళ్లు. ఘంటసాల నిర్మల కూడ వస్తుంది" అన్నారు. శివారెడ్డి గారిని దాదాపు ముప్పై ఐదేళ్లకు పైగా చూస్తున్నాను. లెక్కలేనంతమంది ఆయన అభిమానులలో నేనూ ఒకడిగా ఉన్నాను. ఆయన కూడ ఎంతో మందిని ఆదరించినట్టే నన్ను కూడ చాల ప్రేమతో, వాత్సల్యంతో దగ్గరికి తీసుకున్నారు. నా కవిత్వం మీద, ఉపన్యాసం మీద చిరకాలం హృదయంలో దాచుకోదగిన అభిమాన ప్రశంసలు చేశారు. ఆ సంబంధం వల్ల ఆయన చెప్పిన మాటను కాదనడం కష్టం. ఆ ఉత్సవం ఏమిటో తెలియదు. వెళ్లి అక్కడ ఏమి చేయడమో తెలియదు. కవిత్వం రాస్తూ, ఒక సంపుటం కూడ వేసి ఉన్నాను గాని, విరసం కవి సభల్లో మినహా బైట కవి సమ్మేళనాల్లో పాల్గొన్న అనుభవం చాల తక్కువ. కాని శివారెడ్డి గారి మాట కాదనడమూ కష్టమే.

ఒక వారం తిరగకుండానే, అత్యద్భుతమైన కథకుడు, నవలా రచయిత, సినిమా దర్శకుడు, మలయాళ మహారచయితలలో ఒకరు ఎంటి వాసుదేవన్ నాయర్ సంతకంతో తుంచన్ మెమోరియల్ ట్రస్ట్ నుంచి ఆహ్వానం. తిరూర్ లోని తుంచన్ మెమోరియల్ లో 2003 జనవరి 28–29ల్లో జరిగే దక్షిణ భారత కవుల సమావేశంలో పాల్గొనమని. 'నా భాష, నా కవిత్వం' అనే అంశం మీద, 'నా కవిత్వం, నా సందేశం' అనే అంశం మీద సదస్సులలో, చర్చలలో పాల్గొనమని ఆహ్వానం. కొన్ని కవితలైనా ఇంగ్లిష్ అనువాదాలు కూడ పంపమని ఒక అభ్యర్థన. ప్రతి సంవత్సరం తుంచన్ మెమోరియల్ లో జరిగే కవితా

ఉత్సవానికి అన్ని దక్షిణాది భాషల నుంచి ఇద్దరిద్దరు కవులను పిలుస్తారు. అలా 2003 ఉత్సవానికి తెలుగు నుంచి ఘంటసాల నిర్మల గారికి, నాకు ప్రాతినిధ్యం దొరికింది. తమిళం నుంచి కనిమొళి, మనుష్య పుతిరన్, కన్నడం నుంచి ఎస్ మంజునాథ, సరస్వతి దు, తుళు నుంచి వామన నందవర, కొంకణి నుంచి ప్రకాశ్ పడ్గావ్కర్ అక్కడ ఆ సంవత్సరం ఆహ్వానం పొందిన ఇతర కవులు.

ఆ కవితా ఉత్సవం జరిగే ప్రాంగణం – తుంచన్ పరంబు – కేరళలో తిరూర్ పట్టణం శివార్లలో ఉంది. తుంచత్తు రామానుజన్ ఎళుతచ్చన్ అనే పదహారో శతాబ్ది కవి స్మారకంగా అక్కడ నడుస్తున్న తుంచన్ మెమోరియల్ రిసర్చ్ సెంటర్‌లో ఈ వార్షిక కవితా ఉత్సవాలు జరుగుతాయి. ఆ ఉత్సవాలలో భాగంగా తుంచన్ ఉపయోగించిన ఘంటాన్ని ఊరేగించడం, చిన్నపిల్లలకు అక్షరాభ్యాసం చేయడం, శాస్త్రీయ సంగీత నృత్య ప్రదర్శనలు జరుగుతాయి. ఆ ఉత్సవాలను స్వతంత్రమైన తుంచన్ మెమోరియల్ ట్రస్ట్ నిర్వహిస్తుంది గాని తంజావూరు దక్షిణ మండల సాంస్కృతిక కేంద్రం, కేరళ ప్రభుత్వ సాంస్కృతిక శాఖ వంటి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ శాఖల సహకారం ఉంటుంది. అలా ఆ ఉత్సవాలలో కొంత మత వాసనలు, ప్రభుత్వ ప్రోత్సాహం ఉన్నప్పటికీ, తుంచన్ చరిత్ర, ఒక పదహారో శతాబ్ది కవికి ఇవాళ్టికీ దొరుకుతున్న ఆదరణ, తుంచన్ పరంబులో పరిశోధనకు, రచనకు కల్పించిన వసతులు, సౌకర్యాలు, ఉత్సవాల రెండు రోజులూ అక్కడ వెల్లివిరిసే సాహిత్య, కవిత్వ వాతావరణం తప్పనిసరిగా గౌరవించవలసినవి. అనుసరించవలసినవి.

తెలుగు ప్రాచీన కవులు చాలమంది లాగనే తుంచన్ జీవిత వివరాలు కూడ ఎక్కువగా తెలియవు. ఆయన రామాయణాన్ని, మహాభారతాన్ని మలయాళంలోకి అనువదించాడు. ఆ అనువాదాలు మలయాళ కవిత్వ భాషను సంపన్నం చేశాయని, ఒక కొత్త కవిత్వ సంస్కృతిని ప్రారంభించాయని అంటారు. గ్రీకు సాహిత్యానికి హోమర్, ఇంగ్లిష్ సాహిత్యానికి చాసర్ ఎటువంటి సేవలు అందించారో మలయాళ సాహిత్యానికి తుంచన్ అటువంటి సేవలు అందించాడంటారు. తుంచన్ పుట్టిన చకల నాయర్ అనే శూద్ర, అనాదృత (నూనె గానుగ ఆడించే గాండ్ల) నాయర్ల ఉపకులానికి చెందిన వాళ్లు గ్రామాలలో మలయాళం ఉపాధ్యాయులుగా పనిచేసేవారు. తుంచన్ కూడ అలా ఉపాధ్యాయ వృత్తినే స్వీకరించి తిరూర్ పొరుగున ఉన్న త్రిక్కండియూర్ లో ఒక ముషిణి వృక్షం కింద పిల్లలకు చదువూ రాతా బోధించేవాడని గాథలున్నాయి. ఉపాధ్యాయ వృత్తి చేపట్టకముందు ఆయన పొరుగున ఉన్న తమిళ, తెలుగు ప్రాంతాలను పర్యటించి ఆ రెండు భాషలు కూడ నేర్చుకున్నాడంటారు. ఈ పర్యటనలలో భాగంగా ఆయన మీద భక్తి ఉద్యమ ప్రభావం పడిందని, ఉపనిషత్తులు అధ్యయనం చేశాడని అంటారు. పర్యటనల నుంచి తిరిగి వచ్చాక ఉపాధ్యాయ వృత్తి ప్రారంభించి, అదే సమయంలో అతి సాధారణ, సంగీతమయమైన, లయబద్ధమైన శైలిలో

రామాయణ భారతాలను మలయాళంలోకి అనువదించాడు. కిళి పాట్టు (చిలుక పలుకు) అనే కవిత్వ ప్రక్రియకు ఆద్యుడు. హరినామ సంకీర్తనం, ఇరుపతినాలు వృత్తం, కైవల్య నవనీతం కిళిపాట్టు, దేవీ మాహాత్మ్యం, మహాభాగవతం కిళిపాట్టు, చింతారత్నం వంటి రచనలెన్నో చేశాడు.

సంస్కృత, ద్రావిడ భాషల సంగమంగా మలయాళ కవిత్వంలో ఆయన నూతన ధోరణికి ప్రారంభకుడు. మలయాళ సాహిత్య చరిత్రలో పునరుజ్జీవన వైతాళికుడని చరిత్రకారులు అంటారు. మలయాళ సంస్కృతిలో ఆయన ప్రభావం ఎంత విస్తృతమైనదంటే ప్రతి విజయదశమి రోజునా వేలాది మంది చిన్నారులను తుంచన్ పరంబుకు తీసుకువచ్చి ఆ చెట్టు కింద అక్షరాభ్యాసం చేయిస్తారు.

మరణానంతరం దాదాపు మూడు శతాబ్దాలు మరుగున పడిపోయిన తుంచన్ స్ఫూర్తిని పునరుద్ధరించాలనే ప్రయత్నాలు ఇరవయోశతాబ్ది తొలిరోజుల్లో మొదలయ్యాయి. జమోరిన్ రాజు విద్వాన్ మానవిక్రమన్ ఎత్తన్ తంపురాన్ సరిగ్గా తుంచన్ నివసించిన, పాఠాలు చెప్పిన వృక్ష ప్రాంగణంలో 1906లో కవుల, రచయితల, సాంఘిక సంస్కర్తల సమావేశం నిర్వహించాడు. అక్కడే తుంచన్ స్మారక కేంద్రం నిర్మించాలని తీర్మానించారు. కాని ఆ తర్వాత కూడ ఐదు దశాబ్దాలు ఆ పని ముందుకు సాగలేదు. చివరికి 1954లో ఆ ప్రణాళికను పునరుద్ధరించి, అమలు చేయడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. ఆ తర్వాత కేరళ ప్రభుత్వ సహాయ సహకారాలతో, మెమోరియల్ సెంటర్ నిర్మాణమయింది.

చెట్లకూ, ప్రత్యేకించి పూలచెట్లకూ, పచ్చిక బయళ్లకూ ఎంతో స్థలం వదిలిన విశాలమైన ఆవరణలో తుంచన్ మెమోరియల్ సెంటర్ ఉంటుంది. మలయాళ చరిత్ర, సంస్కృతి చెప్పే మ్యూజియం. తుంచన్ ఉపయోగించిన ఘంటం ప్రదర్శనకు ప్రత్యేక ఏర్పాట్లు. కిళిపాట్టు స్మృతిలో రామ చిలుక కాంస్య విగ్రహం. తుంచన్ పాఠాలు చెప్పిన ఆ నాలుగు శతాబ్దాల వృక్షాన్ని అలాగే ఉంచి అక్కడ నిర్మించిన ఒక రాతి మండపం. ఒక విశాలమైన సభాభవనం, పెద్ద గ్రంథాలయం. అతిథుల కోసం, పరిశోధకుల కోసం దాదాపు ఇరవై కుటీరాలు. అన్నిటికన్ని భవనాలూ కేరళ వాస్తుశైలిలో ఎర్ర పెంకుల కట్టడాలు. అత్యున్నత ప్రమాణాల పరిశోధనా కేంద్రంగా తుంచన్ మెమోరియల్‌ను కాలికట్ విశ్వవిద్యాలయం గుర్తించింది. అక్కడి గ్రంథాలయాన్ని, తాళపత్ర గ్రంథాలను, రాతప్రతులను వినియోగించుకోవడానికి ఎందరో విద్యార్థులు, పరిశోధకులు నిత్యం వస్తుంటారు.

ఆ ప్రాంగణంలో రెండు రోజుల సదస్సులో నిర్మల గారికీ నాకూ కూడ ఒకసారి మా కవిత్వం చదివి వినిపించడానికీ, మరొకసారి తెలుగు కవిత్వం గురించి మాట్లాడడానికీ అవకాశం వచ్చింది. ఒక్కొక్క కవి మూడు కవితలు చదివి వాటి గురించి చెప్పాలన్నారు. నేను గత వారం ప్రస్తావించిన 'అనురాగాంతం', 'పాట ఒకటే' లతో పాటు, 'భవిష్యత్తులోకి',

‘మనసు తుడిచేసి చూడు’, ‘జననం’, ‘మహా మానవహస్తం ముందర మోకరిల్లి’, ‘ఖూన్ కా తలాష్’ ఇంగ్లిషులోకి అనువదించి తీసుకుపోయాను. వాటిలో ఏ మూడు చదివానో ఇప్పుడు గుర్తులేదు.

తిరిగి రాగానే తుంచన్ మెమోరియల్ అనుభవాల గురించి రాద్దామనుకుని మొదలుపెట్టి ఐదారు వాక్యాలు రాసి అసంపూర్తిగా వదిలేసిన యాత్రాకథనపు కాగితాలు ఇప్పుడు వెతుకుతుంటే కనబడ్డాయి.

“అది కరుత్తమ్మ ఎదురుచూపుల నేల.

అది మాప్పిళ్లల పోరాట జ్ఞాపకాల మాల.

అది కవి తుంచన్ పునరుజ్జీవించి నడయాడిన వేళ.

కేరళలో మలప్పురం జిల్లాలో గడిపిన నాలుగురోజులూ కవిత్వంతో, పురాస్మృతులతో, వర్తమాన విషాదాలతో, సృజనాత్మక సాహిత్యంతో, అతి మొరటు వాస్తవికతతో, కరుణాపూరితమైన మలయాళీల స్నేహపూర్వక ఆతిథ్యంతో, కవిత్వ పీఠాల మీదికి చొరబడిన కొంచెపుతనాలతో, జేసుదాస్ అద్భుత సమ్మోహక గానంలో, జేసుదాసును అస్పృశ్యుణ్ని చేసిన మతమౌఢ్యపు స్ఫురణతో గడిచిపోయాయి....” అని రాసుకున్నాను.

వీటిలో అప్పుడు రాద్దామనుకుని రాయకుండా వదిలేసిన రెండు విషయాలైనా ఇప్పుడు పంచుకోవాలి.

ఒకటి, మలయాళీల సాహిత్య, పుస్తకాభిమానం. తుంచన్ ఉత్సవం దగ్గర పుస్తక ప్రదర్శన ఏర్పాటు చేసిన డి సి బుక్స్ అనే ప్రఖ్యాత మలయాళీ, ఇంగ్లిష్ ప్రచురణ సంస్థ ప్రతినిధితో మాట్లాడాను. పదమూడు సంవత్సరాల కిందనే ఆ సంస్థకు కేరళ రాష్ట్రం మొత్తంలో ముప్పై దుకాణాలున్నాయి. అప్పటికి కేరళ జనాభా మన జనాభాలో సగం. వాళ్లు పూర్తిగా అక్షరాస్యత సాధించిన వాళ్లు గదా అని ఊరడింపు పొందుదామనుకున్నా మన అక్షరాస్యుల కన్న వాళ్లు ఒక కోటి తక్కువ. మనకు అప్పటికి అతి పెద్ద ప్రచురణ సంస్థకు ఉండిన దుకాణాలు పదికి లోపు. అవీ ఇరవై మూడు జిల్లాలలో. కమలాదాస్ ఆత్మకథ, ఒ వి విజయన్ కథా సంకలం అప్పటికే వాళ్లు 22 ముద్రణలు వేశారు. ప్రతి ముద్రణకూ కనీసం మూడు వేల ప్రతులు వేస్తామని అన్నారు. ఇక మార్క్వెజ్ ‘వన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్’ పది ముద్రణలు పొందింది. ఆ పుస్తకాలు తెరిచి ఆ వివరాలు చదువుతుంటే తెలుగు సాహిత్యాభిమానుల పుస్తకాదరణ గుర్తుకు వచ్చి దుఃఖం కలిగింది అని ఆరోజు రాసుకున్న అనుభవం పదమూడు సంవత్సరాల తర్వాత కూడ చెంపల మీద తడిగానే ఉంది.

రెండు, ఆ రెండు రోజుల్లో కాసేపటి కోసం జేసుదాస్‌ను పిలిపించి ఒకటి రెండు మలయాళ కీర్తనలో పాటలో పాడించారు. అది ఒక అద్భుత అనుభవం. సభల మర్నాడు

తిరూరు నుంచి సుప్రసిద్ధమైన గురువాయూరు శ్రీకృష్ణ ఆలయం యాభై కిమీ లోపే అంటే చూడడానికి వెళ్లాం. నాస్తికుడిగా గుడికి వెళ్లే అలవాటు ఎప్పుడూ లేకపోయినా శిల్పం కోసం, ఆచారాలనూ, మనుషుల ప్రవర్తననూ చూడడం కోసం గుళ్లకు వెళ్తూనే ఉంటాను. గురువాయూరులో మాత్రం హిందువులైతే తప్ప ప్రవేశం లేదని, చొక్కా తీసేయకపోతే లోపలికి ప్రవేశం లేదని అన్నారు. నిర్మల గారిని, మాకు తోడు వచ్చిన మలయాళీ యువతిని లోపలికి పంపి బైటే ఉండిపోయాను. అలా బైట నిలబడిన గంటసేపూ దేవస్థానపు మైకులనుంచి జేసుదాసు అద్భుత గళం నుంచి శ్రీకృష్ణ కీర్తనలు. కాని ఆ జేసుదాస్ హిందువు కాదు గనుక ఆ దేవస్థానంలోకి ప్రవేశించనివ్వలేదు. 'నీ శ్రమ కావాలి నువ్వు వద్దు, నీ గళం కావాలి నువ్వు వద్దు, నీ కలం కావాలి నువ్వు వద్దు' అనే ఈ దుర్మార్గ సమాజాన్ని ధ్వంసించే కృషి చేయకుండా ఉట్టి కవితాభిమానులుగానో, కవులుగానో ఉండిపోవడం ఎంత నేరం అనిపించింది.

ఆంధ్రజ్యోతి లో 1999లో అచ్చయి, తుంచన్ ఉత్సవంలో చదివిన కవిత ఒకటి కూడ మీతో పంచుకోవాలి:

## మనసు తుడిచేసి చూడు!

నా మనసులో దాచుకున్న
నెమలి ఈక ఒకటి నీకు చూపాలి
నా కనుపాపలపై కదలాడే
పువురేక ఒకటి నీకు చూపాలి
నా ఊపిరికి అద్దుకున్న
మొగలిరేకు ఒకటి నీకు చూపాలి

మనసు విప్పుతానా
ఒకటికాదు
పురివిప్పిన నెమళ్లు
కోటానుకోట్ల పింఛాలు

నీ మునివేలు నా కంటిపాపపై అన్చుకుంటానా
పూలచెట్టు జలజలా రాలినట్టు
వేనవేల పూరేకులు

ఈ ఊపిరి నిండిన పరిమళమేమిటా
అని చూస్తే
శ్వాస నిండా గుబాళిస్తున్న
లక్షోపలక్షల మిత్రుల పేర్లు....

మనుషులు దూరమై పోవచ్చు
మనిషి జ్ఞాపకం ఎక్కడికి పోతుంది?
లతలయి సాగిన ఆదిమమైత్రి
ఎక్కడాగి పోతుంది?

వేటగాళ్లకు చిక్కి
నెమలి మాయమై ఉండొచ్చు
చూడు,
దుఃఖానంతర ఆకాశం నిండా
పరచుకున్న నెమలి పింఛం
ప్రతి వర్షపు బొట్టులో విచ్చుకున్న
గడిచిన వసంతపు జ్ఞాపకం

కంటినెవరో పెకలించి ఉండొచ్చు
ముద్రించుకున్న దృశ్యాలనేం చేస్తారు?
నిమిరిన ఆర్ద్రహస్తాల పూరేకులనేం చేస్తారు?
చెంపల మీద ఆరిన కన్నీటి చారికల్లో
గత హర్షాతిరేకాల గాథలేమవుతాయి?

ముఖం చాటేయొచ్చు
వీథులు తప్పించి తిరగొచ్చు
ఆ ఊరికే వెళ్లకపోవచ్చు
సమూహ సముద్రంలో
చుక్కాని ఇంకో వేపుకు తిప్పొచ్చు
నిన్నటి ఆలింగనాలనివాళ
అస్పృశ్యం చేయొచ్చు...

కాని
అట్టడుగున మనిషివి కదా
మనసు మీది నుంచి
మనిషి స్పర్శనెట్లా తుడిచేస్తావు?

# కవిత్వమంతా జీవితమే, జీవితమంతా కవిత్వమే

కవిత్వంతో ఎప్పటికీ అసంపూర్ణంగా మిగిలిపోతున్న ఒకానొక ప్రేమ గురించి చెప్పాలి. కవిత్వమొక తీరని దాహం అన్నమాట అక్షరాలా నిజమైన ముప్పై ఐదు సంవత్సరాల తీరని దాహం గురించి చెప్పాలి. ఆ సెలయేటిలో ఎన్నెన్ని చోట్ల ఎన్నెన్ని కాలాల్లో ఎన్నెన్ని సార్లు దోసిలిపట్టి నింపుకున్నా మనసు నిండని వృత్తాంతం చెప్పాలి. అది పాబ్లో నెరూడా కవిత్వం. జీవితమే కవిత్వమైన, కవిత్వమే జీవితమైన నెరూడా జీవనకవిత్వం. ఈ శీర్షికలో కవితారచనతో నా ములాఖాత్ గురించి చెపుతూ ముప్పై మూడు వారాల కింద, ఆ సందర్భం కొద్దీ, నెరూడా కవిత ఒకటి అనువాదం చేస్తూ నెరూడా గురించి మరొకసారి చెపుతానని వాగ్దానం చేశాను. శీర్షిక ముగింపు దగ్గర పడుతున్నప్పుడు, ఎన్నో వాగ్దానాలు నిలబెట్టుకోకపోయినా ఈ వాగ్దానం నిలబెట్టుకోవాలి.

'నీకై బ్రతుకే ఒక తపమై వెదుకాడే' అని కవితను సంభావించిన శ్రీశ్రీ ఎంత ఇష్టమో, 'ఒకానొక కాలాన.... కవిత నన్ను వెతుకుతూ వచ్చింది' అని తిరగేసి చెప్పిన నెరూడా అన్నా అంతే ఇష్టం నాకు. పాబ్లో నెరూడా పేరు (ఇంతకూ ఆయన పేరది కాదు. ఆయన పేరు నెఫ్తలీ రికార్డో రేజెస్ బసొఅల్తో. ఆయన మాతృభాష స్పానిష్ లో పాబ్లో – ప్రజలు – అనే మాటనూ, పందొమ్మిదో శతాబ్ది చెక్ కవి యాన్ నెపోముక్ నెరూడా స్మృతిలో ఆయన ఇంటిపేరునూ కలిపి తయారు చేసుకున్న కలం పేరుతో సుప్రసిద్ధుడయ్యాడు) బహుశా మొదటిసారి నా పదకొండో ఏట చూశాను. 'సృజన' 1972 జనవరి సంచికలో కె వి రమణారెడ్డి గారు 'పాబ్లో నెరూడాకు నోబెల్ బహుమతి' అని ఒక విమర్శనాత్మక వ్యాసం రాసి, నెరూడా రాసిన 'దేశ పతాక' అనే దీర్ఘ కవిత అనువాదం చేశారు. చూశాననే రాస్తున్నాను గాని చదివాననో, చదివినా అర్థం అయిందనో రాయడం లేదు. అప్పటికింకా ఆరో తరగతిలో ఉన్నానేమో, పుస్తకాలూ, ఇంట్లో పత్రిక గనుక సృజనా చదువుతున్నాను గాని అర్థం చేసుకున్నానని చెప్పలేను.

ఆ తర్వాత మార్చ్ సంచికలో రవి అనే గుంటూరు పాఠకుడు కె వి రమణా రెడ్డి గారు 'వేకువ' (అప్పుడు శివారెడ్డి గారు నడుపుతుండిన త్రైమాసిక పత్రిక) లో పాబ్లో నెరూడా మీద ప్రశంస వ్యాసం రాశారనీ, 'సృజన'లో విమర్శ వ్యాసం రాశారనీ, ఈ "రెండు పరస్పర

విరుద్ధ వ్యాస అస్త్రాలు" ఏమిటనీ కాస్త దురుసు ఉత్తరం ఒకటి రాశారు. దానికి కె వి ఆర్ చాల ఓపిగ్గా "విమర్శ నిరాధారమనుకొంటున్నాను. మొదట రాసిన వ్యాసం పూర్తిగా బయోగ్రాఫికల్. దాన్నే 'వేకువ'కు పంపాను. అది రాశాక కొంతకాలానికి, చాల కొద్ది కాలానికే మరొక వ్యాసం రాస్తే బాగుంటుందని, అందులో నెరూడా ప్రస్తుత స్థితిని విమర్శ చేస్తే మొదటిదానికి సమగ్రత చేకూరినట్లౌతుందని అనుకొని 'సృజన'కు వ్యాసం రాసి పంపాను. నిజానికి ఇవి రెండూ ఒకే వ్యాసంలోని రెండు భాగాలనుకొన్నా తప్పు లేదు. నెరూడా గొప్పదనం గురించి నాకెన్నడూ, ఇప్పుడుకూడా చిన్నచూపు లేదు. నిస్సంశయంగా నెరూడా మహాకవి. సోవియట్ యూనియన్‌ను అభిమానిస్తున్నాడని మాత్రమే బాధపడాలి గాని మరొకందుకు ఎందుకూ కాదు. అందుచేత నా వ్యాసాలు రెండూ పరస్పర విరుద్ధంగా ఉండే అవకాశం లేదు. పాజిటివ్ అండ్ నెగెటివ్ ఆస్పెక్ట్స్ రెండూ వేర్వేరు వ్యాసాలలో చర్చింపబడ్డాయి" అని రాశారు. వివాదం ఎప్పుడైనా ఆసక్తిని రేకెత్తిస్తుంది గనుక బహుశా నెరూడా మీద నా ఆసక్తికి అక్కడే బీజం పడి ఉండవచ్చు.

తర్వాత ఏడాదిన్నరకు, అంటే నా ప్రపంచజ్ఞానం మరికొంత పెరిగాక, 1973 సెప్టెంబర్ 11న చిలీలో సైనిక కుట్ర జరిగింది. ఎన్నికల ద్వారా అధికారానికి వచ్చిన సోషలిస్టు ఐక్యసంఘటన ప్రభుత్వాధినేత, దేశాధ్యక్షుడు సల్వదోర్ అయెండె ని (అప్పట్లో ఇంగ్లిష్ స్పెల్లింగ్ ప్రకారం అలెండీ అని తప్పుగా పలికేవాళ్లం) సైనిక కుట్రదారులు పదవీచ్యుతుణ్ని చేసి, అధ్యక్ష భవనంలోనే హత్య చేశారు. అమెరికన్ ప్రభుత్వ సిఐఎ ప్రోత్సాహంతో, బహుళజాతి సంస్థల సహకారంతో జరిగిన దుర్మార్గమైన దాడి అది. ఒకే ఒక్క రోజున వందలాది మంది కమ్యూనిస్టులను, సోషలిస్టులను ఊచకోత కోశారు. అదృశ్యం చేశారు. రాజధానీ నగరం శాంటియాగోలో జాతీయ ఫుట్‌బాల్ స్టేడియంలో ఆరు వేల మంది అనుమానితులను పోగేసి, వారిలో కొందరిని ఎంపిక చేసి బహిరంగంగా కాల్చి చంపారు. ఎన్నో దేశాలలో తన పాటలూ సంగీతమూ వినిపించి ప్రపంచ ప్రఖ్యాతుడైన చిలీ సోషలిస్టు కవి, గాయకుడు, గిటార్ వాయిద్యకారుడు విక్టర్ యారా ను గుర్తించి చేతికి గిటార్ ఇచ్చి పాటలు పాడమని ఆజ్ఞాపించి ఒక్కొక్క వేలూ గొడ్డలితో నరుకుతూ, తూటాల వర్షం కురిపించి చంపేశారు. సైనిక కుట్ర జరిగే నాటికి కాన్సర్ వ్యాధితో వంద కిమీ అవతల ఇస్లా నెగ్రా లో స్వగృహంలో ఉన్న నెరూడా ఇంటి మీద సైనికులు దాడి చేశారు. వారక్కడ సోదా చేస్తుంటే "వెతకండి. వెతకండి. ఇక్కడ మీకు దొరికే ఏకైక ప్రమాదకర పదార్థం కవిత్వమే" అన్నాడట నెరూడా. సైనిక కుట్ర జరిగిన పన్నెండు రోజుల తర్వాత ఆయన ఒక శాంటియాగో ఆస్పత్రిలో మృతదేహమై కనిపించాడు (ఆయనది సహజ మరణం కాదని, విషం ఇంజక్షన్ ఇచ్చి హత్య చేశారని దశాబ్దాలు గడిచాక పరిశోధనల్లో తేలింది). ఆయన అంత్యక్రియలకు ఎవరూ వెళ్లడానికి వీలు లేదని సైనిక పాలన శాసించింది. అయినా వేలాది మంది ఆయన కవితలు చదువుతూ అంత్యక్రియల్లో పాల్గొన్నారు.

ఆ వార్తలు ఇంత వివరంగా ఇక్కడి పత్రికల్లో వచ్చాయో లేదో, అప్పుడు చదివామో లేదో గుర్తు లేదు గాని చిలీలో ప్రజాస్వామ్యాన్ని, ప్రజా ఆకాంక్షలను ఇంత దుర్మార్గంగా హత్య చేసిన ఆ పరిణామం మీద శివసాగర్ 'వివాలా శాంటియాగో' అనే అజరామర దీర్ఘ కవిత రాశారు. ఆ కవితను 1973 డిసెంబర్ 'సృజన' సంచికలో వేశాం. ఆ కవితను 'కవితా ఓ కవితా' లాగ ధారణ చేసి ఎన్నో చోట్ల గొంతెత్తి చదవడం నిన్నా మొన్నా జరిగినట్టుగానే ఉంది. ఆ సంచికలోనే 'నెరూడా! నెరూడా!!' అని కె వి రమణారెడ్డి గారు నెరూడా జీవితాన్నంతా ప్రతిఫలించిన మంచి కవిత ఒకటి రాశారు.

తర్వాత ఐదారు సంవత్సరాలకు పెంగ్విన్స్ ప్రచురణగా 'పాబ్లో నెరూడా సెలెక్టెడ్ పొయెమ్స్' స్పానిష్ ఇంగ్లిష్ ద్విభాషా సంకలనం వచ్చింది. దాంట్లో మొదటిసారి నేను Tonight I can Write, Poetry (And it was at that age…….Poetry arrived in search of me) కవితలు చదివాను. పందొమ్మిదో ఏట ఆయన రాసిన Tonight I can Write సరిగ్గా ఆ వయసులోనే నాకందింది. ఆ రెండు కవితలూ నోటికి పట్టి ఆ భావోద్వేగాన్ని పలికిస్తూ చదవడం సాధన చేశాను. ఆ రెండు కవితలూ ముప్పై ఏళ్లకు పైగా గున్గునాయించుకుంటూ ఇటీవలనే అనువాదం చేశాను.

ఒకటి రెండు సంవత్సరాలలోనే నెరూడా 'మెమోయిర్స్' చేతికి దొరికింది. ఒక కవి జీవితం ఎంత విశాలంగా, సున్నితంగా, ఆర్ద్రంగా, అర్థవంతంగా ఉండాలో, ఒక కవి జీవితం వేనవేల జీవితాల సమ్మేళనంగా ఎలా పరిణమిస్తుందో ఆశ్చర్యకరమైన తెలివిడినిచ్చిన పుస్తకం అది. మామూలుగా కవితకు ముందు వచనవాక్యాల ఉటంకింపు ఉచితమో అనుచితమో తెలియదు గాని, 1984లో రాసిన, 'సృజన'లో అచ్చయిన 'సమూహంలోకి...' అనే నా కవితకు నెరూడా మెమోయిర్స్ లోంచి "మన కాలపు కవికి ఏకాంతమూ సమూహమూ రెండూ ప్రాథమిక విధులుగానే ఉన్నాయి" అని ఉటంకింపు ఇచ్చాను.

బెజవాడలో ఉండగా 1988లో చిన్ని, చుక్కల స్నేహితురాలు, అమెరికాలో స్థిరపడిన భీమేశ్వరరావు గారి కూతురు జ్యోతి వచ్చింది. మాటల మధ్యలో కవిత్వ చర్చ వచ్చి, నెరూడా 'టునైట్ ఐ కెన్ రైట్' వినిపిస్తూ, తనకు స్పానిష్ వచ్చునని తెలిసి మొదటిసారి ఆమె గొంతులో స్పానిష్ లో ఆ కవిత విన్నాను.

హైదరాబాదులో ఎకనమిక్ టైమ్స్‌లో పని చేస్తున్నప్పుడు 1997-98ల్లో మా బ్యూరో చీఫ్ బికె సుధాకర రెడ్డి గారు అమెరికా వెళ్లారు. ఒకరోజు ఫోన్ చేసి 'అమెరికా నుంచి నీకేం కావాలి' అని అడిగారు. మొహమాటపడి 'ఏమీవద్దు సార్' అన్నాను. 'ఏవైనా పుస్తకాలు కావాలంటే చెప్పు' అన్నారాయన. ఏమీ వద్దనే అన్నాను. కాని అప్పుడప్పుడే మైక్రోసాఫ్ట్ తయారుచేసిన ఎన్ కార్టా అనే మల్టీమీడియా ఎన్‌సైక్లోపీడియా నా కోసం తీసుకొచ్చారు. అది ఒక అద్భుతం. దానిలో వింతలూ విశేషాలూ ఎన్నో. లెనిన్ గొంతు, మావో గొంతు,

మార్టిన్ లూథర్ కింగ్ గొంతు, మాల్కం ఎక్స్ గొంతు, అనేక స్థలాల 360 డిగ్రీల దృశ్యాలు, అనేక ఫొటోలు, దాదాపు ప్రతి విషయం మీదా పేజీల కొద్దీ సమాచారం.

ఆ ఎన్‌కార్టాలో పాబ్లో నెరూడా కవిత్వం గంభీరమైన గొంతులో స్పానిష్‌లో విన్నాను. నెరూడా గొంతులో కవిత్వం చదివిన కాసెట్లు ఎక్కడయినా దొరుకుతాయా అని అంతకు ముందు ఎందరినో అడిగినవాణ్ని హఠాత్తుగా ఎన్‌కార్టాలో నెరూడా కవితలు స్పానిష్‌లో విని పరవశించాను.

ఐతే అది నెరూడా సొంత గొంతు కాదు. అది 'ఇల్ పోస్తినో' అనే ఇటాలియన్ సినిమాలో నెరూడాగా నటించిన వ్యక్తిది. అమెరికా మిత్రులందరినీ 'ఇల్ పోస్తినో' తెచ్చిపెట్టగలరా, పంపించగలరా అని అడగగా అడగగా మిత్రులొకరు పట్టుకొచ్చారు. ఆ సినిమాలో నెరూడా పాత్రతో, పోస్ట్‌మాన్ పాత్రతో మమేకమవుతూ, 'కవిత్వం రాసినవాళ్లది కాదు, ఉపయోగించుకునే వాళ్లదే' అని పోస్ట్‌మాన్ అన్న చిరస్మరణీయమైన మాటతో తన్మయమవుతూ ఆ సినిమాకు మూలం ఏమిటనే సంగతి గ్రహించనేలేదు.

నెరూడా క్రియాశీల రాజకీయాల నుంచి కాస్త దూరం జరిగి, కవిత్వం రాసుకోవడానికి ఏకాంత సముద్రతీరగ్రామం ఇస్లా నెగ్రాలో ఉన్నప్పుడు అక్కడ ఆయనకు విరివిగా వచ్చే ఉత్తరాలు అందించడంకోసం ప్రత్యేకంగా ఒక పోస్ట్‌మాన్‌ను ఏర్పాటు చేశారు. నెరూడాతో పరిచయం వల్ల ఆ పోస్ట్‌మాన్ కవిత్వాభిమాని అయి, తన నెచ్చెలిని ఆకర్షించడానికి కవిత్వాన్ని వాడుకున్నాడని నెరూడా 'మెమోయిర్స్'లో ఉన్న చిన్న ప్రస్తావన తీసుకుని ఈ సినిమా అల్లారని అనుకున్నాను. కాని అది నిజం కాదు. నెరూడాతో నా సంబంధం మరొక మలుపులో ఆ నిజం తెలిసింది.

నా సహచరి వనజకు యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా, బర్కిలీలో డాక్యుమెంటరీ నిర్మాణంలో ఒక ఏడాది ఫెలోషిప్ వచ్చింది. నాకు కూడ మూడు నెలలు అక్కడ ఉండే అవకాశం వచ్చింది. బర్కిలీ వెళ్లడానికి కొద్ది రోజుల ముందే కొత్తగా ఆడం ఫెయిన్ స్టీన్ రాసిన నెరూడా జీవితచరిత్ర దొరికి అది చదువుతూ నెరూడాలో, నెరూడా కవిత్వంలో తలమునకలవుతూ ఉన్నాను. లాటిన్ అమెరికా గురించీ, ప్రజా పోరాటాలకూ సాహిత్యానికీ ఉండే సంబంధం గురించీ, ప్రపంచంలోని ఇతరదేశాల మార్క్సిస్టులకు భారతీయ మార్క్సిస్టులకు ఉన్నట్టుగా "నైతిక" బంధనాల భారం లేకపోవడం గురించీ ఆలోచనలు ప్రేరేపించిన పుస్తకం అది. నెరూడా జీవితానుభవాల విస్తృతీ, ఆయన ప్రేమ వ్యవహారాలూ, ఆయన రాసిన శృంగార కవిత్వాన్ని కమ్యూనిస్టు పార్టీయే అచ్చు వేయడమూ చదివి ఆశ్చర్యపోయాను. అసలు భారతీయ, తెలుగు మార్క్సిస్టు సంప్రదాయంలో "నైతిక వ్యవహారాలు"గా చూడబడేవి హిందూ, బ్రాహ్మణ, గాంధీవాద, మడి-వెలి వాద చిహ్నాలా, మానవ సహజమైనవేనా అని తర్కించుకున్నాను. ఆ ఆలోచనలతోనే బర్కిలీ చేరాను.

మాకు ఇల్లు అద్దెకు ఇచ్చి సెలవు మీద భారతదేశానికి వెళ్లిన బెంగాలీబాబు అమృత్

చౌధురి దగ్గర విచిత్రమైన విస్తృతిలో పుస్తకాలున్నాయి. ఆ పఠన, లేదా సేకరణ వైశాల్యానికి ఆశ్చర్యపోతూ ఆయన బీరువాల్లో ఒక్కొక్క పుస్తకమూ చూస్తూ ఉండగా, హఠాత్తుగా కళ్లు ఒక పుస్తకం మీద నిలిచిపోయాయి.

'ద పోస్ట్‌మాన్'. ఆంటోనియో స్కార్మెటా రాసిన స్పానిష్ నవల 'ఎల్ కార్టెరో డి నెరూడా'కు ఇంగ్లిష్ అనువాదం. అనువాదకురాలు కాథరిన్ సిల్వర్. నూటపదహారు పేజీల చిన్న పుస్తకం. నెరూడా చనిపోయాక పన్నెండు సంవత్సరాలకు 1985లో స్పానిష్‌లో అచ్చయి, 1993లో ఇంగ్లిషులోకి వచ్చింది. నవలలోని కథాకాలాన్నీ, స్థలాన్నీ, ప్రధానాంశాలనూ, పాత్రల పేర్లనూ సినిమా కోసం మార్చారు గాని 'ఇల్ పోస్తినో'కు మూలాధారం అది.

చిలీ నైరుతి భాగంలో చిన్న మత్స్యకారుల పల్లె ఇస్లా నెగ్రా. నల్లని ద్వీపం అని అర్థం. కాని ఆ పల్లెటూరు నల్లనిదీ కాదు, ద్వీపమూ కాదు. 1930లలో ఆ ఊరు చూసిన నెరూడా చనిపోవడానికి వారం ముందువరకూ ఆ ఊళ్లో ఎన్నో ఏళ్లు గడిపాడు. ఆ ఊరిమీదా, అక్కడి సముద్ర తీరం మీదా ఎన్నో కవితలు రాశాడు. ఒక కవితా సంపుటానికి ఇస్లా నెగ్రా అని పేరు పెట్టాడు. ఆ సముద్ర తీరంలో ఇల్లు కట్టుకున్నాడు. అది చిన్న నిరక్షరాస్య స్పానిష్ జాలరి పల్లె. అక్కడ ఎవరికీ ఉత్తరాలు రావు. అక్కడ పోస్ట్ మాన్ ఉద్యోగం లేదు. నెరూడా ఉన్నప్పుడు ఆయనకు వచ్చే కట్టల కట్టల ఉత్తరాలు, పుస్తకాలు, పత్రికలు తెచ్చి ఇవ్వడానికి తాత్కాలికంగా ఒక పోస్ట్‌మాన్‌ను నియమించేవారు.

అలాంటి తాత్కాలిక పోస్ట్‌మాన్ ఉద్యోగం కోసం టెలిగ్రాఫ్ ఆఫీసు తలుపు మీద ప్రకటనతో నవల మొదలవుతుంది. చేపలవేటకు వెళ్లడం ఇష్టంలేని మారియో జిమేనెజ్ అనే పదిహేడేళ్ల సోమరి యువకుడు ఆ ప్రకటన చూసి, సొంత సైకిలు ఉంటే చాలు ఆ ఉద్యోగం వస్తుందని తెలుసుకుని ఆ ఉద్యోగంలో కుదురుకుంటాడు. ఇక అక్కడినుంచి చివరిదాకా నవలంతా ఒక ఉద్విగ్న ప్రణయగాథ. మానవజీవితం నిండా పరచుకుని ఉన్న ప్రేమ పొరలు పొరలుగా ప్రతి పాత్రలోనూ ప్రతి సన్నివేశంలోనూ పువ్వు విచ్చుకున్నట్టుగా పాఠకుల కళ్లముందర విచ్చుకుంటుంది. ఎంత అందమైన పూలయినా రాలిపోక తప్పని భయానక రాజకీయ సామాజిక వాతావరణంలో ఆ అనురాగపుష్పాలు ఏ కర్కోటక సైనిక ఉక్కుపాదాల కింద ఎట్లా నలిగిపోతాయో చెపుతూ నవల ముగుస్తుంది. మరో మాటల్లో చెప్పాలంటే అది నవల కాదు, కవిత్వం. కవిత్వ సౌందర్యానికీ, శక్తికీ దర్పణం.

నవలలో ప్రేమ రూపాలకు లెక్కలేదు. అది అనురాగం, వాత్సల్యం, అభిమానం, ప్రేమ, ఆప్యాయత, ప్రణయం, కామం, విరహం...అన్ని రూపాలలోనూ వ్యక్తమవుతుంది. తొలియవ్వనంలో ప్రవేశిస్తున్న ఒక పల్లెటూరి కుర్రవాడికీ ప్రపంచ ప్రసిద్ధిగాంచిన అనుభవజ్ఞుడైన వృద్ధ కవికీ మధ్య ప్రేమ. కవిత్వమంటే అప్పటిదాకా ఏమీ తెలియని ఒక అమాయక యువకుడు ఉపమానం అంటే ఏమిటో అడగడంతో మొదలుపెట్టి, కవిత్వాభిమాని

అయి, చివరికి తానే కవి అయిన దాకా మనిషికీ కవిత్వానికీ మధ్య ప్రేమ. ఆ పల్లెటూరిలో పానశాల నడుపుతూ లోకం పోకడ తెలుసుకుని తెలివిగా ఇల్లుగడుపుతూ అప్పుడప్పుడే ఈడేరుతున్న తన కూతురిని జాగ్రత్తగా కాపాడుతున్న నడివయసు స్త్రీ కళ్లు కప్పి ఆ కూతురితో ఆ యువకుడు మొదలుపెట్టిన శృంగార భరితమైన ప్రేమ. ఆ నవయవ్వన ప్రేమకు ప్రేరణగా ఉద్దీపనగా అవసరమైనంతమేర కవిత్వం మీద ప్రేమ. మధ్యతరగతి పవిత్ర భావనల నేపథ్యం నుంచి చూస్తే పచ్చి శృంగారం అనిపించేలా ఆ యువతీయువకుల మధ్య అవ్యాజ, నిసర్గ, మానవీయ, దైహిక వ్యక్తీకరణ పొందే ప్రేమ. సముద్రం మీదా, సాగరఘోష మీదా, పర్వత సానువుల మీదా, పక్షుల కిలకిలారావాల మీదా, తీరం మీది ఇసుక మీదా, ఆ ఇసుకలో పరుగెత్తే పీతల పాదధ్వనుల మీదా, నెరూడా కోసం రాజకీయాల మీదా, నోబెల్ బహుమతి మీదా, అధ్యక్ష ఎన్నికల మీదా... నూటపదహారు పేజీల్లో ఎటుచూస్తే అటు వెల్లివిరిసే ప్రేమ. కవిత్వం.

చిట్టచివరికి అటువంటి అమాయకమైన, స్వచ్ఛమైన ప్రేమానురాగాలన్నిటినీ నిర్దాక్షిణ్యంగా తొక్కివేసే సైనిక పదఘట్టనలు. సైనిక కుట్ర. అయెండె హత్య. వేలాదిమంది సోషలిస్టుల, సోషలిస్టు సానుభూతిపరుల ఊచకోత. నెరూడా మరణం. నెరూడా కోసం మారియో సాహసం. చివరికి నెరూడా స్నేహితుడనే అభియోగంతో మారియోను కూడ మాయం చేసిన సైనికులు. ఒక అద్భుత ప్రేమమయగాథకు విషాదాంతం.

ఈ కవితామయ, ప్రేమమయ గాథను నెరూడా మీద నా ప్రేమ వల్ల మాత్రమే కాదు, తెలుగు సమాజానికి అవసరమైన సున్నిత, కవితాత్మక విలువల వల్ల కూడ తెలుగులోకి తీసుకు రావాలనుకున్నాను. వెంటనే తెలుగు చేయడం ప్రారంభించాను. దాదాపు సగం నవల తెలుగు చేసి 2008 ఏప్రిల్ నుంచి అక్టోబర్ వరకూ ఎనిమిది విడతలు అప్పుడు వెలువడుతుండిన వెబ్ పత్రిక 'ప్రాణహిత' లో ప్రచురించాను. ఆ అనువాదం అసంపూర్ణంగా ఆగిపోయింది. నా కవిత్వ ములాఖాత్‌లన్నిటిలోకీ సుదీర్ఘమైనదీ, హృదయానికి అత్యంత సన్నిహితమైనదీ, విషాదకరంగా అసంపూర్ణంగా మిగిలిపోయినదీ ఉద్వేగభరితమైన ఈ నెరూడా కవిత్వ గాథ.

"నేను ఎల్లప్పుడూ కోరుకునేది కవిత్వంలో జనం చేతులు కనబడాలని. వేలిముద్రలు కనబడే కవిత్వాన్నే నేనెప్పుడూ ఇష్టపడతాను. నీరు పాటలు పాడే బురదమట్టి కవిత్వం కావాలి. ప్రతి ఒక్కరూ తినగలిగే రొట్టెల కవిత్వం కావాలి" అన్నాడు నెరూడా. కవిత్వానికి అంతకన్న సార్థకత ఏమున్నది? నెరూడాతో, నెరూడా కవిత్వంతో ములాఖాత్ కన్న మించిన కవితాభిమాన సాఫల్యం ఏమున్నది?

# వియోగవేళ విచారధార

దాదాపు ఇరవై ఐదు సంవత్సరాలుగా కనీసం పది పత్రికల్లో నిర్ణీత కాలవ్యవధి శీర్షికలు రాస్తూ వచ్చినప్పటికీ ఆ శీర్షికలన్నిటికన్న ఎక్కువ తృప్తినిచ్చినదీ, ఆనంద విషాదాల పురాస్మృతులనెన్నిటినో గుర్తు తెచ్చుకునే అవకాశం ఇచ్చినదీ, పాఠకులతో నిరంతర సంభాషణకు అసాధారణ వేదిక కల్పించినదీ ఈ నలభై వారాలుగా సాగుతున్న 'కవిత్వంతో ములాఖాత్'. ఎప్పుడెప్పుడో మరిచిపోయిన, మెదడు అట్టడుగుపొరల్లో పడిపోయిన ఎన్నెన్నో జీవితానుభవాలనూ విశేషాలనూ మళ్లీ గుర్తుకు తెచ్చినదీ, కవిత్వంపై తొలి వలపును మళ్లీ చిగురింపజేసినదీ ఈ కాలమ్. బహుశా ఈ కాలం.

ఎప్పుడో ఆంధ్రపత్రికలో మొట్టమొదటి కాలమ్ 'కడలి తరగ' రాస్తున్నప్పుడు, చూడకుండా ఒక్కరోజు కూడ ఉండలేననుకున్న అత్యంత ప్రియమైన వ్యక్తి సుదూరాన ఉద్యోగానికి తరలి పోతున్నప్పుడు 'వియోగవేళ విచారధార' అని కృష్ణశాస్త్రి గారిని తోడు తెచ్చుకుని ఒక వారం రాశాను. పావు శతాబ్ది గడిచాక మళ్లీ ఇవాళ కూడ కవిసంగమం మిత్రులతో వియోగాన్ని, 'కవిత్వంతో ములాఖాత్' తో వియోగాన్ని కూడ అలాగే చెప్పాలనిపిస్తున్నది.

ఈ శీర్షిక ఇలా సాగినందుకు మొట్టమొదట మిత్రుడు, సోదరుడు యాకూబ్‌కు హృదయపూర్వక కృతజ్ఞతలు చెప్పాలి. దాదాపు 'కవి సంగమం' ప్రారంభమైనప్పటి నుంచీ ఒక వారం వారం శీర్షిక రాయమని యాకూబ్ అడుగుతున్నాడు. పనుల ఒత్తిడి వల్ల కొంతా, దానికన్న ఎక్కువగా కవిత్వానికీ నాకూ సంబంధం తెగిపోయిందనే అభిప్రాయవిచారం వల్ల కొంతా ఠలాయిస్తూ వచ్చాను. పట్టువదలని విక్రమార్కుడిలా యాకూబ్ వెంటపడగా రాస్తానని ఒప్పుకున్నాను. ఏమి రాయాలని మాట్లాడుకుంటుండగా కవిత్వానికీ నాకూ పొంవురం కుదిరిన సంగతులు రాస్తానన్నాను. చివరికది ఇలా 'కవిత్వంతో ములాఖాత్' గా రూపొంది, నలభై వారాలు నడిచింది.

మొదట్లో కేవలం జ్ఞాపకం మీద రాశాను గనుక రాసినవాటికన్న వదిలేసినవి ఎక్కువని ఇప్పుడు అనిపిస్తున్నది. ఆ తర్వాత పాత పుస్తకాలో, పత్రికలో వెతికి వాటి నుంచి కొన్ని ఆధారాలు ఇస్తూ, లేదా నా పాత కాగితాల కవిలెకట్టల్లో వెతికి తవ్వితీస్తూ రాశాను గాని అక్కడ కూడ జ్ఞాపకంలోంచి జారిపోయినవీ, అచ్చుకు ఎక్కకుండానే జారిపోయినవీ చాల ఉన్నాయని అనిపిస్తున్నది. తప్పనిసరిగా రాయాలనుకున్నవి కొన్ని రాశాను గాని అన్నీ రాయలేక పోయాను. కొన్ని రాయాలని అనుకోకపోయినా ఆ వారమో, ఆ నెలో జరిగిన పరిణామాలవల్ల అప్పటికప్పుడు తోసుకు వచ్చి రాయించాయి.

అన్ని వాదాల కవిత్వాలనూ అభిమానించాను, శ్రద్ధగా చదివాను, ప్రతి వాదంలోనూ అభిమాన కవులున్నారు గాని ఆ కవులతో, కవిత్వంతో నా ములాఖాత్‌ల గురించి రాయలేక పోయాను. బహుశా ఈ శీర్షిక పరిధిలోకి ఆ వాదాల కవిత్వంతో ములాఖాత్ రాదని నా మనసే ఎక్కడో సంకోచించిందనిపిస్తున్నది. అలాగే నేను అనువదించిన ఇతర భాషా కవిత్వాల ములాఖాత్ గురించి రాశాను గాని, నేను చదివిన ఇతర భాషా కవిత్వాల గురించి ప్రస్తావనవశాత్తూ తప్ప వివరంగా రాయలేకపోయాను. అలాగే, రాయడానికి పూనుకుని సగంరాసి వద్దనుకుని వదిలేసిన ములాఖాత్ కూడ ఒకటి ఉంది. అది 1980ల చివర హైదరాబాదులో వచన కవిత్వం మీద విమర్శగా పొయెట్రీ ఎరాడికేషన్ గ్యాంగ్ (పిఇజి – పెగ్) పేరుతో కొందరు కవులూ, విమర్శకులూ ప్రారంభించి, కవిత్వం మీద సంధించిన వ్యంగ్యాస్త్రాల గురించి. కవులు తమమీద తాము పరిహాసం ఆడుకోగలిగిన పరిణతిని సాధించడం ఎలాగో చెప్పడానికి ఆ ములాఖాత్‌ను వాడుకుందామనుకున్నాను. కాని, మళ్లీ చదువుతుంటే ఆ విమర్శ కాస్త దురుసుగా, విసురుగా ఉందని, అది సాధించదలచిన మేలు కన్న కీడే ఎక్కువేమోనని మానేశాను.

అన్నిటికన్న నేను విచారించిన రెండు మతిమరపులు ఒకటి చలసాని ప్రసాద్ గారి గురించి, మరొకటి వరవరరావు గారి గురించి. చలసాని ప్రసాద్ నాకు పరిచయం చేసిన కవిత్వంలో మరొకటి కూడ కలపవలసి ఉండింది. అల్లసాని పెద్దన రాసిన 'పూత మెరుంగులున్ పసరు పూపబెడంగులు చూపునట్టివా కైతలు…' అనే పద్యమాలిక చదివి వినిపించి, అప్పటివరకు 'రమణీప్రియ దూతిక…' పద్యంతో పెద్దన పట్ల ఉండిన అభిప్రాయాన్ని ఆయన మార్చారు. అలాగే, వరవరరావు గారి కవిత్వం గురించి రాసేప్పుడైనా, నా 'పాఁవురం' ప్రచురణ గురించి రాసేప్పుడైనా మరొక విషయం మరిచిపోయాను. వజీర్ రహ్మాన్ తన అద్భుతమైన కవితాసంపుటం 'ఎచటికి పోతావీ రాత్రి'ని చలంకు అంకితం ఇస్తూ, అద్భుతమైన, కవితాత్మకమైన వాక్యాల్లో చలం గురించి రాస్తూ చివరన and back into him all those poems of his అని రాశాడు. నేను 'పాఁవురం' కృతజ్ఞతల పేజి ('పాఁవురమే…') లో కూడ "and back into him all those poems of his అని చలం గురించి వజీర్ రహ్మాన్ అన్నట్టు the one and only hero I would never transcend - మామయ్యకు…' అని రాశాను.

సరే, ఇదివరకే ఒకసారి రాసినట్టు చేసినపని మీద సంతృప్తి ఎప్పుడూ ఉండదు. సంతృప్తి ఉండడం మంచిది కూడ కాదు. ఒకసారి ఒక పని చేసి బైటికి వచ్చాక నిర్మమంగా దాన్ని చూస్తుంటే ఎన్నెన్ని లోపాలున్నాయో తెలుస్తూనే ఉంటుంది. ఇక ఈ శీర్షిక ముగిస్తున్నవేళ నా కవిత్వ ములాఖాత్‌ల గురించి మరి ఒకటి రెండు విషయాలు పంచుకోవాలి.

కవిత్వం అచ్చువేసినప్పటికీ కవినేనా అనే ప్రశ్న నన్నెప్పుడూ వదలలేదని ఇదివరకే రాశాను. 'పాఁవురం' తర్వాత ఆ ప్రశ్న నా మనసు మీద మరింత ఎక్కువగా కదలాడుతూ

ఉన్నది. ఆ తర్వాత కూడ రాయలేదనీ, అచ్చు వేయలేదనీ కాదు. కాని కవిత్వాన్ని నేను చూసే పద్ధతి కాస్త మారిందనే అనాలి. ఒకరకంగా చెప్పాలంటే కవి కాని వ్యక్తి ఎవరూ ఉండరని అంతవరకూ నాకున్న అభిప్రాయం బలపడింది. కాని కవిగా లోకం అంగీకరించాలంటే, గుర్తించాలంటే దానికోసం సమయం పెట్టాలనీ, ప్రత్యేక సాధన, శ్రమ చేయాలనీ, మానవ మేధకు సహజమైన వ్యక్తీకరణ శక్తిని ఒక ప్రత్యేక పద్ధతిలో, ఒక నిర్దిష్ట నేపథ్యంలో, ఒక చారిత్రక, సాంస్కృతిక అవగాహనా పునాది మీద ఎప్పటికప్పుడు పదను పెట్టుకోగలిగినప్పుడే ఎవరికైనా కవి అని చెప్పుకోగలిగే అర్హత వస్తుందని ఇప్పుడు నేననుకుంటున్నాను. అంటే కవిత్వం అందరూ రాయగలరు, కవులు కొందరే కాగలరు అనవచ్చునేమో. ఆ మాటకు కూడ అపార్థాలు వచ్చే అవకాశం ఉంది గనుక వివరించాలంటే, ప్రతి గొంతూ పాడగలిగినప్పటికీ కొందరే గాయకులు అవుతున్నట్టు, ప్రతి కాలూ ప్రతి చేయీ విన్యాసాలు చేయగలిగినప్పటికీ కొందరే నృత్యకారులు అవుతున్నట్టు, ప్రతి గొంతూ మాట్లాడగలిగినప్పటికీ కొందరే వక్తలు అవుతున్నట్టు అది ఒక ప్రత్యేక నైపుణ్య సాధనా విశేషం మాత్రమే.

అంత సాధన చేసే శక్తీ, సమయమూ నాకు లేవని గుర్తింపు 'పావురం' తర్వాత నాకు కలిగింది. అలా కవిత్వంతో దూరం పెరిగింది. మరీ ముఖ్యంగా చదువుకున్న రాజకీయార్థిక శాస్త్రం వల్ల (ఈ అంతర్జాలం మీదనే నన్ను ఎవరో రాజకీయార్థిక శాస్త్రవేత్త అని సంబోధిస్తే, కవి మిత్రులొకరు 'అవునా' అని వ్యంగ్యంగా ప్రశ్నించి నేనది కూడ కానని తేల్చారనుకోండి! నన్ను నేను ఎప్పుడూ రాజకీయార్థశాస్త్ర విద్యార్థి అని చెప్పుకోవడానికే ఇష్టపడతాను), గత రెండున్నర దశాబ్దాలుగా రాజకీయార్థిక రంగంలో పాలకులు సాగిస్తున్న దుర్మార్గాలను విప్పి చెప్పడం నా బాధ్యత అనుకోవడం వల్ల వచన రచనకు, వ్యాస రచనకు ఎక్కువ సమయం కేటాయిస్తూ వచ్చాను. ఆ మేరకు కవిత్వ రచనకు సమయం తగ్గింది.

అయినా 'పావురం' తర్వాత ఈ పదమూడు సంవత్సరాలలో కూడ కవిత్వం రాస్తూనే ఉన్నాను. అచ్చుకు ఇచ్చిన, ఇవ్వగలిగిన దానికన్న ఎక్కువగా వ్యక్తిగత కవిత్వం రాశాను. ఎవరైనా అలా రాసుకోగలిగేదీ, రాసుకునేదీ చాల కవిత్వం ఉంటుందనీ, దానితో మమేకం కాగలిగిన, ఆ అనుభూతులనే అనుభవించగలవాళ్లు ఎవరైనా ఉన్నారని అనుకుంటేనే, అంతమేరకే బహిరంగపరచవచ్చుననీ ప్రస్తుతం అనుకుంటున్నాను. ఆ అనుభూతి, ఆ అభివ్యక్తి నా ఒక్కడిదే అయితే అది అచ్చుకెక్కడం, ఇతరులు కూడ అది చదవాలని కోరుకోవడం అనవసరమే అనుకుంటాను. కాని మనిషంటే సాధారణ మానవత్వ శకలం గనుక, మనిషంటే మానవ సంబంధాల సమాహారం గనుక ఒక మనిషి అనుభూతి అనిపించినది కూడ, ఒక మనిషి అభివ్యక్తిగా బైటపడినది కూడ ఇతర పాఠకులను, శ్రోతలను చేరవచ్చు. అలా నా కవిత్వాభివ్యక్తి అంతగా ఇతరులకు చేరుతుందని నాకనిపించడం లేదు. ఈ పదమూడు

సంవత్సరాలలో కనీసం మూడు సంపుటాలు తీసుకురాగలిగినంత కవిత్వం రాసినప్పటికీ, అందులో కనీసం ఒక సంపుటానికి సరిపోయేంత పత్రికల్లో అచ్చుయినప్పటికీ, సంపుటం వేయడానికి ఇష్టపడకుండా ఉన్నది కవిత్వంతో ఈ దూరాన్ని అనుభవిస్తున్నందు వల్లనే. అయితే ఈ కాలంలో నాలుగైదు సందర్భాలలో రాసుకున్న కవిత్వం గురించి 'కవిత్వంతో ములాఖాత్' పాఠకులతో పంచుకోవాలనిపిస్తున్నది.

జీవితం నాకు రెండుసార్లు యావజ్జీవ శిక్ష విధించింది. మొదటి యావజ్జీవ శిక్ష శారీరకం. రెండోది మానసికం. మొదటిసారి ముప్పై ఒకటో ఏట 'నీ శరీరంలో మాధుర్యం పెరుగుతున్నది. దాన్ని తగ్గించే చేదువిషం జీవఫలం లోపల తయారు కావడం లేదు. కనుక ప్రతిరోజూ మూడు సార్లు నువ్వు ఇంజెక్షన్ పొడుచుకుని చేదు మింగవలసిందే. అది యావజ్జీవ శిక్ష' అని జీవితం వైద్యుల ద్వారా చెప్పించింది. ఆ తర్వాత పదిహేను సంవత్సరాల పాటు రోజుకు మూడు ఇంజక్షన్ల చొప్పున పదిహేనువేల సార్లు నా శరీరాన్ని నేను సూదితో పొడుచుకున్నాను. (ఇతరులను పొడవడమైతే సులభం. కాని మన శరీరం మనం పొడుచుకోవడం ఎంత కష్టం!) ఆ తర్వాత వైద్య విజ్ఞానశాస్త్ర అన్వేషణల వల్ల రోజుకు మూడు సార్ల నుంచి నాలుగు రోజులకు ఒకసారికి పొడుచుకోవడానికి మారాను గాని శిక్ష మాత్రం యావజ్జీవితమే.

రెండో శిక్ష, నన్ను యావజ్జీవితం నిరంతర అనుమానితుడిగా మార్చింది. అప్పటికి మూడు దశాబ్దాలకు పైగా నా ప్రాణానికి ప్రాణమైన స్నేహితులెందరో నేను చేసిన ఒక తప్పు వల్ల నన్ను తమ జీవితాల నుంచీ, ఆలోచనల నుంచీ బహిష్కరించారు. ఒకరకంగా నన్ను అస్పృశ్యుణ్ణి చేశారు. ఆ తప్పుకు తల వంచుకుని, ఒకటికి పదిసార్లు బహిరంగ క్షమాపణ కోరినప్పటికీ, నేను ఒంటరినే అయిపోయాను. నన్ను తమలో ఒకడిగా భావించే సమూహం లేకుండా పోయింది. ఆ తప్పు చేసినప్పటికీ, నా తాత్విక, రాజకీయ, సామాజిక విశ్వాసాలు మారలేదు గనుక నేను అంతకుముందు ఎలా ఉన్నానో అలాగే ఉన్నాను గాని, నాపట్ల నా మిత్రుల దృష్టిలో ఒక అనుమానపు జీర కొనసాగుతున్నది.

శిక్షితుడైన మనిషి, అనుమానితుడైన మనిషి, వేదనలో ఉన్న మనిషి, ఒంటరితనాన్ని అనుభవించే మనిషి కవిత్వం రాయని క్షణం ఉండదు. ఒత్తిడి కవిత్వానికి జనని. వేదన కవిత్వానికి పాదు. కన్నీటిలో కవిత్వం ప్రవహిస్తుంది. ఒంటరితనంలో కవిత్వం తీగపారుతుంది. అందువల్ల ఈ రెండు వేదనలూ, బహుశా జీవితాంతం నాతో ఉండే, నన్ను తమతో ఉంచుకునే వేదనలు నాలో కవిత్వ ఊటలను ఊరిస్తూనే ఉన్నాయి. అనారోగ్య సమయాల్లోనూ, ఆనంద సమయాల్లోనూ, బర్కిలీలో, నయాగరా జలపాతం దగ్గరా, మెక్సికన్ పిరమిడ్ల దగ్గరా, ఇక్కడా ప్రతిరోజూ రాస్తూనే ఉన్నాను. రాయని కవిత్వం ఎక్కువా, రాసే కవిత్వం తక్కువా. వాటిలోంచి వీడ్కోలు కానుకగా ఒక్కసారే నాలుగు కవితలు:

# మనిషంటే పని కదా (2008)

మాధుర్యం కావాలి
జీవితమూ స్నేహమూ
మాధుర్యం నిండాలి
కాని ప్రతి నెత్తుటిచుక్కా
చక్కెరముక్కయినప్పుడు
ఇది కన్నీటి కాలం
ఇది భయం కాలం
ఇది నిరాశ కాలం

ఇదివరకెప్పుడూ భయపడలేదు
వేలసూదులతో చర్మమంతా జల్లెడ అయినప్పుడూ
రక్తబిందువులన్నీ పెటిల్లున పగిలి
దేహం ఒణికిపోయినప్పుడూ
లోలోపలి తీపితయారీయంత్రం
లోలకంలా అటుకొసకూ ఇటుకొసకూ
ఉధృతంగా ఊగుతూ
అస్తిత్వాన్ని చిగురుటాకు చేసి
సుడిగాలిలో ఎగరేసినప్పుడూ
ఎప్పుడూ భయపడలేదు

అనారోగ్యానికి కాదు
శయ్యకు ఖైదీని చేసినందుకూ కాదు
దినచర్యంతా శరీరరక్షణే అయినందుకు
పనిమీద ఆంక్షల కటకటాలు నిర్మిస్తున్నందుకు
ఇది కన్నీటికాలం భయాలకాలం నిరాశలకాలం

మనిషంటే ఆలోచన కదా
మనసుమీద మంచుకప్పమంటే ఎట్లా?
మనిషంటే మాట కదా
పెదాలు కుట్టేసుకోమంటే ఎట్లా?

మనిషంటే రాత కదా చదువు కదా
హాసం కదా స్నేహం కదా
మనిషంటే పని కదా
సెలవు పలకమంటే భయం
మనిషితనాన్ని వదులుకొమ్మంటే భయం

## పునరపి జననం?! (2010)

ఎంతమాత్రం నమ్మకం లేదు
'పునరపి జననం పునరపి మరణం'
అబద్ధమని తెలుసు
రిహార్సళ్లు వన్స్ మోర్లు కట్లు రీటేకులు ఉండవు
పునరుత్థానాలు రెండోరాకడలు లేవు
బతికినా చచ్చినా ఒకటే రంగస్థలి ఒకటే ప్రదర్శన
అడుగడుగునా చచ్చిబతికినా ఒకేఒక్కటి జీవితం
గెలిచినా ఓడినా ఒకటే బతుకు పోరు
నవ్వినా ఏడ్చినా పోరాడినా ఒకటే మనసు హోరు

అయినా
తనను తాను రాల్చుకున్నాక మళ్లీ చిగురు
శిశిర శైథిల్యం తర్వాత స్నేహపు ఆమని
ఆత్మహననానికి పాల్పడ్డ మనిషికి మళ్లీ జననం

నిజంగా మనుషులెంత గొప్పవాళ్లు
పడిపోయిన మనిషి ముందు
మునివేళ్ల అమృత ధారలు అందించే
మనుషులెంత గొప్పవైద్యులు
ఆశోపహతుడైన మనిషిలో
ఆశ నింపే పెదాలు ఎంత మధురమైనవి
కన్నీటి వరదకు స్పర్శతో
జీవం పోసే ఆత్మీయత ఎంతటి ఔదార్యం!

స్పృహ తప్పిన మనిషి మేల్కొంటాడు
లేచినిలిచి మళ్లీ చదువుతాడు
వినే మనుషులు
ఆపినచోటి నుంచే రాస్తాడు
చదివే మనుషులు
గొంతు సవరించుకుని పాడుతాడు
ఆడే మనుషులు
పెదాలు విప్పి మాట్లాడుతాడు
ముద్దాడే మనుషులు

మళ్లీ మనిషయిన మనిషి చుట్టూ మనుషులే మనుషులు
పాత మనిషే కొత్తమనిషయి మళ్లీ బతుకు మొదలు
లోలోపలి నుంచి మరొక మనిషి సృష్టి

## దిగిపోయే పొద్దు (2011)

ఒక తొలి చలికాలం ముసిముసి వేకువ
మా ఇంటి ముందర బొడ్డుమల్లె చెట్టు
జలజలా పుట్లకొద్దీ పూలు రాల్చింది
చలికోతగా, దురుసుగా, విసురుగా
తెల్లని తెలుపుగా.
మా ఇంటి వెనుక పారిజాతం
ఒక్కొక్క అపురూపాన్ని నేలమీద పేర్చింది
బిడియంగా, మృదువుగా, చల్లగా
ఎరుపు తెలుపుల కలనేతగా.

మా ఇంటి మీద అప్పుడే విచ్చుకుంటున్న విభాతపు చిర్నవ్వు
మా ఇంటి వెనుక మాంకాళమ్మ మర్రిలో గుబురు చీకట్ల దిగులు

అదే సమయాన మా అమ్మ నన్నీలోకంలో ప్రవేశపెట్టింది

తొలిస్పర్శ తొలిధ్వని తొలిమాట తొలిపాట తొలిఆట తొలిఅడుగు
అన్నీ అమ్మే అన్నీ ఆ ఊరే అన్నీ ఆ ఊపిరే
బొడ్డుమల్లెలే పారిజాతాలే
తూర్పు ఎదురుచూపులే పడమటి చీకట్లే

దురుసుతనమూ బిడియమూ
విసురూ మృదుత్వమూ
తెలుపూ ఎరుపూ
చలీ వేడీ చిర్నవ్వూ దిగులూ...

యాభై ఏళ్లు గడిచిపోయాయి
ఇప్పటికీ అదే పసితనపు అనుభవాల జ్ఞాపకాల పేగుబంధం
స్పర్శకోసం ధ్వనికోసం మాటకోసం పాటకోసం ఆటకోసం అడుగుకోసం
అదే వెతుకులాట
అమ్మకోసం
అదే అన్వేషణ
ఊరికోసం అదే తపన
మనిషికోసం స్నేహంకోసం అక్షరంకోసం
అదే ఎడతెగని దాహం

గడిచిపోయాయి యాభై ఏళ్లు

ఎవడు బతికేడు మూడు యాభయిలు అని సామెత
ఎవడు బతికేడు రెండు యాభయిలు మాత్రం

హద్దు దాటాక
అవతల పోగొట్టుకున్నవేమిటి
పొందినవేమిటి
ఇవతల ఏంకావాలి ఏం వదులుకుంటావు

మనుషులే కావాలి
తిట్టినా కొట్టినా దూషించినా ద్వేషించినా
మనసులే కావాలి
చేరదీయకపోయినా, ముద్దాడకపోయినా
మెడపట్టి గెంటినా అంటరానివాణ్ని చేసినా
మనుషులే కావాలి
స్నేహమే కావాలి
రెండో యాభై మాత్రమే కాదు
ఎన్ని యాభైలైనా
మనసులే కావాలి
మమతలే కావాలి
చల్లనిపూలే కావాలి
వెచ్చని చిర్నవ్వులే కావాలి
మనుషుల గుంపులు కదలాడే అక్షరాలే కావాలి
పుస్తకాలే కావాలి
చీకటి మీద విభాతమే వికసించాలి

## వెనుక వరుస మేలు (2014)

వేదిక జిగజిగేలుమంటున్నప్పుడు
సుదూరంగా వెనుకవరుసలో కూచోవడం నేర్చుకోవాలి
వీలయితే ఇంకా వెనుక అంచుల నీడల్లోకి తప్పుకోవాలి

ఎంత దూరంగా నిలబడితే అంత స్పష్టమైన చూపు
ఎంత దగ్గరైతే అంత అధికారపు మమకారపు కైపు

మిరుమిట్ల వెనుక చీకట్లు కనబడేది దూరమైనప్పుడే

నిన్నటి దాకా వేదికను కూల్చిన చేతులే
ఇవాళ మోచేతులతో అందరినీ వెనక్కి తోస్తూ
వేదిక ఎక్కుతున్న వింత దృశ్యం కనబడేది అక్కడే

వేదిక కట్టిన చేతుల బొబ్బలూ నెత్తుటి చారికలూ
నిన్నటిదాకా ప్రయాణంలో ఒరిగిన సహచరులూ
మదిలో చెరగకుండా ఉండేది దూరంగా ఉన్నప్పుడే

వేదిక మీది కొందరిలోకి రారమ్మని పిలిచేవేళ
పచ్చిగడ్డి మీద అసంఖ్యాకుల్లో కాటగలిసి పోవాలి
నిద్రమత్తు సుఖప్రయాణ వాహనం ఆహ్వానిస్తున్నప్పుడు
ముళ్లదారిన మెలకువతో కాలినడక ఎంచుకోవాలి
గద్దెల మీది ఔదార్యపు సాయానికి, సారాయానికి
ధన్యవాదపు దోసిలి పట్టడం మానుకోవాలి
ప్రగల్భాల పట్టు పీతాంబరాలు పర్రున చింపి
సహజాత నైసర్గిక ప్రకృతిని ధరించాలి

ఎవరో నీకు కల్పించిన ప్రాముఖ్యతనో
నీకు నువ్వే తెచ్చిపెట్టుకున్న ఆధిక్యతనో
నువ్వే ధ్వంసం చేయడం నేర్చుకోవాలి
వేదిక మీది కుర్చీని తన్నెయ్యాలి
మొదటి వరుస ఆహ్వానాన్ని తిరస్కరించాలి

# స్వేచ్ఛా సాహితి ప్రచురణలు

1. **అప్రకటిత అంతర్యుద్ధం** – భారత ప్రభుత్వ అడవుల విధానంపై విమర్శ – నవంబర్ 1983
2. **అసంఘటిత పోరాటాలు** – భారత పారిశ్రామిక రంగంలో అసంఘటిత కార్మికుల బతుకుపోరు – నవంబర్ 1983
3. **కథా కథనం** – కథా ప్రక్రియపై వ్యాసాలు – కాళీపట్నం రామారావు – జనవరి 1990
4. **తత్వశాస్త్ర వ్యాసాలు** – మావో సే టుంగ్ – ఏప్రిల్ 1991
5. **మట్టికాళ్ల మహారాక్షసి** – నవల – గూగీ వా థియోంగో – అను: వరవరరావు – జనవరి 1992
6. **చిత్రహింసల కొలిమిలోంచి** – ఆత్మకథ – అష్రఫ్ డెగానీ – అను: నవత? – ?
7. **ఇదీ నా గొడవ** – ఆత్మకథ – కాళోజీ – సెప్టెంబర్ 1995
8. **బందీ** – జైలు డైరీ – గూగీ వా థియోంగో – జనవరి 1996
9. **మాటిగరి** – నవల – గూగీ వా థియోంగో – అను: 'వ్యోమ' – అక్టోబర్ 1996
10. **కథా సందర్భం** – కథా విమర్శ వ్యాసాలు – ఎన్. వేణుగోపాల్ – నవంబర్ 2000
11. **పాఁవురం** – కవిత్వం – ఎన్. వేణుగోపాల్ – ఏప్రిల్ 2002
12. **విచ్ఛిన్నమవుతున్న వ్యక్తిత్వం**–మాగ్జిం గోర్కీ–పోస్ట్ మాడర్నిజం–ఎన్. వేణుగోపాల్– జనవరి 2005
13. **నవలాసమయం** – నవలా విమర్శ వ్యాసాలు, సమీక్షలు–ఎన్. వేణుగోపాల్–జూన్ 2006
14. **రాబందు నీడ** – అమెరికా యుద్ధోన్మాదంపై వ్యాసాలు (1989–2006) – ఎన్. వేణుగోపాల్ – జనవరి 2007
15. **తెలంగాణ విమోచనోద్యమం తెలుగు నవల** – సమాజ సాహిత్య సంబంధాలు – ఒక విశ్లేషణ – వరవరరావు – జనవరి 2007
16. **తెలంగాణ వ్యాసాలు** – వరవరరావు – నవంబర్ 2007
17. **గంగానమ్మ** – నవలిక – విజయ – జనవరి 2008
18. **కల్లముందరి చరిత్ర** – నాలుగు దశాబ్దాల విప్లవోద్యమం – సమకాలిక వ్యాఖ్యలు – ఎన్. వేణుగోపాల్ – జనవరి 2008
19. **వరవరరావు కవిత్వం (1957 – 2007)** – నవంబర్ 2009
20. **పరిచయాలు** – ప్రభావశీల వ్యక్తుల గురించి అక్షరచిత్రాలు– ఎన్. వేణుగోపాల్ – జనవరి 2009
21. **విశ్వాంతరాళం** – కొడవటిగంటి రోహిణీప్రసాద్ – సెప్టెంబర్ 2009
22. **జాత్యహంకారి హిట్లర్** – చేలూరు రమాదేవి – నవంబర్ 2009

23. **మానవ పరిణామం** – కొడవటిగంటి రోహిణీప్రసాద్ – డిసెంబర్ 2009
24. **లేచినిలిచిన తెలంగాణ** – ఎన్. వేణుగోపాల్– ఫిబ్రవరి 2010
25. **జీవకణాలూ నాడీకణాలూ** – కొడవటిగంటి రోహిణీప్రసాద్ – మే 2010
26. **రాబందు వాలిన నేల** – ఇరవై ఏళ్ల ప్రపంచీకరణ – 1991–2011 – ఎన్. వేణుగోపాల్ – జులై 2011

ఎన్. వేణుగోపాల్ (1961) కవి, సాహిత్య విమర్శకుడు, అనువాదకుడు, పత్రికా రచయిత, వక్త, రాజకీయార్థిక శాస్త్ర విద్యార్థి

అచ్చయిన స్వతంత్ర రచనలు: సమాచార సామ్రాజ్యవాదం (1992), కల్లోల కాలంలో మేధావులు – బాలగోపాల్ ఉదాహరణ (1999), అమ్మకానికి ఆంధ్రప్రదేశ్ (మొదటి కూర్పు – ఆగస్ట్ 1999, రెండో కూర్పు – డిసెంబర్ 1999), కథాసందర్భం (2000), కడలితరగ (2001), పావురం (2002), ప్రజల మనిషి – సంక్షిప్తీకరణ (2003), తెలంగాణ నుంచి తెలంగాణ దాక (2004), విచ్ఛిన్నమవుతున్న వ్యక్తిత్వం, పోస్ట్ మాడర్నిజం (2005), వట్టికోట ఆళ్వారుస్వామి సార్థక జీవనం (సంగిశెట్టి శ్రీనివాస్ తో కలిసి – 2006), నవలాసమయం (2006), రాబందునీడ (2007), కళ్లముందరి చరిత్ర (2008), పరిచయాలు (2009), తెలంగాణ – సమైకాంధ్ర: భ్రమలు, అబద్ధాలు, వాస్తవాలు (2009); శ్రీశ్రీ అన్వేషణ (2010); లేచినిలిచిన తెలంగాణ (2010); ప్రతి అక్షరం ప్రజాద్రోహం – శ్రీ కృష్ణ కమిటీ నివేదిక (2011); రాబందు వాలిన నేల (2011); గురజాడ అప్పారావు దేశభక్తి – ఒక శతాబ్ది కిందటి ముందుచూపు (2012); Understanding Maoists - Notes of A Participant Observer from Andhra Pradesh (2013); ఊరిదారి – గ్రామ అధ్యయన పరిచయం (2013); విద్వేషమే ధ్యేయంగా విశాలాంధ్ర మహారభస (2013)

అనువాదాలు: మార్క్సిజం, లెనినిజం – మన సూక్ష్మదర్శినీ దూరదర్శినీ (1981); అసంఘటిత పోరాటాలు (1983); అప్రకటిత అంతర్యుద్ధం (1983); మా కథ (మొదటి కూర్పు – 1983, రెండో కూర్పు – 2003); ఉదయగీతిక (మొదటి కూర్పు – 1985, రెండో కూర్పు – 2003); రైలుబడి (1989); విచ్ఛిన్నమవుతున్న వ్యక్తిత్వం (1991); అనామకుడు (1993); భారతకథలు (1993); మావో కవితలు (1993); చీకటిపాట (సి.వనజతో కలిసి – 1995); పెద్దమనుషులు (1996); మూడోమార్గం (2003); ఆర్థిక శాస్త్రవేత్తగా మార్క్స్ (2004); బర్బరత్వపు సామ్రాజ్యం (2005); గుండె కాగడా (2010); భారత్‌పై అరుణతార (2012); భారత చరిత్ర అధ్యయనానికి ఒక పరిచయం (2014); సంకెళ్ల సవ్వడి (2015)

సంపాదకుడు / సహ సంపాదకుడు: Fifty Years of Andhra Pradesh 1956-2006 (2007), Telangana, The State of Affairs (2009), 24 గంటలు (2010); హైదరాబాద్ స్వాతంత్ర్య సంరంభం (2010); జనహృదయం జనార్దన్ (2012); సమగ్ర తెలంగాణ (2015)